# మాఘమాహాత్మ్యము





గ్రంథకర్త
అ. శేషాచలశర్మ






శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర
# మాఘమాహాత్మ్యము



ఇది

శ్రీమన్నారాయణచరణారవిందపారాయణపారీణ
శ్రీ త్రికూటాచలపతిచరిత్రాద్యనేకకృతినిర్మాణచాతురీధురీణ

## అబ్బరాజు శేషాచలశర్మగారిచేత

రచియింపఁబడి

తత్పుత్రుండు, ప్రస్తుతము శేపల్లెయందలి
మాండలికోన్నతపాఠశాలాంధ్రోపాధ్యాయుఁడు, నాంధ్రీకృత
భగవద్గీతా నిరోష్ఠ్యదాశరథిచరిత్ర దీక్షితచరిత్రాద్యనేకగ్రంథకర్తయు నగు

**అ. హనుమంతరాయశర్మచేతం**

బ్రకటింపంబడియె.

---

ప్రథమముద్రణము 500 ప్రతులు.

---

బెజవాడ
ఆంధ్రగ్రంథాలయముద్రాక్షరశాలయందు,
పుణ్యపురుషకదంబద్రవ్యసాహాయ్యము చేత
ముద్రింపంబడియె.



**1936**

సాదాప్రతి వెల రు 2
క్యాలికో వెల రు 3

శ్రీమేధాదక్షిణామూర్తయే నమః

# తొలిపలుకు

## అబ్బరాజు శేషాచలశర్మగారిసంగ్రహజీవచరిత్ర

శ్రీమన్నారాయణచరణారుణారవిందమకరంద బిందుసందోహాస్వాదనేందిందిరుండు, సంస్కృతాంధ్రభాషావిశారదుఁడు, నిరంతర భగవద్గీతాధ్యాత్మరామాయణ పారాయణ ధుఁణుండు, అబ్బరాజాన్వవాయ పయః పారావార రాకాసుధాకరుండు, అమ్మక్కాంబా నృసింహామాత్యపుత్రుండు, కౌండిన్యగోత్ర కలితాపస్తంబసూత్రుండు, బొగ్గవర సుబ్బరాయకవిరాజ జామాతృండు, మంగాంబాహృత్సరోరుహ మిత్రుండు, మజ్జనకుండు, గురుండు, కీర్తిశేషుండునైన శేషాచలశర్మగారు, గర్తపుర (గుంటూరు) మండల (జిల్లా) విరాజిత నరసరాజపురోపమండల (నరసరావుపేటతాలూకా) ప్రకాశిత, శుకనగర (చిలుకలూరుపేట) సమీపస్థ, వేలూరుపురంబునంగల తదీయమాతామహ గృహంబున 1838 వ వత్సర ప్రాంతంబున జననమందిరి.

వీరికి సుబ్బయ్య వెంకయ్య యను జ్యేష్ఠసోదరు లిద్దఱు, రామయ్య కృష్ణయ్య యను కనిష్ఠసోదరు లిద్దఱు, నాచెమ్మ, నరసమ్మ యను జ్యేష్ఠసోదరీమణు లిద్దఱు, లక్ష్మీదేవి మాచమ్మయను కనిష్ఠసోదరీమణు లిద్దఱు కలరు. వీరి జనకుండు మత్పితామహుండునగు నృసింహామాత్యుండు సంస్కృతాంధ్రభాషాయోషా సేవాపరాయణుండు,జ్యోతిశ్శాస్త్రపారగుఁడు,సరసమృదుమధురకవితావనితాజనితాచ్ఛకీర్తివిస్తారుండు నై నొప్పినవాఁడు. శేషాచలశర్మగారటువంటి తమతండ్రిగారి వెన్నంటి యనవరత విద్యాభ్యాసంబుసేసి యుభయభాషలం బాండిత్యంబు సేకరించిరి. వీరికింగల యత్యంతశాంత శమదమాది గుణసంపన్నత్వం బపారంబు. ఇయ్యనఘుండు తమకుఁ గాకుండ, వారికిం జేరకుండ, నొరు లొనరించిన యపకారంబునకుఁ బ్రతీకారంబు సేయక తన యజాతశత్రుత్వంబు వెల్లడించినవాఁడు.

ఇక్కవిపుంగవుని పితృపితామహులు మాతామహులు బహుళసంపన్న గృహస్థులు. ఈయన తల్లియైన యమ్మక్కాంబ కోడంట్రికమునకు సర్వవస్తువాహనంబులతోడ, సమస్తాభరణ వస్త్రాలంకారంబులతోడ, దాసీదాస జనంబులతోడ విచ్చేసినదని వాక్రుచ్చెడివారు. కాని వీరి జ్యేష్ఠసోదరులిద్దఱు కనిష్ఠసోదరుండు నేకకాలంబునఁ గాలగతి నొందుటంబట్టి తండ్రియైన నృసింహమంత్రి డిల్లపడిన యుల్లంబున బెల్లుదురపిల్లి రాజకీయంబైనపన్నులం జెల్లింపమింజేసి పరామరికలేనిసంసారంబుసారంబుచెడి తీరంబు సేరనేరని పారావారంబునందలి నౌకవోలె దారిద్ర్యంపు మున్నీరునం దేలియాడుచుండె. అంతఁ గొంతకాలంబునకు శర్మగారు భాషాసేవయే కాక కాలానుగుణంబుగ రాజసేవకూడఁ జేయనెంచి గ్రామఁ గ్రామణికోద్యోగ నిర్వహణ ధురీణతం జెలంగుచు నరసరాయ పురోపమండలంబునం గల మునిమాక మున్నగుచోట్ల గ్రామణీత్వంబు వహించి తన్నావరించిన దారిద్ర్యసముద్రంబు తదుద్యోగ నౌకాసాహాయ్యంబున నుత్తరించి తొంటియట్ల నలరారుచుండెను.

తరువాత మజ్జన నానంతరంబున వినుకొండయను నుపమండలబునంగల చిట్టాపురాగ్రహార సమీపంపు గ్రొత్తసాలెంబున మన్మాతుల నిలయంబులకుఁ జేరువ స్వీయగృహంబున నాబాల్యదశతోడ వారిగృహస్థాశ్రమంబుగూడ నడచినదాయె.

అవ్వెనుక మఱికొన్నినాళ్లకుఁ దెనాలియను నుపమండలంబునగల దోనేపూడియందు బాలికా బాలక పాఠశాలను నిర్మించుకొని యయ్యూరివారికిం బ్రీతికరంబుగ నా పాపలకు రేపు మాపనక విద్యాదానంబు చేయుచుండిరి. వీరి జన వశీకరణంబు విద్యాబోధనా చాతురీ ధురీణత్వంబు నప్పటికి నిప్పటికి నెల్లరచేతం గొనియాడంబడుచున్నది. ఇదియ శేషాచలశర్మగారి చరమదశాకాలం బనందగు.

ఇదియ వారిసంపూర్ణగ్రంథరచనాకాలంబు, భగవన్మైత్రిసాహిత్య సంతోషకాలంబు.

## వీ రి గ్ర ం థ ము లు.

1. త్రికూటాచలమాహాత్మ్యము (ఎల్లమంద కోటీశ్వరచరిత్ర)
2. మురారిశతకము (భక్తిరసప్రధానము)
3. నందనందన శతకము (కృష్ణావతారవర్ణనము)
4. ఆంజనేయదండకము (జననము మొదలు రామపట్టాభిషేకమువరకుఁ గథ)
5. ఆదినారాయణశతకము, భక్తిరస ముట్టిపడును, (దో॥ పార్థసారథిగారి ప్రేరణము)
6. శ్రీమన్మాఘమాహాత్మ్యము (మత్ప్రేరణము)

వీరు దీనిని దోనెపూడిగ్రామమునఁ (పాద్మపురాణాంతర్గత మాఘమాహాత్మ్యము) రచియించిరి. ఇది యాఱాశ్వాసముల పద్యకావ్యము. వీరి గ్రంథరత్నహారంబున కిదియ నాయకరత్నంబు. ఇందు సుమారు 2,234 గద్యపద్యంబు లలరారుచుండు. దీని రచనావిధానంబు గడుఁ గడుంగొనియాడందగియున్నది. ఇయ్యది యర్థంబు నిలిచిన చోటునకుం బదంబుఁ, బదం బాగినతావునకుంగణంబు, గణంబునెలకొనిన ప్రదేశంబునకుఁ బ్రాసంబుఁ, బ్రాసంబు పాదుకొనినయెడకు విశ్రమంబు, నిలుపక యొండొంటికిం జెట్టరికంబు గట్టిగం దెల్పుచుఁ దనవాణిని నలువరాణియైనవాణికి రాణివాసంబు సేసెనోయన మృదుమధురపదభూయిష్ఠంబు కవిజనేష్టంబునైన ద్రాక్షాపాకంబు, వైదర్భీరీతిని నలరారుచుండు.

శేషాచలకవిగారి రచనాకాలంబున నీగ్రంథంబున నే నచ్చటచ్చట రచనకుం దోడ్పడినవాఁడనని చెప్పుకొనుట తప్పుగాదు. మృదుమధుర పదగుంభనల నలరారు వారి రచనకు, శుష్కకటువైన నారచనకు శైలిగలియకుండునోయని నాసాహసంబునకు నేన వెరగుపడువాఁడ. అట్లయ్యు నాశ్వాసాద్యంతంబుల వారి యాజ్ఞాబద్ధుండనై కొన్ని పద్యంబులు మార్కండేయకృత శివస్తవంబు నాచేతనే వ్రాయంబడినవి.

ఏది ఎట్లైన,వారి రచనాచమత్కారంబు, ధారాశుద్ధి, సంస్కృతపద జటిలత్వంబు, నాంధ్రపదలాలిత్యంబు, గర్భకవిత్వ బంధురంబు, చిత్రకవిత్వ సుందరంబు, గూర్పునేర్పు నాకంటెఁ బరపండితమండలంబు నొక్కి వక్కాణించుచు గుణాగుణంబుల విమర్శింప నర్హంబు. వీరి పుస్తకంబులం దొక్కొక్క పద్యంబు శైలికై యెత్తిచూపెద,

చ. శ్రితజనపోషణుండు సర•సీరుహనాభుఁడు దేవబృందవం
దితచరణారవిందుఁడు సు•ధీరగుణోజ్జ్వలుఁ డబ్ధికన్యకా
పతి రవికోటితేజుఁ డహి•పర్వతవాసుఁ డనంతభోగశా
శ్వితనిలయుండు మాకు దయ•చేయుఁ గవిత్వపటుత్వసంపదల్.

త్రికూటాచలమాహాత్మ్యము. 1

క. వరయమునాతీరంబున, మురళీగానంబు చేత ముదిత•లనెల్లం
బరవశలఁజేసివారికి, వరములఁదగనిడిన కంస•వైరి! మురారీ!

మురారిశతకము. 2

ఉ. రాగమెలర్ప రేపు మధు•రానగరంబునఁగల్గు నా ధను
ర్యాగముఁజూడఁబోవలయు • నంచని యామరునాఁటిప్రొద్దునన్
వేగమపోవఁగా నచటి • వ్రేఁతల నాపురమందుఁగల్గు ను
ద్యోగముఁదీర్చివత్తునని • యూరడఁబల్కిన నందనందనా!

నందనందనశతకము. 3

శ్రీమన్మహావాయుపుత్రా! ... ... త్రిలోకాధిపస్తోత్ర! సత్పుణ్యచారిత్ర! ... ... శ్రీరామ సుగ్రీవ సౌమిత్రులంగూడి ... ... ... రావణున్ గుంభకర్ణు న్మహిండొల్లఁగాఁజేసి ... ... వానరాధీశ ... ... నమః.

ఆంజనేయదండకము. 4

శా. శ్రీవాణీశభవాదిసన్నుత! రమా • చిత్తేశ! మౌనీంద్రసం
సేవాంఘ్రిద్వయ! భాస్కరేందునయనా! • చిద్రూప! భక్తప్రియా!
భావాతీత! సురేంద్రవందిత! మహా•బ్రహ్మాండభాండోదరా!
వేవేగం గరుణింప నాదెసకురా•వే! ఆదినారాయణా! 5

ఇట్టి వీరు చరమదశ యం దత్యంత సౌఖ్యసంపదల నోలలాడుచుఁ గళత్ర పుత్రపౌత్త్రికా సందర్శన సంతోషయుక్తులగుచుఁ గాలంబుగడుపుచు దమవిద్యా బోధనాసక్తులైన శిష్యులకు మాకు సంతాపకరంబుగఁ బరీధావి వత్సర శ్రావణ శుద్ధ విదియ సౌమ్యవాసరంబున సాయాహ్నంబునఁ (1912 ఆగష్టు) బుణ్యార్జితులైన జనాకీర్ణంబగు నాకలోకం బలంకరించిరి. వీరి కే నొక్కరుండ పుత్రుండ.

| వీరి పౌత్రికలు. | పౌత్రులు. |
|---|---|
| వేంకటసీతారామాంబ | కీ. శే. వేంకటకోదండపాణిశాస్త్రి |
| కీ. శే. ,, శివకామసుందర్యంబ | ,, సారంగపాణిశాస్త్రి |
| ,, రంగనాయకాంబ | ,, బాలాంజనేయశాస్త్రి |
| ,, సరస్వత్యంబ | |
| ,, గాయత్ర్యంబ | |

వీరి సంతాన సంతానవృక్షంబు పరమేశ్వరానుగ్రహంబునఁ బెద్దలయాశీర్వచనంబున నింతవరకు నలరారుచున్నయది. ఈ వృక్షంబిల్లై నానాఁటం బెంపొందుచుండుఁగాత.

ప్రస్తుతనివాసము రేపల్లె,
1-12-1932

ఇట్లు,
అ. హ. శర్మ.

# కృతజ్ఞత

# హనుమద్గ్రంథమాలాగ్రంథములు

## మహారాజపోషకులు

1 శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణదీక్షితచరిత్రి
బ్రహ్మశ్రీ చోడవరపు దేవళరాయశర్మపాకయాజిగారు
బెజవాడవారు ముద్రింపించిరి ... ... రు 550-0-0

2 అచ్చాంధ్రనిరోష్ఠ్యనిర్గద్య దాశరథిచరిత్రి
బ్రహ్మశ్రీ శిష్టా హనుమంతరాయశర్మగారు
నిజాముపట్టణమువారు ముద్రింపించిరి ... 225-0-0

3 శ్రీ సుగ్రీవపట్టాభిషేకము
మ. రా. శ్రీ ఏర్లగడ్డ పకీరయ్యచౌదరి
కిష్కింధపాలెమువారు ముద్రింపించిరి ... 350-0-0

4 నారాయణుఁడు
5 నీతికథానిధి
మ. రా. శ్రీ చెవ్వాకుల చినకోటయ్య నాయడుగారు
మ. రా. శ్రీ చెవ్వాకుల వేంకటకృష్ణయ్యనాయడుగారు
పెరవలిపాలెమువారు ముద్రింపించిరి. } 100-0-0

6 పార్వతీపరిణయము ( నాటకము )
బాపట్ల, రేపల్లె, దుగ్గిరాల, కొల్లూరు హైస్కూల్ల
ఉపాధ్యాయులు, ఐలవరము వాస్తవ్యులు ... 100-0-0

7 ఆదినారాయణశతకము
బ్ర. దోనెపూడి పార్థసారథిగారు ముద్రింపించిరి 25-0-0

8 మాఘమాహాత్మ్యము
తెనాలి, రేపల్లె దోనేపూడిగ్రామవాస్తవ్యులు
కొంతవరకు ముద్రించిరి ... 200-0-0

శ్రీ

# హనుమద్గ్రంథమాలిక

## హితచింతితులు

శ్రీ. వై. మ. బ్ర. వే. కోటీశ్వరదీక్షితులవారు,
దుర్గాక్షేత్రము, బెజవాడ.

,, జానపాటి వేంకటసుబ్రహ్మణ్య
పాకయాజిగారు, గురజాల.

ఇట్లు,
అ. హ. శర్మ,
1—1—1936.

# రా జ పో ష కు లు

| | |
|---|---|
| మ.రా.రా.శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు మదరాసు | 50 0 0 |

# ప్రధాన పోషకులు

| | |
|---|---|
| మ.రా.రా.శ్రీ నిమ్మగడ్డ సోమశేఖరరావుగారు, దోనేపూడి | 20 0 0 |

# పో ష కు లు

| | | |
|---|---|---|
| మ.రా.రా.శ్రీ | యాబలూరి ఆదినారాయణశర్మగారు, తెనాలి | 10 0 0 |
| ,, | తంగెడ నరసింహారాయశర్మగారు గ్రామగ్రామణి, మోర్జంపాడు. | 10 0 0 |
| ,, | చోడవరపు జానకీరామశర్మగారు | 10 0 0 |
| ,, | మునగాల లక్ష్మయ్యగుప్తగారు, దోనేపూడి | 10 0 0 |
| ,, | యీ సత్యనారాయణ మూర్తిగారు | 10 0 0 |
| ,, | వెనిగళ్ళ రాఘవయ్యగారు, గ్రామమునసఫు | 10 0 0 |
| ,, | యీ చిన బ్రహ్మయ్యగారు | 10 0 0 |
| ,, | పర్వతనేని భద్రయ్యగారు | 10 0 0 |
| ,, | నాదిండ్ల పిచ్చయ్యగారు | 10 0 0 |
| ,, | దివి నీలాద్రిగారు | 8 0 0 |
| ,, | మోటూరు వేంకటాద్రియ్యగారు, వెల్లటూరు | 8 0 0 |

# స హా యు లు

| | | |
|---|---|---|
| మ. రా. రా. శ్రీ | కొండముది శ్రీరామశర్మపాకయాజిగారు, న్యాయవాదులు, తెనాలి. | 5 0 0 |
| ,, | మూలుపూరు నరసింహమూర్తిపంతులుగారు, తహశీలుదారు, గురజాల. | 5 0 0 |
| ,, | జింకా వెంకటసుబ్బారావుగారు, న్యాయవాదులు, గురజాల. | 5 0 0 |
| ,, | మల్లాది నరసింహమూర్తిగారు, న్యాయవాదులు. | 5 0 0 |
| ,, | రూపెనగుంట హనుమంతరావుగారు న్యాయవాదులు. | 5 0 0 |
| ,, | దిడగు గోపాలకృష్ణమూర్తిగారు, న్యాయవాదులు. | 5 0 0 |
| ,, | ఎన్. నమ్మాళ్వారుగారు, హెడ్మాస్టరు, బి. ఎం. స్కూలు, గురజాల. | 5 0 0 |
| ,, | నిమ్మగడ్డ వేంకట రెడ్డిచౌదరిగారు, దోనేపూడి. | 5 0 0 |
| శ్రీమతి | నిమ్మగడ్డ మాణిక్యమ్మగారు | 5 0 0 |
| మ. రా. రా. శ్రీ | నాదెండ్ల వేంకటసుబ్బయ్యగారు | 5 0 0 |
| ,, | వీరమాచనేని వేంకటాద్రిమయ్యగారు | 5 0 0 |
| ,, | సూర్యదేవర కృష్ణమూర్తిగారు | 5 0 0 |

౨

# చందాదారులు

తెనాలితాలూకా, దోనేపూడి.

| | | |
|---|---|---|
| మ.రా.రా.శ్రీ | నిమ్మగడ్డ వేంకటప్పయ్యగారు | 4 0 0 |
| ,, | ఈ వెంకటనరసయ్యగారు | 2 0 0 |
| ,, | ఈ పున్నయ్యకొడుకు పిచ్చయ్యగారు | 2 0 0 |
| ,, | వెనిగళ్ళ శేషమ్మగారు | 3 0 0 |
| ,, | బొప్పన శ్రీరాములుగారు | 2 0 0 |
| ,, | ఈ పున్నయ్యగారు | 2 0 0 |
| ,, | దివి నారాయణగారు | 2 0 0 |
| ,, | నిమ్మగడ్డ వేంకటరామయ్యగారు | 2 0 0 |
| బ్రిహ్మశ్రీ | ఆకుల శ్రీమన్నారాయణమూర్తిగారు | 2 0 0 |
| ,, | కోట వేంకటసుబ్బారావుగారు | 2 0 0 |
| ,, | కో. వేం. సుబ్బారావుగారు | 1 8 0 |
| మ.రా.రా.శ్రీ | కో. వేం. సుబ్బయ్యగారు | 1 0 0 |
| ,, | కో. వేం. సుబ్బయ్యగారు | 1 0 0 |
| ,, | కో. శ్రీరాములుగారు | 1 0 0 |
| ,, | కో. పున్నయ్యగారు | 1 0 0 |
| ,, | వెనిగళ్ళ నీలాద్రిగారు | 1 0 0 |
| ,, | వె. చి. కోటయ్యగారు | 1 0 0 |
| ,, | నిమ్మగడ్డ రామయ్యగారు | 1 0 0 |
| ,, | సుంకర పరంధామయ్యగారు | 1 0 0 |
| ,, | నిమ్మగడ్డ కుటుంబరావుగారు | 1 0 0 |
| ,, | తుమ్మల తాతయ్యగారు | 1 0 0 |
| ,, | దివి అంజయ్యగారు | 1 0 0 |
| ,, | వె. శ్రీ. ర. కొ. శ్రీరాములుగారు | 0 8 0 |
| శ్రీమతి | ని. సూర్యావతిగారు | 0 8 0 |

—: రేపల్లె :—

| | | |
|---|---|---|
| బ్రహ్మశ్రీ గొల్లపూడి హనుమంతరావుపంతులుగారు | | రు 3 0 0 |
| ,, చావలి శ్రీకృష్ణయ్యగారు | న్యాయవాదులు | 2 0 0 |
| ,, మన్నెపల్లి శ్రీరాములుగారు | ,, | 2 0 0 |
| ,, కొట్టపాటి వేంకటాచలపతిరావుగారు | ,, | 1 0 0 |
| ,, పోలవరపు రామబ్రహ్మముగారు | ,, | 2 0 0 |
| ,, వర్ఘు మాధవరావుగారు, ప్రైవేటు | ,, | 2 0 0 |
| ,, చిల్లర సదాశివరావుగారు | | 1 0 0 |
| ,, కోటంరాజు వెంకుపంతులుగారు | ,, | 1 0 0 |
| ,, కేతవరపు వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ,, | 1 0 0 |
| ,, వేదాంతం లక్ష్మీపతిగారు | ,, | 1 0 0 |
| ,, బ్రహ్మాండము నరసింహముగారు | ,, | 1 0 0 |
| ,, మామిళ్లపల్లి వేంకటరత్నంగారు | ,, | 1 0 0 |
| ,, తాడేపల్లి లక్ష్మీనారాయణగారు, ఓవర్సియరు | | 1 0 0 |
| ,, ఎల్లాప్రగడ లక్ష్మీనరసింహారావుగారు, అడ్వకేట్ | | 1 0 0 |
| ,, కొాతా ఆదినారాయణశాస్త్రిగారు | | 1 0 0 |
| ,, నారుమంచి వెంకటసుబ్బారావుగారు, న్యాయవాదులు | | 1 0 0 |
| ,, యాబలూారు వెంకటసుబ్బారావుగారు | | 2 0 0 |
| ,, యల్లాప్రగడ సత్యనారాయణగారు | | 1 0 0 |
| ,, వడ్లమూడి కోటీశ్వరరావుగారు | | 1 0 0 |
| ,, దాసరి పరిపూర్ణయ్యగారు, టీచరు | | 1 0 0 |
| ,, ఎ. అప్పారావుగారు | | 1 0 0 |

—: పోతవర్లంక :—

| | |
|---|---|
| మ.రా.శ్రీ వాడపల్లి నరసయ్యగారు కరణముగారు | 1 0 0 |
| ,, ఈ. శ్రీరామమూర్తిగారు } | 2 0 0 |
| ,, ఈ. వీర రాఘవయ్యగారు } | |
| | 31 0 0 |

దోనేపూడిగ్రామమున మాయొద్ద విద్యాభ్యాసమొనర్చినవారు, మిత్రులైనవారునై మాగ్రంథములకు ద్రవ్యసాహాయ్యము చేయదగినవారిపేరులు

## బ్రాహ్మణులు

బ్రహ్మశ్రీ దోనేపూడి వేంకటరామయ్యగారు, అసిస్టెంటుకరణముగారు, దోనేపూడి
,, దోనేపూడి నాగభూషణముగారికుమారుడు వెంకటసుబ్బారావుగారు
,, పిచర్ల సీతారామాచార్యులుగారు

## వైశ్యులు

మ. రా. శ్రీ అలపాటి ఆంజనేయులుగారు
,, ఆకుల శివరామయ్యగారు
,, ఈ మాధవరాయుడుగారు
,, కోటవాలిన పున్నయ్యగారు

## కమ్మవారు

,, నిమ్మగడ్డ పిచ్చయ్యవర్మగారు
,, ఈ పరంధామయ్యగారు
,, ఈ మాధవయ్యగారి శ్రీరాములుగారు
,, ఈ వెంకటనరసయ్యగారికుమారుడు బ్రహ్మయ్యగారు
,, ఈ చంద్రమౌళికొమారుడు పరంధామయ్యగారు
,, బొప్పన చిన్నబ్బిగారి నరసయ్యగారు
,, నాదింద్ల పెదసీతారామయ్యగారు
,, ఈ ఒసవయ్యగారు
,, ఈ వసిష్ఠుగారు (నరసయ్యగారు)
,, పర్వతనేని వెంకయ్యగారు
,, వెనిగళ్ల నీలాద్రిగారి పరంధామయ్యగారు
,, ఈ నాగయ్యగారి కుమారుడు వీరరాఘవయ్యగారు
,, ఈ అంజయ్యగారి సుబ్బయ్యగారు
,, సూర్యదేవర వేంకటరంగయ్యగారు
,, సుంకర వేంకటసుబ్బయ్యగారు
,, బొప్పన సుబ్బయ్యగారి కొమారుడు వీరరాఘవయ్యగారు
,, వెనిగళ్ల సోమయ్యగారి లక్ష్మీనారాయణగారు
,, ఈ శివరామయ్యగారి నరసయ్యగారు
,, ఈ యెఱ్ఱకోటయ్యగారి రామకృష్ణయ్యగారు
,, ఈ న. వెం. కో. పున్నయ్యగారు
,, లంక అమర్త్యాచారిగారు
,, ఇంకను నాకు జ్ఞప్తికిరానివార లెందఱో కలరు.

నివాసము సంతగుడిపాడు
ప్రవాసము
గురజాల
1—1—1936

ఇట్లందఱకు కృతజ్ఞుడు
అ. హనుమంతరాయశర్మ
ఆంధ్రపండితుడు

శ్రీరస్తు

# కృతజ్ఞతాపూర్వక విజ్ఞప్తి

తే. అవనిఁ బాద్మంపుమాఘమా•హాత్మ్య మెలమి
మై లిఖించి సమస్తజ•నాళి వొగడ
యశముఁ గాంచినయట్టి "శే•షాచలకవి"
వర్యునిఁ గనిష్ఠపితృతుల్యు•భక్తిఁగొల్తు. ౧

సీ. దోనెపూడిపురంబు•లోనుండ నే నొక,రినిఁగోరఁ గొంపోయి • తనగృహమున
నిల్పి నన్నంతట • నెఱిఁ గళత్రింబుతోఁ, బలికెనిట్టులు మన•వానియొద్దఁ
గలిగిన గుణములు • గనరావు వీనియం,దన నవ్వుచును బైటి•కపుడ వచ్చి
యేమదియన నింటి•రో! మన "హనుమంత,రాయండు" చేలఁ బ•రాకులేక
తే. శుద్ధుఁడై పాత్రముం బట్టుఁ•జూడు మన్నఁ, గొత్తయగుటను నన్నుఁ•గూడలేమి
నుండెనో యనఁ దాన•నాకొఱరె బుద్ధి, యట్టి మాపితృతుల్యుల•నెట్టుమఱతు. ౨

ఆ. జ్ఞాతులందుఁ జాలఁ • గనికరంబునుఁ జూపు,నతిథులందుఁ జూపు • నాదరంబు
సరగ యాచకులకు • సాత్త్వికగుణములో, నన్ను దాన మొసఁగు •నధికభక్తి. ౩

తే. చేయఁగలఁడన్ని విద్యలు • వ్రాయఁగలఁడు, భూరిఁ రణాలలోపల•భూమిఁగొల్చి
దేవగురుఁడనఁ బరఁగి బో•ధించు బోధ,నర్థి విన్నను నల్లచ•ట్లయినఁ గరఁగు. ౪

క. సీతారాముఁడ రారా!, చేతంబిగురెత్త నే ర•చించిన పద్యా
లీతటి వ్రాయఁగ నని నను, బ్రీతిగఁ బిలువఁగలవాని • నెట్టులు మఱతున్. ౫

తే. సుగుణఖనియగుగురు చెంతఁ జొ•క్కముగను, బాల్యదశయంతఁ గడపిన•వాఁడనగుటఁ
గొన్ని గుణరత్నములను జే•కొంటిననుచు, దృఢముగా చెప్పఁగలను సం•దియము లేదు.

తే. ఆత్మజుని పంపి చేవలి•యందుఁ బాఠ,శాల నొకదానిఁ గుదిరిచి • సదయబోధ
నాభ్యసనపాఠశాలకు • నంపి వృద్ధి, నన్నుఁ జేసె మఱువ జన్మ•మున్నవరకు. ౭

ఆ. నేను బెద్దవాఁడ • నీయన్న యొంటరి,వాఁడు దరిని నున్న•వాఁడ వీవు
పక్షమునకు నొక్క•పరి వచ్చి నా సేమ, మరయుమా! యభీష్ట•మదియ సుమ్మి.

క. అనుచుం గనినప్పుడు బ,ల్కినచందముగానె నన్ను • లీలఁగఁ బిల్వం
బనిచి యనాయసంబుగఁ, గని తులసీజలముఁ గొని త•గంజనె దివికిన్. ౯

తే. అట్టి నాపినతండ్రి వ్రా•యంగనైన, మాఘమాహాత్మ్యమును హను•మంతరాయ
శర్మగారు శుద్ధపరిశీ•లితముగను, వ్రాసి యియ్య నొసంగిరి•వాస్తవముగ. ౧౦

క. "మనుమాక"హనుమ యొసఁగిన, ఘనవరమున జననమంది• ఘనపాండిత్యం
బున నంతవాఁడు నగ్రజుఁ,డనువుగఁ దయ చేసి న•నుఁ గృతార్థునిఁ జేయన్. ౧౧

క. పెద్దన్న గుణములందునఁ, బెద్దన్న కవిత్వమందుఁ ♦ బేర్కొనఁ గొలపుం
బెద్దన్న మాకు నతఁడే, పెద్దగనెంతు నెదఁబొదల ♦ బ్రీతిన్ నీతిన్. ౧౨

క. మంగమ్మ నాదుపినతలి, చెంగట నే పాత్రమైనఁ ♦ జేకొనిదానిం
బొంగుచుఁజదువఁగ నోడుదు, రంగగు పాండిత్యమును దరంబె నుతింపన్. ౧౩

క. కవితావ్యాసంగంబును, బ్రవిమలసాంగత్యమును దిరంబగుభక్తిన్
దవిలెను గురుకులవాసం, బివిసు కృతఫలమ్ముకతన ♦ నేనూహింపన్. ౧౪

సీ. మాన్పించినాఁడు సన్మతితోడఁగ స్పెట్టి, యంతంత మద్దురభ్యాసములను
చదివించినాఁడు లక్షణగ్రంథములు పెక్కు, మక్కువతోడఁ దామక్కునుంచి
బోధించినాఁడు సంపూర్ణంబుగాఁ గవి, తారహస్యములు సంతసముతోడ
వ్రాయించినాఁడు చిత్రప్రబంధంబులు, తప్పొప్పులరయుచుఁ ♦ దనివిసనఁగ
అట్టిఁ డౌయబ్బరాజువంశాంబురాశి
పూర్ణరాకేందు సద్ద్విజుఁ బుణ్యపురుషు
మంగమాంబామనోహరు ♦ మాన్యచిత్తుఁ
దలఁతు శేషాచలామాత్యుఁ ♦ దాల్మితోడ. ౧౫

ఆ. తండ్రిఋణముదీర్పఁ ♦ దలఁచియే హనుమంత, రాయపాకయాజి ♦ వ్యయపరియాస
లోర్చి ముద్రణమ్ము నొప్పారఁజేయించె, నొక్కసుతుఁడ చాలు నుత్తముండు. ౧౬

క. దీక్షను మాఘమహాత్మ్యము, ద్రాక్షాపాకంబుగాఁగ ♦ రచియించియుఁ బ
ద్మాక్షున కంకితమొసఁగిన, దక్షుఁడు శేషాచలాభిధానుఁ దలఁతిరయే? ౧౭

తే. సదమలంబగు నాకృతజ్ఞతను దెలుప, వ్రాసి యర్పించినాఁడ నావలనఁ దప్పు
లున్న మన్నింపుఁడంచుఁ గే ♦ లొగ్గినాఁడఁ, బుణ్యజనులార! సత్కళాపూర్ణులార! ౧౮

వినుకొండతాలూకా
వేట్రాయుని అప్పాపురము
అగ్రహారము
బోర్డుఎలిమెంటరీస్కూలుమాష్టరు
ది 13—11—1935.

ఇట్లు
విన్నవించు బుధవిధేయుఁడు
అబ్బరాజు సీతారామశర్మ
పరశురామచరిత్రాద్యనేకాంధ్రగ్రంథకర్త
సంతగుడిపాడు.

శ్రీ స్వధర్మప్రకాశినీపత్రికాధిపతులు
శ్రీ. వై. మ. కనుపర్తి వేంకటరామవిద్యానందనాథదత్తపుత్రులు నగు
మార్కండేయశర్మశాస్త్రిగారి

# విస్మృతి

శా. శ్రీమన్నైగమశాస్త్రపారగులు లక్ష్మీనాథసేవాపరుల్
శ్రీమత్కాశ్యపగోత్రసంభవులు నా శ్రీసూర్యనారాయణ
శ్రీమద్వేంకటరామయార్యులకుఁ గూర్మిం గూర్చుపుత్రుం గళా
కౌముక్ సోదరదీక్షితాదరుని "మార్కండేయశాస్త్రిం" గుణో
ద్ధామున్ "సర్వనియోగిరత్నమును" నిత్యంబెన్నఁగాఁ జెల్లదే? ౧

సీ. అయ్యయ్యో! తిలజలంబియ్యక సవతి కట్లజెగితేయని తొలియాలు వారల
కటకటా! సోదరుంగడ కొతితేయని, కోటీశదీక్షితుల్ గోడుసెంద
హరిహరీ! శాస్త్రవిద్యం దేర్చకేఁగితం, చాడినారాయణుం డడలునొంద
శివశివా! యెవ రింక సవనధర్మంబుల, నాడువారని పాకయాజు లడల
తే. శిష్టు లననేల యితరులే చెవులుమూసి, క్షోభపడ యువశ్రావణశుక్లపక్ష
మునఁ ద్రయోదశి దివికిని బోతివయ్య, సత్యధుర్య మార్కండేయశాస్త్రివర్య!

సీ. సంస్కృతాంధ్రాంగ్లభాషలఁగాక ద్రావిడ,కన్నడభాషలఁ గఱచినాఁడు
శబ్దశాస్త్రముఁ దర్కశాస్త్రమ్మునేకాక, యన్యశాస్త్రజ్ఞానమందినాఁడు
స్వీయవేదాభ్యాసశీలుం డగుటకాక, తదితరవేదముల్ చదివినాఁడు
వేదశాస్త్రార్థసంవేదియౌటయకాక, నిత్యపాఠకులకు నేర్పినాఁడు
తే. నైగమార్గంబెఱింగి తా నడచినాఁడు, మించి తనవారి నటు నడిపించినాఁడు
దివిజగురుఁడో యనంగను దిరిగినాఁడు, నతనిఁగాంచ మార్కండేయుఁ డెఱిగినాఁడు.

సీ. ఉపనిషదర్థంబు నున్నదున్నట్టుగా, నెఱుఁగఁ దెల్పెడువార లెవ్వ రింక
నిత్యకర్మాష్టకానిష్టసందేహమ్ము, లెఱుఁగఁ దీర్చెడువార లెవ్వ రింక
మఱి బృహస్పతియట్లు మధురహాస్యంబులు, నెఱిఁగి బోధించువా రెవ్వరింక
మతకర్తృగాథలు స్మృతికి రా మాటికి, నవ్వొలకఁబలుకువా రెవ్వరింక
తే. మా కటంచు హవిర్యాజిపాకయాజి,వర్గములు చింతనొందఁగా స్వర్గమునకు
దివిజగురుఁ జూడఁబోయితో ధీరవర్య, సత్యధుర్య! మార్కండేయశాస్త్రివర్య.

సీ. ఘనసనాతనసభాగ్రసనాథిశుగా, నిందురినిఁ బిల్వఁగా నేగితొక్కొ?
శారదాచట్టమ్ము శాస్త్రసిద్ధము గా,దని గురుఁబల్కింప నఱిగితొక్కొ?
విధవావివాహమ్ము విధి గాదనుచు శుక్రు,ననిపంప మేలని యఱిగితొక్కొ
మనవార లొనరించు మఘుహవిర్భాగముల్, సుర లందికొని మెచ్చఁ జూడఁజనితొ?
తే. ఒళిర! నీయూహ లెవరికిఁ బట్టియిచ్చుఁ, బట్టియిచ్చిన సల్పఁగా నెట్టు వచ్చు
స్వర్గపట్టణమునకేల చనితివౌకద?, సత్యధుర్య మార్కండేయశాస్త్రివర్య!

తే. మాకుమారునిఁ బోలిన మాకుమారు, బాలు వేంకటకోదండపాణిశాస్త్రి
గాధ నమరేంద్రుతోఁ బల్కి కరము వెలుగఁ, జలుపఁజని తె"మార్కండేయశర్మశాస్త్రి!

ఇట్లు,
అ. హ. శర్మ.

# విస్మృతి

ఉ. నీవలనన్ జనించితిని ♦ నీవలనం దమిఁ బెంపు జెందితిన్
నీవలనన్ గణించితిని ♦ నీతివినీతివివేకసంపదల్
నీవలనం గ్రహించితిని ♦ నిర్మలనిశ్చలదైవభక్తి నే
నీవల నట్టిదైన ఋణ ♦ మేగతిఁ దీర్చెదనమ్మ తల్లిరో!

ఉ. కాచినవాఁడవైతిగద ♦ కంటిని రెప్పవలెం గుమారునిన్
వాచినలాగు నేర్పితివ ♦ వారిగ విద్యల; గద్యపద్యముల్
దోఁచినపట్ల నల్లుటయుఁ ♦ దోడుగ ఛందము శబ్దశాస్త్రమున్
జూచినలాగు వల్కితివి ♦ తోరపున ప్పెటుదీర్తు, నో పితా!

ఉ. యోగముఁ బాసి, శ్రీపతిని ♦ యోగమునం బరిశుద్ధవంశసం
యోగమునంది జ్ఞానవిని ♦ యోగము చేతను విద్యలొంది, దు
ర్యోగము కన్నవారల వి ♦ యోగము పాలొనరింప స్వర్గసం
భోగములందఁ బోయితివె ♦ పుత్రిక! సత్కృతిపాణిశాస్త్రివై.

ఉ. సల్లలితప్రవర్తనల ♦ శాస్త్రకలావిభవంబునంది నా
పిల్లఁడు పాణిశాస్త్రి సనఁ ♦ బ్రేముడిఁ గాంచెదు నిల్చియున్న మే
నల్లురనంచు, నాశపడ ♦ నాశల నాశలఁ ద్రోసివేసి పె
ద్దల్లునిఁ జూడఁబోతె తొలి ♦ యాలినిఁ గూడఁగఁబోతె రాఘవా!

ఉ. దేవుఁడవంచు నమ్మితిని ♦ ధీరుఁ గుమారుని పేరఁ బిల్చితిం
గావుదువంచు నాదుకృతి ♦ కన్యలఁ గన్యలనిచ్చి నచ్చికన్
బావనుఁ డల్లువాఁడనుచు ♦ బల్మురిపెంబును జెందుచుండఁగా
నీవర కింత చేసితివి ♦ యింకెటు చేసిన నేమి? రాఘవా!!

గురజాల. }

ఇట్లు,
అ. హా. శర్మ.

శ్రీ వాజపేయయాజుల రామసుబ్బరాయఁడు, బి.ఏ., గారు, వెంకటనారాయణగారు.
కీ. శే. అ. వేంకటకోదండపాణిశాస్త్రియొక్క పార్వతీపరిణయముం గూర్చి వ్రాసిన

# పద్యదశకము

మ. పదునారేండ్లను సత్కవిత్వమెలమిన్ వ్రాయంగ నాశ్చర్య మం
దెదలో నెంచనివారలుందురొకో తండ్రీ! మీకుమారుండు బల్
కుదురై నెక్కొను కైతలల్లె నన లోకుల్ మెచ్చరే? కాని మీ
కెద శోకాగ్నినిఁ బెట్టి యేఁగెననఁగా నెంతేనిఁ జింతించితిన్. ౧

తే. పదియు నారేండ్లనాఁటికే వ్రాయనేర్చె, సరససత్కవిత్వంబన్నఁ జాల వింత
గొలిపె నిట్టిరత్నంబు మీకు సుతుఁడౌచు, నవతరించుట మీదు పుణ్యంబు కాదె? ౨

చ. వయసునఁ జిన్నయయ్యు గుణవంతుఁడునై కవియై మహీస్థలిన్
నయమునఁ గాంచి సంస్కృతమునన్ గడు మేటి యటన్న కీర్తి మేల్
జయమును గాంచినాఁడు గద చక్కనియాంధ్రకవిత్వతత్త్వమున్
బయలుపడన్ రచించి యిది వాఙ్మయవృద్ధికి మేలుఁ గూర్చెడిన్. ౩

చ. బ్రతికిననాల్గునాళ్లు తలవంపులు లేక మెలంగినాఁడు సం
స్కృతమున నాంధ్రమందునఁ బ్రసిద్ధకవిత్వము వ్రాయనేర్చి యే
యతుకును లేక జీవితమునంతయు నిట్టులఁ ద్రోయువారి జీ
వితమె గదా గణింపఁదగు పేరుఁ బ్రతిష్ఠయుఁ గూర్చు నిద్ధరన్. ౪

తే. మిమ్ముఁ బోలినవారిగర్భమ్మునందుఁ, బుట్టి తల్లిదండ్రులఋణమట్టై తీర్చి
నాఁడు చిఱుతప్రాయమునందె నయము మీరఁ, బ్రౌఢుఁడయ్యె మీకోదండపాణిశాస్త్రి.

తే. ఆంధ్రమాతగర్భమ్మున నవతరించి, యాంధ్రభాషలోఁ గవితను నభ్యసించి
యాంధ్రదేశంబునకుఁ గీర్తి నార్జనంబు, జేసి యిందు నందున మోక్షసిద్ధిఁ గాంచె. ౬

ఉ. తాతయుఁ దండ్రియున్ జనిన దారిని నేఁగుట పిన్నవారికిన్
ఖ్యాతికి హేతువంచు మనమందున నెంచుటఁ జేసి కాదె గా
నీతిపథానువర్తియయి నిశ్చలతత్త్వమెఱింగి చక్కనౌ
కైత రచించి సద్యశముఁ గాంచినవాఁడు భవత్సుతుండిలన్. ౭

ఉ. శ్రేయము గాంచఁగాఁదగు పరిశ్రమఁ జేసి యశంబు నెల్ల లేఁ
బ్రాయమునందె కాంచె బుధవర్గము మిక్కిలి మెచ్చురీతిగా
నీయజుఁడేలకో కృపనొకింతయులేక యొసంగఁడాయె దీ
ర్ఘాయువటంచు నెమ్మనమునందు విచారము పొంగి పొర్లెడిన్. ౮

చ. కలమును జేతఁ బట్టి కవికాండము మెచ్చెడిరీతి వేంకటా
చలపతి నాసఖుండు దగు చక్కని పీఠిక వ్రాయఁ జూచి నా
కల మటు సాహసించి తమ గాదిలిపుత్రుఋణంబుఁ దీర్పఁగా
నెలమి రచించెఁ గైకొనుఁ డహీనపుభక్తి నమస్కరించెదన్. ౯

తే. చిఱుతప్రాయంబునం దిట్టి సిద్ధయశముఁ, గాంచినకవికి నాంధ్రలోకంబు ఋణ మ
దెట్లు తీర్పఁగలదటంచు నెంతుఁ గాన, వ్రాసినాఁడను హనుమంతరాయశర్మ! ౧౦

ఇట్లు విధేయమిత్రుఁడు
వా. రామసుబ్బరాయఁడు.

# శ్రీ హనుమద్గ్రంథమాలాగ్రంథములు

అముద్రితములు

1 హనుమద్భగవద్గీత
(గీతామాహాత్మ్యముసహా)
2 అభిమన్యుఁడు (ఈతనిజీవితము, భారతసంగ్రహము)
(వచనము)
3 లక్ష్మీనృసింహస్తోత్రము
4 దక్షిణామూర్తిస్తోత్రము
5 అంబరీషచరిత్ర
6 కవికర్ణపేయము
7 అచ్ఛాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య నృగచరిత్ర
8 ధనంజయతీర్థయాత్ర (నిరోష్ఠ్యరూపకము)
9 చాటుపద్యరత్నహారము
10 హరిహరనాథశతకము (భారతసావిత్రి)

---

# మజ్జనక శేషాచలశర్మగారివి

1 నందనందనశతకము (భాగవతకథ)
2 త్రికోటీశ్వరచరిత్రము (ఎల్లమంద కోటీశ్వరచరిత్ర)
(రగడ) (గుమ్మెటకథ)
3 ముద్దుమురారిశతకము
4 ఆంజనేయదండకము

గురజాల. } ఇట్లు,
అ. హ. శర్మ.

# పండితాభిప్రాయములు

శ్రీహయగ్రీవాయనమః

శా॥ వీక్షింపంబడె మీదుతండ్రి కవితావిజ్ఞాని శేషాచల
ప్రేక్షావత్తిలకంబుచేరచితమా శ్రీమాఘమాహాత్మ్య మీ
దృక్షుంబంచని దానిఁ బేరుకొనునే ధీరుండు ధారాఢ్యమై
దాక్షాపాకముతో మృదూక్తిమయమై దైవారు ధీమన్మణీ!

గీ॥ తండ్రికృతికర్త మీరుగ్రంథములవ్రాసి
ధన్యులైతిరి సుతుఁడు కోదండపాణి
పార్వతీపరిణయకృతిఁబలికె నబ్బ
రాజకుల! మేలు! హనుమంతరాయశర్మ!

ఉ॥ తాతయుఁ దండ్రియుర్ సుతుఁడు దానును గ్రంథములర్ రచించి వి
ఖ్యాతకవీంద్రులౌటయనఁగా నొకపాటిదియే కవీంద్రుఁడై
వాత్మక! యబ్బరాజకులవర్ధన! మీదుకులంబుఁజూడ నా
చేతముభట్టహర్షుని విశిష్టకులంబును సంస్మరించెడిర్.

గీ॥ ప్రాజ్ఞుఁడైపోయెఁ గోదండపాణియన్న
చింతఁబోఁదోసి ముదముఁగూర్చెదరుగాక
ఆర్య! సారంగపాణి బాలాంజనేయ
శర్మలు భవత్సుతుల్ కలాచతురులగుచు.

ఇట్లు

23—2—36,
గుంటూరు.

ఆంధ్రకాదంబరీశతలతుణీత్యాద్యనేకగ్రంథకర్తలు,
శతావధానులు, పల్లెపూర్ణప్రజ్ఞాచార్యులు,
సంస్కృత ప్రధానోపాధ్యాయులు,
టౌన్ హైస్కూల్, గుంటూరు.

శ్రీం

శ్రీమత్ బాలాత్రిపురసుందరీ పరదేవతాయైనమః

# నవరత్నములు

శ్రీచతురాననాదిబుధశేఖరసన్నుతగణ్యపుణ్యకా
ర్యాచరణంబటంచు ఫణిరాణ్మణి శేషుఁడు వేయినాలుకల్
సాచి వచించినన్ బొగడఁజాలక శోభిలు సబ్బరాజు శే
షాచలపండితేంద్రరచితాద్భుత కావ్యకలాకలాపముల్. 1.

శ్రీ నిగమాంచితధోరణి
గానంబడుమాఘమాసకావ్యములోనన్
మానితశేషాచలకవి
తేనెలువడకట్టి కయితతీరిచిదిద్దెన్ 2.

శ్రీ బాలార్కశుభప్రభావిభవపుష్టిన్ దుష్టిరూపించుచున్
జాబిల్లింవెలుఁగొందుచల్లఁదనమున్ సంగోరుపాల్గోరుచున్
ఆబాలాఖిలపాఠకాళిహృదయాహ్లాదంబుసాధించుచున్
బ్రాబల్కుల్ గులికించునేటుకయితన్ బాడించిపాడించెనో 3.

మేసి వేలుపులెంగిలిసేసినట్టి
పచ్చివెన్నెలవెగటుతీ పచ్చిరాదు
నీచకోరిక ల్మదిమానసీ చకోరి
కామణీ! మాఘమాహాత్మ్యకళలఁగొనవె. 4.

నవమాలిక! కుమానవమాలికాకృతిన్
నాసిల్లిరోసమున్ బాసిమనుము
విరవాజి! ఈదృక్కవిరవాజితములైన
తావు లింకొకతావులో విడువుము
కలకండ! నీకండఁగలకండఁగఱగించి
ప్రాణాలపైఁదీపిమానుకొనుము
మావితేనె! రసాలుమావితేనెపమెంతు
మనెడిమీ తలపొగ రడఁచికొనుము

వేత్రశుష్కప్రియాలేల మీరలిట్టి
కైతసరితూఁగుపనిపెద్ద కంఠశోష
మాఘమాహాత్మ్యమున దురితౌఘమెల్ల
మాపుకొనుఁడు మనస్తాప మాపుకొనుఁడు. 5.

పోషితనవ్యకావ్యరసమోహనమై వెలుఁగొందు సత్కృతిన్
శేషుఁడుసాహితీబలవిశేషుఁడుస్వీయసహస్రజిహ్వలన్
భూషణసేయుచో నచలమున్ బురణించుచుముద్దుబారి ని
ర్ద్వేషత ముందువెన్కఁగల పేర్లనురెంటిని వీరికిచ్చెనో. 6.

## అచ్చతెలుఁగు

తుమ్మెద లాల్మగల్గలసి దొమ్మిగఁదమ్ముల గుమ్మితేనియల్
కమ్మగజుఱ్ఱుసొమ్మసిలి గఱ్ఱునఁద్రేపుచుఁగైపుసైపకే
జుమ్మని గొబ్బితట్టుతరిఁజుట్టుకొలారముపాట వీరిక
బ్బుమ్మనఁబమ్ముకైతమురిపమ్ములకున్ సుతివేసినట్లగున్. 7.

మేటిపాలేటిసిరికైత సాటిరామి
పోటు రాకాసిమూఁకలపోటుఁదినిమె
నోడిపోతినోయని పాఁపఱేఁడుతుదకు
నేలనెత్తికెత్తుక పెద్దగోలమానెఁగె. 8.

పలుకులువీరికప్పరఁపుఁ బల్కులఁబోలక నెమ్మనంబు గా
సిల మొగమెఱ్ఱఁజేసికొని చిల్కలుచిల్కలుసోకి పోక్కెడున్
పలుచచివుళ్లచేవగదు బారిన కూతల కూతలందమున్
గొలమునఁబెద్దపేర్వడిన కోవెలకోవెల తగ్గిబెగ్గిలెన్. 9.

మకాము
గుంటూరు
20—2—36

ఇట్లు బుధవిధేయుఁడు
అచ్యుతుని వేంకటాచలపతిరావు,
బాపట్ల.

మాతృవర్గము
భారద్వాజ గోత్రము






అ. హనుమంతరాయశర్మ,
పితృవర్గము
కౌండిన్య గోత్రము









ం క య్య

రసమ్మ )



కేశవయ్య
రామయ్య
శేషయ్య
కృష్ణయ్య
అనంతయ్య
పిచ్చయ్య
నరసింహము
( తొండపి
సత్తెనపల్లి
తాలూకా )
కేశవయ్య
పూర్ణచంద్రరావు
గుంటూరు


మ్మ



రామయ్య
కృష్ణయ్య
మ్మ
లక్ష్మమ్మ
ాయ
నృసింహరాయ శర్మ
భార్య మహాలక్ష్మమ్మ
మ్మ




ము
వెలది సీతా
రామమ్మ
భర్త తిరుమలరావు
మంచికంటి
శివకామసుందరమ్మ
రంగనాయకమ్మ
భర్త వీరరాఘవయ్య
కస్తూరి సరస్వతి
భర్త కృష్ణమూర్తి
గాయత్రి
పాణి
పొత్తూరి లక్ష్మీపార్వతమ్మ
భర్త ( మల్లికార్జునుడు ) శివయ్య

శ్వశుర్వర్గము
కాశ్యప గోత్రము

మంచికంటి కొండయ్య

|

అప్పయ్య
భార్య శేషమ్మ

|

సుబ్బయ్య
భార్య వెంకమ్మ

|

శేషయ్య
భార్య బసవమ్మ

|

వీరరాఘవయ్య
భార్యలు: వేంకట శివకామ సుందరమ్మ
,, రంగనాయకమ్మ

అబ్బరాజు వెంకటసుబ్బమ్మ
భర్త హనుమంతరాయశర్మ

అనుముల వీరరాఘవమ్మ
భారద్వాజగోత్రము
భర్త వెంకటామయ్య

# విషయసూచిక

పథమాశ్వాసము


| | పుట. |
|---|---|
| అవతారిక ... | 1 |
| షష్ఠ్యంతములు ... | 3 |
| కథాప్రారంభము ... | 4 |
| సూతునిరాక ... | ,, |
| సూతుఁడు మాఘమాహాత్మ్యమునుడువుట | 5 |
| దిలీపుని వేఁట ... | 6 |
| కాననభూమి వర్ణన ... | 7 |
| సరోవరవర్ణన ... | 8 |
| విఖనసఋషిరాక ... | ,, |
| దిలీపుఁడు వసిష్ఠునిసందర్శించుట ... | 9 |
| మాఘస్నానఫలము ... | 10 |
| గంధర్వ వ్యాఘ్రముఖకారణము ... | 13 |
| పురూరవుని కథ ... | 14 |
| పురూరవునకు విష్ణువు ప్రత్యక్షమగుట | ,, |
| కౌత్సుఁడను బ్రహ్మచారి లక్షణములు | 18 |
| మృగశృంగ కృతవిష్ణుస్తవము ... | 20 |


ద్వితీయాశ్వాసము.


| | |
|---|---|
| బాలికామరణము ... | 29 |
| కౌత్సుఁడు కన్యకల బ్రతికించుట ... | 30 |
| ధర్మగుప్తచరిత్ర ... | 31 |
| మృగశృంగ కృత కృతాంతస్తవము | 34 |
| యమసదన వృత్తాంతము ... | 39 |
| సమవర్తి పాపకర్మల మందలించుట | 45 |
| పుష్కరుఁడు నారకులను నరకము నుండివిడిపించుట ... | 49 |
| శ్రీకృష్ణుఁడు గురుపుత్రుని బ్రతికించుట | 58 |


తృతీయాశ్వాసము.


| | పుట. |
|---|---|
| సౌభరి చరిత్రము ... | 66 |
| గృహస్థధర్మములు ... | 70 |
| పతివ్రతాధర్మములు ... | 78 |
| మృకండచరిత్రము ... | 84 |
| మార్కండేయ జననాదివృత్తాంతము | 86 |
| మార్కండేయ జననము ... | 89 |
| మార్కండేయ చరిత్ర ... | 99 |
| మార్కండేయకృత శివస్తోత్రము | 104 |


చతుర్థాశ్వాసము.


| | |
|---|---|
| తీర్థమాహాత్మ్యము ... | 109 |
| శివుఁడు బ్రహ్మహత్యతొలఁగించుకొనుట | 113 |


పంచమాశ్వాసము.


| | |
|---|---|
| శివరాత్రి మాహాత్మ్యము ... | 146 |
| వైశ్యునిచరిత్ర ... | 163 |
| జీవహింసకులొందు నరకములు ... | 166 |
| తులసీమాహాత్మ్యము ... | 168 |
| శివపూజాప్రభావము ... | 169 |


షష్ఠాశ్వాసము.


| | |
|---|---|
| కాంచనమాలినీ చరిత్ర ... | 186 |
| రాక్షసుని చరిత్ర ... | 190 |
| దేవద్యుతి కృతవిష్ణుస్తవము ... | 204 |
| కేరళుని కథ ... | 214 |
| సారస వానర జన్మపరిహారము ... | 218 |

# శుద్ధపత్రము

ఆర్యవర్యులారా!

నేనెంత జాగ్రతగా ముద్రింపించినను బ్రమాదములు గొన్ని కానుపింపఁగా నిందు సవరించితి. శేషించిన వేవేనియున్నచో మఱొక ముద్రణమున సవరించుకొనెద.

ఇట్లు
అ॥ హ॥ శర్మ

| పుట | పద్యసంఖ్య | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 తొలిపలుకు | 3 వ పేరా | 6 | చెల్లింపనిం జేసి | చేలుచెట్లుపరాధీ |
| | | | తరువాత | నంబులగుటంబట్టి |
| 5 | ,, | 2 | మాలిక | మాలికా |
| 4 | 2 | 4 | జూచిన | దూచిన |
| 1 | 4 | 3 | రమాభిధానికి | రమాభిధానకు |
| 2 | 7 | 2 | నేత్రికి | నేత్రికు |
| 181 | 402 | 1 | మురారి | పురారి |
| | ,, | 3 | మారితా | దూరితా |
| | ,, | 4 | పురారి | మురారి |
| | | ,, | చక్రిధారి | నక్రిహారి |



కృతికర్త పుత్రుఁడు :
అ. హనుమంతరాయశర్మ
ఆంధ్రీకృత భగవద్గీతాది కృతికర్త.

కృతికర్త పౌత్రుఁడు :
అ. వేంకట కోదండపాణిశాస్త్రి
పార్వతీపరిణయ కృతికర్త.

## అ॥ హ॥ శర్మ లగ్నకుండలి.

ది 1881-10-28 వృష సం॥ ఆశ్వయుజశు ౫ సౌమ్యవాసరమున మకర లగ్నో.త్తరదశానూరాధానక్షత్రతృతీయచరణమున జననము.

| | | | |
|---|---|---|---|
| | శ | గు కే | కు |
| | | | |
| ల | | | శు |
| | చం రా | బు | ర |

## కీ॥ శే॥ అ॥ వేం॥ కోదండపాణిశాస్త్రి లగ్నకుండలి.

కాళయుక్తి సం॥ చైత్ర బ ౮ స్థిరవారమున జననము.

| | | | |
|---|---|---|---|
| | ర బు | ల గు | కే |
| శు | | | శ |
| చం | | | కు |
| రా | | | |

# హనుమద్గ్రంథమాలికాహితచింతకులు



బ్రహ్మశ్రీ వేదమూర్తులు

1 ముక్కామల హనుమద్దీక్షితులుగారు

2 తుర్లపాటి హనుమద్దీక్షితులుగారు

3 కురుమద్దాలి వేంకటరామపాకయాజిగారు

4 గోపాలుని పురుషోత్తమపాకయాజిగారు

5 కొలిపాక అప్పారాయశర్మగారు

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# మాఘమాహాత్మ్యము.

[ శేషాచలకవీయము ]

## ప్రథమాశ్వాసము.

శ్లో. నమామి నారాయణపాదపంకజం,
కరోమి నారాయణపూజనం సదా,
వదామి నారాయణనామ నిర్మలం,
స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్.



యును గౌస్తుభమ్ముఁ దుల•సీవనమాలయుఁ బుట్టుమచ్చతో
రాయుచు వక్షమందుఁ దన•రారఁగ, వేల్పులు సామగానముల్
బాయక చేయ వారి కన•పాయసుఖోన్నతు లిచ్చు నాదినా
రాయణుఁ డార్తరక్షణప•రాయణుఁ డీవుత మాకభీష్టముల్. 1

మ. నిగమధ్వానము లింపు నింప మొగముల్ • నిండం బ్రఘోషింపు చిం
పుగఁ బద్మాత్మజుని వేయివత్సరములం • బూజించి విన్నాణియై
జగదుత్పత్తికి హేతువుం గనినవా•గ్జానిన్ సురజ్యేష్ఠునిన్
ఖగరాజధ్వజునూనుఁ గొల్చెద మదిం • గాంక్షించి యశ్రాంతమున్. 2

మ. క్రమత న్వేల్పులుఁ బ్రాఁతవేల్పులు సుధం • గాంక్షించి పాల్వెల్లి గ్రా
వముఁ గవ్వ మ్మహిరాజు త్రాడుగ మథిం•ప న్మధ్య హాలాహలం
బమితంబై పొడసూప దానిఁ గడిగా • నంకించి కంఠంబునం
బ్రమదం బొప్పఁగ నిల్పి లోకములఁ గా•వంజా ల్దారం గొల్చెదన్. 3

చ. పరమపతివ్రతామణికిఁ • బంకజపాణికిఁ బద్మనేత్రకుం
బరగృహవాసికిం గరుడ•వాహనుదేవికి నోషధీశుసో
దరికి రమాభిధానికి సు•ధానిధిచూలికి నిందిరాఖ్యకుం
దరికి జగన్నివాసినికి • దాసజనావని కాత్మ మ్రొక్కెదన్. 4

ఉ. పాణియుగమ్ము మోడ్తు శుక•వాణికిఁ బుస్తకపాణికిం బికీ
వాణికి మంజువాణికిని • బంకజపాణికి వంద్యమానగీ
ర్వాణికి వారిజాసనుని•రాణికి వాణికిఁ బాలితామర
శ్రేణికి శారదాంబుదశ•రీరిణి కంబుదనీలవేణికిన్. 5

ఉ. శారదచంద్రచంద్రికలఁ ♦ జాల హసింపఁగఁజాలు కాంతివి
స్తారమునం జెలంగి తెలి♦దామరగద్దియపైఁ దలిర్చి శృం
గారరసంబు చెల్లిగొనఁ♦గా మధురోక్తుల వీణతంత్రు లిం
పారఁగ మీటు భారతికిఁ ♦ బ్రాంజలిఁ జేసి భజింతు నెప్పుడున్. 6

ఉ. భూతికినై కరద్వయము ♦ మోడ్చి భజించెదఁ గాసరాసురా
రాతికిఁ బద్మనేత్రికిఁ గ♦రద్వయసంభృతఖడ్గశూలస
ద్ధేతికి శైలసూతికి సు♦ధీచయమోదికి వెండికొండరా
నాతికిఁ బార్వతీసతికి ♦ నవ్యవినీలఘనాభగాత్రికిన్. 7

చ. ముదమునఁ గొల్తు నెల్లపుడు ♦ మూషకవాహను నేకదంతునిన్
సదమలహేమవర్ణు ఘన♦చామరకర్ణు గణాధినాథు న
క్కదలికపిత్థజంబుఫల♦ఖాదను దైత్యనిషూదను న్మహా
విదితబలుం గజాననుని ♦ విఘ్నవిదూరు వినాయకాఖ్యునిన్. 8

ఉ. పుట్టినతోడనే దివికిఁ ♦ బోంగి ఫలం బని పూషు మ్రింగఁ జే
పట్టినఁ బాకశాసనుఁడు ♦ వజ్రమునం బడవైవఁ గూలి యా
పట్టున బ్రహ్మదీవనల ♦ వర్ధిలినట్టి యజయ్యునిం జగ
జ్జెట్టి నమోఘు మారుతిని ♦ జిత్తమునం దలఁతు న్మదాప్తికై. 9

ఉ. ఎక్కడ రామకీర్తనము ♦ లెక్కడ రామకథాప్రసంగమా
నక్కడ నిల్చి మస్తకము ♦ నంజలిచే ఘటియించి ప్రేమ పెం
పెక్కఁగ మోదబాష్పముల ♦ నీనఁగ రామకథామృతంబు లో
మక్కువ మీర గ్రోలుహను♦మంతు ననారతమున్ భజించెదన్. 10

గీ. అమలగుణధాము వానివం♦శాబ్ధిసోముఁ, బ్రణుతసువివేకి వాల్మీకిఁ ♦ బ్రస్తుతించి
అచ్యుతాపరవేషు న♦తార్థితోషు, నతులమంజుయోగాభ్యాసు♦వ్యాసు నెంచి. 11

సీ. తతభాగవతసుధా♦ధారాప్రయోగికి, శుకయోగికిని భక్తి ♦ జోబిళు లిడి
మృదుమధురవచనా♦మిళితసద్భాణుని, బాణుని కవితాప్ర♦భావ మెన్ని
తతకావ్యనిర్మాణ♦దక్షుఁ గాళిదాసుఁ, గాళిదాసునిసువాం♦క్కులనఁ బొగడి
అనవరతవిదళి♦తాఘుని మాఘుని, పదగుంభనముఁ బాలఁ ♦ బ్రస్తుతించి
గీ. నన్నపార్యు నెఱ్ఱన్నఁ ది♦క్కన్న నెన్ని, సుకవిసోముని నాచన♦సోముఁ దలఁచి
కాంతిభాస్కరు భాస్కరు♦స్వాంతమందుఁ, బొగడి వినుతింతుఁ గవిరాజుఁ♦బోతరాజు.

గీ. ఆర్యు లగువారికే తప్పు♦లచ్చటచటఁ, గలుగ మనుఁబోటివారలఁ ♦ దలఁచ నేల?
దిద్దదగుపట్ల దిద్దుఁడీ ♦ దిద్దరాని, యెడల నను నింద సేయక ♦ విడుఁడి కవులు. 13

వ. అని యిష్టదేవతావందనమ్ము, సుకవిజనాభివందనమ్ముఁ, గుకవిజననిందనముఁ
గావించి మదీయాన్వయక్రమం బొక్కింత వక్కాణించెద. 14

సీ. శ్రీవరనాభిరాజీవమ్మునను నట్టె, నాలుగుమోముల నలువ పుట్టెఁ
గ్రమత వానికొలానఁ గౌండిన్యఋషి పుట్టె, నెన్న వానియశము మిన్నుముట్టె
నతనిసంతునన వెంకనార్య తాఁ గనుపట్టె, వానికి శేషయ్య వరుసఁ బుట్టె
నామంత్రిమణి నర్సమాంబను గేల్వట్టెఁ, దగ వారలకు సుతత్రియము పుట్టె
నందుఁబొందుగ నృసింహామాత్యుఁడొకఁడట్టె, చెల్మినమ్మకు కమ్మఁ జెట్టఁబట్టెఁ
బరగ వారికిఁ బుత్రపంచకం బొగిఁ బుట్టె, నందు శేషాచలా ఖ్యతఁడు బెట్టె
గీ. నాకు, శ్రీకృష్ణుసెడ భక్తి నాఁడ పుట్టెఁ, గృష్ణునకుఁ గృతినిడ మనంబిపుడు పుట్టె
నేమిచెప్పుదు నాకల్మి లేమి నెట్టె, వాసుదేవుండు గరుణఁ జేపట్టఁబట్టె. 15

క. కృతిఁ జేసినఁ గృతినందిన, మృతజీవుం డనఁగఁబరగి యిహపరములఁ దా
నుతి కెక్కు నసెడు పలుకులు, శ్రుతివచనములందు విని వచోగుంఫనలన్. 16

గీ. ఒక ప్రబంధమ్ము రచియించి సకలలోక, నాయకుండగు నాదినారాయణునకుఁ
గావ్యకన్యక నొసఁగి నాకర్మజన్మ, ములఁ దొలంగించుకొనఁగ నాబుద్ధిఁ దలఁచి.

## షష్ఠ్యంతములు.

క. నారాయణునకు సుగుణా, ధారునకు జగత్త్రయైకధామునకు నిరా
కారునకు జన్మకర్మని, వారణునకు భక్తలోకపరిపాలునకున్. 1

క. క్షీరజలధిజామాతకు, వారిజభవముఖ్యదైవవందితునకు సం
సారాంబుధితరణునకుం, దారకనామునకుఁ బరమదాక్షిణ్యునకున్. 2

క. మురభేదికి కలుషార్ణవ, పరిశోధికిఁ బీతవస్త్రపరిధాయికి శ్రీ
హరికి మధుకైటభారికి, ధరణీధరధారి కమితధార్మికమణికిన్. 3

క. అల కలభాషణములతో, గలగల నందియలు మేల్మిగజ్జెలు మొల నా
దల నలరఁ బింఛియము ముంగలఁ గలలో నాడు గోపికాకాంతునకున్. 4

క. హరికి ద్రోణపురవరని, హరికి భక్తజనదుఃఖహరికి రిపుసం
హరికిఁ గమలాసుమనో, హరికిఁ గంసారి కఖిలహరికి హరికిన్. 5

క. హరి కఖిలాండపజ్క్తివి, హరికి ఘననీలదేహ హరికి మురసం
హరికి ధరణీసుమనో, హరికి నిశామనోవిహరి కజునకున్. 6

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన శ్రీమత్పాద్మపురాణంబునందలి మాఘమా
హాత్మ్యంబు బను మహాపురాణంబునకుఁ గథావిధానం బెట్టిదనిన. 7

# కథాప్రారంభము

ఆ. వె. పూర్వయుగమునందు ♦ బుధమణుల్ శౌనకా, ద్యఖిలఋషులు ద్వాద ♦ శాబ్దములొగి
సత్త్రయాగ మొకటి ♦ సలిపెద రవ నైమి,శమున దానిఁ గాంచ ♦ సరసఫణితి. 1

క. వచ్చెడిఋషిసముదయముల, నచ్చెరువుగ దేవగణము ♦ లాలోకింపన్,
విచ్చేసెడిక్షోణీదే,వచ్ఛటలం దేటుపరతు ♦ వైభవ మెసఁగన్. 2

సీ॥ మా॥ అసితపైలసుమంత ♦ వసుమత్యాగస్త్య, జాబాలికాశ్యప ♦ శౌనకాత్రి
పర్వతాపస్తంబ ♦ భార్గవాంగిరసార్త, పక్వసారగపార ♦ బభ్రుసత్య
కాత్యాయనసుతీక్ష్ణ ♦ కపిలముద్గలవామ, దేవమంతువిద్రుర ♦ ధీతరబుధ
కరుణకైవల్యకం ♦ కణకలాధరకాల, కాలాగ్నిరుద్రోగ్రి ♦ శీల కండ
కణ్వగౌతమగార్గ్య ♦ గాలవకాణాద, కౌణకౌశికజర ♦ త్కారగర్గ
కల్పాంతకోద్దాల ♦ కశ్వేతబావాక, తామలకప్రియ ♦ ధూమశంఖ
కశ్యపసంకృతి ♦ కౌండిన్యనారద, విష్ణువృద్ధపిశంగ ♦ పృథుహారీత
జమదగ్నిధూమప ♦ శనిబకౌంకవశిష్ఠ, శక్తిపరాశర ♦ సత్యవతేజ
పటువిశాలాక్షైక ♦ పాదద్విపాదోర్ధ్వ, బాహుమహాగ్రీవ ♦ బాహుకాయ
శ్వేతాశ్వతరమహా ♦ సేన శతానంద, మాండవ్యరైభ్యవి ♦ భాండక భృగు
పంకశరభాంగబోధాయ ♦ నాంకమంత్రి, విదభరద్వాజశుక వేద ♦ వినమృకండ
యాజ్ఞవల్క్యశతాతప ♦ యజ్ఞశీల, బుధమహోదరశ్రీవత్స ♦ ముఖ్యఋషులు. 3

చ. అలరఁగ నప్పు డీసరణి ♦ నాదిమసంయమిచంద్రబృందముల్
విలసితవేదశాస్త్రచయ ♦ విద్యలఁ జాలఁ బ్రసిద్ధికెక్కి ని
ర్మలమతి వారిశిష్యులు క్ర ♦ మమ్ముగ వారలశిష్యవర్గముం
గలిసి యనేకు లొక్క గుమి ♦ గా నరుదెంచిరి యాగభూమికిన్. 4

వ. ఇట్లు వచ్చి. 5

క. నైమిశనామకవనమున, ధీమంతులు మునులు గోమ ♦ తీతీరమునన్
గామించి యజ్ఞఫలమును, నేమించిరి శాల యొకటి ♦ నిశ్చలమతులై. 6

## సూతురాకడ.

సీ. పుణ్యమై దేవతా ♦ గణ్యమై చిరకాల,ముం జేయఁదగినదై ♦ మొనసియున్న
సవన మొక్కండు ద ♦ చ్ఛాలయం దొనరింప, సమశట్టి వేదమం ♦ త్రముల వేల్చు
చున్న యాక్రతువును ♦ జూచువేడ్క జనించి,సూతుఁ డామోదస ♦ మేతుఁ డచటఁ
జేరఁగ నాతని జూచి ♦ నెఱజడలు శ్నార,చీరలుం జిరునవ్వుఁ ♦ జిల్క మొగము

ఆ. వె. మిగులఁ దిన్నఁదనము ♦ మేలైనయర్థము, లెఱుఁగునెడల నేర్పు ♦ నెలమి మంచి
గొనపుఁగల్మి గల్గి ♦ గణుతింపసంతోష,మునకు మేరలేని ♦ మనము గలిగి. 7

చ. నొసటఁ ద్రిపుండ్రధారణము • నూతనభస్మవిలిప్తదేహ మ
త్యసదృశమై గళంబున శి•వాక్షసరమ్ములు మండలాకృతి
న్వ్యాసు జడ జుట్టినట్టి ముడి • వేదపురాణసుశాస్త్రమర్మముల్
వినుతిక తెల్ప నేర్పమర • వేమరు మేలు దలంచువాఁడునై. 8

ఉ. కోపమును న్వ్యాపీకములఁ • గోరిక మాని జయించి మోక్షముం
బ్రాపుగ నిల్పుచుం దనువుఁ • బాయకమున్నె గణించి, వేదవి
ద్యాపరిశీలతి న్మెలఁగు • వ్యాసునను గ్రహితం ద్రిబాధసం
తాపము వాపి వ్యాసుబలె • ధారణి గౌరవపాత్రుఁడై తగన్. 9

ఉ. వేదవిధి న్మెలంగుచు వి•వేకముతోడుత నిల్చినట్టి యీ
సాధువరేణ్యుఁ గంటిమని • సంతస మొప్పుగ సత్కరించి స
మ్మోదవినోదలీలఁ దగు • భూరికథల్ వినఁగోరువారలై
యాదర మొప్పఁ జుట్టికొని • రాపును లప్పుడు సూతు నర్మిలిన్. 10

ఉ. పొచ్చెము లేక సూతుఁ డతి•పుణ్యుఁడు వారలు కోరు సత్కథల్
జెచ్చెరఁ దెల్ప నాసభకుఁ • జేతులు మోడ్చి నమస్కరించి వా
రిచ్చిన పీఠమందు వసి•యింపఁగ శౌనకముఖ్యమౌను లా
సచ్చరితుం దగం గనియు • సమ్మతితో నిటు వల్కి రందఱున్. 11

క. సూతా! పదునెనిమిది ప్ర,ఖ్యాతపురాణార్థము లితి•హాసములును సం
ప్రీతిని నీచే వింటిమి, చేతోమోదమున నొకటి • సెప్పవె మరలన్. 12

తే. అంచుసంయములిటువల్కి•హర్ష మొదవఁ, బ్రకటమైయొప్పు పాద్మపు•రాణమందు
మాఘమాహాత్మ్య మది విని • మఱపుదగిలె, దాని నెఱిఁగింపుమయ్య స•ద్ధర్మ మెసఁగ.

క. అనఁగ విని శౌనకాదులఁ, గనుఁగొని యుగ్రశ్రవుండు • గరుణాన్వితుఁడై
వినుఁ డిపుడ మాఘమాసం, బనుకూలత వచ్చె; నిట్టు • లమరఁగవలదే? 14

## సూతుఁడు మాఘమాహాత్మ్యము నుడువుట.

వ. అని వినుం డని సూతుండు, మా తండ్రియయిన రోమహర్షణునకు శిష్యుండనయి నారాయణాంశంబునం జన్మించిన వ్యాసానుగ్రహంబు గలవాఁడ నగుటచే మీ రడిగిన యీ మాఘమాహాత్మ్యముం జెప్పెద నని ముందు పరమాత్మస్వరూప మయిన యోంకారమునకు మ్రొక్కి బ్రహ్మవిష్ణుమహేశ్వరు లయిన త్రిమూర్తులకు, స్వయంప్రకాశురా లయిన సరస్వతికి, విఘ్నేశ్వరునకు మ్రొక్కి, పరాశరుని కుమారుండు, బూరుషోత్తముండు, నెల్లవేదములకుఁ బుట్టినచోటగువాఁడు, నెల్లవిద్యలకు గనియయినవాఁడు, స్వచ్ఛప్రకాశమైన కీర్తిగలవాఁడు, వేదవేదాంగములచేత నెఱుఁగఁదగినవాఁడు, మిగులఁ దిన్ననివాఁడు, జాల గొప్పవాఁడు, విషయముల నణచినవాఁడు, నాకుఁ దేటయిన బుద్ధిని గలుగఁజేసినవాఁడు, నైన వేదవ్యాస మహామునీశ్వరునకు సర్వకాల సర్వావస్థలయందు మ్రొక్కెదు ననిపల్కి, దేవతాగురువందనములు గావించి, వారలఁ గనుంగొని యిట్లనియె. 15

క. మునులార! వినుఁడీ యాకథ, ఘనుఁడు దిలీపునకు బ్రహ్మ♦పుత్రుఁ డినకులం
బునకు గురువగువశిష్ఠుఁడు, వినుపించినవిధిని మీకు ♦ వినుపింతుఁ దగన్. 16

ఆ. మాఘమాసమహిమ ♦ మహిని నిట్టిది యని, పలుకువారు విన్న♦వారు నొకరు
గానుపింప రిట్టి♦కథఁ జెప్ప విన నేను, నిను దక్క నన్యు ♦ లెవరు గలరు? 17

ఉ. ఏనరుఁడైన భానుఁ డుద♦యింపకమున్న రుణోదయంబునన్
మానక మాఘమందున స♦మంచితగ్రామబహిర్జలంబులన్
స్నాన మొనర్చినట్టి బుధ♦సత్తముఁ డింద్రపురంబునందుఁ దాఁ
దానకమై కుటుంబసహి♦తంబుగ నిల్చు జగద్ధితంబుగన్. 18

వ. అని మఱియు సూతుం డిట్లనియె. 19

తే. ఆ దిలీపమహారాజు ♦ యాగ మొకటి, సేసి బ్రాహ్మణజనులకుఁ ♦ జెలువుమీఱ
భూరిదక్షిణ లొసఁగి వి♦భూతి మెఱయ, నవభృథస్నాన మొనరించి♦నంత మీఁద. 20

చ. పురమున కేగుదెంచి జన♦పూజితుఁడై రిపువర్గమందు భీ
కరగతి నొప్పి సాధువులఁ ♦ గాచుటయం దనురక్తుఁడై ధరా
భరము వహించి భోగములఁ ♦ బాకవిరోధిని మించి దిక్కుల
న్మెరయఁగ గీర్తి నెంచి గృహ♦మేధి తెఱంగున నుండు నత్తఱిన్. 21

## దిలీపువేఁట.

క. ఒకదినము వేఁటతమకము, బ్రకటముగ జనింపఁ బాద♦రక్షలు నంగీ
లకుటిలమతిఁ దలపాగను, సుకరంబగు ధట్టి యుంచు ♦ సొంపగు బాకున్. 22

తే. బాణబాణాసనంబును ♦ బరగ నడుము, చర్మమునఁ జేసినట్టి హ♦స్తకవచంబుఁ
దాల్చి వెడలంగ వేటకుఁ♦దగినసేన, తోడ నడచిరి చిత్తము ♦ తొంగలింప. 23

వ. ఇట్లు వెడలి పొంకముగాఁ గానవచ్చు నొక యడవిం బ్రవేశించి. 24

సీ. గొప్పతోపులఁ జాల ♦ మెప్పైనపొదరిండ్ల, మెరకపల్లములగల ♦ ధరణియందు
సెలయేటియిసుకలం♦కలయందు దొనలందు, గండశైలములందుఁ ♦ గలయఁదిరిగి
యీటెలు కత్తులు ♦ నిష్వాసభల్లముల్, లాదిగాఁగలుగు మ♦హాయుధములు
తనవెంట నరుదేరఁ ♦ దగినసేనలఁగూడి, యొక్క మహారణ్య ♦ మక్కజముగఁ

తే. జొచ్చి వేటాడువేడుక ♦ పిచ్చలింప, శరభశార్దూలసింహాళిం♦బరవరాహ
ఖడ్గచమరీగజంబులఁ ♦ గారుఁబోతు, లాదిగాఁగల విపినమృ♦గాళి నెల్ల. 25

ఆ. ఏది వెదకి గొప్ప ♦ యీటెలు గత్తులు, బాణములు సురియలు ♦ బల్లెములును
గుదెలు నారసములు ♦ మొదలగునాయుధ, చయము చేత మిగుల♦సంహరించె. 26

ఉ. అంత నృపాలుఁ డాగహన♦మందునఁ గల్గువినోదసంపదల్
వింతగఁ జూడఁగోరి భట♦వీరులతో సెలయేళ్లు దాటి య
త్యంతకుతూహలుం డయి ర♦యంబునఁ బుట్టల పాకసందులం
గంతులు వేయుచుండెడు మృ♦గంబులఁ బట్టి హరింప నత్తఱిన్. 27

ఉ. అల్లదె చూచితే మెకము • లావలికిం గురిదప్పిపోవ మా
యుల్లము గల్కవారె యని • యోధులు గూతలు వెట్ట వాని నే
నెల్లవిధమ్ములం దునిమి • యేర్పడ వచ్చెద నంచు వేడ్క సం
ధిల్లగఁ వాని గన్గొనెదు • నేరుపుతోఁ గదు దూర మేగఁగన్. 28

కానన భూమి వర్ణన.

తే. అచట ఝిల్లీరవంబుచే • నతుకఁజెంది, కలదవారు మయూరస • ఘుముల మిగుల
జడుపు గలిగిన లేళ్ళమం • డలును బలల,ఖాదనము సల్పు క్రూరమృ • గములు గలిగి. 29

క. తరువుల రంధ్రాంతరముల, నిరువు లొనర్చుకొని కూత • లిడుగూబల వా
గరముసైతలకై భూమిఁ, దఱచు దర్వ్యనడవిపండి • దాటుల మఱియున్. 30

తే. సింహముల వాడిగోళ్లచేఁ • జీల్పఁబడిన, యేనికలతలలందుండి • యిలఁ దొఱంగి
నట్టి ముత్యాలరాసుల • నధికమైన, సర్పచయముల గలమేటి • సరియ లెల్ల. 31

ఆ. పులులగోళ్ళచేతఁ • బొడవగ గాయముల్, గలిగి రక్తధార • లొలుకుజింక
సముదయమ్ము లేగు • సరణి నెంతేగొప్ప, దరులయందుఁ గొండ • చఱియలందు. 32

సీ. చరియించుసిద్ధకిన్నరదూవరు లంతి,పురవుమంగిళ్లతోఁ • బోల్పఁదగిన
స్థలములు గలిగి వృక్షములదట్టపునీడ,లం బుష్పములతావు • లనుకరింపఁ
గార్చిచ్చుమంటలఁ • గ్రాగి మార్గికులనుండి, పరుగు లెత్తెడిచిఱు • పాము లలర
ఇంపైనపొదరిండ్ల • నిండ్రిసిలమణుల, తోరణవారముల్ • తో నెదిర్చు

తే. తుమ్మెదలబారుగొప్పకాం • దూలములను వెలుచిపొదనుండిపా రెడు • నెను మెకముల
ఖడ్గచమరీమృగంబులఁ • గలిగి మివుల, సొబగుమీరెడు బలుకాన • జూచి చూచి. 33

సీ. కుందేళ్లపై వేట • కుక్కల నుసికొల్పి, విడిచి పల్లములందు • నడలు దీర
బోయగుంపులు దిలీ • పుఁడు గూడి విహరింప, వారిసంచారము • వలన జింక
కలకలధ్వని కోడి • కడువడిఁ బరువెత్తె, నది యప్పుడప్పుడు • నచ్చటచటఁ
బొదవుగాఁ గుప్పించి • పొదలపై కేగయుచు, వెంబడించిన బలు • వేఁటకాండ్రు

తే. గురికి నందక పొడసూపి • మొఱగి చనెడు, చిత్రసంచారములను వీ • క్షింపు చవల
దట్టమయి ముండ్లచెట్లచేఁ • దనరి మిట్ట, పల్లముల గాలిజాడఁ గ • న్పట్ట నరిగి. 34

ఆ. వెంబడించి మొక్క • విపినప్రదేశమ్ముఁ, జేరి దప్పివలనఁ • జిక్కి నీరు
లేక గొంతు లెండి • నూకలు రాజును, నోటిమాట లేక • నొచ్చి పడిరి. 35

వ. ఇట్లు దప్పిగొని.

ఉ. వాడినమోములం బరగు • బంటులచేతను వేటకాండ్రచేఁ
బోఁడిమి దక్కయున్ననృప • పుంగవు డెప్డు సపర్య లంది చేఁ
దోడుగ వాండ్రు రాగ బహు • దూరము జింకను బట్టువాస నా
జాడను వచ్చె నింగినడిచక్కి • కినుం డొగి రాఁగ వేగమే. 36

వ. ఇట్లొకసరోవరంబు దరియంజేర నప్పుడు. 37

## స రో వ ర వ ర్ణ న.

ఆ. అదియుఁ గంధిఁబోలి ♦ నదియునై గొప్పవై, దరిగలట్టి చెట్ల♦దట్టమైన
నీడఁ జల్లనైన ♦ నీటిచే ననుకూల,మైన రేవులఁ దగి♦నదియు నగుచు. 38

సీ. పరిమళీయుక్తమౌ ♦ పరిఫుల్లపంకేరు,హములఁ జెంగల్వల ♦ నమరి పూవు
తేనియల్ద్రావి మ♦త్తిల్లినషట్పద,ధ్వనులను మరకత♦మణులచేతఁ
గప్పినవిధముగాఁ ♦ గనుపించుతామర,పత్రిముల్సుజనుని ♦ బహుళమైన
మనమును బోలి ని♦ర్మలమునై తనరారు, సలలితోదకములు ♦ జలములఁ గడు

ఆ. భయముగలుగఁజేయుఁ ♦ బడుమత్స్యమండూక, కమఠజలవిహంగ♦సముదయములు
గలిగినదియు లోభి♦యిల్లుమాడ్కి మిట్టప,ల్లములఁ బాచిచేత♦నమరునదియు. 39

ఆ. దళములనిళలందుఁ ♦ దివిరి పక్షులకు సం,తాప మణఁచునదియు ♦ ధనముగలుగు
తెంపుదాతపగిది ♦ దీనజనులపీడ, మాన్పనోపెడుమహి♦మ గలదియును. 40

క. జననీజనకులవిధమున, ననయము శార్దూలసింహ♦హయరిపుముఖకా
ననమృగమ్ముల జలపానం,బునఁ దృప్తి వహింపఁజేయఁ ♦ బోలినయదియై. 41

క. చంద్రునివలె మనముల కా,నందము నిడి ప్రాణితతికి ♦ నాప్యాయన మిం
పొంద నిడు తత్సరస్సునఁ బొందుగ, మధ్యాహ్నకృత్య♦ములు దీర్చి వెసన్. 42

ఆ. సలిలములను గ్రోలి ♦ ఫలములఁ బరితృప్తుఁ, డైనరాజు సేద ♦ నటులఁ దీరి
నట్టిపరిజనములు ♦ నచ్చోటునం దిష్ట, కథలచేతఁ బ్రొద్దు♦గడుపుచుండి. 43

ఆ. భానుఁ డస్తమింప ♦ భానువంశోద్భవుఁ, డప్రమత్తుఁ డగుచు ♦ నమ్ములపొది
మూపునందుఁ దాల్చి ♦ మోపెట్టి బలువిల్లు, మృగవధార్థ మచట ♦ మెలఁగుచుండె.

ఉ. తోయఁపుమార్గమం గదిసి ♦ తొంగి మొగమ్ములఁ గూల్చునాసతోఁ
బాయక నిల్వఁగా నడవి♦పందులగుంపులు దత్సరఃస్థపా
నీయముఁ గ్రోల ముస్తెలకు ♦ నేలను ద్రవ్వను రాఁగఁ గాంచి యా
బోయలు నడ్డుపెట్టగను ♦ భూపతి వాని వధించె బల్మిమై. 45

ఆ. అట్టు లడవిపందు ♦ లన్నియుఁ దనుచేతఁ, జచ్చెననెడు వేడ్క ♦ పిచ్చలింప
జోక వేటకాండ్రు ♦ గేకలువేయుచు, సారిది రాజుచుట్టుఁ ♦ జుట్టుకొనిరి. 46

తే. అట దలీపుఁడునరుణోద♦యమునఁ బంది, బొందుల న్వెంట నేతెంచు♦బోయగముల
చేత నెత్తించుకొని ప్రేమ♦చేతనరుగఁ, బురపథంబున నెంతయుఁ ♦ బొల్పుగదుర.

## వి ఖ న స ఋ షి రా క డ.

క. కడునిష్ఠలతో వ్రతములు, నడుపుటచే నొడల బలము ♦ నాశనమై బల్
ముడుతలఁబడు చర్మముతో, బడుగుపగిది నెముక లన్ని ♦ బయలువడంగన్. 48

ఆ. గాలివలనఁ దనువు ♦ దూలెడివిధమున, నుండి జింకచర్మ ♦ మొనరఁ గప్పి
వచ్చునట్టి యొక్క ♦ వైఖానసుని హారీ,తుఁ డను విప్రవరుని ♦ దురితహరుని. 49

క. రోమములు గోళ్ళుఁ బెంపుచు, నేమమున స్మరించు చెపుడు ◆ నిగమార్థములో
నేమరక మెల్లమెల్లనఁ, గామనుల నణంచి యెదురు◆గా వచ్చితనిన్. 50

సీ. కని మాఱ మిడి నృపుం◆డనువుగ నొకరారఁ, నిలిచి యామునిపాద◆ములకుఁ దనదు
శిరము సోకఁగ మ్రొక్కి ◆ కరములు జోడించి, నిలువ నృపుండు నాఁ◆డెలిసి మౌని
యతనికి మేలుజే◆యఁగ మానసంబున, నెంచి మాఘస్నాన ◆ మేల వదలి
మలినరహితమైన ◆ సలిలాశయమునుండి, యూరక చను టేమి ◆ కారణ మని
తే. పలుకువై ఖానసుని మృదు◆భాషణముల, కలరి యీస్నాన ఫలమును◆దెలియ నాకుఁ
జెప్పవే యన నారాజ◆శేఖరునకు, వృద్ధవిప్రోత్తముండు తా ◆ నిట్టులనియె. 51

ఉ. భానుఁడు తూర్పుకొండఁ గను◆పట్టకమున్న జలాశయమ్మునన్
స్నాన మొనర్చు కాల మిది ◆ సత్కథఁ జెప్పెడువేళ గాదు నా
తో నరుదెంచి యీసరసి◆తోయముల న్విధిపూర్వకమ్ముగా
స్నాన మొనర్చి మాగురువు◆సన్నిధి కేగి యెఱుంగు మన్నియున్. 52

క. అని పలుకక భూసురుఁ డ, వ్వనమునఁ గల కొలని కేగ ◆ వసుధాధీశుం
డును మౌనివెంటఁ జయ్యనఁ, జని సంకల్పము నొనర్చి ◆ స్నానముసేసెన్. 53

క. దైవఋషిపితృతర్పణ, మావరుసం జేసి మునిప◆దాంబుజములకుం
గావించి నమస్కృతులను, సేవించి విధేయుఁ డగుచు ◆ క్షితిసురునాజ్ఞన్. 54

## దిలీపుఁడు వశిష్ఠుని దర్శించుట.

చ. పురమును జేర నేగి నృప◆పుంగవుఁడున్ సుఖలీల నాఁటిరా
తిరి గృహమందునం గడపి ◆ తీవ్రమతి న్మరునాఁటివేకువం
గర మనురక్తి లేచి నిజ◆కర్మలఁ గల్యమునందుఁ దీర్చి సు
స్థిరమగు రాజచిహ్నములఁ◆చేతఁ గుతూహలమానసుండునై. 55

చ. అరదము నెక్కి భానుకులుఁ◆డైన దిలీపుఁడు మంత్రులాప్తులుం
బరిచరవర్గముం గొలువ ◆ వాద్యరవంబు చెలంగఁగా నతి
త్వరితగతి న్వశిష్ఠునని◆వాసముఁ జేరి మునీంద్రపాదపం
కరుహము లాత్మశీర్షము దగం ◆ దగులన్ నతిసల్పి నిల్చినన్. 56

క. మునిపుంగవుఁ డలభూపతి,వినయమునకు సంతసించి ◆ వివిధములగు దీ
వన లిచ్చి తగినపీఠం, బునుపుచు మన్ననలఁ జేయ ◆ నుత్సాహమునన్. 57

ఆ. కూరుచుండి గురుని◆కుశల మారసి వృద్ధ, విప్రువలనఁ దాను ◆ విన్నయట్టి
మాఘమాసఫలము ◆ మదిమది నాలింపఁ, గోరి ప్రశ్న సేసె ◆ గురునిఁ జూచి. 58

తే. ఓ మునిశ్రేష్ఠ మీచేత ◆ నార్జితమగు, రాజనీతి వర్ణాశ్రమ◆రాజి మతులు
విష్ణుపూజలు దానముల్ ◆ వివిధములగు, వ్రతములాదిగ సకలసం◆గతులు వింటి. 59

సీ. గణనీయమైన మా ఘస్నానవిధినిఁ ద,త్ఫలమెల్ల మీవల్లఁ దెలియనెంచి
యేనిపు డింపల కేతెంచితిని దాని,మహిమ నా కెఱిగించి మానివర్య
ననుఁ గృతార్థునిఁ జేయు మనుచుఁ బ్రార్థించెదు, క్షితినాథున కనె వశిష్ఠమౌని
వనవాసియైన శ్రీ వైఖానసునివాక్య,ములు సవిస్తరముగాఁ దెలియఁదగిన
తే. వనుచు నిహపరసుఖముల నందఁజేయు, నదియు నత్యంతపావన మైనదియును
నైన యీమాఘమాహాత్మ్య మతిశయిల్ల, వినుమనుచు రాజునకుఁ బల్కె మునివరుండు.

మా ఘ స్నా న ఫ ల ము.

తే. దేవతాస్త్రీలతో నెడ తెగనిసంగ,మము నపేక్షించువార లీ మాఘమాస
ముదయమున నేటినీటను వదలకెపుడు, మునుఁగుదురు భక్తితాత్పర్యముల నిలేశ.
చ. చెరువులు నన్నసత్రములు జీర్ణశివస్థలవహ్నిహోత్రముల్
పరువడి నీటిసాలలును బ్రాహ్మణసేవలు విష్ణుపూజలుఁ
సరసఁపుజన్నముల్ జరుపఁజాలక పుణ్యముఁ గోరు మానవుం
డిరవుగ మాఘమం దుదయ మేటను నీటను దోఁగఁగా నగున్. 62
మ. తిల గో భూ గుడ కుంభ ఘోటక పట స్త్రీవిద్యలుం, బాదర
క్షలు నాజ్యాలము తైలకంబళలస చ్ఛయ్యాసనీయాదు లీ
యిలపై నీయఁగఁజాలనట్టిమనుజుం డీ మాఘమాసవ్రతం
బెలమిం జేయగఁ దత్ఫలమ్ముఁ గనుఁ దా నెంతేని భూమీశ్వరా. 63
ఆ. పర్వదివసములను బరగ మన్వాదుల, సంక్రమణములందుఁ జాల నిష్ఠ
సలుపలేనిమనుజుఁ డిల మాఘమాస వ్ర,తము లొనర్పఁ బుణ్యవంతుఁ డగును.
వ. మఱియుం జైత్రవైశాఖమాసంబుల జలాన్నంబులు, జ్యేష్ఠాషాఢమాసంబుల నర్చ
నంబు, కార్తికమాసంబున జపతపోహోమంబులు, మాఘమాసంబున స్నాన
దానంబుఁ జేయువారు తమవారితోడ మిక్కిలి తృప్తి వహించి, పునర్జన్మంబున
భూనాథులయి, తుదకు జన్మరహితమైన మోక్షస్థానముం జేరుదురు. . 65
క. విను మాఘమునం దొనరిం,చిన మజ్జనదానములును జెడనట్టి తపం
బును బోల నరుఁడు సంపద, మును వొందును నొందు స్వర్గమును నవ్వెనుకన్. 66
ఆ. మున్ను కశ్యపఋషి పూఁబోఁడి మాఘమా,సమున నిట్టివ్రతము సలిపి నాక
మేలఁజాలునిందుఁ డినుఁడాదిద్వాదశా,దిత్యగణముఁ గన్న దెఱఁగు వినమె. 67
క. చంద్రునికాంతయు నయ్యమ,రేంద్రునికాంతయు వశిష్ఠునిందువదనయున్
రుంద్రమతి సలిపి వ్రతము న,రేంద్రోత్తమ పున్నియంపుఁబిల్లాం డ్రగుచున్. 68
సీ. సలలితదేహకాంతుల చేతఁ దనరి రో,హిణితుల నాట్యంపుఁబోలుపు గలిగి
గజకర్ణముల మీఱఁగలుగుచామరముల,వలని చల్లనిగాలి వచ్చునదియు
సౌందర్యవతులైన చంద్రవదనలసం,గడిచేత గ్రోలఁగాఁ దగునదియును
వీనుల కింపుగా వినఁదగునాటపాటలరొదల్ చాలగాఁ గలిగినదియు 69

తే. వేదనాదము సల్పెడు • విప్రు లధిక, తత్త్వమార్గంబుఁ దెలియుస • ద్బ్రాహ్మణులును
గలిగినదియు నతిథిపూజ • గలదియునగు, మనికిపట్టుల గనియింతు • రనుదినంబు. 70

ఉ. దానము లీశ్వరార్చన లు • దారతఁ జల్పుచు దుష్టవర్తనల్
మాని పరోపకారమగు • మంచిప్రవర్తన మానసమ్మునం
దానకమై రహిం జెలఁగఁ • దాకొని మాఘప్రభాత వేళఁ దా
స్నానముఁజేయుమానవుఁడు • శంకరమందిరవర్తి యయ్యెడున్. 71

చ. వనములయందునం, దమని • వాసములందున విష్ణుపూజలం
దనిపెడువారికిం, జెడని • దానము లిచ్చుటయే స్వభావమై
పొనరినవారి కెల్లపుడుఁ • బోఁడిమి నెంతటిలోకమబ్బునో
వెనుపడ మాఘమం దుదయ • వేళల మజ్జనమాచరించు త
జ్జనముల కట్టిలోకములఁ • జక్కనియోగ్యతమంపుటిక్కలౌ. [పంచపాది] 72

క. ఎప్పుడుమాఘుస్నానము, చొప్పడునో వానికొలలు • సొరిదిని నపుడే
తప్పులు గూలె నశించును, జెప్పెడి దేమి యిఁక నీవు • చేయుము దీనిన్. 73

ఆ. మానవులకు నిట్టి • మహిమ యేవ్రతములఁ, గలుగఁబోదు మిగుల • సులభమైన
దీని నాచరింపు • దివిరి నీజన్మసా, ఫల్య మొందఁగలవు • పార్థివేంద్ర. 74

క. అనిచెప్పి పూర్వమున భృగు, ముని గంధర్వునకు నిదియ • బోధించెను నా
మణికూటపర్వతంబున, నన విని గురుఁజూచి క్షితిపుఁ • డపు డిట్లనియెన్. 75

క. మునివర మణికూటంబునఁ, గనికరమున భృగువు మున్ను • గంధర్వునకున్
వినిపించెనంటి వీకథ, వినవలతుం దాని నాకు • వివరింపఁగదే. 76

చ. అన విని యవ్వశిష్ఠుఁడు మ • హామతియైనదిలీపభూమిపుం
గని యిటువల్కెఁ బూర్వము • కాలమునందున ద్వాదశాబ్దముల్
చినుకులులేక క్షామమునఁ • జిక్కి హిమాచలసహ్యమధ్యమం
దునఁ గలలోకు లన్నమును • దోయముఁ గానక మాడి రెంతయేన్. 77

సీ. ఏఱులఁ జెఱువుల • నీరొకింతయు లేక, కందమూలాదులు • కంటఁబడక
పితృదేవతార్చనల్ • వేదపాఠంబులు, జరుగక హోమముల్ • చక్కఁబడక
మెండైనగాడ్పులు • నిండి వృక్షములఁ గా, యలు నాకులుం బిందె • లవనిఁదొరఁగఁ
గ్రూరాత్ములగుజనుల్ • చోరులై బాధింప, నల్లరేవానది • యండ నెసఁగఁ
తే. దనరు స్వాశ్రమమునువీడి • తాపసేంద్రుఁ, డైన భృగుముని తనదుశి • ష్యాళితోడఁ
గదలి హిమశైలమున కేగి • కడక దాని, పశ్చిమాశను గైలాస • పార్శ్వమునను. 78

తే. నవ్యసౌవర్ణమాత్నరత్నముల నధిక, కాంతిచే నొప్పి మిగులఁ బ్రి • కాశమాన
మైనమణికూటపర్వత • మందుఁ గ్రిందిదెసను బటికఁపురాళ్లచేఁ • దెల్లనగుచు. 79

ఆ. మధ్య నింద్రనీల • మణిధాతువులఁ బొల్చి, తనువునందు భస్మ • ధారణమ్ము
గళమునందు నలుపు • ఘనజటాబంధమ్ము, చేతఁ గ్రాలుభూత • నేతఁ బోలి. 80

ఆ. ఇంద్రనీలకాంతి నందంద బంగారు, వన్నె జాజురేఖ మిన్నయగుచు
మెఱుపుతీఁగతోడ మెలఁగెడివార్షిక, కాలమేఘపఙ్క్తిఁబోలి మఱియు. 81

ఆ. శైలశిఖర మింద్రనీలమణులచేతఁ, దనరి మధ్యభాగమునఁ బసిండి
చాయ లమరఁ బట్టుసాలు ధరించిన, విష్ణుమూర్తికరణి వెల్గి మఱియు. 82

తే. నీలమణులఁబోల్ నల్లని నెత్తము లచ, టచట స్ఫటికోపలమ్ములు నమరియుండ
మినుకుమినుకను చుక్కల ననుకరించు, మిన్ను చెన్నున మించులఁ బెడఁగు గలిగి.

సీ. తొలఁగినయెనుకసంఘులను నెప్పటియట్ల, చక్కఁగా నతుకువిశల్యకరణి
మొదలౌ వనౌషధమూలికాతతికాంతి, నమితజ్యోతిస్స్వరూపములఁదనరి
పగలు రాత్రిల్లెడ తెగనిదీపమ్ములఁ, గ్రాలుగేహమ్ములతోఁ బోలుపఁదగి
కొండచరులఁ జెంచుకొమ్మలెమ్మెలఁ బిల్లఁ,గ్రోవులు మోవులఁ గూర్చి పేర్చ

తే. గీతములు వాడుచుండె డెక్కములఁ బోలు, నటిటియాకులు కప్పుటాలందమైన
తఱుపు బచ్చతోరంగులు తరచు గలిసి, వజ్రివజ్రఁపుగాంతికి వన్నెయిడుచు. 84

తే. పలువిధములైనరత్నకాంతులును గైరి, కాదిధాతువులును జేరి యక్కజమగు
శిఖలతోఁ గూడియుండిన శిఖినిఁ బోల, నట్టితత్పర్వతమ్ముపై నధికమైన. 85

తే. చదరమై కాల్నేలపైఁ జలువతాళ్ల,పైని విద్యాధరాళి సంభార్య లగుచు
వనవిహారము సల్పి యా బడలిక లాగిఁ, దీర్చుకొనుచుండు రల్లెడఁ దేజమలర. 86

తే. ప్రాణవాయువులం బిగబట్టి యితర, సంగతుల మాని యక్కొండచరియలందు
నునికిపట్టుగ వర్తింతు రుచితకర్మ,లయిన సన్మునులు విరాగు లగుచు మఱియు.

చ. పగలును రాత్రి యెల్లపుడుఁ బాయనిపేరిమను బ్రహ్మము న్మదిన్
నిగమవిధి స్మృతించుచు ననేకులు సిద్ధులు కేళ్ల మాలిక
ల్దగ ధరియించి కొండగవులం గడుఁ బ్రొద్దులు పుచ్చుచుందు రం
పుగ నఱగన్నువెట్టి మనముం బిగబట్టి వహించి మౌనముల్. 88

క. సెలయేటినీటిబొట్టులఁ, జెలువుగఁ జిగిరించిన వెల్వపుఁజెట్టుల బలుమొ
గ్గలతావియేటిలోనో,లలనాడెడు తుమ్మెదరొదలం గలదియునై. 89

క. కడుపారమేసి మదమున, జెడఁదిరిగెడు సేనుఁగులును జింకలు మెగపుం
దడములు కస్తురిమెగములు, గడుకడిఁ దిరిగెడుహయములు గజరిపుగణముల్. 90

క. పావురములు గొరవంకలు, కోవెలలు న్నెమ్మిచిలుకగుంపులు డేగల్
లావుక లేటిప్రింతలు హరి,వావురములు వేల్పుపెద్దవావురము లౌగిన్. 91

తే. నల్లగలువలు తామరల్ దెల్లగలువ,లాదిగాఁ గలపువ్వుల నమరి మివుల
వానిపరిమళముల నొప్పి వాటమైన, కొలఁకులు దిగుడుబావులు గలిగినదియు.

తే. తేనెలంగ్రోలి మదవదిందిరములు, బలసి ఝుంకారముల్ సల్పి ప్రబ్బికొనెడు
క్రొత్తవాసనలకు మదిఁ గోర్కెరేఁగ, నొకకొలఁకు నుండ కేగు వేరొకకొలనికి.

క. ఈకొలఁదిదేవతలచేఁ, బ్రాకటగంధర్వతురగ◆వదనావళిచే
నేకాలముఁ గ్రాలుచు సుగుణాకర! పర్వతము మెఱయు ◆ నావుడు నృపుఁడున్.

తే. షడ్గుణైశ్వర్యసంయుక్త◆శార్ఙ్గిభక్త, సక్త! దుర్జనముక్త త◆చ్ఛైలమెంత
నిడివి వెడలుపు చదరమై ◆ నెగడినదియొ, విస్తరమ్ముగ వినిపింపు ◆ విమలచరిత.

క. అనియిటువల్కు దిలీపుని, ఘనవినయోక్తులకు మిగులఁ ◆ గరుణారస మిం
పెనయఁగ వసిష్ఠముని నృపుఁ, గని చెప్పఁగఁదొణఁగె నిటుల◆కౌతుకమెనయన్. 96

సీ. జననాథ! మణికూట◆శైలయోజనములు, నిడిపి ముప్పదియారు ◆ వెడలుపు పది
యడుగుభాగము పది◆యారునై విలసిల్లి, చందనసురసాల◆సరళపనస
పారిజాతలవంగ◆బకుళఖర్జూరజం, బీరసాలాది◆వృక్షతతులఁ
బరిమళయుతపుష్ప◆ఫలముల నేప్రొద్దు, నొప్పుచుండు నివాస◆యోగ్య మగుచు

తే. నట్టిపర్వతమును గాంచి ◆ యాత్మ గరువు, భయము విడనాడి సంతోష◆పరత నొక్క
యాశ్రమమ్మేర్పరచుకొని◆యందు నిల్చె, భృగుమునివరుండు దనశిష్య◆బృందములును.

తే. తడవున నిట్లు నిత్యకృ◆త్యములు నిగమ, మంత్రములు హోమములుఁ దపో◆మహిమ నొప్పి
భగవదారాధనలచేతఁ ◆ బవలు రేయి, జరుపుచుండఁగ నొకనాఁటి◆సమయమందు.

## గంధర్వవ్యాఘ్రముఖకారణము.

తే. ఒక్కగంధర్వుఁ డచ్చోటి ◆ కక్కజముగ, వ్యాఘ్రముఖమున వేగంబ◆వచ్చి తనదు
భార్యతో నామునీంద్రుని◆పాదములకు, మ్రొక్కి దుఃఖాత్ముఁడై ముని◆మ్రోల నిల్చె.

వ. ఇట్లు మ్రొక్కి దురంతచింతాభరంబున నెదుర నిలిచిన యా గంధర్వదంపతులం
గనుంగొని. 100

ఆ. ఆదరించి వారి◆దగు ఖేదమూలమ్ము, నడుగు మునికులార్ణ◆వాబ్జున కొగిఁ
దనవిచారమెల్లఁ ◆ దలపోసి గంధర్వుఁ, డెఱుఁగఁజేయఁదలఁచి ◆ యిట్టు లనియె.

ఉ. ఏమని విన్నవించెద ము◆నీశ్వర నా తొలిజన్మమందు నే
నేమి తపంబు సల్పితినొ ◆ యీశ్వరభక్తి వహించి దాని కీ
భామున దేవయోనిమయి ◆ బాటిలినంతల కేమికర్మమో
యీ మెయిఁ గ్రూరవ్యాఘ్రముఖ ◆ మేర్పడె మానికులాబ్ధిచంద్రమా. 102

క. ఇందుల కారణమును నాకుం దేటగఁ బల్కు మీవుఁ ◆ గూరిమితో నీ
చందమును బాపి మునుపటి, సుందరరూపమ్ము కనులఁ ◆ జూపు మహాత్మా. 103

వ. అని మఱియు నిట్లనియె. 104

ఆ. సద్గుణములు గలిగి ◆ సౌందర్యఖని యయి, యాటపాట నెంతొ ◆ నేటయి నను
నేటుమాటలందు ◆ సాటిదీటిన యీపె, భార్యయయ్యె నాకు ◆ నార్యవినుత. 105

ఆ. చిన్ననాఁట నిద్ది ◆ కన్నియగా నుండి, వీణెపాటఁ జాలఁ ◆ బెంపుఁజెంది
సామగానవిద్య◆చతురుఁడౌ నారద, మునివరేణ్యువలనఁ ◆ గనియె మెప్పు. 106

తే. మఱియు సప్తస్వరములమ♦ర్మము లెఱింగి, గానవిద్యానిధానమై ♦ కొలుచుండు
రాజరాజును మెప్పించె ♦ రహిఁ జెలంగ, బాల్యచాపలమున వీణె♦పాటవలన. 107

తే. ప్రొద్దుపోకకు నొకనాఁడు ♦ బుద్ధిదీరఁ, గానరసపరవశతను ♦ వీణెపాట
పాడఁ గని శంకరుఁడు గగు♦ర్పాటుతోడ, శిరముఁ గదలించె నానంద♦భరితుఁడగుచు.

ఆ. ఇట్టి సుదతి నన్నుఁ ♦ జెట్టఁబట్టిన దీనిఁ, గలిసి సకలసౌఖ్య♦ములను జెందఁ
జాల కిప్పు డిట్టి♦శార్దూలముఖమున, దుఃఖపడుచునుంటి ♦ దురితదూర. 109

తే. అనుచు విద్యాధరుం డపు♦డమితమైన, తనదుఖేదమ్ము నంతయు ♦ మునివరునకు
విన్నవించిన భూతభ♦విష్యవర్త, మానము లెఱింగిన మునీంద్రుఁ ♦ డౌ నటంచు. 110

ఆ. జ్ఞానదృష్టిచేతఁ ♦ గనుగొని నవ్వుచుఁ, బలికె నిట్టు నిన్ను ♦ బాధవెట్టు
చిత్రకర్మ మేను ♦ సెప్పెద గంధర్వ, వినుమటంచుఁ బల్కె ♦ భృగువరుండు. 111

క. మంచివివేకము గలిగి స, మంచితకార్యములయందు ♦ మసలెడివారల్
వంచనఁ డయుచు భ్రమ న, త్యంచితదుఃఖముల మ్రింగి ♦ యలయుదు రకటా. 112

తే. ఈఁగ కాలంతయైన దు♦ష్కృత మెవండు, తెలిసియేని యొకించుక ♦ తెలియకేనిఁ
జేయఁగా నది మహనీయ♦శిఖిని బోలి, కాలుచు ననేకదుఃఖముల్ ♦ గలుగఁ జేయు.

తే. విషము కొంచెము ప్రాపఁ ద♦పింపఁజేయు, నట్టు దుష్కర్మ మణుమాత్ర♦మైనఁ జేయ
ననుభవము మీఁద బాహుళ్య♦మగుచు దుఃఖ, భాజనముఁ గల్గఁజేయు నూ♦బలువితెముల.

ఆ. దోషకృత్యమంచుఁ ♦ దోచదు చేసెడు, సమయమందు నవల ♦ నమితమైన
పవనమిత్రుఁ బోలి ♦ బాధలబెట్టెడు, వేళఁ గానుపించు ♦ విరివిగాను. 115

ఆ. కనుక మాఘమాస♦మునను శుద్ధైకాద, శిని వ్రతమ్ము భక్తిఁ♦జేసి ద్వాద
శిని శిరమ్ము నంటి♦కొనిన సీ కిట్టిశా, ర్దూలముఖము నేఁడు ♦ తోఁచె నకట. 116

పురూరవు కథ.

ఉ. మోదమెలర్ప నీవలెనె ♦ మున్ను పురూరవుఁ డన్ నృపుం డనే
కాదశినాఁడు సక్రమము♦గా వ్రతమాచరణం బొనర్చియుం
ద్వాదశినాఁడు దా మరచి ♦ తైలముతోఁ దలనంటికొన్న నా
ఖేదదమైన పాపమున♦కే క్షితిపాలన మాని భీతిమై. 117

తే. పట్టణము వాసి శిశిరప♦ర్వతము దండ, కేగి యచ్చోట దైవని♦యోగమైన
కొలనికట్టున నివసించి ♦ మలినరహిత, మైనతజ్జలములఁ జేసె ♦ స్నాన మమర. 118

తే. చేసి దర్భలమీఁద నా♦సీనుఁ డగుచుఁ, బాపి విషయాళిఁ జిత్తమ్ము ♦ వశము జేసి
నిద్రయును నన్నము న్మాని ♦ నిష్ఠఁ దనరి, దేవదేవుని నాత్మలో ♦ దిటవుపఱిచి. 119

పురూరవునకు విష్ణువు ప్రత్యక్షమగుట.

సీ. నీలమేఘము డాలు ♦ నేలుకాంతులవాని, మెఱుఁగుఁ జామనచాయ♦మేనివాని
తెలిదమ్మిరేకులఁ ♦ దెగడుకన్నులవానిఁ, దొగవిందు నగుముద్దు♦మొగమువాని

పసమీరుమేలిహొం♦బట్టుదుప్పటివాని, నెమ్మిగుల్కెడు పేరు♦రమ్మువానిఁ
బిల్లవాలును సంకుఁ ♦ బెనుగత్తి విల్లాని, చాలఁగ్రాల్ భుజచతు♦ష్టయమువాని
తే. కమ్మకస్తురి గీరునా♦మమ్మువాని, రేయిఁ బవలును జేయు కం♦దోయివాని
నొప్పుఁగుల్కెడు మొసలినా♦యొంట్లవాని, నమృతవారాశిగారాబు♦టల్లువాని.
చ. కడువడి నిట్టచిహ్నములు ♦ గల్గిన కంజదళాక్షు నెమ్మదిన్
దడబడకుండ నిల్పి నృప♦తాపసుఁడిట్లు భజింపుచుండఁగా
నెడపక యేడుజన్మముల ♦ నెంత తపఃఫల మబ్బుఁ జేయు నా
పుడమిదునీఁడు చేయు సమ♦బుద్ధి తపంబున కంత రెట్టియై. 121
క. ఉత్సాహమ్మొదవఁ దపో,ద్యత్సంపదఁ గ్రాలు నతని♦దండకు వచ్చెన్
వాత్సల్యముతో శ్రీహరి, వత్సంబుం గోరి గోవు ♦ వచ్చినభంగిన్. 122
ఉ. మున్ను ధరాధిపుండు దప♦ముం బొనరింపఁగఁ బూనువేళఁ దాఁ
బన్నగశేవిధిం బహుళ♦వాంఛ జనింప భజించె నట్టి సం
పన్నత బాగుమీర ముని♦వర్యులు గొల్వఁగ మాఘశుద్ధమం
దెన్నఁగనైన ద్వాదశి న♦హీనశయానుఁడు వచ్చె లక్ష్మితోన్. 123
తే. వచ్చి ప్రత్యక్షమైనట్టి♦వనరుహాక్షుఁ, జూచి సంతోషబాష్పముల్ ♦ జొబ్బిలంగఁ
దపము సాలించి భూమిపై ♦ దండమువలె, సాగిలఁ బడి పురూరవ♦శ్చక్రవర్తి. 124
తే. భువనములకెల్ల నాధార♦భూతమైన, శ్రీహరికి మ్రొక్కి కరములు ♦ శిరమునందు
మోపి డగ్గుత్తికను మాట ♦ మొగిని రాక, యెట్టకేలకు మాటలు ♦ తొట్రుపడఁగ.
వ. గద్గదస్వరంబుతో నా భగవంతుని నిట్లని స్తుతియించె. 126
చ. సరసిజగర్భముఖ్యసుర♦సంఘములే తమతత్త్వమింతయే
నెఱిగి హృదంతరాళమున ♦ నేర్పడఁబల్కఁగ లేరటన్నచోఁ
దరమె నుతింప నాకు ఘన♦తామసుఁడం జపలాన్వితుండఁ బా
మరుఁడ జడుండ వక్రితను ♦ మానిపి నన్నుఁ గృతార్థుఁ జేయవే. 127
ఆ. దేవదేవ! నీదు♦దివ్యదర్శనమున, నాకు జన్మమింక ♦ లేకయుండ
నెల్లదుఃఖములకు ♦ నిల్లగు సంసృతి,బద్ధు నన్నుఁ గరుణ ♦ నుద్ధరింపు. 128
క. అని యిటు పల్కు పురూరవుఁ, గని భగవంతుఁడును బాష్ప♦కణతోయములం
దనచేతిశంఖతీర్థము,నను నభిషేకించి రాజు♦నకుఁ బ్రియమెసఁగన్. 129
క. నూనెను ద్వాదశిదినమునఁ, గానక తల నంటికొన్న ♦ కర్మఫలంబుం
బోనడఁపుచు నూర్వశి తనుఁ. దాన వరించెడి సురూప♦తను వొగి నొసఁగెన్.
ఆ. వసుమతీశుఁ డిట్టి♦వరము నచ్యుతునిచేఁ, బడసి యంతమీఁదఁ ♦ బట్టణమున
కేగుదెంచి మరల ♦ నెప్పటివిధమున, రాజ్యపదవిఁ జెందెఁ ♦ బూజ్యుఁడగుచు.
క. ఓ విద్యాధర నీ వటు, గావింపక భుక్తపడెదు ♦ కర్మము మదిలో
భావించి యేల దుఃఖము,చే విసుగొగిఁ జెంద నొందు ♦ సెప్పెద వినుమా. 132

తే. ఇట్టికార్యాలముఖము పోఁ♦గొట్టుకొనఁగఁ, గోర్కి కలదేని యామణి♦కూటపర్వ
తమునఁగల యేటినీటఁ బూ♦ర్వమునఁ జేసి,యట్టిదుష్కర్మ పోఁగొట్టు♦నట్టి దంచు.

క. చేయుము మాఘస్నానము, మాయును నీదుకిలిమెల్ల ♦ మంచిగొనంబుల్
శ్రేయస్కరముం గలుగు ను,పాయము నెఱిఁగింతు నార్య♦వర్యులు మెచ్చన్. 134

సీ. వినుమి యిప్పుడు నైదు♦దినములలోపల, మాన్యతేపంబైన ♦ మాఘ మొకటి
తా నరుదెంచునం♦తకు ముందుఁ బుష్యశు,ద్ధైకాదశి యమోఘ♦మా దినమని
ప్రారంభముం జేసి ♦ యది మొదల్ నెల భోజ,నము మానివేసి ది♦నమ్ము నుదయ
కాలమందునఁ దప్పు♦కయ మజ్జన మొనర్చు,చు హృషీకములఁ జేకఁ ♦ జొక్కపడక
ఆ. అన్యములను విడచి ♦ యచ్యుతుఁ బూజల, మూఁడువేళలందు ♦ మొనసి తనుపు
నెఱిఁగి మాఘములో లి♦యేకాదశికి నెదు,రనుచుచుండు ♦ మింపు గదుర.

క. అట్టిశుభదినము రాఁగా, నెట్టన నీ వుపవసించి ♦ నియమముతోడన్
దిట్టముగ నిలువు మే నా,పట్టున మంత్రోదకములఁ ♦ బరిశుద్ధిగాన్. 136

ఆ. తాన మాడఁజేసి ♦ తరుణవయస్కుఁడౌ, మనుని సెక్కిరించు ♦ మంచిమొగము
గలుగునట్టు లేను ♦ గావింతు నీకు నీ, దోసములను నవలఁ ♦ దొలఁగనడఁచి. 137

క. మిక్కుటఁపుసోయగముగల, చొక్కఁపుటిల్లాలిఁ గూడి ♦ సుఖయించెద వీ
నిక్కఁపుమాఘవ్రతమి మా, వక్కఱతో నెఱిఁగి తాన ♦ మాడు మటంచున్. 138

ఉ. ధర్మమెఱింగినట్టి ముని♦తల్లజుఁ డా ఋభుయోగిఁ గాంచి దు
ష్కర్మము లూడ్చుమార్గమని ♦ స్పష్టముగాఁ గనుపట్టునట్టు నే
మర్మములేక తెల్పి తుల ♦ మాఘమహత్త్వము దాన నీవు స
త్కర్మముగా నెఱుంగుమని ♦ తద్దయు వేలుపుగాణ కిట్లనున్. 139

క. ఆపదలు దొలఁగు నెంతటి, పాపములైన నశియించు ♦ బహువ్రతముల ను
ద్దీపించు నిదియ శ్రేష్ఠము, ప్రాపకమగు వ్రతమటంచుఁ ♦ బల్కుదురు బుధుల్.

క. వ్రతములు దానములును స,త్క్రతువులు యోగములు నెల్ల ♦ తపములు జేయన్
జతనమగు మాఘమాసము, నతులితమతి బ్రహ్మకైన ♦ నలవియె పొగడన్. 141

సీ. మఱి పుష్కరమున బ్ర♦హ్మావర్తమునఁ బృథూ,కమున గంగాసింధు♦కలితమౌ ప్ర
యాగం గురుక్షేత్ర♦భాగమ్మునందున, గంగాయమాత్మజా♦సంగమమునఁ
బంచేంద్రియమ్ముల ♦ బంధించి దశశర,త్తులను నొక్కచోట ♦ నిలిచి చేయు
ఘనతపస్సంపదఁ ♦ గలుగుఫలంబు మా, ఘమునందు మూఁడు ది♦నములు నుదయ
ఆ. కాలమందుఁ బేర్మి ♦ గల్గి స్నానమొనర్ప, నట్టిఫలము నంద ♦ నవ్వలగుదు
రిందు కింతయేని ♦ సందేహ మూనంగ, వలదు వలదు వేల్పు♦పాటకాఁడ. 142

క. చిరకాలనాకసుఖ మే,నరులు నపేక్షింత్రో వారు ♦ నారాయణుఁగూ
ర్చి రహిని మాఘస్నానము, నరుణోదయవేళఁ జేయ ♦ నగు గంధర్వా. 143

క. ఆయువు నారోగ్యము సిరి, పాయనిసతిచక్కఁదనము ♦ బాంధవ్యము దా
మేయెడల నెడలఁ గోరెదు, ధీయుతు లీవ్రతముఁ జే♦యఁ దివురగవలయున్.

క. దోషము దారిద్ర్యము పటు,రోషము జననింద వికృత♦రూపంబును ని
శ్శేషముగ మాఘమున సవి,శేషముగం దానమాడఁ ♦ జెడు గంధర్వా. 145

తే. కోరి కోరక కాని సం♦కోచపడక, నెట్టిజలముల నెండైన ♦ నేమరకయ
స్నానముం జేయు మాఘమా♦సమున దుఃఖ,పుంజములను సుఖపుంజ♦ములను బొందు.

ఆ. విధుఁడు కృష్ణపక్ష♦తిథులను క్షీణించి, యవల శుక్లపక్ష♦మందు వృద్ధి
నొందినట్టు మాఘ♦మం దంయు స్నాతుఁడై, పాపమడఁగ సుకృత♦ఫలముకడుగ.

సీ. రత్నాకరమునందు ♦ రత్నముక్తాప్రవా,ళసమూహములు వుట్టు ♦ లాగునఁ గడు
పాడము మాఘస్నాన♦ మువలన నాయుష్య,ధనసతీపుత్రమి♦త్రవ్రజమ్ము
కామధేన్వాదులు ♦ కరుణఁగోర్కులొసంగు, నెట్లు నేతత్స్నాన ♦ మట్లొసంగు
కృతయుగానఁ దపస్సు ♦ త్రేతాయుగమ్మున, యజ్ఞసమూహము ♦ ల్యాగపజ్త్తి
తే. ద్వాపరయుగమ్మునం జక్రి♦పాణిపూజ, కలియుగమ్మున దానముల్ ♦ సలుపవలయు
నిదియు ముఖ్యమ్ము గంధర్వ ముదముతోడఁ, దెలిసి యొనరించువారికి♦ ఫలములబ్బు.

చ. ప్రతియుగమందు నొక్కఁడు ♦ భాసిలుచుండెడు నట్లుగాక ని
యతులితమాఘమాసమున ♦ నన్నియుగమ్ముల నన్నిజాతులన్
హితవుగ నాచరించుటకు ♦ నేర్పడె దీనికి నెద్దియేనియుం
జత యొకఁ డేనిఁ గానము ని♦జమ్ముగ నెంచుల నెంచి కాంచినన్. 149

తే. అనుచు భృగుముని విద్యాధ♦రునకు మాఘ,మహిమ నెఱిగింప నతఁడు సం♦భ్రమ మెలర్ప
నిలిచి యయ్యాశ్రమమున మ♦సిషి నాఁగఁ, బరగుసలిలోడ మణికూట♦పర్వతమున.

సీ. అలలతోఁ బ్రవహించు ♦ నెలరేటిజలములఁ, బత్నితో గంధర్వ♦పతి భృగుముని
తనకుఁ దెల్పినపద్ధ♦తి నల మాఘస్నాన,ముం జేసినం ద్వీపి♦ముఖము వదలి
మునియనుగ్రహమున ♦ మునుపటిదేవతా,ముఖము చేకూరఁగా ♦ ముదముఁ జెందె
నటుల గంధర్వున ♦ కానంద మొనరించి, ముని వింధ్యపర్వతం♦బునకు శిష్య
ఆ. గణముతోడ నోర్పు♦గల్గి శరీరయా,త్రం గడుపుచు వచ్చి ♦ దానికొండ
లందుఁ జొచ్చి చేరె ♦ నాదట రేవాన,దీసమీపభూని♦వాసమునకు. 151

తే. ఓ దిలీపమహారాజ ♦ యేది సకల,లోకపాలి కంతటికి న♦స్తోక మగుచుఁ
దనరు నా మాఘమహిమ గం♦ధర్వునకును, వినిచె బ్రహ్మర్షివర్యుఁడౌ♦ భృగుమహర్షి.

క. బహువిధములైన కోర్కుల, సహజముగా నిచ్చు మాఘ♦సద్వ్రత మిదిగా
కిహపరముల కాధారము, నహహా యీకథను జదువ ♦ నన్నియుఁగలుగున్.

ఆ. అనుచు నటు వశిష్ఠు ♦ డాదిలీపునితోడ, మరల నింక నొక్క ♦ మాఘమహిమఁ
దెలిపె నదియు మీకుఁ ♦ దెలియఁ బల్కెదవినుం,డనుచు సూతుఁడనియె ♦ మునులతోడ.

క. ఎయ్యది పాపవినాశని, యెయ్యది దుఃఖవనకీలి యెయ్యది సుఖదం
బెయ్యది పావనకలితం, బయ్యది మాఘుంబు దాని నాడెద వినుఁడీ. 155

## కౌత్సుఁ డను బ్రహ్మచారి లక్షణములు.

సీ. మును పద్మకల్పాంతమునఁ గృతయుగమందుఁ, గుత్సనామకబ్రహ్మకులజుఁ డొకఁడు
కర్దమమునికన్యకను ధర్మపత్నిగా, వరియించి తద్భార్యవలన నొక్క-
కులదీపకుండగు కొమరుని గాంచి యా, కొమరున కైదేండ్లు గూడ వాని
నుపనీతుఁ జేయ నయ్యుదారగుణుం డల బ్రహ్మ,చర్యంబు మహితాగ్నికార్యములను
ఆ. జేయుచుండి గురుని సేవింపుచుఁ ద్రికాల,ములను స్నానసంధ్యవలనఁ దృప్తుఁ
డగుచు భిక్షమెత్తునట్టి యన్నము భుజి,యింపుచుండి గెల్చి యింద్రియముల.
ఆ. మొలను ముంజి గోచి మోదుగుకఱ్ఱ క,మండలువును నొడలినిండ నచ్చ
భస్మ మలఁది భుజముపై నొంటిజందెమ్ము, జింకతోలుఁ దాల్చి చెలువుమీర.
క. కనుఁగొనెడు జనములెల్లం, గనుపండువుగాఁగ గాంచి కడువేడుకతో
మనముల సంతోషింపఁగ, ననవరతము వేదపాఠనాసక్తుండై. 158
సీ. సతతప్రాతఃకాలస్నానాదిసత్కర్మ,ములఁ దీర్చి తల్లిదండ్రులకుఁ బిదప
నుపదేశవిద్యల నొసఁగినగురువుల, కౌశ్రిమవాసుల కధికభక్తి
మ్రొక్కుచుఁ దాంబూలమును గంధపుష్పాక్ష,తలు పాదరక్షలు దలకుఁ బాగ
దంతధావనము నద్దము వన్నెచిన్నెలు, భూషణాంబరములు మొగిఁ దలఁపక
ఆ. మఱియుఁ జెలికపిండి మద్యము మొదలుగా, నత్తువస్తుసమితి మాని బ్రహ్మ
చర్యమునకుఁ దగనకార్యముల్ నడుపుచు, శీలవంతుఁ డనగ గ్రాలె నతఁడు.
క. ఇటు శుభలక్షణముల నా,వటుమణి చాంద్రాయణాదివ్రతములచే మి
క్కుటమగుతీర్థాచరణత, నటు పరిశుద్ధాంతరంగుఁడై వర్తిలుచున్. 160
సీ. పదపడి యొకనాఁడు పశ్చిమముఖముగాఁ, బాఱు కవేరజావారియందు
స్నానమాడఁగ నేగ సంచితపుణ్యఫ,లమ్ముచే నపుడ మాఘమ్ము రాఁగఁ
బుడమిపై నెవ్వరుఁ బడయశక్యము గాని, దమితపుణ్యము నిచ్చు నదియుఁ గొన్ని
యెడలఁ బశ్చిమముగా నడుచుచు మఱికొన్ని,చోట్ల నుత్తరముగాఁ జొచ్చుచుండి
ఆ. సాగరమునఁ గలయు సర్వనదులలోఁ బ్ర,యాగకంటె మహిమ నధికమగును
బుధులచేత నెపుడు పొగడొందు తన్నదీ,స్నాన మబ్బెనంచు సంతసించి. 161
ఆ. మూఁడుమాఘమాసములు కవేరాత్మజా,తీరమందు నిలిచి దివ్యమగుచు
పడమరకును నేగు పానీయములఁ ద్రికా,లములయందు స్నానమమరఁ జేసి.
ఉ. కోరికలెల్లమాని గుణకోవిదకౌత్సుఁడు మాఘమందుఁ గా
వేరి జలావగాహనము వేమరుఁ జల్పిన పుణ్యరాశి పెం
పారఁగఁ దల్లిదండ్రులు నమస్కృతు లంది ముదంబుఁ జెంద నా
పై రహి వారియాజ్ఞను దపం బొగిఁ జల్పఁదలంచి యాదటన్. 163

క. ఆకావేరికి నుత్తర, మాకాశము నొరయుచున్న ◆ యట్టిశిఖరముల్
వీకం గాంచినచఖుల, స్తోకంబగు చెట్లుగల్గి ◆ చూడఁదగినదై. 164

క. కలకలమను పులుఁగులరవ,ములు నడవిం దిరుగు మృగస ◆ మూహము పెనుబా
ములు గొండశిలలు గలదయి, పలువంకల భయదమగుచుఁ ◆ బరగినయదియై. 165

ఉ. పెక్కువిధంబులం దనరి ◆ పెంపు వహించిన పూవుఁదీవెలం
జక్కఁగ నావరింపఁబడి ◆ జానవు నేత్రములందుఁ బ్రేమ పెం
పెక్క సువర్ణపుష్పకము ◆ లెక్క విహారము లోలిఁ జల్పి లోఁ
జొక్కెడుయక్షసంఘముల ◆ సొంపును బెంపును గల్గినట్టిదై. 166

క: పెల్లలరిన దయి కమ్మని, చల్లనిసల్లలితవాయు ◆ సంచారపుఁ దా
కు ళ్లలను గదలువాల్లిక, ఫుల్లాంబుజపుంజములను ◆ బొల్చినదౌనలన్. 167

చ. పలు ననతేనె లాని మధు ◆ పంబులు నాద మొనర్పఁ బెంపు సొం
పలరెడు కోకిలస్వనము ◆ లద్రిగుహల్ ప్రతిశబ్దమీనఁ గే
కులు నవపింఛముల్ విడచి ◆ కూయుచు నాట్యము సల్ప దేవయో
నులు దమయాటపాటల న ◆ నూనముగా విహరింపఁ గ్రాలుచున్. 168

సీ. దిక్కుల కెగఁబ్రాకి ◆ మిక్కుటమయి నిడు,పైన కొమ్మలతోడ ◆ నమరి మిన్ను
నంటినపాదపు నొం ◆ డొంటితో నొరసెడు, సాలశమీకత ◆ మాలబిల్వ
చందనాశ్వత్థామ్ల ◆ సంతానఖర్జూర, నారికేళాశోక ◆ నాగకేస
రౌదుంబరలవంగ ◆ పాదపజంబీర, దాడిమీతినిశమం ◆ దారనింబ
తే. జాతిచంపకబొలర ◆ సాలసాల,జాలమాలూరహింతాల ◆ తాళకేత
కీరసాలవటాంఘ్రిప ◆ వారకలిత,లలితనారాయణాఖ్యశై ◆ లంబునందు. 169

ఆ. మలినరహితమైన ◆ జలముల నలలచేఁ, జలనమందు తామ ◆ రలసమీప
మందుఁ బాలుదీప ◆ చందమై వెలుఁగొందు, నంచపిండుచేత ◆ నందమగుచు. 170

క. తనయందుఁ దానమాడెడు, మనుజుల దుష్కర్మ లడఁచు ◆ మహిమగలిగి కో
రినకోరికల నొసంగుచు, ననువగు నొకకొలనిచెంత ◆ కరుదెంచి వెసన్. 171

ఆ. అపుడు మాఘమాస ◆ మాసన్నమగుట నా, కొలనిపడమటిదెస ◆ నిలిచి దాని
సలిలములను నెపుడు ◆ జలకమ్ములాడుచు,హరినిఁగూర్చి తపము ◆ నాచరించె.

చ. అటుల జపమ్ము మాని తన ◆ యాత్మను నేమి చలింపనీక యా
వటువు సమీరశూన్యమయి ◆ వర్తిలుదీపముభంగి నిల్చి తా
నిటు నొకటాయె మోక్షిడో యన ◆ నిసచరాచరమెల్లఁ దానుగాఁ
బటుతరమైన నిష్ఠ నెసఁ ◆ బాయక చేసెఁ దపంబు నర్మిలిన్. 173

క. అప్పుడు జింకలసముదయ,మప్పులు గ్రోలుటకు నేగి ◆ యాకొలనిదరిం
జొప్పడగఁ దపముసల్పెడు, నప్పురుషవరేణ్యుఁ గాంచి ◆ యాశ్చర్యముతోన్.

క. ఇది యొక్క మ్రానిమ్రోడని, మదిఁ దలఁచుచు మేనిదురద ◆ మాన్పుటకొఱకై
కదలక యుండెడు తపసిని, బదపడి రాచుకొనుచుండు ◆ భయవిరహితలై. 175

సీ. అటు తపోమహిమచే ◆ నజరుద్రసురులకు, నందశక్యముకాక ◆ నధికుఁడైన
సర్వరక్షాచణు ◆ సర్వాత్మకుం జక్రి,ధరు నెట్లు నిల్పె హృ◆త్పద్మమందు
నట్లు ప్రత్యక్షమై ◆ యాభగవంతుండు, జ్ఞానసంపన్నుఁడౌ ◆ కౌత్సునెదుర
నిలిచి యోమృగశృంగ ◆ నీతపోమహిమకు, సంతుష్టి నొందితిఁ ◆ జాలు నింక.
ఆ. ననుచు చానతిచ్చి ◆ యాతని శిరంబునఁ, దనదుహస్త ముంచి ◆ తడవ నతఁడు
నిదుర హెచ్చరికను ◆ బొదలినకరణిఁ ద,పస్సమాధి మాని ◆ లెస్సనిల్చె. 176
ఆ. కనులు తెరచి వేయు◆కవులమిత్రతేజ, మమర భూషణాంబ◆రములతోడ
చలము విడచి యెదుర◆ సాక్షాత్కరించిన, విష్ణుమూర్తిఁ గాంచి ◆ వివశుఁడగుచు.

## మృగశృంగకృత విష్ణుస్తవము.

ఆ. సాఁగి మ్రొక్కి లేచి ◆ సరగున హస్తముల్, శిరమునందు విష్ణు◆ చరణయుగము
మనమునందు నుంచి ◆ మధుమథనుండ! కృష్ణుండ! యంచు వినుతి◆ మెండు జల్పె.
ఉ. లోకములన్ని నీకడుపు◆లోపల నేర్పడఁజేసి జీవులం
జేకొని రక్షణం బరసి ◆ సేయుచు ధర్మ మెఱింగి వానికిన్
నీకరుణార్ద్రదృష్టి భువి ◆ నింగి వెలుంగఁగఁ జేయుచుందు వ
స్తోకచరిత్ర! నన్ను గృపఁ ◆ జూడుము నిన్ శరణంబు వేడెదన్. 179
సీ. ఎవ్వనిసంకల్ప ◆ మీచరాచరముల, యక్షీణసృష్టిస్థి◆తిక్షయమ్ము
లకు హేతువై యొప్పు ◆ లాలితషడ్గుణై,శ్వర్యసంపన్నుఁడై ◆ వరలు నెవఁడు
లోకమ్ములప్పుల◆లో డిందునప్పుడు, వటపత్రశయనుఁడై ◆ పరగు నెవఁడు
శాంతాదిసద్గుణ◆జాలపరిభావకుల్, కలిగిన సుజ్ఞాన◆కలితుఁ డెవ్వఁ
తే.గీ. డెవఁడు స్వాతంత్ర్యమున దివ్య◆ నెవ్వఁ డధిక, తేజమున నీజగంబుల◆ దీప్తమగుచు
వెలుఁగు నెవ్వఁడు మోక్షమ్మ◆ వేఁడ్క నిచ్చు,నట్టిదేవుని భజియింతు◆ ననుదినంబు.
క. స్థిర యోగీంద్రులమనముల, గురుతరముగ నిలిచి వారి◆కోరిక లెపుడున్
గరుణించు వాని జగములఁ, బరికింపఁగ నధిపుఁ డనఁగఁ ◆ బరగినవానిన్. 181
ఆ. వె. అణువుకంటెఁ గొంచె◆మై మహత్తునకంటె, నధికమగుచు శ్రుతుల ◆ ననవరతము
పొగడఁదగినపాద◆యుగములఁ గులిశాది,రేఖ లమరఁ దేజ◆రిల్లువాని. 182

సీ. భయదమా సంసార◆పాథోధిదరిఁ జేర్ప, యానపాత్రముఁ బోలు◆నట్టివాని
నెల్లలోకములకు ◆ నేలికయై లోక,ముల నెల్లఁ దానయై ◆ మెలఁగువాని
మంచిగొనమ్ముల ◆ మించి జన్మస్థితి, నాశ మొందని పుణ్య◆రాశి ననఘు
వేయునాదలలతో ◆ వెలుఁగుచుండెడివాని, నఖిలరాక్షసశత్రు◆ వైనవాని
ఆ. వె. అజరమేశరుద్రు ◆ లనెడుత్రిమూర్తులుఁ, దాన యగుచు నెప్పుడుఁ ◆ దనరువాని
శంఖచక్రఖడ్గ◆శార్ఙ్గనందకగదా,ద్యాయుధముల నొప్పు◆నట్టివానికి. 183

తే. వగతురను దున్మించి సజ్జన♦ప్రకరములను, గూర్మి మీరంగఁ బ్రోవఁగాఁ♦గోరువాని
భక్తిమై నిల్చి పదములఁ♦బట్టి కొల్చి, హస్తములు మోడ్చి మ్రొక్కెద♦ననుదినంబు.

ఉ. హారమణీఘృణీకలిత ♦ హాటకకంకణస్వర్ణరత్నకే
యూరవరాంగులీయకమ♦హోజ్జ్వలకౌస్తుభవైజయంతు లొ
ప్పారఁగఁ దాల్చి ముజ్జగము♦లందుఁ బ్రకాశము నొందఁజాలు నీ
చారుతరప్రభావమును ♦ సన్నుతిఁ జేసెద మోక్షకామినై. 185

క. నీకంటెఁ ద్రిభువనములఁ, బ్రాకటముగఁ బ్రభువు గలఁడె ♦ పరికింపంగా
నీ కిరుమూఁడుతలంపుల, పోకలు లే వెన్నఁటికిని ♦ బుణ్యచరిత్రా. 186

క. శరణాగతుఁడగు నను నీ,చరణసరోజముల భక్తిఁ ♦ జక్కఁగఁ జిక్కం
గరుణింపు కృపాదృష్టిని, నిరతము నీపాదములకు ♦ నే మ్రొక్కెదున్. 187

ఆ. ప్రళయకాలమందు ♦ జలముపై నవకంజ,ములను బోలుకనులు ♦ మూసి యోగ
నిద్ర చేత వెలుఁగు ♦ నీపదాంబుజములఁ, నమితభక్తిఁ గొలుతు ♦ ననుదినంబు. 188

క. నీయంద తగులు డెందము, బాయక యుండెడువిధంబుఁ ♦ బరికించి యిటుల్
సేయుము నీచే రక్షణ, నేయెడఁ బొందఁదగువాఁడ ♦ నేఁ జేతు నతుల్. 189

చ. తొలఁకరిమబ్బుగెబ్బుజిగి♦తోఁ దళుకొత్తు మెఱుంగుమేనునం
జెలఁగుచుఁ గాళియుం డనెడు ♦ చిల్వలరాతలలందుఁ జిందులం
జలిపినవానికిం గరుడి♦జక్కిపయిం జెలఁగాడువానికిం
బలుమరు వందనంబు లెడఁ♦బాయక చేసెద నెల్లవేళలన్. 190

చ. అని యిటు మాటిమాటికి మ♦హానినయోక్తుల నమ్రవృత్తుఁడై
కనులను బాష్పతోయములు ♦ గ్రమ్మఁగ రోమము లట్టె నిక్కఁగా
వినతు లనేకభంగులను ♦ విప్రకుమారుఁడు చేసి చేసి దే
వుని దనచిత్తమందుఁ దల♦పోయుచు చేరువ నిల్చె దీనుఁడై. 191

క. ఇటు నిష్కపటాత్ముండై, పటుతరభక్తి దరి నుండు ♦ భాగవతమణిం
దటుకునఁ గని భగవంతుఁడు, కటకటఁబడి యిట్టు లనియెఁ ♦ గరుణ దలిర్పన్.

ఉ. ఓమృగశృంగ! నీదయిన♦యుగ్రతపంబున నీసరస్సునం
దేమరకుండ మాఘమున ♦ నీ వొగి మజ్జన మాచరించినన్
వేమరు సన్నుతుల్ సలిపి ♦ వేడుటకుం దగ నాకు నీపయిం
బ్రేమ జనించి వచ్చితిని ♦ బెంపును జెందితి మోద మందితిన్. 193

ఆ. స్నానజపములందుఁ ♦ జాలఁగా డస్సిన,వాఁడ వీవు నెట్టి♦వ్రతతపములు
దానములును యాగ♦తతులు మాఘస్నాన,మునకు సాటిరావు ♦ మొగిని నాకు.

క. అని యానతిచ్చి మోక్షం,బును గోరుచుఁ దేటమీరు♦మోమును మఱియుం
దనపైఁ జిత్తము గలిగిన, మునికొమరుని గాంచి యిట్లు ♦ ముదమునఁ బలికెన్.

క. నీ వడుగు విపుడు నన్నుం, గావలసినవరము లవును ♦ కా దన కిడి నీ
భావము రంజిలఁ జేసెద, నావాక్యము నొకటి వినుము ♦ నాయెడభక్తిన్. 196

ఆ. మునులు బ్రహ్మచర్య♦మునఁ గ్రతుభుజ్మణి, సమితి యజనములను ♦ సంతసించి
నటులఁ బితరులెల్ల ♦ అనిశంబు సంతతి, వలనఁ దృప్తిఁ జెందఁ ♦ గలరు వత్స! 197

క. కావునఁ బెండ్లిప్రయత్నముఁ, గావించిన యదియ నాకుఁ ♦ గడుసమ్మతమౌ
నోవిప్రవంశవర్ధన, నీవు గృహస్థుఁడవు గమ్ము ♦ నీవారలలోన్. 198

సీ. అటు లొనరింపు మా ♦ కది ప్రియంబును నిష్ట,మునుగల్గుఁ బైజన్మ♦మునను నీవు
ఋభునామము వహించి ♦ పృథ్వీసుతునకు సు,తుండవై జనియించి ♦ తోడఁ దెల్వి
నమరి జీవన్ముక్తుఁ ♦ డన నొప్పి విప్రని,దాఘశర్మనకుఁ ద♦త్త్వం బెఱుంగఁ
బలికి మోక్షప్రాప్తి♦ పరుఁ జేసి తదుపరి, యుత్తమస్థానంబు ♦ నొందఁగలవు.
తే. నింద్యులకు సుంతయేనియు ♦ సందియంబు, గలుగ దని యానతిచ్చిన♦ కమలనాభుఁ
గనిమిగులసంభ్రమాశ్చర్య♦కలితుఁడగుచు,నిటులవచియించెమృగశృంగు♦డింపుగదుర.

ఆ. ఇంద్రుఁ డాదిదేవ♦బృందంబులకు లోక,ములకు నంతటికిని ♦ మూలమైన
యాది దేవుఁ డంచు ♦ నబ్జభవాదుల,వలన మ్రొక్కు లందు ♦ వారిజాక్ష! 200

ఆ. ఎల్లవారి కెపుడు ♦ నెల్లకోరికలను, గలుగఁజేయునట్టి ♦ గరుడవాహ!
వరము లిచ్చునట్టి ♦ వాంఛగలిగెనేని, వేడ్క నాకు గాను♦పించినటుల. 201

ఉ. ఇచ్చట నిల్చి యెల్లరకు ♦ నెల్లసుఖంబుల నెల్లకాలముల్
ముచ్చటదీర నిచ్చువర♦ముం గరుణింపుము, నట్టులైన నే
నిచ్చట నీయనుగ్రహము ♦ నింపుగఁ బొందినయందు కద్దియే
యచ్చపుగుర్తు నిట్టివర♦మంతియ చాలును నొందు మాధవా. 202

క. భక్తపరాధీనుఁడవై , శక్తులు నినుఁ గొలువ జీవ♦చయములయందున్
యుక్తిని విహరించెడి యో, ముక్తశ్వర నీవె దిక్కు ♦ ముదమున నాకున్. 203

చ. అని మృగశృంగుఁ డీకరణి ♦ నర్మిలిఁ బల్కెడు పల్కు లాలకిం
చి నిగమవంద్యుఁ డైనహరి ♦ సెప్పెను నే నిట నిల్చి సంతసం
బున నిరతంబు బూజలను ♦ బుణ్యజనంబులచేత నొందుచున్
ఘనమగు సౌఖ్యసంపదలఁ ♦ గాదన కిచ్చెద నెల్లభంగులన్. 204

ఉ. ఏమనుజుండు, నీసరసి ♦ నేర్పడునీటను మాఘమాసమం
దేమరకుండ మజ్జనము ♦ నింపుగ సల్పి సునిశ్చలాత్ముఁడై
కామితవస్తుసంపద ల♦ఖండతఁ గూర్చెడు నాకుఁ బూజలన్
వేమరు జేయువాఁ డఘము ♦ వీడి వికుంఠమునందు నుండెడున్. 205

క. రవిసోమగ్రహణంబుల, బ్రవిమలమగు దక్షిణోత్త♦రాయణమున్యా
ది వివిధసంక్రమణమ్ముల, భువిని వ్యతీపాతదర్శ♦పూర్ణిమలందున్. 206

క. ఈకొలనినీటఁ దానము, గయికొని విప్రులకు రజత ♦ కాంచనదానం
బేకాలఁదిని సల్పిన వా, రాకాలఁదిని సౌఖ్యపదవు ♦ లందుదు రనఘా. 207

సీ. అనుచు నాభగవంతుఁ ♦ డానతిచ్చిన విని, ముని పల్కె నపుడు సం♦మోద మొదవఁ
గుత్సునిసుతుఁడ నే♦ కౌత్సుఁడ నైయుండ, మృగశృంగుఁ డను నామ♦ మెట్లు గలిగె
నన విని వత్స సం♦వధికసమాధిచే, నలర జింకలగుంపు ♦ నంబువులను
గ్రోలుటకొఱకు నీ ♦ కొలనికి నరుదెంచి, కొమ్ములచే నిన్నుఁ ♦ గోకఁబడిన
ఆ. కారణమున నిచటఁ ♦ గలుగు ఋషులు మృగ,శృంగుఁ డంచు మేను ♦ వొంగఁ బిల్చి
రింక నెల్లవారు ♦ ని న్నటుఁ బిల్చెద, రంచుఁ బల్కె యామ♦హామహుండు. 208

క. ఆనారాయణగిరిపైఁ, దానకముగ నిలిచె జనుల ♦ దయ నేలఁగఁ బెం
పూనినదాక్షిణ్యముతో, శ్రీనాథుఁడు లోకములఁ బ్ర♦సిద్ధముగాఁగన్. 209

చ. తనదుతపంబులచే మిగుల ♦ ధన్యతనొందిన కౌత్సుఁడున్ మహా
వినయము మీర నా నిగమ♦వేద్యుని చొక్కఁపుటద్దుదమ్మికిం
బ్రణుతులు పెక్కొనర్చి భగ♦వంతునియాజ్ఞ శిరంబునందుఁ గై
కొని మదిఁ బెండ్లియత్నమున♦కుం గడువేడుక పిచ్చలింపఁగన్. 210

చ. మొల నొకముంజిగోచి వెలి♦బూడిదపూఁతలఁ గ్రాలు నెమ్మెయిన్
వలపల నొంటిజందియము ♦ వావిరిమూపుల జింకతోలు స
ల్లలితకరాబ్జమందునఁ బ♦లాశఁపుదండము పానపాత్రముం
జెలఁగఁగ విష్ణు లోన నిడి ♦ చేరఁగ వీటికివచ్చె విప్రుఁడున్. 211

క. తనజన్మస్థానమ్మగు, ఘనభోజపురమ్ము సొచ్చి ♦ కడువేడుకమైఁ
దనరాక కెదురుచూచెడు, తనగృహమున నుండు తల్లి♦దండ్రులఁ జూడన్. 212

సీ. అరుదెంచి వారిపా♦దాబ్జంబులకుఁ దన, తల మోపి నేలపై ♦ దండము వలె
పడి దండ మొసఁగి సం♦భ్రమముతోడుతఁ దన, వృత్తాంతమంతయు ♦ విశదపరుప
నాతల్లిదండ్రులు ♦ నాపుత్రు నెడబాసి, బహుకాలమైన యా♦భ్రమము దీర
మదిలోన నుండు ప్రే♦మరసంబు నెవిధ,మున వెలికురికెనో ♦ యనఁగఁ గనుల
తే. బాష్పతోయము లొల్కఁగఁ ♦ బలువితముల, శిరము మూర్కొని కౌఁగిటఁ ♦ జేరఁదీసి
చుబుకమును పుణికి ముద్దాడి ♦ చుంచుదువ్వి, వేడ్కఁ గొమరునిసంతోష♦పెట్టి రపుడు.

క. పిమ్మట నామృగశృంగుఁడు, సమ్మతితోఁ దనదుగురువు♦సదనంబునకున్
నెమ్మదిని నేగి వారిప, దమ్ముల కభివందనములు ♦ దగ నొనరించెన్. 214

వ. ఇట్లొనరించి వారిసన్నిధానంబున. 215

క. నిరతము వేదాధ్యయనము, దఱుచుగఁ గఱచుచు ననుంగు♦దలిదండ్రులకున్
గురువునకుఁ బ్రీతి మొప్పిక్కుచు, సరవిం గాలంబుఁ బాల♦సంయమి గడపెన్. 216

ఆ. కొంతకాల మొజ్జ♦కుఁ దలిదండ్రుల కొగి, సేవ సల్పుచుండి ♦ చిత్త మలర
వేదపాఠముల స♦విస్తారముగ నేర్చి, గురుననుజ్ఞ నొంది ♦ కొమరు మిగుల. 217

తే. స్నాతకవ్రతోత్సవమును ♦ శాస్త్రవిధిని, బెద్దలానతిఁ బడసి సం♦ప్రీతి మెరయఁ
జేసికొని మృగశృంగుండు ♦ చెల్వమీర, నెలమిఁగల తలిదండ్రుల ♦ కెఱఁగి పలికె.

క. జననీజనకులు సుతులం, గని పెంచుటలోనఁ జాల ♦ కష్టించెద రా
ఋణమును నూఱేడులకుం, దనయులు దీర్చికొనలే ర♦నం దప్పగునే. 219

క. కావున గురుమాతృపితృల, భావము రంజిల్లఁజేయఁ ♦ బరగినవాఁడే
కేవల ముత్తముఁ డనఁదగి, భూవలయమునందుఁ జాలఁ ♦ బొగడిత వడయున్.

సీ. తల్లిదండ్రులు నొజ్జ ♦ తనియ నటించిన, సకలతపస్సులఁ ♦ జాలినంత
ఫలము లభించు నె♦ప్పటికైన వారినే, వకవృత్తి యున్నత♦పస్సులందు
నధికం బటం చార్యు ♦ లంగీకరింతురు, నా మువ్వురనుమతి ♦ నంది యే ప
నిని జేసినను నది ♦ నిర్వాహక మ్మగు, బుద్ధిమంతులు వారి♦పూజవలన
ఆ. మూఁడులోకములును ♦ మొనసి జయింతురు, నదియు ధర్మ కామ ♦ మర్థ మోక్ష
మలర నెపుడు వారి♦ననుమతిఁ బనిసేయు, టొప్పు నదియె ధర్మ♦ మొసఁగు ముదము.

ఆ. బ్రహ్మచర్యమునను ♦ వడుగులు ఋగ్యజు,స్సామవేదములను ♦ జాలభక్తి
మూఁడొ లేక రెండొ♦ మొనయంగ నొక్కండొ, కఱచి గురులవలనఁ♦గరుణవడసి.

క. పిదప గృహస్థాశ్రమముం, బదపడి పూనంగవలయుఁ♦బైదలి సరియై
నది కలిగెనేని దానికి, నధికము వే రొండు లేదు ♦ నాశ్రమములలోన్. 223

ఆ. దంపతులకు మైత్రి ♦ తారసిల్లిన దాన, ధర్మ మర్థ మధిక♦తరఁపు గామ
మధికముక్తి యనెడు ♦ నల సాధనలు గల్గు, స్వర్గ మిన్నిటికిని ♦ సాటిగాదు.

క. భార్యాప్రియత్వ మబ్బిన, నార్యాన్వితమైనస్వర్గ♦ మది యేటికి; త
ద్భార్యాప్రియత్వ మబ్బిన, నార్యాన్వితమైన స్వర్గ♦ మది యేటి కిఁకన్. 225

ఉ. కొందఱు భార్యయందు ♦ ననుకూలత లేమి నెదం గలంత ముం
జెంది వికారభారమునఁ ♦ జెల్వల జెల్గలఁ బోల్తు; రవ్వి యిం
పొంద శరీరరక్తము నె ♦ నోలని గ్రోలు; నెలంత లన్ననో
డెందము రక్తముం ధనము ♦ డిల్లసెడంగ హరింతు రెంతయేన్. 226

తే. కాన నేఁ జెప్పఁగడఁగిన ♦ ఘనతరగుణ,ములు గలిగి చతురత్వంబు ♦ గలిగి వంశ
వృద్ధి గలిగి పెనిమిటిపైఁ ♦ బేర్మి గలిగి, పలుకు వెంపుఁ బతివ్రతా♦త్వంబు గలిగి.
తే. తల్లికి సపిండురాలును ♦ దండ్రికిని స,గోత్రురాలును గానిదై ♦ కోమరు మిగులు
చక్కదనములయిక్క యౌ♦ చెక్కులాడిఁ, బెండ్లియాడంగవలయుఁ♦బో ద్విజవరుండు.
తే. అరుదెవుల పిచ్చి బొల్లు బ్ర♦హ్మఘ్ను నాఁడు, బిడ్డలన కను దానిని ♦ జెడ్డపనుల
వలనఁ జేడ్పుడు పాతకిఁ ♦ బరఁగ నట్టి,వంశజాతలఁ జేపట్ట♦వలదు వలదు. 229

సీ. వ్యాధు లేమియు లేక ♦ స్వానుజుల్ బాంధవ,జాలముల్ గల్గి బల్ ♦ సాధ్వియగుచుఁ
దనకంటె పిన్నదై ♦ తగుమృదుమధురంపు,భావలచే నొప్పి ♦ స్వకులజ యగు

కన్యక విప్రేంద్రు ♦ గ్రహియింపఁగాఁదగు, సర్పవృక్షమ్ములఁ ♦ జలచరముల
నదుల పర్వతముల ♦ నదముల నక్షత్ర,ముల పుష్పముల నేత్ర♦ములను భూత
తే. ప్రేతనామకలను వంశ♦వృద్ధిలేని, వంశజాతల హీనాన్వ♦యాయజల నె
వండు గాని వివాహమ్ము ♦ సంధుమతని, జేసికొనఁగూడ దింకను ♦ జెప్పుదు వినుఁడు.

ఆ. అవయవముల తగ్గు సం♦ధికమ్ము గల కన్య, మిక్కిలిగఁ గృశించు♦మేనిదాని
పొడవుమేనిదాని ♦ భూరికఠినమగు, తనువుదానిఁ గూడఁ♦దగదు తగదు. 231

తే. రోమములు మేనియందున ♦ నేమి లేని,దాని బలురోమములు గల్గు♦దాని బిరుసు
తలవెండ్రుకల్ గలిగినదాని ♦ దగినచక్కఁ,దనము, జాలఁ గల్గిననేని ♦ దగదు కొనఁగ.

క. ఈచెప్పినగుణముల నా,లోచింపక పెండ్లికొనుట ♦ లోఁబడి తత్కా
ర్యాచయములఁ గొనినట్టిరు, లేచందంబునను సంతు ♦ లేకుండురుగా. 233

క. కావున గుణపరిశీలనఁ, గావింపక కాని పెండ్లి♦కాదగు కన్యం
ధీవరులు గోరరది నిజ, మీ విధమున సల్పవలయు ♦ నెప్పటికైనన్. 234

తే. ఈదృశగుణమ్ములం జాల ♦ నెసఁగు వనిత, భర్త కాయుష్యముం బెంపుఁ ♦ గీర్తి గల్గఁ
జేయునని కుంభజాదులు ♦ సెప్పిరి ముని,వర్గ మెల్లరు నటులనే ♦ పల్కి రనఘ.

క. ఇప్పుడు మీసమ్ముఖమునఁ, జెప్పినసుగుణములు గల్గు ♦ చేడియ నాకుం
జొప్పడువిత మెఱిఁగింపుఁడు, ముప్పుగొనె భగవదాజ్ఞ ♦ మోనసి మనమునన్.

క. అని యడుగఁ గుత్సముని తన,తనయుని నిగమార్థపత్తిఁ ♦ దనరినపలుకుల్
విని సంతసించి మృగశృం,గునితో నిట్లనియె నపుడు ♦ కోరిక మీరన్. 237

క. విను దీనికి నాలోచన, పని లే దాచారమందుఁ ♦ బ్రబలినసిరున్
దనరారఁ జెందరానిది, కనరా దొక్కండు నైనఁ ♦ గాశ్యపియందున్. 238

సీ. ఆచారహీను లై♦నట్టివారికి మంద,మతు లైన జనులకు ♦ మాఘమాస
ముదయకాలస్నాన ♦ మొగి నొనర్పనివారి, కతిథిపూజలు లేక ♦ యలరువారి
కిని హరివాసర♦మున నుపవాసముఁ, జేయనివారికి ♦ శివునిభక్త
లును గానివారికి ♦ ననయము తలిదండ్రు,లం దొజ్జమేల్పంతు♦లందుఁ బ్రీతి
ఆ. నావులందు గరుణ ♦ నడఁగినవారికి, దానధర్మము లొగి ♦ లేనివారి
కెపుడు మాఘమహిమ ♦ నెఱుఁగనివారికి, మంచికన్య దా లం♦భించఁబోదు. 239

క. పొందుగ స్నానము గోపీ,చందన మాపాసనమ్ము ♦ సంధ్యాది లొగిం
డెందమున మరచి భోజన,మందున బ్రియ మందునట్టి ♦ యధమాగ్రణియున్. 240

క. అల కావేరీస్నానముఁ, జెలువుగ మాఘవ్రతంబుఁ ♦ జేయని మనుజుం
డిల నుత్తమగుణసంపద, నలరెడు కన్యామణికిని ♦ నర్హుఁ డగుదురే. 241

ఉ. ఓసుత! మాఘమాసము మహోజ్జ్వలమై తనరారు విద్యలన్
భాసురమైనకీర్తి జిగి పైదలినిం బలకాయ మాయువున్
భాసిలు విష్ణుభక్తి గుణవంతు లనందగు పుత్రవర్గమున్
బాసటగాఁ జరింపఁగల బంధుజనావళి నిచ్చు నచ్చుగన్. 242

ఉ. చక్కనిరూపసంపదయు సజ్జనమైత్రియు నిచ్చ బుద్ధియుం
జిక్కనిదైవభక్తియు విశేషమనీషయు నెంతో శాంతియుం
జొక్కఁపుటుగ్రకారతయు శోభనసంపదయున్ దయాత్మయున్
నిక్కఁపుస్వర్గభోగము ననింద్యమతీ! యిడు మాఘ మెంతయున్. 243

వ. అది యట్టిది కావున. 244

ఉ. సారసనేత్రుఁడైన హరి సారతరంబగు నీసమాధికిం
దారకుఁ డయ్యె మాఘమునఁ దప్పక సల్పినస్నాన మింపుగా
నారసి నీపయిం బహుళమైన దయామతి నున్నవాఁడు నీ
కోరికఁ దీర్పఁగాఁగలఁడు కోరి భజింపుము విష్ణుదేవునిన్. 245

క. అని జనకుఁడు సంభాషించిన ఘనయోక్తులకు నలరి చెచ్చెర మునినం
దనుఁడు 'పితృవాక్యపరిపాలన' సేయఁగ నుత్సహించె లాలితభక్తిన్. 246

చ. అతులదయార్ద్రచిత్తుఁడయి నట్టిమహాముని తత్సువాక్యముల్
హితవుగ నాత్మ నెంచి మృగశృంగుఁడు సాదరఁ దండ్రిపాదముల్
కుతుక మెలర్ప సోకఁగ నకుంఠితభక్తిని మ్రొక్కి నమ్రుఁడై
మతిఁ దలపోయుచు న్నిలిచె మాధవుపాదసరోరుహద్వయిన్. 247

వ. అనిన విని దిలీపుండు వశిష్ఠు నడిగినవడువున శౌనకాదిమహామునులు సూతు నటమీఁది కథావిధానంబు వినిపింపుఁ డని యడుగుటయు. 248

ఆ శ్వా సా ం త ము.

చ. ధరధర! శంఖచక్రధర! శార్ఙ్గగదాధర! శ్రీధరాధరా!
దరదరవిందలోచన! సుధాసమభాషణ! దీనపోషణా!
వరకరుణాకరా! సుకర! వైరివిభీకర! వంశసత్కరా!
సరసిరుహోదరా! హిమరసాధరనందనసోదరా! హరీ!

స్రగ్విణీగర్భితభుజంగప్రయాతము:

నమో దేవదేవా గుణాతీత సీలా, రమోర్వీవధూనాథ రాత్రించరారీ
క్షమాదేవతారాధ్య కౌంతేయరక్షా, క్రమాభావనాతీత రంభారతారీ.

మాలిని. సరసిజదళనేత్రా! సన్మునిస్తోత్రపాత్రా!
శరదసదృశగాత్రా! శంకరామిత్రజైత్రా!
స్మరహరనుతవేషా! సాధుహృత్కంజపూషా!
సురవరపరిపోషా! సూరిసంతోషభాషా!

గద్యము.

ఇది శ్రీ బాలగోపాలకృష్ణ వరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్య గోత్రపవిత్ర శ్రీమ దబ్బరాజువంశపయఃపారావారరాకాకైరవమిత్ర మ్మక్కాంబా నృసింహామాత్యమణిపుత్ర సూరిజనవిధేయ శేషాచలశర్మ నామధేయ ప్రణీతంబైన శ్రీమత్పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు ప్రథమాశ్వాసము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ

# మాఘమాహాత్మ్యము.

[శేషాచలకవీయము.]

## ద్వితీయాశ్వాసము.



నారాయణీరమణా
నానాంహోహరణ యాదినారాయణ గీ
ర్వాణగణవినుతచరణా
ద్రోణపురీరమణ విమతదోర్బలహరణా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిలమునులు, నవలిమృగశృంగుకథఁ జెల్పుమన వసిష్ఠుఁ
డా దిలీపున కెఱిఁగించినటు వచించెఁ, దను వినుండనిసూతుఁ డిట్లనుచుఁబలికె.

సీ. అల భోజనగరంబునందు సుచథ్యనామకుఁడు విప్రశ్రేష్ఠుఁ డొకఁడు గలఁడు
అతనికూఁతురు సుగుణాఢ్య తామరససంకాశనేత్రింబులు గల సువృత్త
యను నొకకన్నియ తనయీడు చేడియ, లను గొందరను గూర్చుకొని పడమర
గాఁ బ్రవహించెడు కావేరికిని జని, మాఘమాసమున నేమరక యుదయ

ఆ. మునకుమున్ను లేచి మును గని కావేరి, జలము సహ్యశిఖరి జననమంది
రంగనగర మంటి రాజిల్లుతల్లి కా,వేరిపాప మణఁచివేయు మంచు. 8

చ. సురలు వహింపఁగాఁదగిన జోకను బావన మైనదాన వై
మరువక మాఘమాసమున మజ్జన మాడెడువారిపాపముల్
కర మనురక్తి మై నణఁచఁగాఁదగు పశ్చిమవాహినీ! నిరం
తరము నమస్కరింతుము ముదమ్మున నిమ్ము శుభమ్ము నమ్మరో! 4

చ. పొలుపుగ మంచిపెన్మిటియుఁ బుత్రిలు బుద్ధి పతివ్రతాత్వమున్
బలుమరు నెల్లకోరికలు బాల్యడఁజేయు మటంచు మంత్రముల్
సలలితభక్తి మై నొడివి సమ్మతి మ్రొక్కిడి శాస్త్రపద్ధతిం
జెలియలు దాను స్నానమును జేసిరి నిత్యము ప్రొద్దుపొడ్వునన్. 5

మ. వినుఁ డిట్లామె త్రివర్షముల్ సలిపెఁ గావేరీజలస్నానమం
దున నిత్యంబు గృహాననఁ గల్గుపనులందున్ నేర్పు మై నెల్లనొ
ప్పినకూఁతుం గని యా యుచథ్యుఁడు మది న్వేడ్కం దలంచెన్ స్వనం
దన కెంతేతగు భర్త యేయెడఁ గలం డా యంచు భూవల్లభా. 6

సీ. అంతఁగుత్సఁడునూనుఁ◆డయినట్టిమృగశృంగు, వైవాహికముఁజేయు◆వాంఛపొడమి
మును నుచథ్యునిపుత్రి◆కనుసువృత్తను గోర్కి, నడుగఁగాఁ దలిదండ్రు◆లనుమతింప
మంచిరూపముచేత◆నంచితశుభలక్షణముల నొప్పుచుఁ గుటుం◆బమున మివుల
నాసక్తిలేనిది ◆ యగుచు మాతాపితృవంశములకుఁ జాల ◆ వన్నె దెచ్చి
అ. పిన్నవయసు గలుగు ◆ కన్నియ దీని వరించ నర్హమంచు ◆ నెంచెఁ గౌత్సుఁ
డంత నొక్క మాఘ◆మరుగుదెంచుటయును సువృత్త ముపురఁగూడి ◆ చిత్తరులను. 7

క. అనలువురు కావేరీ, స్నానమునకుఁ బోవఁగా ను◆షఃకాలమునన్
గానన హోరి యగు మదపు, టేనుఁగు చెను దవిలి తొండ ◆ మెత్తుకొను చోగిన్. 8

క. చిరకొట్టుచు ఘీంకార, స్వరముఁ దమవెంటఁబడిన ◆ సామజమునకున్
వెఱచి భయపడుచు నుఱికిరి, చరణంబులు దొట్రుపడఁగ ◆ సంచలమతులై. 9

క. పరువు లిడువారి వెంటను, గరి విడువక చనఁగ దేహ◆కంపముచేతన్
దరలుచు ఖేదము మనమున, దరికొన నదిదూర మరిగి ◆ దైవవశమునన్. 10

బా లి కా మ ర ణ ము.

ఆ. తృణముచేత నిండు◆కొని నీరు లేక విస్తారమైనలోతు ◆ దగినదొడ్డ
పాడునూతిలోనఁ ◆ బడి దేహములఁ బాసి, చనిరి ధర్మరాజు◆సదనమునకు. 11

క. బాలికలు స్నానమునకై, చాలఁగ తడ వయ్యె నరిగి ◆ జాడదెలియ దే
వే శాయె నంచు నంతట, జాలింబడి యింట వారి◆జననీజనకుల్. 12

సీ. వెదకంగఁ జొచ్చి కా◆వేరీతటమునందు, నడవులం బొదరిండ్ల ◆ నచ్చటచట
తిరిగి, కానగలేక ◆ దిగులొంది యొక్కచో, జారినకట్టువ◆స్త్రములు కొన్ని
సొమ్ములు, గనుపింప ◆ సొలయుచు నాజాడ, నరిగి, మహారణ్య◆మందుఁ బచ్చి
కసరవుచే నిండార◆గా నుండి జలము లే, కంధకారత నిండి◆నట్టి పాడు
ఆ. బావి, దానిలోనఁ ◆ బడిజీవరహితమై, యొప్పు విమల సురస◆యును సువృత్త
కమల యనెడు చిన్ని◆కన్నియలను గాంచి, తల్లు లమితదుఃఖ◆ధారిణులయి. 13

మత్త. ఓ కుమారికలార! మజ్జన ◆ మొర్పమై నిల మాఘమం
దేకనిష్ఠను సల్పసల్పఁగ ◆ హెచ్చినట్టివిరాగముల్
మీకుఁ గల్గుట మర్త్యలోకము ◆ మేలు గాదని దేవతా
లోకమందు వసింపఁ జిత్తము ◆ లోనఁ గోర్కి జనించెనే. 14

క. పలువితములైనధాన్యము, లలవడు గేహములఁ బక్వ ◆ మగువంటకమున్
గలిగి భుజింపక జనకులు, విలపించుచునున్నవారు ◆ వేగమ రారే. 15

సీ. మాఘమాసమునందు ◆ మక్కువఁ గావేరి, నీరమ్ములం దోగు ◆ నిపుణు లెపుడు
పాపముల్ రోగముల్ ◆ భయముఁ జెంద రటంచుఁ, బండితులగువారు◆పలుకుచుందు
రావాక్య మీయెడ ◆ ననృతమై కన్పట్టె, శాస్త్రధర్మము లెందుఁ ◆ జనియెనొక్కొ
పలుమారు రమ్మని ◆ పలువరించెదు మమ్ము, నాదరింప రిదేల ◆ యణఁగియుంటి

ఆ. లేమనందు మింక ◆ నీపాడుబావిలోఁ, బడములు నిడి కదల ◆ మెదలకుండ
నెందు కుంటి రిట్టు ◆ లింతకోపమ్మున, కేమి తప్పు గల్గె ◆ నింతులార. 16

వ. అని యిట్లు విలపించుచుండు నెడ నందు సుకృతజనకుండగు నుచథ్యుండు కూఁతు నుద్దేశించి యిట్లనియె. 17

క. తల్లీ! మృగశృంగుఁడు తన, కిల్లాలుఁగ నిన్నుఁ గోర ◆ నిచ్చెద నని నే
నుల్లము రంజిలఁ బలికితి, నెల్లి యతం డరుగుదేర ◆ నే నేమందున్. 18

మ. ఇటు లాకన్యల తల్లిదండ్రు లచటన్ ◆ హెచ్చైనశోకమ్మునం
బటువాక్యమ్ముల డెందముల్ గలఁగఁగా ◆ వాపోవ నచ్చోటికిం
జటిలంబైన తపంబుచేత మిగులన్ ◆ సామర్థ్యముం గల్గి వే
సట లేకుండిన కౌత్సుఁడుం జనియె వి◆శ్వాసంబు దీపింపఁగన్. 19

క. చని పాడునూతిలోపలఁ, దనువు విడినకన్యకలను ◆ దల్లిదండ్రులఁ గ
న్గొని వారు మరల జీవిం,చను పాయము నొకటిఁ దలఁచి ◆ సుస్థిరమతియై. 20

క. వారల కిటులనె మీరలు, నూరక విలపింప నేల ◆ యూర్జితఁపుబనుల్
మీరక నీకన్నియలశ, రీరములం గావుఁ డేమ◆రిన దోస మగున్. 21

క. నానేర్పు నెఱపి కన్యల, ప్రాణంబులు దెచ్చువఱకు ◆ బాగుగ మీరీ
ప్రాణములు లేనితనువుల, మానుగ రక్షింప మీఁద ◆ మతిమే ల్గలుగున్. 22

## కౌత్సుఁడు కన్యల బ్రతికించుట.

సీ. ఈరీతి వారల ◆ నూరార్చి పావన, మైన కావేరి॥ ◆ నరిగి కుత్త
కకు నంటునీటిలోఁ ◆ గదలకుండఁగ నిల్చి, కరములు శిరముపైఁ ◆ గదియఁ జేర్చి
దినకరుఁ గాంచుచు ◆ దీటైనమనముతో, మృత్యుదేవతను బ్రా◆ర్థింపుచుండ
మును గన్నియలప్రాణ◆ములు వోవఁ జేసిన, యేనుగు తొండమ్ము ◆ నెత్తి పైకి
ఆ. నీటనున్న కౌత్సు ◆ నేలఁగూల్పఁగ నెంచి. వేగ రాఁగఁ గాంచి ◆ విప్రుఁ డేమి
భయములేక మృత్యు ◆ భజియింప నది గని, గజము నొక్క నిమిష◆కాల మచట. 23

క. చిత్తరువుప్రతిమవడువున, హత్తిన సాధ్వయి నిలిచె ◆ యాటోపంబుం
బొత్తుగ విడి తొండముతో, నెత్తుచు మెల్లఁగను పైకి ◆ నింపు జనింపన్. 24

సీ. తనశిరంబునఁ బెట్టి◆కొన మృగశృంగుండు, నేనుంగు నెక్కుట ◆ యెంచ ముందు
మంచికార్యములకు ◆ మంగళసూచక, మగునని సజ్జను ◆ లాడుచుందు
రంచు నిర్భయమున ◆ నలవారణముపైని, నివసించి దానిదా ◆ భవము నెంచి
జపము సాలించి గ◆జము దోష మడఁపంగఁ, దలఁచి మాఘస్నాన ◆ ఫల మొనిమిది
ఆ. దినములదియు నిడఁ ◆ దివిరి యొసంగితి, నంచుచేత జలము ◆ నంది దాని
శిరమునందుఁ జల్లఁ ◆ జెచ్చెర నది యా ఫలము గ్రహించి యందు◆లకు ఫలముగ. 25

చ. కలుషములెల్ల దూల లయ॥కాలపుమేఘమునందుఁ బుట్టు గ
ర్జల కెనయైన మోఁతలను ॥ జాలఁగ ఘీంకరణంబుఁ జేయు నా
కలభము తన్నుఁజూచి యతి॥కౌతుక మెంచెడు విప్రుపైని ని
ర్మలదయఁ జూప నాతఁడు స॥ముచితబుద్ధిని దానిదేహముక్. 26

తే. పరమపావనుఁడైన యా॥బ్రహ్మచారి, హస్తతలమున నిమిరిన ॥ హస్తి పూర్వ
తనువుఁ బోవిడి దేవత్వ॥మొనరఁదాల్చె,మింటికిని జని కాంతిచే॥మిహిరుకరణి. 27

క. కనుపడ నాశ్చర్యముగాఁ, దనవిధమును జూచు విప్ర॥తనయునకు మహా
వినయవిధేయుఁడునై వం,దనము లనేకము లొనర్చి ॥ తనరినభక్తిక్. 28

ఉ. ఓమునివర్య! కర్మముల ॥ నొప్పిన యీమృగరూపమందు నే
వేమరు జెందుదుఃఖముల ॥ వీడి కృతార్థుఁడ నైతి జెంది నా
నోము ఫలించె నీకృప న॥నూనత నించినచూడ్కిఁ గాంచి బల్
ప్రేమను నింప నే నిటులఁ ॥ బెంపు వహించితి బాలసంయమీ. 29

ఆ. ఓకృపాసముద్ర ॥ యొనర నా జన్మవృత్తాంత మొకటి కలదు ॥ దాని నీకు
విన్నవింతు మదిని ॥ వేసట నొందక, చిత్తగింపు మేక॥చిత్తమునన. 30

ధ ర్మ గు ప్త చ రి త్ర.

ఆ. పూర్వమందు నిషధ॥పుటభేదనము గల, దందు మంచినడత ॥ నమితధార్మి
కుఁ డన నొక్కఁ డొప్పెఁ ॥ గోమటి తనపేరు, విశ్వగుప్తుఁడనఁగ ॥ విస్తరించె. 31

క. అతనికి నేఁ దనయుఁడనై, యతులితుఁడగు ధర్మగుప్తుఁ ॥ డనునామముతో
నుతికెక్కి నాకాలమునను, హితవగుపనులందు మిగుల ॥ నేను మెలఁగితిక్. 32

సీ. వేదశాస్త్రమ్ములు ॥ వినుట పఠించుట, యాగముల్ సేయుట ॥ యవనిసురుల
కును దాన మిచ్చుట ॥ ధనము వడ్డికి నీక, యొలమి గోరక్షణఁ ॥ గృషిని బేర
మును గల్గి తగినట్టు ॥ పనులను నడపుచు, నలరి సత్యముతోడ ॥ నందుఁ గాముఁ
డను గాక యౌర్వని॥తనము సుంతయు లేక, ధర్మార్థకామముల్ ॥ దగినయటుల
తే. గడపుచును బేర మాడెడి॥కాలమందు, జాగ్రతగ బలువితముల ॥ సంచరించి
యజ్ఞములుసల్పునపుడు బ్రా॥హ్మణులచేత, నడుగ బడకయ యిచ్చి తే॥నర్థతతుల.

ఉ. క్రోధవిమోహలోభముల ॥ రోగభయమ్ములఁ జెందకే లస
ద్బోధను, దేవపూజలను ॥ బొల్పుగుజన్నము, లన్నదానముల్
మోద మెలర్ప జల్పితివి ॥ భూసుర గోవృషపంక్తులందు, నే
భేదము లేక పోషణను ॥ బ్రీతిగ జల్పితి నెల్లకాలముక్. 34

క. పరులధనమ్ములఁ గోరక, పరభామల కాసపడక ॥ వరగ స్వభార్యక్
నిరతము సంభావించితి, గురువులు పెద్ద లిడుశిక్ష॥కును లోఁబడితిక్. 35

క. మృతదినము దప్పకుండఁగఁ, బితరులకును శ్రాద్ధవిధులు ◆ బ్రీతి సలిపితిన్
సతతము గృహదేవతలకు, నతిపూజ లొనర్చినాఁడ ◆ సానందముతోన్. 36

సీ. పరిమళ మైనద్ర◆వ్యములును రసవస్తు, వులు వంటకట్టెలు ◆ కలుపుపాలు
బియ్యము మజ్జిగ ◆ నెయ్యి దుంపలు కూర, గాయలు విస్తళ్లు ◆ గడ్డినూనె
యేలకులును లవం◆గాలు పిప్పలి, శొంఠి మిరియాలు సావాలు ◆ మిరిచి మొదలు
గాఁ గలవస్తువుల్ ◆ కాయధాన్యమ్ములు, పశువులు వస్త్రముల్ ◆ పలువితములఁ
ఆ. గొనెడివేళ వాని ◆ గుణపరిశీలనఁ, జేసి యమ్మకమ్ముఁ ◆ జేయునపుడు
బాలవృద్ధులకును ◆ బండితులకు హెచ్చు, తగ్గు లేక యిడితిఁ ◆ దగినధరకు. 37

క. సరకమ్మి నపుడు బేరము, గురుతెఱుఁగనివారు రాఁగఁ ◆ గుత్సితమతితోఁ
బొరపెట్టి మోసపుచ్చక ◆ నరకభియంబునన యిడితి ◆ న్యాయత సరకుల్. 38

సీ. అటుల నక్రమముగా ◆ నార్జించుద్రవ్యము, చెడిపోవునని యట్టి ◆ చెడ్డపనులఁ
జొరక పాషండుల ◆ జోలి దలంపక, గురుదేవభూసుర ◆ గోగణముల
సతతము శుశ్రూష ◆ జరుపుచు బ్రాహ్మణుల,యెడ ద్రోహచింతన ◆ మెపుడు లేక
త్రికరణశుద్ధిగాఁ ◆ దిరుగుచు నెస మనో, వాక్కాయకర్మము ◆ లొక్కటిగను
ఆ. మంచివృత్తియందు ◆ మసలి జీవించుచు, ధర్మపథము నుంత ◆ దప్పకుండ
నోర్పు గల్గి యిపుల ◆ నొకకోటివరహాలు, సంగ్రహించి తుచిత◆సరణి మెరయ.

ఆ. తనయుఁడొకఁడు మంచి ◆ గొనములచేతఁ బ్రి, శస్తమగుచు నాకు ◆ జనన మంద
నతని కట్టిధనము◆నందున సగ మిడి, మిగత సగము జనులు ◆ మెచ్చ నేను. 40

క. పుచ్చుకొని యట్టిధనమును, విచ్చలవిడి వ్యయము సేయు ◆ విధ మంతయు నీ
కచ్చుపడ విన్నవించెద, సచ్చరితా చిత్తగింపు ◆ సాకల్యముగాన్. 41

సీ. చెఱువులు తోఁపులు ◆ జీర్ణాలయంబులు, గుళ్ళు మండపములు ◆ గోపురములు
నీరులేనట్టి యెం◆డారిమార్గమ్ముల, దిగుడుబావులు జాలఁ◆దిట్టమైన
చల్లనివందిళ్లు ◆ జనులకు గొప్పబా,టలయందు నాయాస◆ములను దీర్చు
చావళ్లు మొదలగు ◆ సత్కార్యములకునై, వ్యయపెట్టి, నిల్చిన ◆ యట్టిధనము
ఆ. కన్య కోర్వి వస్త్ర ◆ కంబళ పశుగజేం, ద్రాశ్వ ముద్గ తిల ర◆సాన్న భోజ్య
మాది యైనయట్టి ◆ యన్ని మహాదాన,ములను జేసితి ◆ భువిఁ బొలుపుమీర. 42

ఉ. ఏ నొనరింపనట్టి పను ◆ లీధరణీస్థలియందు నెచ్చటం
గానము; తండ్రి! పూర్వకృత◆కర్మము బ్రహ్మలలాటపట్టికన్
మానుగ వ్రాయబడ్డ లిపి◆ మాన్పఁగ నేరికినైనఁ గూడు నే
హీనున కేని నెన్నఁగ న◆హీనున కేని భజింప కెంతయున్. 43

ఆ. నారికేళఫలము◆నకు నీరు వచ్చిన, కరణి గజము తిన్న ◆ ఘనకపిత్థ
ఫలముసరణి జనుల ◆ కిలఁ గల్మిలేములు, వచ్చుఁ బోవుచుండుఁ ◆ బ్రాయికముగ. 44

వ. అది యట్లుండనిండు. 45

## కాపాలికు మోసము.

సీ. సమబుద్ధి నే నిటు ◆ సంచరింపుచు నుండ, రసవాదమునయందు ◆ నెసఁగువాంఛ
గలుగు కాపాలిక ◆ ఘనమతప్రియుఁ డొక్కఁ, డరుదెంచి నాకడ ◆ ననుచితమగు
మాటల నమ్మించి ◆ సొటుపలం గొన్ని, బోధించి ననుఁ జాల ◆ మోసపుచ్చి
నాకున్న సొమ్మంత ◆ లేకుండఁగాఁ జేయ, బేలనైతిని నిటు ◆ పేద నైతి
తే. వానిసాంగత్యమున నన్ను ◆ వస్త్రములకు, లేక వార్ధక్య మొగి రాఁగ ◆ లేవలేక
యావయవము లన్ని వడఁకఁగా ◆ నతిశయముగు, వ్యాధులం జెంది పనుల నే ◆ వదలిపెట్టి.

తే. అట్టిదుర్దశ నుండ నే ◆ నంతలోన, మాఘ మరుదేరఁగా నింగి ◆ మానికంబు
నుదయమయ్యెడు వేళను ◆ బదిదినములు, స్నాన మొనరించి, తంతలో ◆ జరను నాకు.

ఉ. ఓపిక లేక నే బవలి ◆ యుండ, సుతుండు విదేశ మేగె మేల్
కాపరి లేక గుఱ్ఱములు ◆ గాలవశంబునఁ జచ్చె గోవులుం
బ్రోపరిలేక చోరులకుఁ ◆ బోఁడిమి లోఁబడె, సేద్య మెంతయే
నేపు దొలంగె, భార్య కడుం ◆ హీనపుటాదరణంబుఁ జూపుచున్. 48

చ. గొణుగుచు నుండెఁ, గోడలును ◆ గోడలికోడలు దుష్టచిత్తలై
మనముల నించుకంత కృప ◆ మాయెడఁ గన్పడనీక తిట్టఁగా
మనుమఁడు చెప్పినట్లు విన ◆ మాని గృహంబునఁ గల్గువస్తువా
హనములు, వేశ్యల న్మరిగి ◆ యర్పణజేయుచు నుండె నెంతయున్. 49

క. ఈరీతిని వర్తింపఁగ, భూరమణుం డెఱిఁగి యాత్మ ◆ పురమున మాకుం
గౌరవము చెడగ వెలచెలి, కూరిమి నెపమునన వెడలఁ ◆ గొట్టించె మమున్. 50

క. ఈలాటికష్టదశచేఁ, జాలఁగ దుఃఖింపఁ బుణ్య ◆ జన మీతఁడు మున్
మేలయినధార్మికుం డని, తాలిమితోఁ జేసి రన్న ◆ దానము మాకున్. 51

క. మును నేఁ జేసినధర్మము, ననుమట్టఁగ నాకుటుంబ ◆ పోషణమునకై
కొని, కొన్ని దినము లిటు జీవనమును గడిపితిని నిట్టి ◆ ఫలమంతయు నేన్. 52

ఆ. విక్రయించుకొన్న ◆ విత్తమున బొట్టకే, మరలఁగొన నశించి ◆ మాఘమందుఁ
బదిదినములస్నాన ◆ ఫలము దిక్కయ్యె నా, కనఘ యంత నొక్క ◆ దినమునందు. 53

సీ. భోజనాపేక్షచేఁ ◆ బొరుగింటి కే నేగి, గొం తాన మెక్కితి ◆ నంతమీఁద
జీర్ణశక్తి నశించి ◆ క్షీణించిన తనువం, దతిసారరోగమ్ము ◆ నతిశయించె
సన్మార్గులకు నిది ◆ సంభవంబగుటను, మరణ హేతువటంచు ◆ మదిని దలఁచి
యిదె నాకుఁ జావున ◆ కేర్పడఁగ ల్గెఁగ,దా యని శ్రీహరి ◆ ధ్యాస నుండ
ఆ. తనువు విడిచి మాఘ ◆ మునఁ బదిదినముల, స్నానఫలమువలన ◆ స్వర్గమందు
మనువుకాలమంత ◆ మనువునికడ నుండి, పుణ్యము నశియింప ◆ భువికిఁ ద్రొయ.

ఆ. ధర్మవిక్రయమ్ముఁ ◆ దగఁజేయువారి కీ, ధరణియందు మరల ◆ దంతిజన్మ
గలుగు నెల్ల సహజ ◆ కర్మమైయుంట నా, కది లభించె భూసు ◆ రాన్వయమణి. 55

పంచ. కరీంద్రరూప మబ్బె పాప ◆ కర్మ మంది యీధరం
జరించుచున్నయట్టి నాకు ◆ జన్మపావనంబుగాఁ
దరింపఁజేసి లింతకంటె ◆ ధర్మ మెద్ది దేవతా
పురిం జరింపఁ బోవువాఁడ ◆ భూమిదైవతాగ్రణీ! 56

ఆ. నీయనుగ్రహమున ◆ నేఁ గృతినైతి స,న్మౌనివర్య యని న◆మస్కరించి
త్రిదివమునకుఁబోయె ◆ దేవత్వమునన వై,శ్యప్రవరుఁడు మౌని◆యాజ్ఞమీఁద. 57

ఆ, సత్పురుషులవలని ◆ సాంగత్య మిహపర,ములకు సాధనమ్ము ◆ దలఁప నేనుఁ
గునకు స్వర్గ మిచ్చె ◆ మునిపుంగవుఁడు తొంటి,కరణిఁ దపము సల్పఁ◆గాఁ దలంచి.

క. ఆకావేరీనదిలో, జోకం గళపరిమితిగల ◆ చొక్కఁపునీటం
బ్రాకటముగ నిల్చి దయా, శ్రీకలితుని యముని నిటు భ◆జించె సభక్తిన్. 59

## మృగశృంగకృత కృతాంత స్తవము.

ఉ, పాపులఁ జంపువాఁడ! పలు ◆ వన్నెలఁ గ్రాలెడువాఁడ! పున్నపున్
రూపమువాఁడ! కాఱుతెగ◆రూపమువాఁడ! సమ స్తజీవులన్
రూపము మాపువాఁడ! తుద◆రోజును జూపెడువాఁడ! దద్దుఁడన్
రూ పవుదుంబరుం డనెడు ◆ రూపులవాఁడ! హరించురాయఁడా! 60

ఉత్సాహ. నల్లవాఁడ! గొప్పవాఁడ! ◆ నల్వరూపువాఁడ! నా
యుల్లమును గలంచుకోఱ ◆ లొప్పుమోమువాఁడ! రా
జిల్లుపద్మమిత్రపుత్ర! ◆ చిత్రగుప్తరూప! బల్
పళ్ళ వ్రేల్ పెదవులబొమల◆వాఁడ యోవృకోదరా! 61

పంచచా. అనేకముల్ కరాంబుజంబు ◆ లంజనాద్రికాంతులం
దృణీకరింపఁజాలు నీల ◆ దీధితుల్ భ్రమ న్భయం
బునుం బలమ్ము గల్గుదేహ◆ముం గలాఁడ! దుష్టులన్
వణంకఁజేయువాఁడ! దున్న◆పైఁ జెలంగునాయఁడా! 62

సుగంధి. నిప్పులొల్కుకన్నుగ్రుడ్డు ◆ నీటుగుల్కు గొప్పమై
నొప్పుగుల్కు కెంపువల్వ ◆ యొలి నెఱ్ఱపూల పే
ర్లొప్పఁ గాలమేఘగర్జ ◆ నోటుపుచ్చుబొబ్బలం
గొప్పవేగ మొప్ప దుష్ట◆కోట్లపైకి దూకి నీ
గొప్పదుడ్డుతోడ మోది ◆ కొట్టు దొడ్డరాయఁడా! 63

పంచచా. కడళ్ళనీళ్ళ నెల్లఁ గ్రోలఁ ◆ గల్గి ముజ్జగంబులం
గడంకతోడ మ్రింగి నోరఁ ◆ గల్గు దండిమంటలం
గడానికొండిగట్లనైనఁ ◆ గాల్పఁగల్గు మేల్మిగొం
పుడాలువేల్పు! దంతడాలు ◆ బూనువేల్ప! మ్రొక్కెదన్. 64

స్రగ్విణి. అల్లకాలాగ్నికీ ♦ డైనతేజస్సుతో
నల్లనా మిత్తి తీ♦క్ష్ణంపుమైఁ జెల్లు నా
యెల్ల రోగాలు దా♦మెప్పుడుం గొల్వఁగా
బ్రిల్లదీండ్రైన పా♦పాత్ము లౌవారికిం
దెల్లమా భీతి నెం♦తేని వి చ్చేప్రభూ. 65

తోద. పున్నెమొనర్చిన ♦ పుణ్యులకెల్లం, దిన్ననితమ్ముల ♦ దీటుకనుల్ తోఁ
గ్రిన్ననఁ దోచు జ♦గాయొడయండా!, చెన్నగురాఁయఁడ!♦జే పిత్రురూపా! 66

ఉత్సాహ. పెడఁదలయిన కన్నుఁగవయు ♦ విండ్లవంటి కనుబొమల్
నిడుదలయిన కెండ్రుకలును ♦ నీటుగుల్కు మీసముల్
పొడవులయిన కేలుదమ్మి♦లుం బొసంగుగడ్డము
బాలుపుమీరు దొండపండుఁ ♦ బోలు కావిమోవియున్. 67

మత్త. మేలిబంగరువంటిదేహము ♦ మించురత్నకిరీటము
న్గ్రాలురత్నపుటుంగ్రముల్ రత♦నాలపేరులు హొన్నగల్
కీలుకడ్యము లందపుంభుజ♦కీరులుం మఱియున్ దయ
గ్రాలుచూడ్కులు గల్గి హొన్నగ♦రాల సింగఁపుగద్దెపై. 68

ఉత్సాహ. ఎల్లయపుడుఁ గూరుచుండి ♦ యెల్లకలిమి కిక్కయై
యెల్లశుభములకును దామ ♦ యెల్ల యగుచు నెప్పుడుం
దెల్లపూసరుల్ వఱువలుఁ ♦ దెల్లగొడుగు దాల్చి రా
జిల్లి ధర్మ మెఱుఁగుసభ్య♦శేఖరుల్ నుతింపఁగాన్. 69

ఉత్సాహ. తెల్లరంగుచేత ధర్మ♦దేవతామతల్లి యీ
యెల్లశుభవిలక్షణముల ♦ కెల్లయైన సత్యముం
దెల్లవేల్పువంటికాంతిఁ ♦ దేజరిల్లుశమమునున్
నల్లదారిజియ్యతేజు ♦ నవ్వునట్టిదమమునున్. 70

భుజంగ. చతుర్వర్ణముల్ వల్న ♦ సద్బ్రహ్మచర్యా
ద్యాశ్రమశ్రేష్ఠముల్ వల్న♦దా జన్మమాళీ
లతంత్రాలు కాయమ్ము♦లం దాల్చికొల్వన్
సతం బెల్లసత్పూరు♦షశ్రేణి యెంతో. 71

స్వాగత. మంచిమాటలను ♦ మాటికి సంతో, షించునట్టులుగఁ ♦ జేయుచు సంతో
షంచితుండవయి ♦ హంసునిరూపం,బంచు నెంచఁబడు♦నర్కజ! కేకే. 72

తోటక. కొలలం బొనరించిన ♦ కొంటెలకుం, గలయుం గన నాశన♦కారివియై
యిలలోపలఁ బుణ్యుల ♦ కెల్లరకుం, గరుణం దగురూపున♦గన్పడురా.

స్రగ్విణి. జన్నముల్ లోనుగా ♦ సత్క్రియల్ సల్పుబల్
పున్నెపుంబంక్తికి ♦ నోమ్రదముం గూర్చి త,

గ్గన్నసద్గోష్ఠితోఁ • గ్రాలు తేఁడా! మహా
పన్నమోదా! ముని•వ్రాతమోదప్రదా! 74

చిత్రపదము. ఇమ్ముగ ధర్మయుతమ్మౌ, నెమ్మది నొప్పుదొరా ధ
ర్మమ్ములఁ జల్పెడు వారిన్, సమ్మతిఁ జూచెడువాఁడా! 75

కవిరా. మెడగల బంగరుమువ్వలమ్రోఁతల • మిట్టిపడం గడహత్తిగముల్
నిలిచి యజాండముఁ జీల్పగఁజాలిన • నిడ్పగుచొక్కఁపుఁగొమ్ములు బెం
బొడవగుకాటుకకొండను బోలిన • పొల్పగునెమ్మోయి గల్గి భయం
పడఁ జర కొట్టుచు శ్వాసము విడ్చుస•మానలులాయము నెక్కి తగన్. 76

తరల. కఱకునారస పుంకస మ్మురు•ఖడ్గముం బలుశక్తితో
కలియు శూలము పాశముం గద • కైఁ గలట్టి మెకమ్ము గై
దరము వచ్చిరునాల్గుచేతుల • దాల్చినట్టిఁడ! యొద్దుగల్
నెత్తి నెఱింగినపెద్దసాక్షుల • నెర్చి కైకొని మానిసుల్. 77

ఉత్సాహ. పాపపుణ్యములను దీర్చు • వాఁడ! ముజ్జగాల మేల్
మాపు రేపు గోరువాఁడ • మహితశాంతరూప, పె
ల్లేపుమీర దక్కినమ్మ • నేలువాఁడ, భద్రముల్
కే పొసంగఁజేయువాఁడ • వేడివెల్గుపాపఁడా! 78

సుగంధి. సారపుణ్యశీలనేత్ర • సారసానుమోదసం
సారదుఃఖనాశకర్మ • సాక్షినందనుండవౌ
కారణమ్మున న్విశుద్ధ • కర్మలైనవారి వా
కోరబడ్డకోర్కులెట్టి • కూర్చుచేటివేలుపా! 79

క. వెస నను మంద సుపర్ణుల,కు సపత్నీమాత కూర్మి • కొమరుఁడవై బల్
వసమీరువాఁడ కింకర, విసరము గొలనేయుబాప•విసరము దోడ్తోన్. 80

మానిని. మీకడఁ జేరిచి మీ కెఱిఁగించిన • మేకొని వారల మెండుగ నా
భీకరనారకవేతనలం బడ•వేసి బడింబడి వేచుఁడుః రా
ల్మొకల వేయుఁడు లోఁగక కత్తిని • ముక్కలు సేయుఁడు పొక్కియుడల్
గాకను నేవ్వఁగఁగాల్చుఁడు పిష్టము•గా వెస నూరుఁడు గా దనకే. 81

ఉత్సాహ. అనుచు నిట్లు పల్కువాఁడ! • యమున కూర్మితోడ! క
న్గొనల నెఱ్ఱవారి తిరుగు • గుడ్లు గల్గువాఁడ! భీ
తిని నెడంద మోపఁజేసి • తిరిగి వంకరగను గ్రాల్
కనుబొమల్ గలాఁడ! భక్త•కల్పభూరుహోత్తమా! 82

పంచ. భయమ్ము గల్గఁజేయునట్టి • వక్రమైన భ్రూకుటీ
ద్వయమ్ముతోడఁ గూడుమోము • వాఁడ వౌ వృకోదరా!
రయమ్ము మీరఁ గ్రూరకింక•రవ్రజమ్ముఁ దెచ్చిన
ట్టి యమ్ము రారిదూరుల న్వ•డిం గలంచునాతఁడా! 83

క. తమ తమ నియమములగు క,ర్మముల న్నడపుసమయమున ♦ శ్రద్ధగలారై
క్రమత నెరనేర్చువారలు, విమానమం దుండఁగానె ♦ వెళ్ళి యెదురుఁగాన్. 84

భుజంగ. కరాబ్జమ్ముల న్మోడ్చి ♦ కై వట్టితోడ్తె
చ్చురా! తామరల్ గేరు ♦ సొంపారుకన్నుల్
దొరా! యెనుజన్మాల ♦ తోఁ బొల్చయుం గ్రి
చ్చరం గూర్మితోఁ గాంచు ♦ సంజ్ఞాకుమారా!. 85

క. సర్వము భరించువాఁడా, సర్వవిషయములను నధిక ♦ సామర్థ్యమునన్
నిర్వహణధూర్వహుఁడవై, నిర్వర్తించంగలాఁడ ♦ నిర్మలరూపా! 86

మత్త. దచ్చికంటికి దమ్మికంటికి ♦ దచ్చిరూపులవానికిన్
మెచ్చువచ్చిన నిక్కపుందొర ♦ మేలుకీళ్లను జెప్పఁగా
మెచ్చువచ్చిన న్యాయసాక్షి! సు ♦ మేధ నెల్లజగమ్ములం
మచ్చిక న్నుతిసేయనా దొర! ♦ మాటిమాటికి మ్రొక్కెదన్. 87

క. అనుచు మృగశృంగుఁ డివ్వగ,తున యమునానుజుని సర్వ ♦ మునిగేయుని ద
క్కనఁపుదెస నేలు నల రవి, తనయుని వినయుని సభక్తి ♦ తాత్పర్యములన్. 88

ఆ. నుతు లొనర్చి పెక్కు ♦ నతులను గావించి, చరణకరభుజములు ♦ నురము శిరము
ధరణిఁ దగుల సాగి ♦ దండమువలె బడి, మ్రొక్కుచున్నవిప్ర ♦ ముఖ్యుఁ గాంచి. 89

తే. షడ్గుణైశ్వర్యపజ్ఞచేఁ ♦ జాల నొప్పి, ప్రాణులను తుదముట్టించు ♦ వాఁడునగుచు
భాస్కరునిపుత్రుఁడైన వై ♦ వస్వతుండు, నామునిశ్రేష్ఠు పైఁ బ్రేమ ♦ నూవహిల్ల. 90

ఉ. మిక్కటమైన తేజమున ♦ మించి కుశేశయతుల్యవక్త్రమం
దెక్కువయౌ వికాసమున ♦ హీనబల మ్మురుదీర్ఘ బాహువుల్
చక్కనిరూపసంపదయు ♦ సద్గుణసంపదయు న్సుబుద్ధి పెం
పెక్కఁగ నిచ్చు బుద్ధియును ♦ నింపగు వస్త్రసుపుష్పమాలికల్. 91

తే. కాంచనోజ్జ్వలరత్నసం ♦ ఘటితవివిధ,భూషలను గల్గి ♦ తామరపువ్వులకును
దీటయిననేత్రములు నతి ♦ తిన్నఁదనఁపు, భాషలును గల్గి సంతోష ♦ భరితుఁడగుచు. 92

సీ. సకలాభరణధారు ♦ లకలంకమహిమమై, వెలుఁగుదివ్యాయుధ ♦ ములఁ గలారు
సింహపరాక్రమ ♦ శీలురు నై దీర్ఘ, తరబాహువులు గల్గి ♦ తతవిధేయ
తం దంష్ట్రిలం గాన్పు ♦ దండివాగ్గుహలన, డరు శూరులైన కిం ♦ కరులు నుభయ
పార్శ్వంబులం జేరి ♦ పరిబలి సేవింపంగఁ, గడుధర్మనూత్న్మముల్ ♦ గనెడువారు
తే. శాస్త్రవేదార్థములఁజాల ♦ సంచరించు, వారు యాగమ్ములం జేయు ♦ వారుఁ జేసి
నట్టివారును ధర్మమం ♦ దలరుమధ్య,వర్తులు సభాసదులు వెంట ♦ వచ్చుచుండ. 93

ఉ. హారకిరీటముల్ దనర ♦ నచ్యుతుపాదసరోరుహంబులన్
సారసఁ గొల్చుచు న్సుగుణ ♦ సాంద్రత మీరినరాజసంఘముల్

ధీరత వెంటనంటి యరు ♦ దేరఁగ నామృగశృంగుపాలికిన్
భూరిదయార్ద్రచిత్తుఁడయి ♦ పొల్పుగ వచ్చెఁ గృతాంతుఁ డంతటన్. 94

ఆ. ఇటుల నేగుదెంచి ♦ యెదురఁ బ్రత్యక్షమై, తనదుబాహుదండ ♦ తలము సాచి
గ్రుచ్చి లేవనెత్తి ♦ కుత్సునితనయుని, గౌగిలించి మిగులఁ ♦ గారవించి. 95

ఉ. భూసురవర్య! నీతపము ♦ పొల్పున కే నెద మెచ్చి నీకునై
భాసురరీతి వచ్చితి న ♦ పారవరంబులు నిత్తు కోరికల్
వే సుకరమ్ముగాఁ దెలుప ♦ వే! యను శ్రావ్యఁపుబల్కు వీనులం
భాసురలీలమైఁ జొరగ ♦ బ్రాహ్మణడింభకుఁ డంబకాబ్జముల్. 96

సీ. తెఱచి కట్టెదుర నెం ♦ తే దీవ్యమానుఁడై, పరివారములు గొల్వఁ ♦ బ్రబలమహిష
వాహనుండై క్రాలు ♦ వైవస్వతుని గని, సంభ్రమాశ్చర్యముల్ ♦ సందడింప
కోరినపని సమ ♦ కూడునట్టుగఁజేయ, సామర్థ్యమున నొప్పు ♦ శమన! యనుచు
నంజలిబద్ధుఁడై ♦ యాపాడునూతిలోఁ, బడి చనిపోయిన ♦ బాలికలకు
తే. ప్రాణములొసంగివారలఁ ♦ బ్రతుకఁజేయు,మనుచుఁగన్యలవృత్తాంత ♦ మపుడు తెలియఁ
బలికె ముమ్మాటి కిట్ల నాదు ♦ వాంఛిత మని, కాలుని నుతింప నతఁడు గిం ♦ కరులతోడ.

క. మన యనఁటితోఁటలోపల, ఘనముగ విహరించుకన్య ♦ కల నలువుర వే
చని యిచ్చోటికిఁ దోడ్తెం,డని యాజ్ఞ నొసంగ భటులు ♦ నతివేగమునన్. 98

క. చని కదళీవనమధ్యం, బున ననుపమలీలఁ దిరుగు ♦ ముదితల నెంతే
వినయమునఁ దోడి తెచ్చిరఁ, గని శమనుం డొక్కనిమిష ♦ కాలములోనన్. 99

క. మనుజులకు గోచరింపని, తనువులఁ దనరారునట్టి ♦ తరుణులయసురుల్
గొని పాడునూతిలోపలి, మునుపటి దేహముల నునుప ♦ మునికొని వారల్. 100

ఆ. నిదుర మేలుకొన్న ♦ టు దగంగఁ గన్నులు, దెఱచి పాడునూయి ♦ దరిని వస్త్ర
హీన లగుచు మెల్ల ♦ నేతేరఁగా దముఁ, జూచి తల్లు లమిత ♦ చోద్యమంద. 101

క. బాలిక లప్పుడు తమతమ, చేలములు ధరించి మివుల ♦ శృంగారమునం
దేలుచు గృహముల కరిగిరి, కాలుం డవల మృగశృంగుఁ ♦ గని యిట్లనియెన్. 102

చ. తనిసితి నీస్తవంబునకుఁ ♦ దాపసడింభక తెల్పు కోర్కె నే
ననుపమలీలఁ దీర్చెద ద ♦ యామతితో నన నీస్తవంబు దా
జనులు పఠించిన న్వారిన ♦ సౌఖ్యము లందుచు దుఃఖభాజనం
బును నపమృత్యువుం దొలఁగి ♦ భూరితరాయువు గల్గి క్రాలఁగాన్. 103

చ. వరము నొసంగుమంచుఁ దన ♦ వాంఛితముం దెలియంగఁజేయ భూ
సురమణి కిట్లను న్యముఁడు ♦ నూరివరేణ్యా! త్వదీయబుద్ధి కే
యరమర లేదు నింకొకర ♦ హస్యముఁ దెల్పెద నాలకింపు సు
స్థిరమతిలేమి నెందునను ♦ దేవుఁడు లేఁడను నాస్తికాళికిన్. 104

ఆ. తెలుపఁ బోల దింకఁ ♦ దేటైనమీబోఁటి, జనులు నిది గ్రహింపఁ♦జనును వినుము
భౌమవారకృష్ణ♦పక్షచతుర్దశీ, దినమునందునఁ బిత్రు♦దేవతలకు. 105

సీ. తిలతర్పణ మొనర్చి ♦ సలలితభక్తి నా,స్తవము పఠించిన ♦ జనుల కెలమి
సౌఖ్య మాయుష్యము ♦ సంభవం బగు నని, పలికి యదృశ్యుఁడై ♦ భవనమునకుఁ
జనియె నాబ్రాహ్మణ♦తనయుండు యమునిచే, నిబద్ధవరముల ♦ నెల్లను గొని
సంతుష్టుఁ డగుచు స్వ♦శరీరముఁ బ్రవేశించె,గాన నీస్తోత్రం♦బు♦మానవులకు
తే. క్షేమకర మపమృత్యువు ♦ చెంద దట్టి,వారికి యముండు ప్రత్యక్ష♦మై రహి నిహ
పరముల సుఖంబుబడయుంగ♦వరములిచ్చు,ననుచుబ్రహ్మాత్మజుఁడుదిలీ♦పునకుదెలియ.

తే. పలికె నా బాలికామణుల్ ♦నలువుమీర, యమునిలోకమ్మునందుండి♦యవనికరుగు
దెంచియచ్చటికథ లెల్లఁ♦దెలియఁబలికి,రవలఁదలిదండ్రులకును బాం♦ధవులకెలమి.107

ఆ. అనిన విని దిలీపుఁ ♦ డవ్వశిష్ఠుని గాంచి, పాపు లయినవారు ♦ బాధ లొందు
నరకములను బుణ్య♦పురుషుల శుభములు, విప్రముఖ్య! నాకు ♦ విస్తరించి. 108

ఆ. తెలుపు మనఁగ బాలి♦కలు యమపట్టన, మందు తాపము గన్న♦ యట్టివిధముఁ
దల్లిదండ్రులకును ♦ దమబంధుజనులకుఁ, దెలిపినటుల నీకుఁ ♦ దేటపరతు. 109

## య మ స ద న వృ త్తాం త ము.

వ. ఆకర్ణింపుమని కన్యకలవాక్యములుగా దిలీపునకు వశిష్ఠుం డిట్లనియె; నట్లు బాలికా
మణులు తలిదండ్రులు మొదలైనవారిం దిలకించి యిట్లనిరి. 110

ఆ. అమ్మలార! వినుఁడి ♦ యమపట్టనంబెల్ల, ప్రాణికోటికింత ♦ ప్రాపయి కడు
భయముఁ గల్గఁజేయు♦బహుతరఘోరమై, పరవశమ్ము మివులఁ♦బొరయఁజేయు.111

సీ. మాతృగర్భమునందు ♦ మసలుచున్నట్టియు, జన్మించినట్టియు ♦ జననమంది
పసిబిడ్డలయి చరిం♦పఁ గలట్టియుం బ్రాయ, ములఁ దిరుగ్వనట్టియు♦నలు తెఱఁగుల
స్త్రీపున్నపుంసక♦రూపముల్ గలిగిన, ప్రాణు లందఱు బొంద ♦ భావ్యమైన
యాయమలోకంబు♦నందుఁ బక్షాపక్ష,ములు లేక యెల్లజీ♦వులకు నొక్క
తే. వితముగాఁగాంచివారిదు♦ష్కృతము సుకృత,ముల విచారించుచిత్రగు♦ప్తులను గల్గి
నట్టి సమవర్తిలోకమ్ము♦నందుఁ జేరఁ ♦ దగనివారలు లేరు సూ ♦ ధరణిలోన. 112

ఉ. చేసినకర్మమెల్లఁ దను♦జెందక యూరక పోదు దానిలో
వీసము సందియంబుఁ గను♦పెట్టఁగఁ దోఁచదు నెల్లవారలున్
భాసురపుణ్యకర్మలకుఁ ♦ బాల్పడఁ గాఁనివీటికి న్నిరా
యాసముగాక మార్గమున ♦ హాయిగ నేగెద రంచు వెండియున్. 113

చ. సరసులు మాఘమాసమున ♦ సమ్మతితో నరుణోదయమ్మునన్
బరువడి లేచి కృష్ణ! యదు♦నందన! మాధవ! యంచు శ్రీహరిన్
స్మరణమొనర్చుచు న్నరిగి ♦ స్నానము గ్రామబహిర్జలంబులన్
సరగునఁ జేయఁగా శమను♦సద్మముఁ జేరదురయ్య హాయిగన్. 114

సీ. మాఘమాసమున నే ♦ మనుజులేని సూర్యోద,యము వేళ శీతోద♦కములయందు
సంకల్పసిద్ధిసు♦స్నాతులై బదరికా,కదళీఫలమ్ములఁ ♦ గడఁక దాన
మును జేయు తత్ఫల♦ములను భుజించుచుఁ, దిలదానము విను ని♦ర్మలమనమున,
నామలకఫలము ల♦పార్వతి తేజమ్ము, గలుగువారలకుఁ జె♦ప్పులును దాన
ఆ. మొసగునట్టివార ♦ లుత్తమాశ్వములపై, గొడుగులిచ్చువారు ♦ గొప్పనీడ
సుచితసౌఖ్యపదవు ♦ లొందుచుఁ గాలుని.పురికిఁ బోదు రట్టి ♦ పుణ్యు లరయ. 115

ఉ. చేలము లిచ్చువారు మృదు♦చేలములం ధరియించి పల్లకీల్
మేలిమిగుఱ్ఱముల్ గజము ♦ లిచ్చిన మెత్తని సెజ్జ పీటలం
దాలిమి నిచ్చువారు నెటి ♦ దారిని నేర్మి లేక తిన్నగాఁ
గాలునిపట్టణంబునకుఁ ♦ గ్రచ్చర నేగెద రెంతో హాయిగన్. 116

సీ. తోపులు వేయింపఁ ♦ దోడరి చల్లగ నుండు, తరులనీడలఁ బూల♦దండలొసఁగఁ
బుష్పకారూఢులై ♦ పొలుపార దేవాల,యములు నిర్మింప సం♦న్యాసులకును
మఠములు గట్టింప ♦ మండపములు బాగు, జేయింప మార్గాళి♦శిథిలగృహము
లటు బాగుచేయించ♦ నాయాసముం దీర్చు,కొనుచు నాడుచుఁ బాడు♦చును గురువుల
తే. దేవతలఁ దల్లిదండ్రుల ♦ ద్విజుల నగ్ని,పూజ లొనరింప మార్గాళిఁ ♦ బూజ్యలగుచు
నధికసంతోషమునను య♦మాలయమున, కిన్నివితములఁ జనుదు ర♦ప్పుణ్యప్రజ. 117

సీ. దీపముల్ వెలిగింప ♦ దివ్యయుల్ కాంతి నల్, దిక్కులందునఁ జాలఁ ♦ దిక్కటిల్ల
గృహదానము లొనర్పఁ ♦ బ్రభులసౌఖ్యములతో, గోదానమునఁ గోర్కె♦ గొనలుసాఁగ
మంచిమార్గమున ధ♦ర్మప్రవర్తనలచే, తను రోగతతులచే ♦ తను నవిసెడి
వారి కౌషధ మిచ్చు♦వారు వ్యాధులు లేక, గురుశిష్యభావ మం♦కురము నడపు
తే. నట్టివా రక్కడచట నా♦యాసములను, దీర్చుకొను చంతటంతట ♦ దేహసుఖము
నెటి గనుచుఁ బోదు రిటుల పు♦ణ్యంపుజనులు, సకలసంతోషముల యమ♦సదనమునకు.

సీ. కాళ్లు కడిగికొన ♦ నీ ళ్ళిచ్చువారలు, శీతలపథమున ♦ నీరి మెరసి
బ్రాహ్మణజనుల క♦భ్యంజనం బొనరింప, నతిశయం బైనట్టి ♦ హాయము నెక్కి
బంగారురతనముల్ ♦ పరగ నిచ్చినవారు, మణిమయదివ్యవి♦మానములను
గోరజతాదులఁ ♦ గోరక యొసఁగిన, దివ్యరథంబులఁ ♦ దేజరిల్ల
తే. ధరణి నిచ్చుటచేత నే♦కొఱఁత లేక, జనుల కన్నము నిడిన భో♦జనము నుదక
పానమును సల్పుచును జిత్ర♦భానుసూను, సదనమున కేగుదురు సర్వ♦సౌఖ్యములను.

సీ. తాంబూలదానమ్ముఁ ♦ దనరఁగాఁ జేసిన, పరిమళయుతముఖ♦పద్మ మలర
నేత్రచేఁ ద్రిభువన♦ఖ్యాతి జ్యోతిస్స్వరూపమున నొప్పెడివాహ♦నమున విప్ర
వరులకుఁ గూశ్మాండ♦ఫలము లొసంగిన, హేమవిమానంబు♦నెక్కి శాలి
తండులాధికధాన్య♦తతి దాన మొసఁగిన, సకలవిధంబుల ♦ సౌఖ్యపడుచు
తే. నిటుల పలువితముల ♦ నిహలోకమునఁ జేయు, దానఫలములతోడఁ ♦ దగినసుఖము
నందుకొంచు నంద ♦ రన్ని మార్గమ్ములఁ, శమననగరి జేరెద ♦ రమరజనులు. 120

తే. వండి వెంటనె భూమిపైఁ బడి నశించు, నట్టి యేమాలికలు మాఘ మందు ఫలిత
మగునో యవి యియ్య సకలప దార్థసమితి, ననుభవింపుచు యమపురిఁ కరుగనగును

చ. కనుఁగొన మాఘమం దుదయ కాలము స్నానముఁ జేయువారిచే
ఘనమగునట్టి దానములఁ గ్రాలెడుభక్తిని జేయువారిచే
తను గడునోములం జలిపి దాన మొనర్చినవారిచేత న
త్యనుపమలీల సంతతము నప్పురి నిండినదై వెలింగెడున్. 122

తే. అట్టిపుణ్యాత్ములకు యముఁ డనుదినంబు, పూజ లొనరించు వారిలోఁ బుద్ధిఁ దలఁప
మాఘమందున స్నాన మే మరక చేయు,వారు మిగులఁ బ్రకాశులై పరగుచుండ్రి.

సీ. అందు చిత్రిమ్ములై యయుతసంఖ్యలు గల,దివ్యపుష్పకములు తేజరిల్లు
నట్టివిమానమ్ములందునఁ గూర్చుండి, యలుగు చెంచెడు పుణ్య పరులఁ గాంచి
శమనుండు సింహాసనము డిగ్గి భటులతో, నెదురేగి వారల కింపు గదుర
ముకుళితహస్తుఁడై ముదమునఁ బొదలుచు, కుశల మారసి తన యశము నిగుడ
ఆ. నర్ఘ్యపాద్యములఁ సుఖాసన మిడి ప్రేమ, దనర గొప్పజేసి ధార్మికు లయి
యొరులకు నుపకార మొనరుపఁ గల్గుపు,ణ్యమున వెలుఁగుసజ్జనమ్ములార! 124

ఉ. మీరలు స్వర్గమందుఁ గల మేటిసుఖంబులఁ గోరి పుణ్య మిం
పారఁగఁ జేసినట్టి రరు దారఁగ దివ్యవిమానరాజిపైఁ
గూరిమి దేవతాసతులఁ గూడి వసించి సమస్తభోగముల్
వారక యందుచుం ద్రిదశ వాసముఁ జేరఁ డటంచుఁ బంపఁగన్. 125

ఆ. యము ననుజ్ఞఁ గొంచు నాదట వారలు, దివిజసతులఁ గూడి దివిజపురికి
నేగుదురు ప్రయాగ నేకమాఘమునందు, స్నాన మాచరించు సజ్జనములు. 126

సీ. కాళ్ళొత్తుకొనని చొక్కంపుమార్గమునందుఁ, జనుదురు పరమేష్ఠి సదనమునకు
నొకమాఘమున భానుఁ డుదయించువేళ శీ,తోదకస్నానమ్ము నొనరఁ జేసి
వైష్ణవధర్మప్రవర్తనాసక్తులై, పురుషసూక్తముఁ జెప్పు పురుషులు లెలమి
మిగుల ముక్తిప్రద మగు విష్ణులోకమ్ముఁ, బొందుదు రితరులౌ పుణ్యపరులు
ఆ. మందు యమునిసదనమునకు విమానము, లందు నేగి రవిజు నాజ్ఞ నంది
వెనుక నాకమునకుఁ జనియెద రొక్కట, మఱియుఁ బ్రొద్దుపట్టిమన్కియందు.

ఉ. అక్కడ నక్కడ న్నిలచు నట్టిమహాత్ములఁ బుణ్యమూర్తులన్
బెక్కురు నుందు రందుఁ గల భేదముల న్వివరింపఁ జాల మే
మక్కడ నొక్కతోఁటను విహారము సల్పుచుఁ గొన్నిపద్ధతుల్
నిక్కము మే మెఱింగితిమి నేర్పునఁ గాంచుచుఁ గన్నుదోయితోన్. 128

మ. ఘనమై కల్పమునందుఁ జొప్పడిన మాఘస్నాన మాపుణ్యులం
గనులం జూపఁగ మూల మయ్యెఁ దెగ మత్కర్మపరీజం బెంతయున్
దనర న్నిరటఁ బాపజాతి పడు సంతాపమ్ముల న్వేరుగా
వినుఁ డంచు న్వచియించి రన్నువల కావృత్తాంత మవ్వాలికల్. 129

వ. కావున తదీయకథాక్రమంబు నీకు నెఱింగింతు విను మని రాజునకు మునివరుం
డిట్లనియె. 130

సీ. లోకములో మదో♦ద్రేకులై సద్వృత్తి, విడి తిరిగెడి చెడ్డ♦నడవడిగల
వారు దానములను ♦ వదలనివారు పా. పాత్ములై దక్షిణ♦పథముఁ బట్టి
భయదమై కనుపట్టు ♦ వైవస్వతునిపురి, కేగుదు రది చూడ ♦ నెనుబదారు
వేలయోజనముల ♦ విరివిచే నొప్పి య,నేకరూపములలోఁ ♦ బ్రాకటమగు
నాపట్టణము పుణ్యు ♦ లగువారికిని దాపు, గాఁ గానుపించును ♦ కఠినమైన
తే. మార్గమున నేగు పాపస♦మాజము లను, దూరమై పెక్కుదారులై ♦ తోఁచి చురుకు
గలుగుముండులు మరికొన్ని♦కత్తిరాళ్ళు, గులకబండలతో నింకఁ♦గొన్నికొన్ని. 131

ఉ. మిక్కిలి బంకమట్టియును ♦ మెం డగు నెన్ములపేడకుప్పలన్
జిక్కగ వాడిసూదులను ♦ జిమ్మెడుదర్భలు గడ్డిపల్లముల్
చొక్కఁపుపేటవంపుగను♦లన్ బెనునొడ్డరికంబులుం దరుల్
క్రిక్కిరియంగ నిన్నిటను ♦ వృద్ధివహించుఁ దదీయమార్గముల్. 132

ఆ. ఇట్టిదారులందు ♦ నట్టిపాపాత్ములు, పోవుచుందు రర్క♦పుత్రపురికి
దుఃఖమందు మునిఁగి ♦ తూలుచు మిక్కిలి, లోతుగలిగి పాడు♦గోతు లమరి. 133

ఉత్సాహ. కాలి కాలి నల్లవారు ♦ గట్టిమట్టిపెళ్లలుం
గ్రాలుచుండ కాలునిలుక ♦ గల్గి సూదులట్లుగా
నేలమీఁద సందులేక ♦ నిండుకొన్న మేకులుం
జాలఁగ్రాలునట్టిమార్గ♦జాల ముండుచోటులన్. 134

సీ. అసమానదురితమ్ము ♦ లంది పాపుల నేడ, సందు లే కేగఁగా ♦ క్ష్మాజతతుల
వలన జనించెడు ♦ బలితంపుటంధకా, రమ్ము గ్రిమ్మినకాన ♦ నమ్ములందుఁ
గాలినయవియునై ♦ నాలుగుదారులు, గలసినచోటులఁ♦ గనులకెదురఁ
గార్చిచ్చుమంటలఁ ♦ గ్రాలెడుశిలలచే, నంతట దట్టమై♦నట్టిమంచు
మెడలుదాకను దిగఁ ♦ బడు వాలుకాతతిఁ, గాఁగి తెఱలు నీటఁ ♦ గడుతపించి
నిండుకొన్న పిడుక♦నిప్పుకలవలనఁ, గంతములను గఱచి ♦ గాయములను. 135

సీ. చేయు భయంకర♦సింహశార్దూలాది, మృగసమూహమ్ముచేఁ ♦ బృఘుతరంపు
కెలగలచేఁ గొండ♦చిలువలచే మహా,ఘోరమ్ము లయినట్టి ♦ గొప్పతేనె
టీఁగలచే దొడ్డ♦నాగుబాములచేత, నామ్మేనుగులచే ♦ నధికమైన
బలమున మేనులు ♦ తెలియక దారులఁ, గోరాడుచును వాడి♦కొమ్ములు గల
వృషభములచేత దీర్ఘంపు♦శృంగములను, గలిగి తిరుగాడు నెనుబోతు♦గములచేత
గర్దభోష్ట్రవరులచేత ♦ గండుమీరు, శాకినీఢాకినీపిశా♦చములచేత. 136

ఆ. తలలు రెండు గలుగు ♦ పలలాశనులచేత, బహుళమైన వ్యాళ♦పాళిచేత
బహువిధమ్ములైన ♦ బాధలం బొందుచుఁ, జనుదు రినతనయుని♦సదనమునకు. 137

క. దుమ్ములు జెరుగుచు వడిగాఁ, గ్రిమ్మినవెనుగాలిచేతఁ ♦ గలఁగుచుఁ దనువుల్
దిమ్మరపోవు శిలావ,ర్షమ్మున మనుమసురవలన ♦ సారె మునుఁగుచున్. 138

సీ. తేలుచు మాటికిఁ ♦ దిరముగా మ్రోఁగుచు, నురుమునురుములకు ♦ నులికిపడుచు
వదనుకత్తులవర్ష♦బాధచే దేహముల్, చిల్లులు వడి వెత♦చేతఁ బ్రుంగి
క్షారోదకంపువ♦ర్షముచే శరీరముల్, తడిసి మంటలకును ♦ దాళలేక
శోకించి చలిగాలి ♦ సోఁక వడంకుచు, నిప్పులగాలికిఁ♦ జెప్పఁదగని
తే. వేండ్రమునకు నగ్ని♦వేదన లందుచు, జిహ్వలెండ నోరఁ ♦ జెమ్మలేక
నంగలార్చుచుండి ♦ యరుగుచు నేమియు, దారిఁగనఁగలేక ♦ తల్లడిలుచు. 139

ఉ. జనసంచారములేక గాఢపుదమో♦జాలంబులం దిక్కులుం
గనరాకుండ మహాత్రిమూలమగు మా♦ర్గంబందునం బోవుచున్
వెనువెంటం జనుదెంచుకింకరజనుల్ ♦ వేధింపగా భానుపు
త్రునిగేహం బొగిఁజేరఁ బోదురు మహా♦దుష్టాత్ములౌ మానవుల్. 140

ఉ. చచ్చినపాపజాతులను ♦ జయ్యన నీడిచికొంచుఁ గింకరుల్
చెచ్చెర నేగ వారు మును♦జేసిన దుష్కృతముల్ దలంచి లో
హెచ్చినచింత మున్ను దము ♦ నెత్తి భరించినతల్లిదండ్రులం
బెచ్చగునాత్మపుత్రులను ♦ బ్రేమగలటిస్వబంధుజాలమున్. 141

తే. ప్రాణపదు లైన మిత్రులఁ ♦ బాసి యేక,తమున నితరులకుం జిక్కి ♦ తహతహపడి
యేడ్చుచుం గంతములునంట ♦ నెండి దవడ,లంటుకొని వస్త్రహీనులై ♦ యతిభయమున.

ఆ. బక్కచిక్కి దేహ♦బలము నశింప నా,కలికి నిలువలేక ♦ కాళ్లు నిలువ
సంకెలులఁ దగుల్ప ♦ సంకట మొందుచు,మఱియుఁ జనెద రినజు♦మనికి కొఱఁకు. 143

ఆ. మొరలు పెట్ట నుదర♦ముల శిరములఁ జొన్పి, కేశములను గాల♦పాశములను
బెనచి కట్టియీడ్చి♦కొనిపోవుదురు యమ,సదనమునకుఁ బాప♦సమితి భటులు. 144

సీ. ముఖమున నంకుశ♦మును గ్రుచ్చి వాడియౌ, ముండ్లకంపల నిండి♦పోవ నలవి
గానిమార్గమ్ములఁ ♦ గలఁశమై కొందఱఁ, గొంపోయెదరు మఱి ♦ కొందఱ నఁటుఁ
బెడజెక్కలను గట్టి ♦ యెడపక చేతుల,కును సంకెలఁ దవిల్చి ♦ కూడులేక
దుఃఖింపుచుండఁ గొం♦తుల నురివోసి జి,హ్వలు పాశములచేత♦నంటఁగట్టి
తే. పిఱుదులకు నిరుప్రక్కల ♦ బిగియ నర్ధ, చంద్రతుల్యాయుధమ్ముల ♦ జక్కనొత్తి
పట్టి పాపమ్ము లొనరించి ♦ నట్టివారి, నీడ్చికొనిపోవుదురు భటు ♦ లినజుపురికి.

తే. బీజములు శిశ్నమున జేర్చి ♦ బిగియగట్టి,త్రాళ్ళ ముక్కులు గుట్టి చె♦క్కళ్లఁ బెదవు
లందు దారములను గ్రుచ్చి ♦ కొందఱ నిల,నీడ్చికొనిపోవుదురు భటు ♦ లినజుపురికి.

క. మేలగు నినుపసలాకలఁ,గాలిచి యుదరముల గ్రుచ్చి ♦ గడ్డములు చెవుల్
చీలిచి నెత్తురు జొత్తిలఁ, గాలునిపురిఁ జేర్త్రు భటని♦కాయము లెంతే. 147

సీ. దవుడలు మెడలు పె◆దవులు వగిల్చి పాదములు హస్తములు బ్ర◆ద్దలుగ మొత్తి
బిట్టుగా వృషణముల్ ◆ గొట్టి యీటెలచేతఁ, బొడిచి బాణమ్ములఁ ◆ బొంకమణఁచి
దిక్కుగానక పడి ◆ తెరలి దుఃఖింపఁగా. నిటునటుఁ బరుగెత్త ◆ నినుపకట్ల
గుదియల బడిబడి ◆ గొట్టుచు మండెడి, వీతిహోత్రునిమాడ్చి ◆ వెలుఁగునట్టి
తే. భయదమై తోఁచుకత్తిరం◆పములచేతఁ గోయఁబడువారిచే నాటుం◆గుదెలచేత
వ్రేయ రక్తములొలుకఁగా◆ వెతలఁ గ్రుంగువారు నాదురుపాపులు◆ భటులచేత. 148
తే. పట్టువడి పోవుచుందురు ◆ పలువితములఁ, గలుగుపురుగులఁ గఱపింప◆గాయములగు
వారు నాకలిచేత నాం◆హార ముడుగు,చుండి పరవశమును బొందు◆చుందువారు. 149

ఉ. ఎండఁదాళ లేకయు మ◆హీరుహశాఖలనీడ నాత్మలో
మెండుగఁగోరువారు చలి◆మించెడు బాధను వీతిహోత్రు నొం
డొండను గోరువా రడుగు◆చుండెడువారును దాన మెన్నఁడుం
మొండితనమ్ముతో నలుప ◆ బుద్ధిఁ దలంపమి దారిబత్తెమేఁ. 150
ఆ. కనఁగలేనివారు ◆ గష్టపడుచుఁ బాపు, లగుచు యమునిపురికి ◆ నరుగుచుంద్రు
మఱియుఁ బుణ్యులైన◆మానవుల్ సౌఖ్యాబ్ధి,వీచి దేలు చటకు ◆ వెళ్లుచుంద్రు. 151
ఆ. పాపు లెంతకష్ట◆పడుచుఁ బోదురు మార్గములను నంత కోప◆మున వచింత్రు
ధర్మరాజుతోడఁ ◆ దద్భటుల్ పాపులు, సలుపుదురితములను ◆ సారెసారె. 152
సీ. ఆపాపు లెంతయుఁ ◆ బాపపుఁజాట్కులఁ దిలకించువారలు ◆ దిరుగుడువడు
మనము గలార లొ◆టను దుష్టబుద్ధిగ,లా రౌట భీకరా◆కారము లయి
వరగుకోరలు ముడి◆వడు బొమల్ భయమును, బుట్టఁజేయుకరాళ◆ముఖము వక్ర
మైనదృక్కును బిరు◆సగుచు నిక్కినవెండ్రు,కలు బారుగడ్డము ◆ గదలు పెదవు
ఆ. లాఱుమూళ్ళ చేతు◆లాయుధములును దండము లులాయవాహ,◆నమును నంజ
నాద్రి నలుపు దేవ◆తాద్రితనువు రక్త,మాల్య వస్త్రములను◆మహితక్రుధయు. 153
తే. మేఘగర్జనభాషలు ◆ మిణుగురుఁలను, గ్రక్కుచును దిక్కు లదరఁగ ◆ నుక్కుమిగిలి
మూఁడులోకములను మ్రింగ◆మూర్తిదనరు,వానిఁగాఁ జూతు రా సమ◆వర్తి నెదుర.
ఉ. ఆ యమునాజ్ఞచే సకల◆ప్రాణులనెల్ల హరించు మృత్యువుం
బాయనియగ్ని తేజమునఁ ◆ బ్రబ్బి వెలింగెడి కాలపూరుషుం
డేయెడ మారినాఁ బరగ ◆ నీగు భయంకరమైనశక్తి సం
ఖ్యాయుతముం బ్రజావలికి ◆ నాపద నిచ్చెడి కాళరాత్రియుం. 455
తే. పలువిధంబుల భయమును ◆ గలుగజేయు,నట్టి కష్టాధిదేవత ◆ లధికమైన
రోగములుమూర్తిమంతులై ◆ రూఢిమెరసి,కొలువ వైవస్వతుఁడు కొల్వు◆కూటమందు.
సీ. శక్తిశూలము నంకు◆శము చక్రఖడ్గపా,శములను నాయుధ◆చయము ప్రాణ
బాధల నొనరించు ◆ బాణము ల్విండ్లును, ధరియించి చెలఁగు కిం◆కరులచేత
వజ్రదండములను ◆ వరుసగాఁ బూని పార్శ్వములందు నిలిచిన ◆ భటులచేత
పటుపరాక్రమ బాహు◆బలమునఁ గాటుక,కొండలఁబోలి యు◆ద్దండగతుల

తే. నల్లగా నుండుదేహము ♦ తెల్ల నాయు,ధములఁ జేఁబూని క్రూరులై ♦ తనరుచుండు
పరిజనంబులు సేవింపఁ ♦ బ్రబలి చిత్ర,గుప్తుఁడును గానఁబడునట్టి ♦ కుపితులకును.

క. అటుఁ గానవచ్చు శమనుఁడు, కుటిలుల బెదరింపుచుండుఁ♦గోపముతోడన్
బటు సద్గుణసంపదలను, జటిలుండగు చిత్రగుప్త♦ సన్మార్గమునన్. 158

వ. ధర్మవాక్యములుగా నా పాపకర్ములకు బోధించున దెట్లనన. 159

## సమవర్తి పాపకర్ముల మందలించుట.

ఉ. మీరలు పాపకృత్యములు ♦ మిన్నక చేయుచు నన్యవస్తువుల్
వారక లాగి మీ రితర♦భామలఁ గూడిన దోష మెందు పో
దూరక యం చెఱుంగరొకో ♦ యొప్పిదమై తగునంతశిక్షకున్
జేరితి రింక మీరు నవి♦చెందక రిత్తగఁ బోవనేర్చునే. 160

ఆ. అల్పసౌఖ్యమునకు ♦ నాసించి చేసిన, పాపకర్మములకుఁ ♦ బాలువడితి
రింక కింతదుఃఖ♦మేల చేసినదాని, ననుభవింపవలయు ♦ ననుచు మఱియు. 161

చ. కనుగొనుఁ డీధరాపతులు ♦ గర్వబలంబునఁ గ్రూరచిత్తులై
మునుకొని చేయు పాపముల♦ మున్ని భయంబున మా సమక్షమం
బున కిటు లీడ్చి తేఁబడుట ♦ మోదుచుఁ గింకరులంచు రాజులం
గని యిటుఁ బల్కు కోపమునఁ ♦ గాలునిసన్నిధిఁ జిత్రగుప్తుఁడున్. 162

సీ. అస్థిరమైన రాజ్యము నమ్మి మితిలేని,యాసచేత ననేక♦దోసములను
జేయుచు న్యాయ మ♦న్యాయవిచక్షణ, లేక యక్రమముగాఁ ♦ దేకువ సెడ
మనుజుల దండింపు♦చును స్వప్రయోజన,మునకు నపేక్షించి ♦ భువినిఁ జెడుగు
పను లవలంబించి ♦ జనులను హింసించి,నందున ఫలము మీ ♦ రనుభవింప
తే. వలసియార్జించినట్టి ద్రవ్యమును బరిజ,నముల నాప్తుల బంధుజా♦లముల సుతుల
వెంటఁదోచుకొనిరా కిట ♦ నొంటరులయి, కింకరులచేత జిక్కి దుః♦ఖింప నేల. 163

ఆ. అటుల ధర్మరాజు♦నాజ్ఞ ధరించిన, చిత్రగుప్తువలనఁ ♦ జెప్పఁబడిన
వారలగుచు వారి♦పాపముల్ దలఁచుచు, నూరకుండు రేమి ♦ మారులేక. 164

సీ. రవిసుతుం డంత నా♦రాజుల దోషకృ,త్యములు విచారించి ♦ తగినశిక్ష
లను విధింపుచు దూత♦లను గని చండప్ర,చండమహాచండ♦దండిమగలు
పేర్వేరువరుసగాఁ ♦ బిలిచి వీరలఁ దోడు,కొనిపోయి నరకము ♦ లనెడి మందు
వీతిహోత్రునియందు ♦ వేల్చుఁ డనంగఁ ద,త్క్షణమె వారలకడ♦ గాళ్లు పట్టి
ఆ. త్రిప్పి త్రిప్పి పైకి ♦ దీవ్రముగా నెగ,వేసి ప్రాణములును ♦ బాసిపోక
మునుపె పట్టిచేత ♦ మోదుచు నెఱ్ఱగాఁ బండఁగాలినట్టి ♦ బండలందు. 165

తే. వృక్షములఁ గొప్పవాయువు♦వీచియూచి, విఱుఁగద్రోచెడువిధమున♦ వ్రేయుచుండ
దూట్లువడి దేహములను నెత్తురును గ్రక్కు,చుండి పరవశులగుదురు♦ గుండెలదర.

క. అప్పుడు చల్లనిగాడుపు, జొప్పడి మేనులను దగుల ♦ సోలుచు నంతన్
దెప్పిరిలి లేవగడగుదు, రప్పగిదిని బాపకర్మ ♦ మంతయు నడపన్. 167

ఆ. అమ్మలార! పూర్వ♦మజునిచే నిర్మింపఁ, బడిన నారకములు ♦ బహువిధములు
గలవు వేలువేలు♦గా వాని నన్నిఁటి, దెలిపెదము వినుండు ♦ ధీరమతిని. 168

క. ఇరువదియెనిమిదికోట్టుల, నరకంబులు గలవు యముని♦నగరమునందున్
మఱి నేడవకోటికి దుద, నరయఁగ నొకకోటి ఘోర♦యనునరకంబుల్. 169

తే. కల వవియు నంధకారమై♦కలుషమతులఁ, ద్రోయుచుందురు♦ వానికిఁ దుదసుఘోర
యంత నతిఘోర దానిపై♦నలరుచుండు, దానిపైని మహాఘోర♦తనరు మిగుల. 170

వ. మఱియు నీనాలుగింటికిఁ గ్రింద నైదవయది ఘోరరూప యనఁబడును. ఆఱు, యే
డెనిమిది, తొమ్మిది, పది, పదునొకండు, పండ్రెండునయిన తరళ, తార, భయా
నక, కాళరాత్రి, భయోత్కట, చండ, మహాచండ, కోలాహల, పదమూడవది
నరకకోటిలో నధికమై ప్రచండ యనఁబడును. దానికావల కరాళ విరాళాదులు,
ఆఱు నరకకోట్లు గలవు; ఇరువదవది వజ్ర, దాని కావల నెనిమిది నరకకోట్లుగలవు.
అవి క్రమముగాఁ ద్రికోణ, పంచకోణ, సుదీర్ఘ, పరివర్తుల, సప్తభౌమ, అష్టభౌమ,
దీప్త, మాయ లనంబడును. ఇట్లు క్రమముగా నిరువదెనిమిది నరకకోట్లు గలవు.
అవి మిక్కిలి క్రూరములు, భయంకరములు. పాపులకు యాతనను గలుగఁజేయు
నవియు నైయుండును. 171

ఆ. అట్టినరకకోటు ♦ లన్నిటి కొక్కొక్క, దాని కైదు నైదు ♦ తగఁబ్రధాన
ములుగఁదనరునవియుఁ♦దెలియఁగ నెఱిఁగింతు, మమ్మలార! వినుఁడు♦సమ్మదముగ.

వ. అందుమొదటిది రౌరవము, దానదేహధారు లేడ్చుచుందురు. రెండవదిమహారౌరవము.
అందుఁ బ్రాణులు మిక్కిలి యేడ్చుచుందురు. మూఁడవది తమము. నాలుఁగవది
శ్వేతము. అయిదవది యుష్ణము. ఇదేవరుసగా సుఘోరము, సుదమము, తీక్ష్ణము,
కర్మసందీపనము, శరము, మహామాయము, అతిరోమము, సుభీమము, సంకటము,
తీవ్రవేగము, కరాళము, విరాళము, ప్రకంపనము, మహాపద్మము, సువక్త్రము,
కాలసూత్రము, ప్రతర్ధనము, సూచీముఖము, సునేమి, ఖాదనము, సుప్రదీపకము,
కుంభీపాకము, సుపాకము, కూపము, అతపదారుణము, అంగారరాశము, అసు
క్ప్రాయభవనము, హ్రదకము, విణ్మయము, తుంది, శకుని, మహాసంవర్తకము,
క్రతువు. సప్తజంతువు, పంకలేపము, పూతిమాంసము, ఆద్రవము, ఉచ్ఛ్వాసము,
నిరుచ్ఛ్వాసము, సుదీర్ఘము, కూటశాల్మలము, అరిష్టము, సుమహానాదము, ప్రభా
వము, సుప్రతాపనము, ఋక్షము, రజము, వృకము, శల్యము, సింహము,
వ్యాఘ్రము, మృగాదనము, సూకరము, శ్వానము, మహిషము, వృషము,
మేషము, ఖరాననము, గ్రాహము, కుంభీరము, నక్రము, సర్పము, కూర్మము,
వాయసము, గృధ్రము, ఉలూకము, జలూకము, శలూకము, కపి, కర్కటకము,
గండకము. పూతివక్త్రము, రక్తాక్షము, పూతిమృత్తికము, కణధూపము, తుసాగ్ని,

క్రిమిభోజనాన్నిచయము. అమేయము, అప్రతిష్ఠము, రుధిరాన్నము, శ్వభోజనము, లాలాభక్షణము, ఆత్మభక్షణము, సర్వభక్షణము, సుదారుణము, సంకటము, సువిశాలము, వికటము, కంకటము, పురీషము, కటాహము, కష్టమైన వైతరణీనది, సుతప్తము, లోహశంకువు, విష్ఠాపూయ ప్రపూరణము, ఘోరమైనశితాలవనము, అసిభంగపీడనము, సీలాయసేక్షుయంత్రముల, కూటపాశప్రమర్దిని, మహాచూర్ణి, సుచూర్ణి, తప్తలోహమయము, పర్వతము, క్షురధార, మలపర్వతము, మూత్రకూపము, విష్ఠాకూపము, అంధకూపము, పూయకూపము, శాతనము, ముసలము, ఉలూఖలము, యంత్రము, శిలాశకటము, లాంగలి, తాళపత్రాసిగహనము, మహామశకమండపము, సమ్మోహనము, అతిభంగము, తప్తశూలమయము, గదము, బహుదుఃఖము, మహాదుఃఖము, కశ్మలము, శమలము, మలము, హాలాహలాదికూపము, భీమకూపము, యమానుగము, ఏకపాదము, ద్విపాదము, త్రిపాదము, చిరంతమము, అను నిన్నూటనలుబది మిగుల గొప్పవియు నొక్కొక్కకోటి కైదేసి చొప్పున నేర్పడియున్న నరకములు. 173

ఆ. అగ్నియందుఁ దప్త ♦ మగులోహపాత్రల, తెఱఁగు నాటనలువ♦దినరకములఁ
బడిన దుష్టమతుల ♦ పాపపుంజంబులు, కాలి శుద్ధు లగుచుఁ ♦ గర్మఫలము. 174

సీ. భుక్తమొందుటకుఁగా♦భూమిశరీరధా, రణు లయ్యు మొదలను ♦ దృణము వృక్ష
జాలము లాదిగా ♦ స్థావరంబులఁబుట్టి, యందులదుఃఖము ♦ లెందుచుండి
యవల కీటకముల ♦ నాదటఁ బక్షుల, పిమ్మటమృగములఁ ♦ బిదప గోవు
లై జన్మముల నంది ♦ యాయాఫలంబుల, ననుభవింపుచు నంత్య♦మున మనుష్య
తే. జన్మ మిట్టుల క్రమముగా ♦ సంభవించు, దీనిలో భంగపడిరేని ♦ తృణములందు
మరలఁ జేరుచునుందురు ♦ మాకు నచట, గానుపించిన విన్నసం♦గతులు మీకు.175

ఆ. తల్లులార! మేము ♦ తగఁదెల్పినవిగాక, కలవుకొన్ని వాని♦గణన సేయఁ
జాల మిట్టి నరక♦సరణి పాపుల కగు, పుణ్యుల కవి యొందుఁ ♦ బొసఁగ వమ్మ,176

చ. అన నిటు తల్లులుం బలికి ♦ రానరకంబునఁ గల్గుబాధలున్
వినుటయు చాలు మాకు నవి ♦ వీనుల సోకినయంత దేహముల్
వణకఁగ భీతి చిత్తముల ♦ బొల్పడి మార్పునుగాక మా తలం
పున కవి రాఁగ రోమము ల♦మోఘములై కడు నిక్క నొప్పెడిన్. 177

ఆ. యమునిపట్టణమున ♦ కరిగెడిపాపుల, మార్గములను విన్న మా ♦ యసురులు
కంఠగతము లగుచు ♦ ఘనతాపమొందఁగాఁ, దోచకున్నదెటుల♦దుహితలార! 178

క. అని యీవిధనఁ దల్లులు, మనమున దిగులొంది పలుకు♦మాటలు కన్యల్
విని వారిని నోదార్చుచుఁ, గనికరముగఁ బలికి రెంతొ ♦ గౌరవమెసఁగన్. 179

చ. ఇతరులువోలె లో వెరపు ♦ నేటికిఁ జెందఁగ మీరు బుణ్య మం
చితమతిఁ జేసినా రటులఁ ♦ జేయుట యుత్తమమైన భారత

క్షితి నతిదుర్లభం బనఁగఁ ♦ జెల్లిన మానవదేహ మూనినా
రతిసుకృతంపుఁగల్మి నరుఁ♦డై జనియించును జీవుఁ డిద్ధరన్. 180

వ. కావున. 181

సీ. వినుఁడు మాఘస్నాన♦మును జేయువారికి, నది దుర్లభము కాదు ♦ కొదువలేని
భోగముల్ ముక్తియుఁ ♦ బొసఁగు నీలోకమం,దు భరతఖండము ♦ శుభము లొసఁగు
నిది కర్మభూమి తా ♦ నితరఖండములు భో,గపుభూము లని పల్కఁ♦గఁబడునిందు
మానుసులు తపములు స♦త్పురుషులు యజ్ఞముల్, వ్రతములు దానము ♦ లతులితముగఁ
తే. జేయుచును స్వర్గభోగముల్ ♦ సెందుచుందు, రితరఖండములందుఁ దా♦నిటులఁగాదు
మఱియుఁ గొందఱు పుణ్యులు ♦ మాఘమాస,మందును జలావగాహన ♦ మమలబుద్ధి.

తే. తనరువారును దపముల ♦దానములను, వ్రతములను యజ్ఞములు సేయఁ♦బరగువారు
తగిన కర్మానుసారులై ♦ ధాతవఱ్ఱి, దేవమనుజత్వముల గాంత్రు ♦ ధీరమతిని. 183

సీ. కావున నన్నిఁటఁ ♦ గడు శ్రేష్ఠమైన యీ, భరతఖండమునందుఁ ♦ బ్రాణిచయము
లస్థిరంబైన దే♦హముల మానుషజన్మ, మొంది తపస్సిద్ధి♦నొంది వారల
మోక్షానుకూలుఁడై ♦ పోవు నెవ్వండైనఁ, దపము సేయనివాని ♦ కెపుడు మంచి
కలుగ దట్టుల మను♦ష్యులు విప్రకులమున, జనన మొందియు మోక్ష♦సాధకమగు
తే. తపముమానుటకంటెఁ బా♦తకము లేదు, అట్టిపతితులు నరకసం♦ప్రాప్తులగుచు
సకలయోనులఁ బుట్టుచుఁ ♦ జచ్చుచుండి, మనుజులై పుట్టుచుందు రీ♦మహిని దుదకు.

ఆ. అట్టి మనుజజన్మ♦మందునఁ దపమాచ,రించినట్టులైనఁ ♦ ద్రిదివమునకుఁ
బోవఁగలరు పాప♦ములు సేయ నరకము, నందు దుఃఖములను ♦ జెందఁగలరు. 185

సీ. మఱి యీ భరతఖండ♦మహిమ వినుఁడు దేవ,తలు దీనియందునఁ ♦ దగ జనించి
మాఘమాసమున నే♦మరక వేకువ లేచి, పురివెల్పలను నుండు ♦ పుణ్యజలము
లందు సుస్నానమిం♦పొందఁగాఁ జేసెడి, భాగ్య మెన్నఁటికి సం♦ప్రాప్తమగునొ
భరతవర్షమునందుఁ ♦ బ్రభవించినా కాది, సౌఖ్యములను జెంద,♦ సాధకమగు
తే. మనుజదేహము లొందుట♦మనము సెప్ప, డెఱుఁగ మైత్రిమియంబకా♦దింద్రియముల
స్వర్గమోక్షము గను మహా♦సత్పురుషులు, కోరుచుందురిందుజనించు♦కోర్కెలలర.186

మ. అనుచున్ స్వర్గమునందు నుండెడి సుపు♦ణ్యాత్ముల్ ధరం భారతా
ఖ్యను జెల్వొందెడి ఖండమందు నుదయం♦బౌవారి చారిత్రి కీ
రనలన్ నిర్జరు లెంతో పాడుదురు మీ♦రల్ భీతిని స్నాని హె
చ్చిన సమ్మోద మెలర్ప ధర్మముపయిన్ ♦ జిత్తంబు జేర్పందగున్. 187

ఆ. ధర్మహీనులయ్యు ♦ దారిబత్తెము లేక, యధికదుఃఖమంది ♦ యముని పురికి
నరుగువారు పాపు♦ లగుదురు పుణ్యులు, సర్వసౌఖ్యములను ♦ జనుదు రటకు. 188

క. ఇది మదినిఁ దెలిసి మనుజుఁడు, పదపడి దోషముల నెల్ల♦భంగుల నెపుడున్
వదలుచు ముక్తిప్రదమై, యొదవెడు పుణ్యమును జేయు♦టొప్పును భువిపై. 189

ఉ. ఏనరుఁడైన సద్గతికి • నేగును బుణ్యముచేత దోష మిం
పానఁగఁ జేయ దుర్గతికిఁ • బ్రబ్బిన ఖేదముతోడఁ బోయెడిన్
గాన హరిన్ మదిం దలఁపఁ•గాఁ దగువారలు నారకంబులం
గానక మోక్ష మియ్యఁదగు • కంజదళాక్షుని జేరుచుండెడిన్. 190

తే. మోక్షమునయందు మీకు న•పేక్ష యున్నఁ, దనకు మిన్నగు వస్తు వెం•దునను లేక
సచ్చిదానందరూపమై • చాలఁ దనరి, యుండు నారాయణునిసేవ • నొప్పిదమగు.

ఉ. స్థావరజంగమప్రకర•జాతి ప్రపంచము అస్థిరంబులై
పోవును మించులట్ల కడు•బుద్ధిని సంపద నమ్మి గర్వియై
యేవిధ ముండఁగూడ దిఁక • నిట్టిశరీరము వంటి మృత్యువే
చావునకీడ్చు నిబ్రతుక•శాశ్వతమై తనరారు నెంతయున్. 192

సీ. ధనము రాజులచేతఁ • దగులును సంపద, క్షణకాలమందు నా•శనము నొందు
నదిగాక జీవించు•నట్టికాలములో స,గము నిద్రచేతను • గడచిపోవు
నిలిచినదానిలో•పల భుక్తికొఱదలైన, పనులచే నొకకొంత • పాసిపోవు
పదపడి మఱికొంత • బాల్యవార్ధకములు, మంచిచెడ్డలు మది•నెంచలేక
విషయానురక్తియై • విస్తరింపుచు మిగి,లినకాలమంత నా•శనము నగును
తే. గాన మీ కిందులో ధర్మ•కాల మెద్ది, బాల్యవార్ధకదశలలోఁ • బరమపురుషు
భక్తి గలుగదు యౌవనం•ప్రాయముననె, హరిని సేవింపవలయు మా•యమ్మలార! 193

ఆ. అహము విడిచి భయద•మై యొప్పు సంసార,పాపకూపమందుఁ • బడక హరిని
దలఁపవలయు నిట్టి•తనువు దుఃఖములకు, మూలమై నశించు • మొదటికంట. 194

మ. మలమూత్రాదులతోడ రోత యగుచున్ • మాత్సర్యసంయుక్తవ్యా
ధులచేతన్ బహుపీడలం దనరు నెం•దున్ జూడ నీ దేహమున్
చలనంబై చెడిపోవు దీనికయి దో•షవ్రాత మాసక్తితో
తెలయం జేయఁగ నేల శ్రీహరిని సే•వింపందగున్ భక్తితోన్. 195

ఉ. సారము లేని సంసరణ•సాగరమందునఁ గూలి చాల వే
సారుచుఁగర్మబంధములఁ • జచ్చుచుఁ బుట్టుచు నుండ నేల? వి
స్తారసుఖాస్పదుం డయిన • సారసనేత్రుని పాదపద్మముల్
వారక పూజ చేసినను • వాంఛితముల్ సమకూర్చు నెంతయున్. 196

సీ. బంధువులార! మా•పలుకులాలింపుఁ డీ, దేహ మస్థిరమైన•ది హరిపూజ
సలుపవలయు చరాం•చరరూపముల సహ,స్రములకోటు లనేక•జన్మలెత్తి
మనుజజన్మము ప్రయా•సను గల్గినందుకు, దనుజారిపూజలు • దానములును
సలుపుటయును నా•సక్తి యోగాభ్యాస,మును జేయవలె నను • బుద్ధి నెరప
ఆ. పూర్వజన్మకర్మ•పుణ్యఫలంబునఁ, గాని యితరమేమి • గాదు మనుజుఁ
డగుచు హరిని మఱని • ధ్యానింపకుండిన, తనను దాను జంపు•కొనినపాపి. 197

ఆ. అవును మీకు హితవు ♦ లగువాక్యములు చెప్పెదను వినుఁడు కపట ♦ దంభ మోర్వ
లేనితనము హాని ♦ దానములను విష్ణుభక్తి సలుపుఁ డింక ♦ పలువిధముల. 198

సీ. సకల మిచ్చెడివాఁడు ♦ సర్వలోకములకుఁ, బ్రభు వైన శ్రీహరి ♦ పాదపూజ
సలుపక ఘోరసం ♦ సారాబ్ధి మునిఁగిన, వారు నేనిధి దరిఁ ♦ జేరఁగలరు
వేయుమాట లిఁకేల ♦ వినుఁడు యాగముల వే, దముల తపస్సుల ♦ దానములను
ఫలమేమి హరికీర్త ♦ నలు వినుఁడు సుతులు, భార్య మొదలగు నీ ♦ పనులవలన

ఆ. ముక్తిలేదు మీకు ♦ మోక్షేచ్ఛ గలదేని, భయము విడిచి విష్ణు ♦ భక్తి గలిగి
మలినరహిత మైన ♦ మహితసాలగ్రామ, జలముఁ గ్రోలుచుండు ♦ నలయు నెపుడు. 199

క. గరుడధ్వజువాసరముల, మఱువక యుపవాసములను ♦ మకరమునందుం
దరణి వసించినదినముల, నరుణోదయవేళ జలక ♦ మాడుట యొప్పున్. 200

సీ. పతిని సేవింపుచుఁ ♦ బరగ నేకాదశీ, వ్రతము సల్పుచుఁ బ్రతి ♦ వత్సరమును
మాఘమాసమునందు ♦ మకరరాశిని సూర్యుఁ, డుండుదినమ్ముల ♦ నుదయకాల
మున నూరిబైటిచ ♦ ల్లనినీట దోఁగుచు, హరినిఁ బూజింప మీ ♦ కట్టినరక
బాధలు లేవని ♦ వారితల్లులకును, గన్యకలు సువృత్త ♦ కమల సురస

ఆ. విమల తెలిపినట్టి ♦ యమపురికష్టదుః, ఖంబు లన్ని దెలిసి ♦ కలకఁ దేరి
సకలధర్మములను ♦ స్నానాదివిధులను, సలుపుచుండి రధిక ♦ సమ్మదమున. 201

తే. అతులసమవర్తిలోకవృ ♦ త్తాంతమెల్ల, తెలియఁ జెప్పితి నీమది ♦ తేటపడఁగ
మాఘమకరమునందు నే ♦ మనుజుఁ డైన, శీతజలమజ్జనమ్ము సం ♦ ప్రీతి నాడ. 202

చ. మనుజవరేణ్య! కల్పకసు ♦ మంబుల దేహ మలంకరింపఁగాఁ
గనకపుబొంగరంపుగవ ♦ గాంతుల వట్రువలౌ కుచద్వయిన్
అనుపమలీల స్వేచ్ఛ మెఱ ♦ యన్ సురనందనకాననంబులో
ననయము క్రీడల న్మరిగి ♦ హాయిగ నందుదు రెల్లసౌఖ్యముల్. 203

పుష్కరుఁడు నాగకులను నరకమునుండి విడిపించుట.

చ. అనిన వశిష్ఠుతో నిటుల ♦ నా జననాథుఁడు పల్కె భూమికిన్
మునివర! భానునూనుపుర ♦ ముం దగ నెన్బదియారువేల యో
జనముల దూరముం దనరి ♦ చాలవిఘ్నంబులఁ దోచునంచు నే
ననువుగ వింటి మీవలన ♦ నం దొకసంశయ మొందె నామదిన్. 204

ఆ. బాలికలు శమనుని ♦ పత్తనమున కెన్ని, దివసములకు నేగి ♦ తిరిగివచ్చి
రట్టి కన్నియలకు ♦ నైన శరీరము, లెట్లు నిలిచెఁ బుడమి ♦ నెఱుఁగఁ జెపుమ. 205

క. అనునట్టి యాదిలీపునిఁ, గనుఁగొని మునిచంద్రుఁ డధిక ♦ కరుణ దలిర్పన్
విను మిది పరమరహస్యము, వినుపించెద నృపవరేణ్య ♦ వివరముగాఁగన్. 206

క. నలుబదిదినములు కృతయుగ, మలవడు ముప్పదిని, త్రేత ◆ నటు ద్వాపరమం
దున నిరువది కలిఁ బదిదిన, ములనరకుం జెందు శవము ◆ భూపవతంసా. 207

తే. మొదటియుగమున నాలుగు ◆ బిడ పళెంట, మూఁడు మూఁటను రెండు నాఁ ◆ బొదలు నాలు
గింట నొకపాలు జనులకు ◆ నంటియుండు, బుద్ధికుశలత నిటులను ◆ బుద్ధి వినుము.

తే. మృతినిజెందిన వెనుకఁ బం ◆ డ్రెండుదివస, ములకు నరుగు జీవుఁడు యమ ◆ పురమున కని
బుధులచే నెన్నఁబడు నిట్టి ◆ విధము లరయఁ, బాపులకుఁ గాని పుణ్యుల ◆ పట్ల కాదు.

క. మిక్కిలి గోప్యముగల దిం, కొక్కటి వృత్తాంత మదియు ◆ నొప్పిదనుగు నీ
వక్కరగ వినుము దానిని, జక్కఁగ వినుపింతు మదికి ◆ సమ్మద మొదవన్. 210

సీ. యమునిదూతలు మారు ◆ తము విధంబున వచ్చు, చును బోవుచుందురు ◆ జనులకొఱకు
నటువలెనే ప్రాణు ◆ లందంద పాపపు, ణ్యములచేఁ దారత ◆ మ్యములు గలిగి
సమవర్తి పరమేష్ఠి ◆ శంకర హరిలోక, ముల కేగుదురు కన్య ◆ కలు శమనుని
కరుణచే నటు గల్గు ◆ నరకములను బాపు, లనుభవయాతనల్ ◆ గని మరలిరి
బాలికలు కృతాంతు ◆ పత్తనమున కేగ, మరలివచ్చునంత ◆ వరకుఁ ద్రిదశ
దివసములును వారి ◆ దేహముల్ తల్లులు, కాచియుండి రేమి ◆ కష్టమనక. 211

క. అది కృతయుగ మైనందున, పదపడి దేహంబు లంత ◆ పర్యంతంబున్
జెదరక యుండెను నిది నీ, మది నెఱుఁగుము భానువంశ ◆ మండన! భూపా! 212

ఆ. నాల్గు కృతయుగమున ◆ నలువొప్ప మూఁడు త్రే, తాయుగమున రెండు ◆ ద్వాపరమున
కలియుగమున నొకటి ◆ కల బుద్ధికుశలత, భాగనిర్ణయంబు ◆ ప్రజల కగును. 213

ఉ. ప్రాణము దేహమందు నెసెఁ ◆ బాసిన దేహ మలంకరింపకే
దానికి నంటు చేరితమును ◆ బాఱొన దేమియు మాఘమాసమం
దేనరుడుం బ్రభాతమున ◆ నింపుగ స్నానము దేవపూజలుం
దానము విష్ణువాసరవ్ర ◆ తంబును జేసినపుణ్యమూలమే
పూనిక కల్గి యాపగిదిఁ ◆ బోవుచు వచ్చుచు నుందు రెల్లెడన్. 214

సీ. అన్నిఁటికిని బుణ్య ◆ మగు కారణము విను, పూర్వకాలమునందు ◆ పుష్కరుఁ డను
విప్రుండు యమపుట ◆ భేదనంబున కేగి, యచట పాపుల కగు ◆ నట్టి నరక
బాధలచేఁ బడు ◆ పాట్లను దొలఁగించి, భూమికి నరుదెంచి ◆ భూసురుండు
తనయింట సుఖముగాఁ ◆ దనరుచునుండె త్రే, తాయుగంబున రామ ◆ ధరణివిభుఁడు

ఆ. భూమి నేలుచుండ ◆ భూసురతనయుఁడు, తనువు విడిచి యముని ◆ ధామమునకు
నేగి మరల బ్రతికి ◆ యేతెంచె నతనికి, నీచరిత్ర నీవు ◆ నెఱుఁగుదుకద. 215

తే. వృష్ణివంశాబ్ధివిధుఁడు శ్రీ ◆ కృష్ణమూర్తి, తనగురుఁ డగు సాందీపుని ◆ తనయుఁడు నది
మొసలిచే మ్రింగఁబడి యమ ◆ పురికిఁ బోవ, నావలను బహుదినములు ◆ నైనపిదప.

ఆ. అట్టిచిన్నవాఁడు ◆ నా యమలోకము, నందు నుండఁ దెచ్చి ◆ యధికభక్తి
దనర గురువునకును ◆ దక్షిణగా నిచ్చె, వీరు గాక నేక ◆ విబుధవరులు. 217

వ. ఆసమవర్తిలోకమునకుఁ బోవుచు మఱల వచ్చుచున్నారు. కావున కన్యకలరాకకు సంశయింపఁ బని లేదు. నీ కిం కేమికోరిక గల దడుగు మనుచున్న మునీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. 218

సీ. ఎవఁడు పుష్కరవిప్రుఁ◆డెచటనుండెడివాఁడు, వృత్తినొందియమపురి◆కెటులఁబోయె
నతనిచే నరకమా◆లందుండుపాపులు, గృప నెట్టులుగ నుద్ధ◆రింపఁబడిరి
దశరథాత్మజప్రభు◆త్వపువేళ బ్రాహ్మణ,సుతుఁ డెట్టు మృతిఁజెంది ◆ బ్రతికివచ్చె
నక్రగర్భమున జీ◆ర్ణంబైన గురుపుత్రుఁ, గృష్ణుఁ డెట్టుల బ్రతి◆కించి తెచ్చె
ఆ. నేమికారణమున ◆ నీవిప్రతనయుని, మొసలి మ్రింగ నిట్టి ◆ మూఁడుప్రశ్న
లకు సమగ్రముగను ◆ బ్రకటించు మను రాజుఁ, గని వశిష్ఠుఁ డిట్టు◆లనియె మఱల.

ఆ. బహువిధంబులైన ◆ పాపము లణఁపఁగఁ, జాలినట్టి బ్రహ్మ◆జాతుఁడైన
పుష్కరాఖ్యపుణ్య◆పురుషునిచరితము, వినుము హెచ్చరికగ ◆ నినకులేశ. 220

క. నందిగ్రామమునందునఁ, బొందుగఁ బుష్కరుఁడు నాఁగ◆భూసురుఁడు మహా
నందములో నిలిచెను నే, సందియమును దోచనట్టి ◆ స్వాంతుండగుచున్. 221

మ. సరవిన్ విప్రుఁడు చేయఁగల్గిన యను◆ష్ఠానాదికృత్యంబు ల
క్కరతోఁ జేయుచు నెల్లవారలయెడన్ ◆ గారుణ్య మొప్పార సు
స్థిరతన్ వేదములం బఠించుచు మహా◆శీలత్వముం బొందిపు
ష్కరమాణిక్యము నక్రమంబుఁ జొర మా◆ఘస్నానముల్ సేయుచున్. 222

చ. ఇతరము మాని మానసము ◆ నెల్లవిధంబుల విష్ణుమూర్తిపై
చతురత నిల్పి పూజలను ◆ సల్పుచు శ్రౌతకృశానులన్ సదా
మతి నలరంగ వేల్చుచును, మాధవ! శ్రీహరి! కృష్ణ! యిందిరా
పతి! పరమేశ! భక్తజన◆పాలన! యంచు హరిన్ స్మరింపుచున్. 223

సీ. అతఁడు కుటుంబికుఁ ◆ డయ్యుఁ గలనునైన, జిత్త మితరములఁ ◆ జేరనీక
వర్తింపుచుండ నా◆వైవస్వతుఁడు నొక, దినమందు భటులతో ◆ ననియె మీరు
పోయి నందిగ్రామ◆మున నుండువిప్రుఁబు,ష్కరుని దెమ్మన భువిఁ ◆ గరుగుదెంచి
యాపుష్కరునిఁబట్టి ◆ యాసునఁ గొంపోయి, యినసుతుముందర ◆ నునుప నతఁడు
ఆ. బ్రహ్మతేజుఁడైన ◆ బ్రాహ్మణు నిండారఁ, జూచి భయము గదుర ◆ లేచి యెదురు
నడచి గొప్పజేసి ◆ నయముగఁ గొంపోయి, తనదుగద్దె నునిచి ◆ ధర్మరాజు. 224

క. తనకింకరులను గనుగొని, కనలుచుఁ దల యూచి కన్నుఁ ◆ గానక యాయా
ర నిదే పేరును గలయా,తని దెమ్మన నీమహాత్ముఁ ◆ దగఁ దెచ్చితిరో. 225

ఉ. ఈయన ధర్మపద్ధతుల ◆ నెల్ల గ్రహించిన విష్ణుభక్తుఁడున్
బాయక మాఘమందునఁ బ్ర◆భాతపువేళను తాన మెయ్యెడం
జేయుచునుండు నీసుగుణ◆శీలుఁడు శ్రీహరివాసరవ్రతుం
డీయెడ కేల తెచ్చితిరి ◆ యిట్టి మహాత్ముని బాపచిత్తులై. 226

చ. అని యిటుఁ బల్కుచుం భటుల • నట్టె యదల్చుచుఁ బుష్కరాఖ్యునిం
గని వినయంబుమీర నిపుఁ • గన్గొనఁజాలక తెచ్చి రింక నీ
తనయులు నాలు దుఃఖమునఁ • దాపము నొందుచు నుండఁబోలుఁ గా
వున నిటనుండి శీఘ్రముగ • భూమికి నేగు మటన్న విప్రుఁడుం. 227

తే. దైవరూపము గలుగు నోధర్మరాజ!, పాపు లగునట్టి వార లీ•పట్టునమున
యాతనాదేహములఁ బడి • యాతిబాధ, లనుభవించెడి నరకము • లన్నిఁ జూడ.

క. కోరిక గల దని విప్రుఁడు, సారమతిం బలుక యముఁడు • సదయుండగు నా
పాలున కగు నభిలాషను, దీరుప నరకములఁ జూపి • తెలిపెను వినుమా! 229

వ. అవి మిక్కిలిభయంకరమైన రౌరవము, మహారౌరవము, శ్వభోజనము, విశసనము, క్షార కర్దమము, ఘోరమైన అసిపత్రవనము, భీతిఁ గలుగఁజేయు కుంభీపాకము, క్రిమిశము, క్రిమిభక్షణము, వైతరణీనది, కరంభవాలుకము, లాలాభక్షణము, వీచిమత్తు, సూకరము, రోదనము, తప్తవాలుకము, మొదలైన నరకములు జూప వానియందు.

క. పాపులు తన్నరకములను, నేపు దరిగి దుఃఖజాల • మెసఁగగఁ గడుసం
తాపముఁ జెందుచు నతిగా, వాపోవుచుఁ బీడనొందు • వారలు నగుచుం. 231

సీ. కొఱ్ఱుల దిగవేసియు • ఘోషించువారును, పులులచేఁ గఱపింప • నలుక నొందు
వారు మరి కరంభ•వాలుక నరకము, లందుఁ బడి తపించు•నట్టివారు
తప్తకుంభములందు • తాప మొందెడివారు, పురుగులనే తినఁ•బోవువారు
కత్తులచేతను • ఖండింపఁబడువారు, నసిపత్రవనములఁ•యందు అంప
ముల గోయఁబడువారు • మోయుచు గొడ్డండ్లు, నుప్పుబురద యందు • నొప్పువారు
నున్నతస్థలములం•నుండి త్రోయఁగ బడు,వారును చలిచేత • వణఁకువారు

తే. యాతనాదేహముల నిటు•లన్నివిధము,లైన బాధల నలఁగెడి•యట్టివారిఁ
జూచి పుష్కరుఁడు మదిలో•శోక మొదవ, నారకులతోడఁ బలికెను•నయముమీర.

తే. పాపమతులార! తొల్లింటి•బామునందు, నించుకైనను బుణ్యంబు • నేల చేయ
మానితిరి తత్ఫలంబు సం•భవమునగుచు, యాతనాదేహముల దుఃఖ • మావరించె. 333

క. అన విని యోపుణ్యాత్మక!, యణుమాత్రంబైన ధర్మ • మవనినిఁ జేయం
గనులేక నరకములయా,తనపీడల నొందవలసెఁ • దగ మాకిచటం. 234

సీ. ఏ మొనరించు దుః•ష్కృతము లెల్లను నీకు, వినుపింతు నుపుడు త•ద్విధము దెలియ
పరకాంత లంటుట • పరధనములఁ గొంట, పరుల హింసింప నే • మెరుఁగనట్టి
వారిపై నిందలు • వదలక మోపుట, సద్బ్రాహ్మణుల గేలి • సల్పుటయును
ద్రవ్యమార్జింప వే•దంబు నధ్యయనంబు, జదివి చెప్పుట పరి•చారకులను

తే. పస్తుపడియుండ ముందుగ • వారికంటె, మంచిబోనము దినుటయు • మాఘమకర
మునను సూర్యోదయఁపువేళ • పురము బైటి, శీతజలముల స్నానంబు • చేయకునికి.

ఆ. వంట చేసికొనుట • వదలి సంఘాన్నముఁ, దినుట నగ్నిహోత్ర•దేవపూజ
విడిచి నీట దోగ•బడకయె భోజన, మింపుమీరఁ జేయ • నిటులఁగలిగె. 236

సీ. అంబువులను గోవ్రల ♦ నరిగెడిగోవుల, నడ్డగించుట మద ♦ మావరించి
స్వశరీరపోషణా♦సక్తిని బసులను, నీరు మేత నిడక♦క్షీరములను
బిండుక త్రాగుట ♦ విప్రులకును నాశ. కల్పించి తీర్పక ♦ కన్యల మయి
దానము ల్గొనుటయు ♦ దాతదాపున కేగి, యితరులకును దాన ♦ మియ్యకుండ
తే. విరివిగాఁ దెల్పుటయు శాస్త్ర♦విధి వివాహ, మైనభార్యను వదలుట ♦ నన్యపుణ్య
సతులఁ దగులుట,తప్పుసా♦క్ష్యము వలుకుట, స్నేహితులకేమికీడును♦జేయుటయును.

క. ఇచ్చినదానము మఱలం, బుచ్చుకొనుట దొంగిలింపఁ♦బోవుట మొదలౌ
కచ్చెపను లనేకములుగ, విచ్చలవిడి చేసినాము ♦ విమలచరిత్రా! 238
ఆ. వేయుమాట లేల ♦ విప్రేంద్ర! మత్కృత, మైన పాపపుంజ ♦ మావరింప
నీతిబాధలందు ♦ నీగుచునున్నార, మనెడివారిఁ జూచి ♦ యవనిసురుఁడు. 239

చ. పలికెను పాపులార! యిటు♦వంటి భయంకరమైన యాపదల్
కలుగుట కెప్పుడుం బరమ♦కారుణికోత్తముఁడైన శ్రీహరిం
దలఁపఁగఁ జాలరొక్కొ యమ♦దండనలోఁ బడి డస్సిబాధలం
గలిగెఁగదా జగత్త్రియముఁ ♦ గాచుచు నుండెడి భక్తవత్సలున్. 240

తే. పూజఁగావిందు నెవఁడు నా♦పుణ్యతముని, పాపమునశించి మోక్షసం♦ప్రాప్తియగును
గాన మాధవునకు నమ♦స్కారమైనఁ, దలచుగా మీరు గావించు♦టెఱుఁగఁబడదు.

తే. అటులఁగావున నే కూరిర ♦ మైన నరక, ములు తటస్థించె నడవులం♦దులను బత్రి
నదులలోఁ బరిశుభ్రమైన♦ నుదకంబు, గలను చేతులు కౌళ్ళు చం♦క్కగను గలుగ.
క. మీ రప్పుడు భగవంతుని, నారాధనఁజేయ కిప్పు ♦ డారాటముచే
నూరక మొర లిడనేల య, హోరాత్రములందు నెప్పు ♦ డోలినభక్తిన్. 243

ఉ. పాపములెల్లఁ బాపు భగ♦వంతుని బ్రార్థనచేయరేఁ డింక మీ
పాపములు న్నశించు నెడ♦బాయక యిచ్చట నిల్చి మీకు సం
తాపము పోవునంతకు ను♦దారమతిన్ హరి నేఁ దలంతు నా
రూపిన కిచ్చేఁ దగిన ♦ యోజనతో నఁట మీకు మేలగున్. 244

సీ. అని పల్కుచుండు బ్రా♦హ్మణుని మృదూక్తుల, నాలించి నారకు ♦ లనిరి నీదు
కాయముపై వీచు ♦ గాలి పాపులమైన, మాదేహముల సోఁకి♦ మలయమారు
తమువలెఁ జల్లనై♦ తాప మడంచెను, గావున నొకక్షణ♦కాల మైన
నుండుము సౌఖ్యము ♦ నొంద దుఃఖముచేతఁ, దపియించునట్టి పా♦తకుల మైన
మాకు నీదర్శనమున సం♦పదలు గలిగి, నంత సంతోష మొదవె నే♦మనఁగ నీదు
కరుణ దుష్టుల మైనమా♦కడ జనింప, నౌర యనుచుండ నపుడు నా♦నూరసుతుఁడు.

ఆ. ధర్మరతనముసఁ ♦ దనరు పుష్కరుఁ జూడ, నాయె నరకము లిఁక ♦ నరుగు భువికి
భార్య నీదుకొఱకు ♦ బహుదుఃఖవార్ధిను, గ్నాంగి యగుచు నుండె ♦ నడలుచేత. 246

మ. అనినం బుష్కరవిప్రుఁ డిట్లనియె న♦య్యా నేను భూలోకమం
దున కేరీతినిఁ బోదు నేగ సుఖ మం♦దుం గల్గునే కింకరుల్

మనమందున్ వ్యథ గల్గునట్లుగ వెసన్ ◆ వర్దింప దావాగ్నిలో
మునుఁగన్ వేయఁగ రక్షరక్ష యని పా◆పుల్ నన్ మొఱల్ పెట్టఁగన్. 247

సీ. కలుషాత్ము లగువారి ◆ పలుకులు వీనుల, ◆ దగులుచున్నవి విను ◆ ధర్మరాజ!
అన్నిభూతములందు ◆ నాత్మయై సర్వము, దానయై యంతటఁ ◆ దనరుచుండు
నారాయణుం డిప్డు ◆ నాచేత నేరూప,మునఁ బూజ వడయునో ◆ మోద మలర
తద్రూపమున వచ్చి ◆ తాప మొందుచు నిట్టి, నరకములం దుండు ◆ నారకులను
విడిచిపెట్టుకొఱకు ◆ విశ్వేశ్వరుఁడు భగ, వంతుఁ డింద్రరుద్ర◆బ్రహ్మ లెవని
పాదపద్మములకుఁ ◆ బ్రణతులు గావింతు, రట్టిలోకనాథు ◆ నాశ్రయింతు. 248

పంచ. హరీ! ముకుంద! వాసుదేవ! ◆ యచ్యుతా! జనార్దనా!
మురారి! కృష్ణ! యోగివంద్య ◆ మోక్ష మిచ్చువాఁడ! యీ
పరేతనాథునింట నిత్య◆బాధలొందు పాపులన్
బిరానఁ గావుమయ్య! శత్రు◆భీకరా! కృపాకరా! 249

వ. అని యివ్విధంబున. 250

చ. నరవర! పుష్కరుండు హరి◆నామముఁ బల్కుచునుండ నంతలో
నరకనివాసులై తనరు ◆ నారకులున్ విని తత్క్షణంబునన్
దురితము లగ్నిలోఁ బడిన ◆ దూదిక్రియన్ నశియింప వారు సు
స్థిరమతిఁ జెంది బ్రాహ్మణుని ◆ జేరి మనంబున సంతసింపుచున్. 251

సీ. నీయనుగ్రహమున ◆ నీయవస్థలు మాకుఁ, దొరగి మహాత్మ యీ◆దుష్కర మగు
నరకముల్ విడుమట ◆ నారాయణునిసేవ, గలుగుట కిదె మూల ◆ కారణంబు
గాన నెందుల కీడు ◆ గానిదై స్వచ్ఛమై, పరగు నీకీర్తి యీ◆ధరణి దివిని
వ్యాపించు ననిపల్కి ◆ యముఁడు నాశ్చర్యసం,తోషమగ్నాంగుఁడై ◆ దురితహరుని
బుష్కరాఖ్యపుణ్య◆పురుషుని గని నీకు, వరము లిత్తు భువికి ◆ నరిగి సకల
సంపదలను జెందు ◆ సావధానముగ నా, భయము నెందు లేదు ◆ భవ్యచరిత! 252

తే. నీకె కాదపమృత్యువు ◆ నీమిత్రు,లకును గలుగదు పొమ్ము నీ◆విఁక ననంగ
నవనిసురుఁ డప్పు డీభువి ◆ కరుగుదెంచి, భగవదారాధనల సుఖ◆పదవి నుండె. 253

సీ. భూమీశ! నీకు నే ◆ బోధించినట్టియీ, పుష్కరాభిఖ్యుని ◆ పుణ్యచరిత
మెవఁడు తలంప దుష్◆కృతములు వానికి, నశియించు హరికీర్త◆నములవలన
నరకములందుండు ◆ నారకుల్ విడుదల,యైనవృత్తాంతము ◆ నంత నీకు
నెఱుఁగఁజెప్పితిఁ గదా ◆ యీశ్వరుఁ దలఁచిన, ఫలము ప్రత్యక్షమై◆ పరగుచుండ

తే. భగవదారాధనము చేత ◆ పాపములును, దొలఁగునని వేఱుగా నిఁకఁ ◆ దెలుప నేల
వినుము రాముని రాజ్యమం◆దునను విప్ర,సుతుఁడు మృతినొంది బ్రతికిన◆కతఁ దెలిపెద.

## శ్రీరాముఁడు చచ్చిన బ్రాహ్మణకుమారుని బ్రతికించుట.

తే. సర్వశుభలక్షణములచే ◆ క్ష్మాతలంబు, నందు ముల్లోకముల నుతి◆నొంది భాను
వంశదీపకుచేతఁ ◆ బాలితమయి,యలరు నొక్కటె పుర మయో◆ధ్యాఖ్యతోడ.

సీ. అందురాఘవుఁడు రాజ్యము సోదరులతోడఁ, బాలింప నొకనాఁడు పాఱుఁడొకఁడు
మృతుఁడైన తనప్రియసుతుని రాజద్వారమునఁ బెట్టి యేడ్చుచు ముదముదక్కి
కొమరుఁడొక్కఁడె కాన కొడుక! కొడుక! యని, విలపించు చిట్టులఁ బలికె నేను
తొలిజన్మమున నెట్టి దుష్కృతములఁ జేసి, పాపినై తత్కర్మ ఫలమువలన
ఆ. నయిదువత్సరమ్ము లాయువుగల నీదు, చావు గనుట నాకు సంభవించె
నేను దుఃఖపడుట నిట్టి యకాలపు, మరణ మొందితివి కుమార! నీవు. 256

చ. పలుక నసత్యమున్, మదినిఁ బ్రాణులహింసఁ దలంప సుంతయేన్
గలుషము లాచరించి యెఱుఁగన్ హరిభక్తుఁడ మత్సుతుండు ని
ష్కలుషతఁ బైతృకమ్ములను సల్పెడు భాగ్యము లేక యీక్రియన్
బొలుపరి ప్రేతనాథుపురిఁ బొందుటకుం గతమేమొ దైవమా 257

ఉ. ఈకలుషవ్రజంబు భువి నేలెడు రామునిదౌ నసంశయం
బేకడఁ జూడ నాదుమది కింతియ తోఁచెను భార్యతోడ నే
శోకము నాప నోపమికి శోషిలి దిక్కటులేనివారమై
ప్రాకటమైన రాజపురి వాకిటఁ జచ్చెద, మింక రాముఁడున్. 258

క. తమ్ములతో దీర్ఘాయు, ష్యమ్మున వర్ధిలఁగనిమ్ము జను లర్ధాయు
ష్యమ్మునఁ బోవుట యేలిక, లిమ్మహిని నధర్మవృత్తి నీగుట గాదే! 259

ఆ. ఇట్టిబాలమరణ మీరాజు చేసిన, పాప మనుచు స్పష్టపరచి రాజ
దూషణముల నెక్కు భావలు పలుకుచు, విప్రుఁ డధిక దుఃఖ వివశుఁ డగుచు. 260

క. చనిపోయిన బాలుని మీ, దను వల్చం గప్పి పలువిధమ్ముల శోక
మ్మునఁ బొగులఁగ శ్రీరాముఁడు, విని మిగుల విచారమునఁ దపించుచు నపుడున్.

సీ. తనమంత్రిపుంగవులను వేగ రప్పింప, వారితో మౌద్గల్య వామదేవ
గౌతమ నారద కాత్యాయనులును మార్కండేయ జాబాలి కాశ్యపుఁడును
అష్టమబ్రహ్మర్షు లరుదెంచి వారల, కగు పీఠములయందుఁ దగ వసించి
మిగులతేజముతోడ మెలఁగెడి మునులను, గని ద్వారమందు బ్రాహ్మణుఁడొకండు
తే. నేడ్చుచున్నాఁడు కారణ మేమి దీని, కనుచు దిగులొంది పలుకు రామునకు నందు
నారదుఁడు జానకీప్రాణనాథుఁ జూచి, మునులు వినఁ బల్కె నిటుల సమ్మోద మొదవ.

క. ఇపు డొకవిప్రునిబాలున, కపమృత్యువు సంభవించె నది యెట్లన ని
ష్కపటముగాఁ దెల్పెద విని, నృపవర! తద్దోష మణఁప నేగఁగవలయున్. 263

తే. ఎటులఁ జూచిన విప్రుండు కృతయుగమున, బ్రాహ్మణక్షత్రియులు రెండవయుగమందు
బ్రాహ్మణక్షత్రవైశ్యులు ద్వాపరమున, కలిని నాలుగు జాతు లీయిలను దపము.

క. చేయఁగవలయును శూద్రుఁడు, నేయుగమున నుగ్రతపము నెంత యొనర్పన్
శ్రేయస్కరమగు ఫలము, న్నేయెడఁ బడయంగఁజాల డిప్పుడు నీవున్. 265

ఆ. ఏలు దేశమందు నెక్కడనో శూద్రుఁ, డొకఁడు తపము సలుపుచున్నవాఁడు
నిట్టికారణమున నీబాలునకు మృతి, గలిగె దీని నరసి తెలియవలయు. 266

ఆ. రాజుపాలనమున◆ రాజ్యమందునఁగాని, పట్టణమునఁగాని ◆ పాప మెవఁడు
సేయు నాకలుషముఁ ◆ జెంది మహీపతి, శీఘ్రకాలమున న◆శించు నిజము. 267

సీ. కావున నీదేశ◆గ్రామంబులం దట్టి, కలుష మెక్కడ నుండఁ◆గలదొ దాని
నరయుటకొఱకు ప్ర◆యత్నింపఁ గావలె, నటుల జేసినఁ బుణ్య◆మతిశయించి
ప్రజల కాయుష్యము◆బహుళ మై యుండును, బాలుఁడెప్పటియట్ల◆బ్రతుకఁగలఁడు
అని యిట్లు నారదుం◆డనిన సుధామయం, బైన మృదూక్తుల ◆ నాలకించి
తే. మిగులసంతోష మొదవ సౌ◆మిత్రిని గని, బాలుదేహము చెడకుండ ◆ తైలద్రోణ
మునను బెట్టింపుఁడని తన◆మనసులోనఁ, దలఁప పుష్పక మరుదెంచి◆నిలిచె మ్రోల.

వ. ఇట్లొక్కముహూర్తంబునఁ బుష్పకం బరుదెంచినఁ గని శ్రీరామచంద్రుం డచ్చటి
మును లందఱకును బ్రణమిల్లి తత్పుష్పకారోహణుం డై. 269

సీ. ధనువు నంబులపొదిఁ ◆ దాల్చి మూఁపునఁ గాంత,చే నొప్పు ఖడ్గముఁ◆ జేతఁ బట్టి
వెడలి పశ్చిమదిక్కు ◆ వెదకి కానక యుంచు, దట్ట మై యుండు న◆ త్తరఁపుదెసకు
నేగి యచ్చటఁ బరీ◆క్షించి ప్రాగ్దిశఁ జొచ్చి, దాని విమర్శించి ◆ దర్పణమున
కనయుచు వృత్తాంత ◆ మెల్ల యెఱుంగుట, కనుకూలమైన ద◆క్షిణఁపుదిశకుఁ
ఆ. జని వెదకుచుఁ గొన్ని◆శైలములకు నుత్తరమున నేకతమున ◆ రమ్యమైవి
శాలమైన యొక్క◆సరసియందునను బాదములు పైకి నిల్పి ◆ తల దిగువను. 270

ఆ. క్రొలి వ్రేలుచుండి ◆ కడుభయంకర మైన, తపము సేయునొక్క◆తపసిఁ గాంచి
వాని నడిగె నిట్లు ◆ బ్రాహ్మణక్షత్రియ, వైశ్యశూద్రజాతి◆వారిలోన. 271

ఉ. ఎవ్వఁడ వీవు నామ మది ◆ యెయ్యది నిర్భయమానసుండ వై
యివ్వనభూమియందుఁ దప ◆ మేటికిఁ జేసెదు నేగఁ దెల్పుమీ
యివ్వసుధేశుఁడన్ దెలియ ◆ నే నిటు వచ్చితి నాదువాక్యముల్
నవ్వులు గావు నీమనము◆నం గలకోరిక దీర్తుఁ దాపసీ ! 272

చ. అన విని దక్షిణాభిముఖుఁ◆డై రఘురాముని జూచి పల్కె వాఁ
డనఘ! చతుర్థవంశజుఁడ ◆ నాహ్వయమున్ విను శంబుకుండ నీ
తనువున దేవరూపము ము◆దంబున నందెదు నాసఁ జేసి నే
పనువడ నీతపంబు సలు◆పంగఁ గడంగితి ధారుణీశ్వరా! 273

ఆ. అనుచుఁ బల్కుచుండు ◆ నావృషలుని గని, ఖడ్గ మెత్తి వాని◆కంఠముఁ దెగ
వ్రేయ మృతిని బొందు ◆ వేళ నింద్రాదిది,క్పతులు దేవతలును ◆ వాయుసఖుని.

సీ. ముందుంచుకొని రామ◆చంద్రునిసన్నిధి, కరుదెంచి మేలు మే ◆ లనుచు మాటి
మాటికి నగ్గించి ◆ మత్తియు నిట్లనిరి రామ! నీవు శత్రుసం◆హారకుండ
విది మాకు నిపుడు సం◆మ్మదమైనపని గావ,వరము లిత్తుము కోరు◆నరవరేణ్య!
యనిన రాఘవుఁడు వా◆రిని జూచి సంతోష,కలితుఁడై హస్తయు◆గమ్ము మోడ్చి

8

ఆ. నాకవాసులార! • నాకోరికలు దీర, వరము లిత్తు రేని • ధరణిసురుని
సుతుని మఱల మీరు • బ్రతికింపఁజేయుట, యదియ చాలు ననఁగ • నమరవరులు

క. ఎప్పుడు వృషలుని నఱికితి, వప్పుడె యావిప్రసుతుని • ప్రాణము మఱలం
జొప్పడియె రామ! మేలగు, నెప్పుడు నీ కనుచుఁ ద్రిదివ • మేగిరి దివిజుల్. 276

సీ. దశరథాత్మజుఁ డయో•ధ్యాపురి కరుదెంచు, వరుస విప్రసుతుండు • బ్రతికి రోగ
ములు లేక సుఖముగాఁ • బొదలుటఁ గని విని, తమ్ములతోడ సం•తసము మిగులఁ
జెందిరి బ్రాహ్మణు • లందఱు నానంద, మగ్నులై యార రా•మావనీశ!
నీధర్మవితరణ•నిష్ఠ ధీరత్వము, పరులకు నతిదుర్ల•భంబు కాదె

ఆ. ధర్మమార్గ మెవఁడు • తప్పక రాజ్యంబు, నేయనోపు వాని•సిరియు బలము
యశము విస్తరించి • యవని దీర్ఘాయుష్య, వంతుఁడగుచుఁ బుణ్య•వంతుఁ డగును.

తే. వేదశాస్త్రము లెఱుఁగుచు • వివిధధర్మ,వర్తనలఁ దిర్వ్యచుండెడి•వాఁడు నధిక
శూరుఁడగు ధీరుఁడగు నీవు • ధారుణిఁగల, ప్రజల రక్షించునెడల పం•రాకు మాని

ఆ. పుడమి నేలుమనుచు • భూసురుల్ పలుకఁగ, రాజ్య మేలుచుండె • రామవిభుఁడు
బ్రాహ్మణుండు తనదు•బాలుని దన వెంటఁ, గొనుచు గేహమునకుఁ • జనియె మఱల.

## శ్రీకృష్ణుఁడు గురుపుత్రుని బ్రతికించుట.

ఆ. ఇటుల విప్రసుతుఁడు • మృతినొంది యమపురి, కరిగి మఱల బ్రతికి•యవని కరుగు
దెంచినట్టికథను•దెలిపితిఁ గృష్ణుని, గురుతనయు బ్రతికిన•తెఱఁగు వినుము. 280

సీ. ఘననదీనదముల • వనముల విలసిల్లి, విప్రోత్తములచేత • విస్తరిల్లి
పలువిధముల వృక్ష•ముల రమణీయమై, యోజనవిస్తార • మొప్పినదియు
ధనధాన్యములఁ గడుఁ • దనరెడునదియు నై, వేదశాస్త్రార్థసం•వేద్యులైన
పెద్దలచేతను • పేరు నందుచు నవం,తియనంగ నొకపురి • తేజరిల్లు

తే. నందుసాందీపనియను బ్రా•హ్మణుఁడొకండు, గలఁడు ప్రఖ్యాతినొందిన•గణ్యుఁడధిప
స్వాశ్రమాచారబద్ధుఁడై • సకలవిధము,లైన శుభలక్షణములచే • నలరుచుండి. 281

తే. వేదవేదాంగములను సం•విస్తరముగ, చదివి సత్యమ్ముఁ దప్పక • మది ననూయ
పడక శౌచాదిగుణసంయు•తుఁడగు చమిత,మైన యాహారమును•దగినట్టిచూపు. 282

క. మితిలేని దేహకాంతిని, హితవగుమితభాషణములు • నింద్రియజయమున్
గతకోపుఁ డధ్యయనతప, మతులితమతిఁ జయ మిగుల • ఆస్తిక్యండున్. 283

క. దేవబ్రాహ్మణగురుపూ,జావిధిసక్తుఁడును బుద్ధి•చలనము నెందున్
గావింపక దృఢనియమ,ప్రావీణ్యం డగుచు నెల్ల•ప్రాణుల కెందున్. 284

ఆ. మేలు గోరువాఁడు • మెల్లన దోషము,లెల్ల విడువఁబడిన • యుల్లము గల
వాఁడు నగుచు నాయ•వంతిని భార్యతోఁ, గలిసి చేయుచుండెఁ • గాపురంబు.

సీ. అట్టి సాందీపని • కాకాలమున వంశ, విస్తారకుఁడు చంద్ర•బింబమునకు
దీటైనముఖకాంతి • తేటైనశేముషి, గల సూనుఁ డొక్కఁడు • గలిగె తల్లి
చేత లాలనమును • జేర్పడఁ దండ్రికి, నుత్సాహ మొదవించు•చున్న కొమరుఁ
నకుఁ గొన్నివర్షమ్ము•లకు నుపనయనము, గావింప విద్యలఁ • గఱచి యొక్క
ఆ. మాఘమకరపూర్ణి•మాప్రభాతఁప్రవేశఁ, దోడివడుగుగములతోఁ బ్రభాస
తీర్థమునకు నేగి• తేటయౌ జలముల,మధ్య నిలిచి యాచ•మనము చేసి. 286

చ. విమలసుఖంబు లిచ్చుటకు • విశ్రుతమై తనరారు మాఘమా
సమునఁ బ్రభాతవేళ మది • సమ్మతిఁ బుణ్యనదీజలంబులం
గ్రమముగఁ దోగనాడఁ జల•కమ్మన సంతసమంది యుద్ధరిం
పుము నను కృష్ణ! శౌరి! యదు•పుంగవ! కేశవ! మాధవా! హరీ! 287

క. అని తాత్పర్యముఁ దెలిపెడు, ఘనమంత్రము పఠనజేయఁ• గౌతుక మెసఁగం
దన మిత్రులతో సాందీ,పనిసూనుఁడు జలములోన • భక్తి మునుంగెన్. 288

ఉ. బాపలబిడ్డ లందఱును • బైటకుఁ జేరిరి గాని విప్రసాం
దీపనిపుత్రుఁ డొక్కఁడు ము•నింగియు రామిని బ్రహ్మచారులా
పావనితల్లిదండ్రులకుఁ • బౌరులకున్ వినుపింపఁ దల్లి సం
తాపమునన్ విలాపమున • ధారుణి వ్రాలెను మూర్ఛనొందుచున్. 289

ఉ. అప్పుడు చుట్టుపక్కజను • లందఱు నచ్చటి కేగి నేలపైఁ
దెప్పరమైన శోకమునఁ • దేలెడుసాధ్విని లేవనెత్తి నే
ర్పొప్పఁగ నీతివాక్యముల • నూఱడఁబల్కిరి పుత్రమోహమున్
జొప్పడి కాళ్లు తొట్రుపడ • సోలుచు లేచుచు మాటిమాటికిన్. 290

తే. కలతనొందు జ్ఞానేంద్రియ•ములను మనసు,నందుఁ గలవర మందుచు • ముందు వెనుక
తెలియఁగక ప్రభాసమునకు నై•పరుగులిడును, తన సుగుణములు పలుమాఱు•దలఁచుచుండు.

సీ. ఆబాలకునితండ్రి • యైన సాందీపని, షడ్గుణసంపద, • సమబుద్ధి
గలవాఁడు నాట దుః•ఖము లోపల నడంచి, సుతుల స్నేహితుల స•మ్మతినిఁ బిలిచి
నాచిన్నికొమరుండు • స్నానము చేసిన, విధ మెట్టిదగు దాని•విస్తరింపుఁ
డని మాటిమాటికి • నడుగ నప్పుడు బలిం,చినమంత్రమును వారు•చెప్ప దాని
తే. చదువుకొని యర్థము గ్రహించి • సంతసించి, యట్టిశ్లోకార్థమేపుడును•వ్యర్థమగునె
కాన శ్రీకృష్ణదేవుండె • వాని బ్రోచు, ననుచుఁ దనపత్ని నోదార్చి•యవనిసురుఁడు

వ. ఇట్లు లాదంపతులు తమకుఁ గలిగినపుత్రశోకాటవిని జ్ఞానాగ్నిచేఁ గాల్చివేసి చిరకాల మచ్చటనే సుఖముగా నుండి రని యవ్వశిష్ఠుండు వెండియు నిట్లనియె. యమవిభుండైన శూరసేనుండను రాజు గలం, డతండు మధురాపురంబు తనకు రాజధానిగా కొన్నిదేశంబు లేలుచుండె నట్టియెడ. 293

సీ. అశూరసేనున ♦ కట్టికాలంబున, వసుదేవుఁ డుదయించె ♦ వసుమతీశ!
అతనికిఁ బ్రియపుత్రు ♦ లగు రామకృష్ణులు, జనియింప మదికిహ ♦ ర్షము నొదవఁగఁ
దనపురోహితుని చేఁ ♦ దగుబ్రాహ్మణుల చేత, నుపనయనాదుల ♦ నుచితగతులఁ
జేయించి బంగరు ♦ చేలముల్ సరిపెన, గొలుసుల నొప్పిడి ♦ గోచయంబు
తే. విప్రులకు దక్షిణల నిచ్చి ♦ వేలువేలు, మునుపు బలరామకృష్ణులు ♦ జనన మొందు
నప్పు డాకంసుఁ డూరక ♦ యపహరించి, నట్టి మొదవుల నన్నిబ్రా ♦ హ్మణుల కపుడు

చ. మనమున ధారవోసె నవి ♦ మఱ్వాక బంగరుచేలముల్ సువా
సనగల పుష్పమాలికలఁ ♦ జాల నలంకరణంబు సేయు బ్రా
హ్మణులకు దాన మిచ్చెను గు ♦ మారకు లంత ద్విజత్వ మొంది దీ
క్షను వహియించి గర్గగురు ♦ సమ్ముఖమందున నిశ్చలాత్ములై. 295

క. గాయత్రిని బొందినవాఁ, డేయెడఁ గన్గొనిన విద్య ♦ లెన్నియుఁ గలవో
పాయక యన్నింటి నొందు న, జేయులు నగు రామకృష్ణ ♦ చిహ్నులఁ గొమరుల్.

క. లోకములకు నధిపతులై, ప్రాకటముగ నితరు లెవరు ♦ పడయ నశక్యం
బై కడు నొప్పెడు నిర్మల, మేకజ్ఞానంబు నొంద ♦ నెఱిఁగినవారై. 297

క. నరనాథు లగుచు విద్యల, గురు నింటను జదువ మదినిఁ ♦ గోరికతో నే
గిరి కన దేశము నిండ్రియ, పరవర్తన లేక కాశి ♦ పట్టణమునకున్. 298

సీ. చేరి యవంతిని ♦ జిరకాలవాసుఁడై, శ్లాఘింపఁదగి విప్ర ♦ జాతుఁ డగుచు
సకలవిద్యలు గల ♦ సాందీపనిని గని, తమకును గురువుగాఁ ♦ దలఁచి మదిని
సేవకపరిచర్యఁ ♦ జేయుచు భక్తితోఁ, బాదము లొత్తుచుఁ ♦ బహువిధముల
దేవునివలె నెంచి - సేవింపుచుండఁగ, నాబ్రాహ్మణుఁడు వారి ♦ ననుసరణను
తే. గపటరాహిత్యమును గని ♦ కనికరమున, వేదవేదాంగములు ధను ♦ ర్వేదవిద్య
శాస్త్రములును వేదాంతము ♦ సకలధర్మ, నీతిమార్గంబులను దెల్పె ♦ నాతతముగ.

చ. సరసమతుల్ గ్రహింతు రొక ♦ సారి పఠించినయంతలోన నా
సరణిని వారు షష్టిదివ ♦ సంబుల విద్యల నన్ని నేర్చి యో
గురువర! మీరు దక్షిణను ♦ గోరుఁడి యిచ్చెద మంచుఁ బల్కి నె
వ్వరికిని బోలరాని దగు ♦ వారిప్రభావము బుద్ధి నెన్నుచున్. 300

సీ. తన ధర్మపత్నితోఁ ♦ దగిన యాలోచన, చేసి సింధువులోనఁ ♦ జేరి మిగుల
ప్రబలమై యొప్పు ప్ర ♦ భాసతీర్థమునందు మునిఁగిపోయినవాని ♦ తనయు నిపుడు
తెచ్చి దక్షిణగాగ ♦ నిచ్చిన నదె చాలు, నన రామకృష్ణులు ♦ నరద మెక్కి
రత్నాకరముఁ జేరి ♦ రథము డిగ్గినఁ గని, సంద్రంబు మివుల న ♦ ర్చనలు సేయ
తే. నవిరయుఁ జేకొని భగవంతుఁ ♦ డైనకృష్ణుఁ, డనియె వార్ధిని జూచి నీ ♦ యలల చేత
మాగురుని సుతుఁ గొంటివి ♦ మరల నతని, దెచ్చియిమ్మన నాతఁడు ♦ తెలిపె నిట్టుల.

సీ. ఆచిన్నకొమరు నే • నపహరింపను నాదు,జలమందు నేపాంద్రుండు • సంచరించు
శంఖముఁ బోలిన • శారీరమున నొప్పు, పంచజనుండనఁ • బరగు నొక్క
దనుజుండు మాగురు•తనయుని మ్రింగెను, వాని వేగ వధించి • బాలుని గొని
పొమ్మని సింధువు • పొలుపారఁ గృష్ణుతోఁ, బలికిన వెంటనే • వనధిఁ జొచ్చి
ఆ. వాని రొమ్ము కడుపు • వ్రయ్యలు గావింప, బాలునంగుఁ జూడ • బడయలేక
యతనిదేహమందు • నలరెడిశంఖముఁ, బెరికి కొనుచు మఱల • నరద మెక్కె.

క. యమునికిఁ బ్రియమగునది సం,యమ యనుపట్టణముఁ గూర్చి • హలధరుతోడన్
విమలగతి వేగి యానగ,రమువెలుపల శంఖ మొత్తె • రవ ముప్పతిలన్. 303

క. మనుజులను ధర్మములచే, ఘనముగ నియమించునట్టి • కాలుఁడు శంఖ
ధ్వని విని వారల కెదురుగఁ, జని తోడ్కొనివచ్చి భక్తి•సలుపుచు వారికన్. 304

సీ పూజింపుచు సమస్త•భూతచిత్తములందు, వసియించునట్టి శ్రీ•వాసుదేవ!
తివిరి వేడుకను మా•నవజన్మ మొందిన, మీర లిచ్చటి కేమి•కారణమున
నరుదెంచితిరొ నాకు•నాజ్ఞ నేపని యొందుఁ, జేతురొ యది యెల్లఁ • జేయువాఁడ
ననఁ గృష్ణుఁ డనియె నా•యనుమతి జరిపెడ, వేని కర్మవశము•చే నిటకును
తే. దేఁబడిన మాగురునిసుతుఁ • దెచ్చి మాకు, నిమ్మనుచుఁ బల్క సమవర్తి•సమ్మతించి
వాని బిలిపించి కృష్ణుని•వశముఁ జేయఁ, దెచ్చి గురువున కిచ్చిరి • ధీరమతులు.

క. అందులకు గురువు బ్రహ్మా,నందముతో వారి కనియె • నయముగఁ గని నా
డెందమును సంతసిలె ని,చందము మున్నెవరు చేయఁ•జాలిరొ చెప్పుఁడీ. 306

తే. కాన గురుపూజ చక్కఁగాఁ•గలిగె మాకు, గురువునైయున్న నే మిమ్ముఁ•గోరఁదగిన
దేమి యున్నది నాకోర్కె•యేది కలదొ, దాని దీర్చితి రింక మీరు • ధన్యులరయ.

ఉ. మర్మము లేక మీర లిటు • మాయెడలం బొనరించునట్టి స
త్కర్మలచేత మీయశము • తప్పక లోకములన్ వెలింగెడున్
ధార్మికులార! మీరు తలి•దండ్రులఁ గూరిమితో గనుంగొనన్
నిర్మలచిత్తులై చనుఁడు • నే సెలవిచ్చితి నేఁడు మీ కనన్. 308

సీ. గురునాజ్ఞ బొంది సత్పురుషులు బలకృష్ణు, లటు వాయువేగము•నలరి మేఘ
గర్జనమున నొప్పు • కాంచనరథ మెక్కి, తన పట్టణమునకుఁ • దరలిపోవ
నందుఁడు వసుజు లా•నందించి నష్టమౌ, ధనమును మఱల చే•కొనినపగిదిఁ
గని సంతసించిరి • కడగి ప్రాతఃకాల,స్నానాదికృత్యముల్ • సలుప మాఘ
తే. మాసపూర్ణిమయందుఁ బ్ర•భాసతీర్థ,మునకు వేగి సాందీపని • తనయుఁ డందు
మునిఁగి లేవక యవలఁ గృష్ణునిమహిమను, భువికి నరుదెంచె శమనుని•పురమునుండి.

క. మఱికొం ననేకులు యమపురి, కరిగి సురలకరుణచేత • నవనికిఁ జనుదెం
చిరి వారి నెన్నుటకు నా,తరమౌనె దిలీపభూప! • ధర్మకలాపా! 310

క. అనిన దిలీపుఁడు నేనడి,గినప్రశ్నలు మాఁటికిని ద◆గినయుత్తరముల్
వినుపించితి రవి వింతగ, మనమున నాశ్చర్య మొదవఁగ ◆ మహితవిచారా! 311

సీ. జలజాప్తవంశసం◆జాతులౌ రాజుల, తలల కిరీటముల్ ◆ దగులఁ మణుల
వలన నలంకార◆ముల నొప్పుపాదుకల్, గలిగియు నిక్ష్వాకు◆కులమునందు
సంభవమైనట్టి ◆ క్షత్త్రియులకు మేలుఁ, సేయుచుఁ దవ్వు మని◆శ్రేష్ఠుఁడ వగు
నీకు వందనము ల◆నేకము లొనరింతు, నని బ్రహ్మసుతుని పా◆దాంబుజముల
తే. కపుడు మ్రొక్కెడిమాఘమా◆హాత్మ్యముతుద,వరకు నాలించువాఁడు నై◆ పలికెఁబుణ్య
పురుషుఁడైనట్టిమృగశృంగు◆చరితమువిన,కుతుఁదత్కథనంతయుఁ◆దెల్పుఘనఘ!

ఆ. సత్పురుషుల నంట ◆ సాంగత్య మొదవుట, దర్శనము గలుగుట ◆ దాపున నిలు
చుటను కథను వినుట ◆ చూచి భాషించుట, పాపములు నశింప◆నోపు ననుచు.

చ. కరములు మోడ్చి యీవిధము◆గా నుతియించి వశిష్ఠమౌని చేఁ
గర మనురక్తినిన్ నృపతి ◆ కాంక్ష జనింపఁగఁ గుత్సనూనుస
చ్చరిత వినంగఁగోరె నని ◆ శౌనకుఁడాదిమునీంద్రులన్ సమా
దరణను జూచి పల్కె నటు ◆ తద్దయు సూతుఁడు నిశ్చలాత్ముఁడై. 314

## ఆశ్వాసాంతము.

మ. జలజాతేక్షణ! భక్తపాలనకళా◆సంరంభ! విశ్వేశ! స
ల్లలితాకార! రమావినోద! సుగుణా◆లంకార! ప్రావీణ్య! భూ
వలయవ్యాపక! భూతభావన! గజ◆ప్రాణావనోత్సాహ! క
ర్మలతాచ్ఛేదనఖడ్గ! మేరుగిరిధీ◆రా! భావనారాయణా! 315

### ముక్తపదగ్రస్తము.

చ. కువలయమిత్ర! మిత్రకుల◆కుంజర! కుంజరరక్ష! రక్షకా
భవ! భవమిత్ర! మిత్రహిమ◆భానువిలోచన! మామమామ! మా
ధవ! ధరధీర! ధీరవిను◆తా! ఖలశైలశతార! శతారకా
ధవ ఫణిహారహారయశ! ◆ దైత్యమహోరగతార్క్ష్య! తార్క్ష్యగా.

### కందద్వయ రుగ్మవతీ కమలవిలసిత గర్భకాంచపదవృత్తము.

సారసనేత్రా! సత్యవి,చారా! సరసవచన! నర◆సఖ! ఖలహారా!
కారవజైత్రా! కాంత్యవి,కారా! ఖరకరకులహిమ◆కర! ధరధీరా!
భారతమిత్రా! బంధని,వారా! పరమపురుష! సుర◆వర! యదువీరా!
దారదహారాస్త్రా! మర,దారా! ధరధర సురనుతి! ◆ తతగుణతారా!

### పై కందద్వయములోని వృత్తద్వయము.

సారసనేత్రా! ◆ సత్యవిచారా!, కారవజైత్రా ◆ కాంత్యవికారా!
భారతమిత్రా! ◆ బంధనివారా!, దారదహారా◆స్త్రా! మరదారా!

సరసవచన! నర◆సఖ! ఖలహారా!, ఖరకరకులహిమ◆కర! ధరధీరా!
పరమపురుష! సుర◆వర! యదువీరా!, ధరధర! సురనుత! ◆ తతగుణవారా!

మాలిని. వరమునివనచైత్రా! ◆ వాసవామిత్రజైత్రా!
ఖరకరశశినేత్రా! ◆ కంజభూస్తోత్రపాత్రా!
వరద! గిరిశమిత్రా! ◆ వార్ధికన్యాకళత్రా!
సురవినుతచరిత్రా! ◆ సూరిచేతోబ్జమిత్రా!

## గ ద్య ము .

ఇది శ్రీ బాలగోపాలకృష్ణ వరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్యసగోత్రపవిత్ర
శ్రీమ దబ్బరాజువంశపయఃపారావారరాకాకైరవమిత్ర మ్మ్ర కొండాంబా
నృసింహామాత్యమణిపుత్ర సూరిజనవిధేయ శేషాచలశర్మ నామధేయ
ప్రణీతంబైన శ్రీమత్పాద్మపురాణమునందలి మాఘమాహా
త్మ్యమునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# మాఘమాహాత్మ్యము.

[శేషాచలకవీయము.]



## తృతీయాశ్వాసము.

లక్ష్మీనారాయణ!
పాలితసుత్రామ! దనుజభంజన! భవని
ర్మూలన! కరుణాన్విత! భూ
పాలన! రవిసోమనయన! భవ్యసునామా! 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునులం గనుంగొని యిట్లనియె, నట్లు మృగశృంగువృత్తాంతముఁ దెలియఁగోరినదిలీపనరేంద్రునకు వశిష్ఠమునీంద్రుఁడిట్లనియె.

సీ. ఆమృగశృంగమహాముని గురునింట, నిలిచి శుశ్రూషలు సలుపుచుఁడి
శాస్త్రవిధిని బ్రహ్మచర్యధర్మము పూని, వేదపాఠములందు వివిధశాస్త్ర
ములనొప్పి గురుదక్షిణలను గోదానవ్రతమున బ్రసిద్ధుఁడై తదనుమతిని
నిర్మలమానసనిష్ఠుఁడై యిలు సేరె, నపుడు సుచక్షుఁడు నాత్మజకు వి
తే. వాహమొనరించువాఁడునై వరునిగుత్సుసుతునిగా నిశ్చయింప సమ్మతిదలిర్ప
మునుపు తనచేతఁ గోరఁబడినది యాట, దాని బెండ్లాడువాఁడు కాఁదలఁచె మదిని.

మ. అనుమానింపక యాయుచక్షుఁ డటఁ గన్యాదానముం జేయఁ గో
రినవాఁడై సుతకున్ మనోహరముగా శృంగారముం జేసి బ్రా
హ్మణులన్ రాఁబిలిపించి బంధుయుతుఁడై హర్షంబుతో నంబరా
ర్పణఁ గావించెను దొల్త వేడుకలు మీఱన్ వేదమంత్రంబులన్. 4

ఆ. కుత్సమౌని తనదు కొమరుఁడౌ మృగశృంగు, పెండ్లికొడుకు మునుల బిలువనంప
నిగమవేదు లమితనిష్ఠులు నానంద, భరితు లయ్యు నావివాహమునకు. 5

సీ. అంగిరసుఁడు భృగు వత్రి పర్వత సత్య, వామదేవ హారీత పైల కణ్వ
గౌతమ మాండవ్య కాత్యాయన సుతీక్ష్ణ, కాశ్య పావస్తంబ కౌణ సుమతి
కశ్యప శరభంగ కపిల జైమిని జమ,దగ్ని జాబాలి మౌద్గల్య రైభ్య
లను వారు మఱికొంద రరుదేర ధార్మికుఁ, డగుకుత్సమౌని వా రందఱకును
తే. నూతనాంబరములను సంప్రీతి నొసఁగి, పూజఁ గావించి వారికి భోజ్యము లగు
భక్ష్యములు నాదిగా నిష్టవస్తువులను, దృప్తిఁ బొందించె నట మునిబృందములను.

తే. సుదివసముమంచిదగులగ్న•శుభముహూర్త, మునమహర్షులయెదుటస•మ్మోదమొదవ
సమిధలును దర్భలాజ్యలా•జలను విధివి, ధమున హోమము చేయించి •దంపతులకు.

సీ. పెండ్లి గావింప సు•వృత్తకల్యాణముఁ, గని చెలికత్తెలు • కమల విమల
సురస నీముగురు కు•త్సునికుమారునిజూచి, యిపుడు మమ్ముఁబరిగ్ర•హింపుమటులఁ
గావింపకుండినఁ • గల్గు శాపము నీకు, నని పల్కువాక్యము • లాలకించి
యేకకాలమునం ద•నేకకన్యలవరి,యింపఁబోలునొ రాదొ • యే నెఱుంగ

ఆ. వలయు నంచుఁ గొంత•వరకు నాలోచనఁ, జేయుచుండ నతని•చిత్త మెఱిఁగి
ఋషులనడుమ కుతుక•మెసఁగఁ గూర్చుండిన, వ్యాసమౌనిపలికె • భాసురముగ.

సీ. ఈకన్నియల మృగ•శృంగ! నీ విపుడు వి,వాహము గమ్మ సం•దేహ మూడిగి
కిందట నొకకాల•మందు నీపగిదిని, జరిగినవృత్తాంత • మెఱుఁగ దెలె
దను నీకు వినుము మాం•ధాతృపుత్రికల నే,బదిమందిఁ గొనియె సౌ•భరిమహర్షి
చంద్రుండు దక్షప్ర•జాపతిదుహితల, నిరువదేడ్వుర నొక•పరి గ్రహించె

తే. ననుచు సంశయ ముడిపిన • వ్యాసమౌని,పలుకు లాలించి హోమ మిం•పలరఁ జేసి
కమలవిమలసురసకన్య•కలను మువుర, నగ్నిసాక్షిగ మృగశృంగు• డాడెఁ బెండ్లి.

ఆ. బ్రాహ్మణులకు నెపుడు•బ్రాహ్మ్యవివాహము,నియత మనుచుఁ బలుకు•నిగమవాక్య
సరణి కుత్ససుతుఁడు • సరగునఁ గన్యాచ,తుష్టయమును గొనియె • నిష్టముగను. 10

క. ఈవిధమున సక్రమముగ, వైవాహిక మైనపిదప • వరుని వధువులన్
దీవించిన మునులను సం,భావింపఁగఁ జనిరి తమత•మవిడుదుల కొగిన్. 11

చ. అనిన, దిలీపుఁ డిట్లనియె • నయ్య! మహాత్మ యరుంధతీశ! నీ
వొనరగ బ్రాహ్మణాదికజ•నోచిత మైన వివాహభేదముల్
వినియెద నేర్పడన్ దెలుప•వే యనుభూపతితో మునీంద్రుఁడున్
గనికర మొప్ప దద్విధము•గా వినుపింపఁదొడంగి యిట్లనున్. 12

సీ. అవనీశ! బ్రాహ్మ్య దై•వార్ష ప్రాజాపత్య, మాసుర గాంధర్వ•మవల రాక్ష
సమును పైశాచభే•దముల వివాహము, లెనిమిది తెఱఁగుల • నిలఁ బ్రసిద్ధి
గను నందు వస్త్రాభ•రణములఁ జక్కఁగా, గైసేసి వరుఁ బిల్చి • కన్య నొసఁగు
టది బ్రాహ్మ్య మననొప్పు • నాదంపతుల, కుదయించినతనయుండు•నిరువదొకటి;
యజ్ఞార్థ మగువారి•యాగముల్ సేయించు, వానికిఁ గన్యను • దాన మొసఁగు
నది దైవ మనఁదగు • నట్టివారికిఁ గల్గు, కొడుకు పదియునాల్గు•గోవులజత
వరునిచేఁ గొని తమ•బాలిక నిచ్చుట,నదియార్ష మనఁదగు • నామిథునము
నందు గల్గినసుతుం • డారు; మీ రిరువురు గలిసి ధర్మము చేయఁ•గడఁగుఁడనుచు
వరునకుఁ గన్నియ • నిరవుగా నిచ్చిన, నదియ ప్రాజాపత్య • మనఁగఁ జెల్లు
నట్టిదంపతులకుఁ • బుట్టినసుతుఁ డారు, తరముల నీనాల్గు•వరుసవారి

తే. నుద్ధరింపగ జాలు రీ• పద్ధతులను, బ్రాహ్మణులకు వివాహముల్ • బరగ నాల్గు
విధము లివిగాక తక్కినవి నెఱిఁగింతు, ననుచు రాజునకును జెప్పె • మునివరుండు

ఆ. ధనముఁ గొనుచుఁ గన్య♦కను నియ్య నాసుర, మొకరి కొకరు ప్రియము♦నొంది పరులు
తెలియకుండఁ గలసి♦మెలఁగగా గాంధర్వ, మనగఁ జెప్పనొప్పు ♦ మనుజనాథ.

క. బలవంతుఁ డగుచు గన్యను, బలువీరుల నిగ్రహించి♦పట్టి వివాహం
బలవడఁ జేసికొనిన నది, యిలరాక్షస మనఁగఁబరగు ♦ నివిధమునకున్. 15

తే. బుధులు సమ్మతం బియ్యరు ♦ బొంకుమాట, లాడి మోసముచేతఁ గ♦న్యకను దోడు
కొని చని వివాహమును జేసి♦కొనిరయేని, యదియ పైశాచ మననొప్పు ♦ నవనినాథ!

తే. వెనుకఁ దెలిపిననాలుగు♦విధములైన, వానిలోపల క్షత్రియ♦వైశ్యులకును
దలచుగా నాసురమును గాం♦ధర్వ రాక్షసములుమూడును దగునండ్రు♦ సత్పురుషులు.

క. ఎవిమిదవది పైశాచము, ఘనపాపము గలుగఁజేయుఁ ♦ గావున నెంచం
గను గూడు పాపకర్మల, కని బ్రాహ్మణుఁడైనవాఁడు ♦ వార్షింపఁ డొగిన్. 18

క. తన వర్ణమందుఁ గలిగిన, వనితను చేపట్టి రెండవ♦కులమునందున్
జనియించినదానిని కర, మునఁ బట్టఁగవలయు నింక♦మూడవజాతిన్. 19

ఆ. కలిగినట్టికన్య♦కను సెలగోల చే, పట్టి శూద్రకన్య♦పైటకొంగు
బట్టి బ్రాహ్మణుండు♦పరిణయ మొనరింప, వలయు నిటుల నాల్గు♦వంశజలను. 20

తే. అన్యకులజాత లైనట్టి♦కన్యకలవి, షయము నిటు చెప్ప నొప్పె స్వ♦జాతలైన
చూడ హస్తము బట్టి పెం♦డ్లాడదగును, నాల్గుజాతులవారలు ♦ నయగుణాఢ్య! 21

తే. తమ కులాచారపద్ధతి ♦ తప్పకుండ, బ్రాహ్మణక్షత్రివైశ్యశూ♦ద్రజనముల వి
వాహములు చేసికొనిరేని♦వారలకును, గల్గుతనయులు సద్ధర్మ♦కలితు లగుచు. 22

క. శతవర్షంబులుం ధర జీ, వితకాలము గలిగి కీర్తి♦విస్తారకులై
పితరులను దృప్తిపరచెద, రతులితమతి బ్రాహ్మణులకు♦నగు బ్రాహ్మ్యంబున్. 23

క. మును మాంధాతృనిదుహితల, ఘనుఁడగుసౌభరియు నేక♦కాలమునందున్
గొనియెను బ్రాజాపత్యవి, ధిని నన మాసేంద్రుఁ జూచి ♦ ధీవిలసితుఁడై. 24

తే. ఆ దిలీపుఁడు నిటులనె ♦ నార్యవినుత, షడ్గుణైశ్వర్యములు గల♦సౌభరి మును
పేల మాంధాతృపుత్రిక ♦ లేఁబదుగుర, నేక కాలమునందు గ్ర♦హించె చెపుమ? 25

క. అని యడిగిన రాజేంద్రుని, గని మునివరుఁ డనియె నపుడు ♦ కాంపిల్యపురం
బున వేదార్థములను నెఱిఁ, గినవిప్రుఁడు జీవులందుఁ ♦ గృప గలవాఁడున్. 26

క. హితమతి యోగాభ్యాసను, సతతముఁ గడుభక్తిచేయు సౌభర్యాఖ్యుం
డితరవిషయముల నడఁచిన, ధృతిమంతుం డొకఁడు గలఁడు ♦ దినకరకులజా! 27

## సౌభరి చరిత్రము.

సీ. అతఁడు చాంద్రాయణ♦వ్రతము తొలుత సల్పి, మాసోపవాసంబు♦మహిమ జరిపి
అవల రాలినపండు♦టాకులు భక్షించి, పిదప నాహారము♦ వదలి ద్వాద

శాబ్దముల్ మిగుల లో♦తైన నిర్మలమైన, రమ్యమై యొప్పు నీ♦రముల మునిఁగి
జపతపములు సల్పు♦సరసిలో నొక చేప, గల దది చోటుగుం♦పులనుగూడి
ఆ. యెల్లఝషకములను ♦ నేలికయై యుండ,మగుచు నీటిమీద ♦ నంబుపగిది
త్వరితగతినిఁ దనదు ♦ పక్షము లాడించి, పారుకాడుచుండు♦బహువిధముల. 28

క. జననీజనకులు సతులును, తనయులు సోదరులు సుతులు ♦ తగుబాంధవులున్
మనుమలు గలిసి సుఖింపఁగఁ,గని సౌభరి మదికి నమిత♦కౌతుక మెసఁగన్. 29

ఉ. చేతము చల్లఁగా మెలఁగు ♦ చేపలగుంపును విప్రవంశసం
భూతుఁడు జూచి నీటఁ దప♦ముల్ విడి బైటకు నేగుదెంచి సం
ప్రీతిగఁ బత్నిగూడి విహ♦రింప వివాహ మపేక్షజేసి మాం
ధాతను చేరఁబోవఁ గని ♦ ధార్మికుఁ డానృపపుంగవుం డటన్. 30

క. తను వసియించినసింహా,సనమును డిగి మునికి నెదురు♦జనుదెంచి మహా
వినయమున నర్ఘ్యపాద్యము, లను పీఠము నొసఁగి మిగుల♦లాలితభక్తిన్. 31

తే. చేయుపూజలచే సంత♦సించి మౌని,రమ్యగుణసాంద్ర! యోమహా♦రాజచంద్ర!
వినుము కాకుత్స్థవంశము♦నను జనించి,నట్టినృపతులయాచించు♦యాచకులకు. 32

క. మనమునఁగల కోరికలం, దనియక వృథగా నరిగిన♦ధారణిసురలున్
గనబడరు గాన నీక,న్యను వైవాహికముకొఱకు ♦ నడుగగవలసెన్. 33

క. నీ కేఁబది దుహితలు గల, రో కువలయనాథ! నాకు ♦ నొకకోమలినిన్
గైకొన నిచ్చి వివాహము, ప్రాకటముగఁ జేయు మెల్ల♦భంగుల ననఘా! 34

చ. అనఁగ మునీంద్రుమాట ♦ కెదురాడిన నే మిఁకఁ గల్గఁబోవునో
విన నటు లూరకుండిన వి♦వేకివి గా వని శాప మిచ్చునో
యను భయశంకముల్ మిగుల♦వ్యాకులతన్ జనియింప రాజు స
ద్వినయముతోడ నిట్లనియె ♦ విప్రునితో నొకధర్మపద్ధతిన్. 35

సీ. వసుమతీవర! రాజ♦వంశమర్యాదలు, విన్నవించెదను స♦విస్తరముగ
వాలకింపుఁడు కన్ని♦యకుఁ జూడ నింపుగాఁ, గలిగి వయోరూప♦గతుల మంచి
సుగుణముల్ కల్గిన ♦ సొబఁగు కానికిఁ గన్య,నిచ్చుట నిర్బంధ ♦ మిదియు నొకటఁ
గల దిందులకు నేను ♦ గావించుపనులు మీ, రానతిండనఁగ నా♦మౌనివరుఁడు
తే. క్షత్రియులధర్మ మిటు లైన ♦ జనవరేణ్య!, నే కృతార్థత నొందితి ♦ నీదుహితల
రాణివాసములోని కొం♦జ్జాను బిలువఁ, బంచి నీకన్యకలు చూడఁ♦బనుపు నన్ను. 36

ఉ. పాయనిప్రేమ నాయెడల ♦ వారికిఁ గల్గిన నిచ్చి పెండిలిన్
జేయుము; నీకుమారికలు ♦ చేకొనకుండిన నన్ను నూరకే
పోయెద వచ్చినట్టితెరు♦వున్ గనుగొం చన సంతసించి భూ
నాయకుఁడున్ నపుంసకు న♦నామకు నొక్కని జీరి యిట్లనెన్. 37

ఉ. ఈ ఋషిపుంగవుం గొనుచు ♦ నేగియు నంతిపురంబులోపలన్
గారవమొప్ప నీతనికిఁ ♦ గన్యకలం బొడచూపుమన్న, నిం
పారగ వాఁడు విప్రుని రఁ♦క్షుంబునఁ జేకొని పోవుచుండ నా
సౌభరుఁడు నీటఁ జేసిన త♦పంబున నవ్యనదేహధారియై. 38

క. సురగరుడయక్షవిద్యా,ధరులకు మిన్నైన చక్క♦దనమును బలమున్
సురుచిరవస్త్రాభరణము, లరయఁగఁ గనుపించువాఁడు ♦ నై యరుగుటయున్. 39

సీ. అట్టి మునీశ్వరు ♦ నంతిపురంబున, రాచకన్నియ లుండు♦ రాణివాస
మునకుఁ గొజ్జావాఁడు ♦ కొనిచని వారికిఁ, జూపి మీతండ్రి యీ ♦ సొగసుకాని
నెవరు వరింతు రా♦యువతికి నీయన, వరుని గావించి వి♦వాహ మొనర
జేయనున్నాఁ డని ♦ చెప్పినఁ గన్నియ, లందరు నాతని ♦ సుందరతను
తే. గనిన యంతనె మోహావి♦కార మొదవ, నీమునిశ్రేష్ఠునకు భార్య ♦ నేను నేన
యగుదు నని కన్య లిట్లొక్క♦పగిదివచ్చి, చుట్టుకొని రేక ముఖముగాఁ♦జోద్యముగను.

శా. ఇట్లుం గరిణీసముదయము♦నిభకుఁ జెందుచ్రిఁ, గ్రమ్ముకొనినట్లు నారా♦చకన్నెలైదు
పదులు వారొక్కగమిగ సౌ♦భరిని జుట్టి,నిలువ మాంధాత సంతోష♦కలితుఁడగుచు.

క. తన దుహితలయిష్టముచొ,ప్పున నందఱ మునికి నిచ్చి ♦ పొలుపొందఁగఁ బెం
డ్లిని జేయ నతఁడు పత్నులఁ, గొని యాశ్రమమునకుఁ జనె న♦సుంకితలీలన్. 42

ఆ. అచట భార్య లెంద ♦ ఱందఱ కన్నిగృ,హములు మౌనివరుఁడు ♦ నమరశిల్ప
కారియైన విశ్వ♦కర్మను రావించి, యతనిచేత నపుడు ♦ నైమపదులు. 43

సీ. కట్టించె నవి మహా♦ఘనరమణీయమై, బంగారుమేడ లు♦ప్పరిగెల మణి
స్ఫటికపురాతికం♦బముల మండపములఁ, గాంచనరత్నప్రా♦కారములను
సుందరమైన వా♦చూరు పట్టెలు పతా,కలును సోపానముల్ ♦ కలిగి చిత్రి
తములుగా నున్న♦ద్వారబంధములు క,వాటముల్ కిటికీలు ♦ మేటిరత్న
తే. ముల నమర్చిన తోరణ♦ములను గలిగి, దాసదాసీజనంబుల ♦ ధాన్యధనము
లొప్పిదంబగునట్టి గృ♦హోపకరణ,ములను సర్వసమృద్ధిగ ♦ నలరుచుండె. 44

క. ఇటు విశ్వకర్మకలనం, బటుతరముగఁ గట్టఁబడిన ♦ భవనములందున్
జటిలుఁ డగు తపసి సౌభరి, కుటిలాలకలైన తనదు♦కూరిమిసతులన్. 45

ఉ. కాపుర ముంచి వారిపయిఁ ♦ గల్గినకామసుఖోపభోగముల్
చేపలగుంపుచందమునఁ ♦ జెందుచు నుండెను రాచకన్నె లా
తాపసికూర్చినట్టి ధన♦ధాన్యము లాది సమస్తవస్తువుల్
లోపము లేక దేవసతు♦లో యని సర్వసుఖావహంబుగాన్. 46

సీ. ఇటు కొంతకాలము ♦ నటియింప ధరణీశుఁ, డొకనాఁడు తనదుపు♦త్రికల నల్లు
నిని జూచుకోరిక ♦ మనమున జనియింప, మున్యాశ్రమముఁ జేరఁ ♦ బోవ నచట
ధగధగ మెరయు ర♦త్నముల ధాతువులచే, నిగనిగలాడు మె♦ఱుఁగు పసిండి

చవికెలకాంతుల • చాలు మేడలబారు, కోట లనేకముల్ • కొలువుకూటు
ఆ. ములను వ్రేలుచున్న • పూదండ లంతట, నిండి కొదువ లేక • నిర్మలమగు
మానియునికిపట్టు • మహిమఁ గనుంగొని, సంతసంబుఁ బొంది • జనవిభుండు. 47

క. ఒకముద్దుపట్టిగీమున, కకలంకస్థితిని జనఁగ • నవు డెదురుగఁ బు
త్రిక వచ్చి తండ్రిపాదములకు నెఱఁగిన గారవించి • లాలన మెసఁగన్. 48

ఉ. అప్పుడు రాజు కూఁతునెడ • నాదరముం జనియింప నమ్మ! నీ
వొప్పుగ సర్వసౌఖ్యముల • నొంది సుఖించెదె? తల్లి! నీవు న
న్నెప్పుడునుం దలంతువె? య•నేకసుఖంబుల నిచ్చు భర్త నె
ల్లప్పుడు నీపయిం గడుద•యారస ముప్పతిలం జరింతువే? 49

సీ. అని పల్కు వాక్యము • లాలించి నాయనా!, మృష్టాన్నమును ఘన•మృదులశయన
వస్త్రాభరణములు • పప్పు బియ్యము నెయ్యి, నూనె బెల్లము పాలు • తేనె పెరుగు
వంటకట్టియలు ల•వణము కావలసిన, సకలవస్తువులు ర•సాయనములు
కందమూలాదులు • కస్తూరి మొదలగు, పరిమళద్రవ్యముల్ • బహుధనములు
తే. దాసదాసీజనంబులు • దగినయటులఁ, గలిగి నాయింట నిటువంటి • కాపురంబు
నవనిలోపలఁ గనుపింప • దంతెకాక, పతియు నెప్పుడు న న్నెడ • బాయకుండు.

తే. పట్టుగా నుండి నాయిల్లు • పవలు రాత్రి, నెడపడక భోజనము నిద్ర•లిచటఁజేయు
చుండి నాపయిఁ బ్రీతిచే నుండి నాదు, సోదరీమణులగృహముల్ • చొరకయుంట.

తే. నాకుఁ గల్గిన సౌఖ్యము • నాసహోద, రీజనంబునకును లేమి • నొజఁ గుందు
చుందు నింతయుకాని వే•ఱొండులేద, టంచువచియించుకూఁతువా•క్యములు వినియు.

క. మఱి యొకకూఁతుగృహమ్మున, కరుదెంచిన జనకురాక • నరసి యెదురుగా
నరుగ నొందలిదుహితవలెన్, జరణములకు మ్రొక్కి తనదు • సౌఖ్యముఁ దెలిపెన్.

తే. ఏఁబదుగురుకూతులయిండ్ల • కిటులనరిగి, యంద రొకరీతిగాఁ దాము • ననుభవించు
సౌఖ్యములు దెల్ప మాంధాత • సంతసించి, మందహాసాంచితముఖార•విందుఁడగుచు.

మ. తనజామాతను సౌభరిన్ గని మహా•త్మా! నీతపస్సిద్ధి నే
గని మోదించితి నిట్టి నీ మహిమముల్ • గానంగ లే దెన్నఁడైఁ
నను మత్పుత్రికలన్ నిరంతరము స•న్మానంబుతోఁ గాపురం
బును వర్ధిల్లఁగఁజేయుచుండు మని సం•బోధించి నిశ్చింతుఁడై. 55

సీ. ధరణీవిభుఁడు తన • పురమున కేతెంచె, నంతటఁ గాలము • కొంత గడువ
రాచకన్నెలు ముని • రాజుసాంగత్యము, వలన నొక్కొక్కరు • వహ్నితేజ
ముసు బోలు తనయుల • ముగురేసి గన వారు, నందఱు నూటిపై • నైదుపదులు
నై పుత్రపౌత్రుల • నభివృద్ధిచేఁ బిల్ల, చెలికీను కైవడిఁ • జెలఁగుచుండ్రి
ఆ. సౌభరియును దనదు • సతులతో సంసార, సంగమమునఁ దగిలి • శబర మనెడి
చేపగుంపుపగిదిఁ • జిరకాలసౌఖ్యము, లనుభవింపుచుండె • ననవరతము. 56

మ. ఘనుఁ డాసౌభరి ద్వాదశాబ్దముల మా♦ఘంబుల్ దపోనిష్ఠచే
తను నీటన్ వసియించి చేసిన హరి♦ధ్యానంబుచే సవిధం
బున సిద్ధించెను దత్ఫలంబు మహిలోఁ ♦ బుణ్యాత్ము లీలాటి వ
ర్తనలందున్ విహరింప మాఘఫలమున్ ♦ బ్రాప్తించు నిక్కంబుగన్. 57

క. విను మీ సౌభరిచరితము, వినిచిన నాలించినను భు♦విన్ శ్రద్ధను వ్రా
సినవారలు నన్వయవృ,ద్ధిని జెంది యశమ్ముఁ గాంత్రు ♦ ధీరవరేణ్యా! 58

చ. అనుచు వసిష్ఠుఁ డిట్లనియె ♦ నామృగశృంగుఁడు శాస్త్రరీతిగా
నొనర వివాహమై ద్విజుల ♦ నొప్పిదమౌ నిగమార్థపద్ధతిన్
ఘనగృహమేధిధర్మములఁ ♦ గైకొని తప్పక చేయుచుండె నో
మనుజవరేణ్య! యమ్మునిస♦మానగృహస్థులఁ గాన మెయ్యెడన్. 59

ఆ. అతనిసతులు నల్వు ♦ రగు సువృత్త కమల, విమల సురస యనఁగ♦నమితమతులు
పతినిగూర్చి రాత్రి ♦ పవలు శుశ్రూషలుఁ, జేయుచుండు రెపుడు ♦ చెన్నలరఁగ.

క. ఇటు మృగశృంగునిదయితలు, పటుతరముగ సలుపునట్టి ♦ పాతివ్రత్యం
బెటు చూచిన శేదను త,జ్జటిలునివాక్యముల కలరి ♦ జనపతి పలికెన్. 61

క. అతులగృహస్థాశ్రమప,ద్ధతులు పతివ్రతల కుండఁ ♦ దగు లక్షణముల్
మతిఁ దగులఁ దెలుపు మను వసు,మతినాథునితో వసిష్ఠ♦మౌని యిటు లనెన్. 62

## గృహస్థధర్మములు.

సీ. నరనాథ! విను మంచి ♦ నడవడి గల మర్త్యుఁ, డిహపరముల రెంట ♦ నెనయవచ్చు
నందుల కాధార♦మైన గృహస్థాశ్ర,మమునకు నియతధ♦ర్మములు దెల్పె
దను గృహస్థుఁడు వేకు ♦ వను లేచి ధర్మార్థ,ముల విచారించి యా♦వల ముహూర్త
కాలము వానిచేఁ ♦ గలుగు పరిశ్రమ, మరసి గ్రామముబైట ♦ నరిగి నిరృతి
ఆ. భాగమందు నొక్క ♦ బాణమువ్రేటున, కవలఁ దనదుగృహము ♦ నంటకుండఁ
గసవుచేత నిండి ♦ కనుపట్టు భూమిపై, దినముఖమున సాయ♦మున నిరతము. 63

తే. చెవికిఁ జందెము బిగఁజుట్టి♦ చేలము తలఁ,గప్పి యుత్తరముఖుఁ డయి♦ కాచియుమియ
కుండ నుచ్ఛ్వాస లిడక కూ♦ర్చుండి మౌన,మున విసర్జింపవలె మల♦మూత్రములను.

ఆ. విడుచుమలముఁ గనక ♦ తడవు నాలస్యము, జరుప కచట లేచి ♦ పురుషచిహ్న
మమరచేతఁ బట్టి ♦ యగ్నికార్యముల క,క్కరకు రాని యెందు♦కసవుచేత. 65

ఆ. గుదము తుడిచికొనుచుఁ ♦ బదవడి దుర్గంధ, మడఁగిపోవునటుల ♦ నెడమచేత
మట్టితోడ లెక్క♦బెట్టుచు నీటఁ బ్ర,క్షాళనంబుసేయఁ♦జను నరేంద్ర! 66

తే. అట్టిప్రక్షాళనము నదు♦లందుఁ గొలకు, లందురేవులయందు బ్రా♦హ్మణుని కెదుట
నీటి కెదురుగఁ జేయుట ♦ పాటిగాదు, అంబువులు దెచ్చి బైటఁ జే♦యంగవలయు

తే. జలమునకుఁ బాత్రి లేనట్టి ◆ సమయమందు, రేవునకు గొంత యెడముగా ◆ బావివగిది
బిడిశిలితిమూర లోతు నే ◆ ర్పడఁగ గుంట, నొకటిఁ గావించి దానికి ◆ నుదకమపుడు.

సీ. నించి తజ్జలము శే ◆ నీటను బడకుండ, మట్టిగుంటకుఁ జుట్టు ◆ కట్టవేసి
యానీటిచే గుద ◆ మైదుసారులు లింగ, మొకతూరి పెడచేత ◆ నొనరఁ గడిగి
శుద్ధిగావించి యా ◆ చోటి మృత్తుకతోడఁ, బదిమారు లెడమకేల్ ◆ వయివయిపున
నయిదుసారులు చేతి ◆ యడుగున హస్తముల్, కాళ్ళేదుమాఱులు ◆ కడుగుకొనుచు

ఆ. నచటు బాసి కొంచె ◆ మావలికిని జని, మట్టిచేత నైదు ◆ మార్లు కాళ్లు
హస్తతలము లేదు ◆ నావృత్తులును శుద్ధి, పరచి నీటఁ గడిగి ◆ పార్థివేంద్ర! 69

తే. అటులఁ బరిశుద్ధుఁడైన బ్రా ◆ హ్మణుఁడు చేల, మొదవఁగాఁ జుట్టెనిక ముడి ◆ వదలిమరల
తిన్నఁగా వేసికొని మెడ ◆ జన్నిదమును, సవ్యముగ జేసికొనుచు నా ◆ స్థలము విడిచి.

సీ. ముందటికిని జేర్చ ◆ మోకాళ్లను త్తర, ముఖముగ శుభ్రమై ◆ పొసఁగుచోట
గూర్చుండి నీరు ఛే ◆ కొని పుక్కిలించి వే, యఁచుఁ బవిత్రములను ◆ నునిచి వేళ్ల
బ్రహ్మతీర్థమునైపు ◆ రహినాచమించియుఁ, గనులు తుడిచికొని ◆ కాష్ఠ మొకటి
జలమునఁ గడిగి హ ◆ స్తమునందు నుంచుక, వృక్షశాఖా! నాకు ◆ వెసఁగ నెక్కు

తే. డాయువు బలము తేజము ◆ యశము ధనము, పసులు నిసువులు నాగమ ◆ ప్రాప్తిబుద్ధి
మేధ దయచేయుమను చు సం ◆ బోధనగల, మంత్రమును జెప్పి కొనియాచ ◆ మనము చేసి.

సీ. ప్రాఙ్ముఖంబున నుత్త ◆ రముఖుఁడై కూర్చుండి, పండ్లు దోమఁగనగు ◆ బ్రాహ్మణుండు
ఆపుల్ల శాస్త్రము ◆ నందుఁ జెప్పినవిధం, బున నుండవలయును ◆ మనుపు నుడివి
నట్టిమంత్రమున నా ◆ ప్యాయస్వ యనెడి యి, త్యాది మంత్రములతో ◆ దంతధావ
నము చేయవలె జన్మ ◆ నక్షత్రమున నష్టమి నవమి పున్నమ ◆ దినములందు

తే. పాడ్యమియు షష్ఠి ద్వాదశి ◆ పర్వములను, శ్రాద్ధతిథులను మిథునక ◆ ర్మము తలంటు
దంతధావనమును జేయఁ ◆ దగదు విప్రుఁ, డగు గృహస్థుఁడు భానువం ◆ శాబ్ధిచంద్ర! 72

క. ఋతుమతియై స్నానము స, మ్మతిఁ జేసిన భార్యనైన ◆ మాతాపితరుల్
మృతినొందిన దివసములను, రతికి నపేక్షింపఁదగదు ◆ రాజకుమారా! 73

తే. ద్వాదశిచతుర్దశితిథుల ◆ పత్నిసంగ, మంబు చేసిన నేమి దో ◆ షంబు లేదు.
పండ్లుదోమెడిపుడకను ◆ ముండ్లచెట్టు, పాలచెట్ల గ్రహింపఁగా ◆ వలయుబుధులు.

ఆ. అది చిటికెనవ్రేలి ◆ యంతటిలావును, ద్వాదశాంగుళములఁ ◆ దనరు పొడవు
గలిగి దాన బుడుపు ◆ గంట్లు లేకుండుట, శాస్త్రసమ్మత మగు ◆ జనవరేణ్య! 75

తే. దంతకాష్ఠము మొదలు చి ◆ త్తరువు వ్రాయు, కూర్చవిధమున మెత్తగాఁ ◆ గొట్టిపండ్లు
తోముకొనవలె నేయేతి ◆ థులను గూడు, ననుచు శాస్త్రము గలదొ యా ◆ దినములందు

సీ. పండ్రెండుమాఱులు ◆ పానీయముల నోరు, పుక్కిలించిన శుద్ధిఁ ◆ బొసఁగునైన
భోజనద్రవ్యముల్ ◆ భుజియింప నమలిన, ముఱికిఁ బోవుటకునై ◆ పారకులాకు
లను దంతధావన ◆ మొనరించి ముఖమార్జ, నము చేసి యాచమ ◆ నమును జేయఁ

ఆ. బరిశుద్ధుఁడగు నంతఁ • బవమానదు్రపదాది, మంత్రలింగములను • మఱియుఁగొన్ని
అనువాకములచేత • నఘ్మర్షమంత్రము,లను జలంబుల శిరం • బునను జల్లి
కొనుచుఁ బ్రాతః స్నానముననుఁ జేసి దరిఁజేరి, యాచమనము జేసి • యంతమీఁద
తే. పదములను రెండు నొకచోట • గదియ నుంచి, యుత్తరము తూర్పు దెసలలో • నొకముఖముగ
నీరముల గొని దోయిట • నిలిచి కనుబొ,మల పాడెవు నెత్తి తేజస్సు • ములను నీట.
తే. విడువవలె విప్రవాసము • వ్రేళ్లయందు, నెచట నేతీర్థములు గల • వచట దేవ
ఋషిపితరతర్పణమును సం • ప్రీతిఁ జేయ,వారు తృప్తివహింతు ర • వార్యచరిత! 79

వ. అట్లు కావున బ్రహ్మతీర్థమునకు బొటనవ్రేలి మొదటను, ఋషితీర్థమునకు చిటికెన వ్రేళ్లరెంటినడుమను, పితృతీర్థమునకు మొదటివ్రేలిచూపుడువ్రేలిమధ్యను నివాసస్థానములై యుండును. తద్విధముగా దేవతలు మొదలగువారికి తర్పణమువిడచి.

సీ. * ఉదకముదరిఁ జేరి • యుతికి యార నిడిన, తెలుపువసనమును • నెుఁలఁ గట్టి
యుత్తరీయము వయి • నుంచి జుట్టును ముడి, వెట్టి చేతులు రెండు • మట్టివేసి
రుద్ది కడిగి మరి • తద్దయు నాచమ, నముచేసి యూర్ధ్వపుం • డ్రము ధరించి
భూతిచేతఁ ద్రిపుండ్ర • మును గాని గోపిచం, దనము మృత్తిక నైన • దాల్చుకొనుట
ఆ. సుచితమగును భస్మ • మూర్ధ్వపుండ్రముగాని, మట్టిచేత నడ్డ • బొట్టుగాని
బెట్టఁగూడ దటులఁ • బెట్టినఁ బ్రళయము, వరకునుండు వాఁడు • నరకములను. 81

వ. ఊర్ధ్వపుండ్రతిర్యక్పుండ్రములను శాస్త్రము ననుసరించి పెద్ద లాచరించిన క్రమమున ధరించి పుండ్రధారణమైనపిదపఁ దర్జనీమధ్యమాంగుష్ఠములచే నాసికమును బిగబట్టి "ఓం భూః," అనుమంత్రముచేత ప్రాణవాయువులను బంధించి విడిచి పిమ్మట సంధ్యావందన మాచరింపవలయును. అది యెట్లనగా "ఆపోహిష్ఠా" యనుఋక్కుచేత దర్భలతో మార్జనము చేసికొనవలెను. ఆఋక్కుయొక్క మొదటినాలుగుపాదములు ప్రణవముముందుఁ జేర్చియు వెనుకటినాలుగింటికి జేర్చకయు చెప్పి ప్రణవమును ముందు జేర్చి అన్నిఋక్కులను జెప్పుచు భూమియందును, శిరస్సునందును, ఆకాశమునందును, మఱల శిరస్సునందును, భూమియందును ఆకాశమునందును తిరిగి శిరస్సునందును దర్భలతో నుదకమును ప్రోక్షించి, పిమ్మట

---

శ్లో. "ఆచమ్య ప్రయతోభూత్వా హ్యూర్ధ్వపుండ్రంచ ధారయేత్,
భస్మేతేన త్రిపుండ్రంచ గోపిచందనమృత్తికా.

శ్లో. ఊర్ధ్వం నశారయే ద్భస్మ, మృదా తిర్య క్నధారయేత్,
భసితే నోర్ధ్వపుండ్రంచ, సదా తిర్యక్చ యో ద్విజః,
ధారయే న్నరకే ఘోరే వసే దాకల్పసంక్షయాత్,
ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రంవా పూర్వాచరిత మాచరేత్."
ఇతి పాద్మపురాణే—మాఘమాహాత్మ్యే పుండ్రద్వయనిర్ణయః—

శరీరమునం దంతటను బ్రోక్షించుకొని “ఓం భూ ర్భువ స్సువః” అనువ్యాహృతి మంత్రమును జెప్పి నీళ్లు చుట్టి యాచమనము చేయవలెను. ‘ఆపోహిష్ఠా’ యనునది మంత్రము, సింధుద్వీపఋషి, అనుష్టుప్పు ఛందస్సు, అప్పులు (నీళ్లు) దేవత; ఈ మంత్రమునను నీళ్లు చల్లుకొనుట వినియోగము. ఇట్లు బ్రాహ్మణుఁడగువాఁడు సమ్మార్జనము చేసికొని పిమ్మట మంత్రపూర్వకముగా నాచమనము చేయవలయును. అనంతరము ప్రణవముతోఁ గూడిన ఋగ్యజుస్సామవేదములను “ప్రీణాతు స్వాహా” అని చెప్పుచు నొక్కొక్కవేదము నొక్కసారి చెప్పుచు మూడుమారులు ఆచమనము చేసి బొటనవ్రేలి మొదటితో రెండుపెదవులను, అడ్డముగా రెండుమాఱులు తుడుచుకొని అథర్వాంగిరసము లను మంత్రములను బ్రాహ్మణము లనుమంత్రములను స్మరించి రెండుపాదములపైని, హస్తములపైని, నీళ్ళు చల్లుకొని మూతి తుడుచుకొని కర్మములను నడపునట్టి క్రమము నెఱిఁగిన పండితులు బోలుత నొకటితో నొకటి చేరుకొన్న మూఁడు వ్రేళ్లచేత ఇతిహాసములను కల్పసూత్రములను విశేషకథలను “నారాశంసా” అను మంత్రములను దలఁచి యుదకమును ముట్టి శరీరము అవయవములను దుడుచుకొందురు. బొటనవ్రేలిచూపుడువ్రేలి చేరిక గల పుడిసిలితో జలము నెత్తి నాసికారంధ్రములను వేఱువేఱుగా దాకించి విడిచి “సూర్యశ్చ” అనుమంత్రముచేత మంత్రింపఁబడిన జలమును బుచ్చుకొనవలయును. అనంతరము దోసిట నీళ్లెత్తుకొని సూర్యునకు నెదురుగా నిలిచి గాయత్రిచేత నభిమంత్రించి పయికెత్తి క్రిందఁ బడునట్లుగా ముమ్మారు విడిచి ఆకాశమును జూచుచుఁ బ్రాతస్సంధ్యను స్తోత్రము చేయవలెను. అనగా సూర్యోదయము కాకమునుపే యిట్లు చేయవలెను. పిమ్మట భాస్కరుఁడు గనఁబడునంతవరకు గాయత్రీజపము జేసి యంతట సూర్యదేవతాకములైన మంత్రములచేత ఉపస్థానము చేసి ప్రాతస్సంధ్యను గాయత్రి, సావిత్రి, సరస్వతి, అనుమంత్రాధిదేవతలను, “కామోకార్షీత్” అనుమంత్రమును బ్రార్థించి, ఎల్లదేవతలకొఱకును ఆఱుప్రదక్షిణములు చేసి తనయడుగులు మోపినందుకు భూమికి నమస్కారము చేయవలెను. 82

సీ. ఎవఁడు సక్రమముగా ♦ నిటుల సంధ్యావంద,నము చేయు వానికి ♦ నాకమర్త్య
పాతాళమున నెందుఁ ♦ బడయని సౌఖ్యము, లేదు సంధ్యావంద ♦ నాదివిధులు
జరిపినతదుపరి ♦ శాస్త్రపద్ధతిని హో,మము చేసి నిత్యదా ♦ నము నొసంగ
వలయును దివ మష్ట ♦ భాగముల్ గావించి, వానిలోపల నాది ♦ భాగమందు
తే. నిపుడు చెల్పిన కర్మము ♦ లెనయఁ జేసి, రెంట వేదాధ్యయనము వ ♦ ర్ణించుచును స
మిధలు దర్భలు పూవులు ♦ మొదలగునవి, యార్జనము చేసికొనవలె ♦ నవనినాథ!
తే. అవలమూఁడవకాలము ♦ నందు దేహ,మునకు శ్రమపెట్టకయ దొర ♦ కినవరకును
ద్రవ్య మార్జింపవలయు సం ♦ ద్బ్రాహ్మణునకు, నిర్ణయంబైనషట్కర్మ ♦ నియతివినుము.
తే. జన్నములు చేయఁజేయింప ♦ శాస్త్రనిగమ,ములను చదువుట జదివింప ♦ సలలితముగ
దానమిచ్చుట కొనుటస ♦ త్కర్మ లివియు, నాఱు బ్రాహ్మణులకుఁజెల్లు ♦ నందులోన.

తే. వేదములఁ జదివించుట వివిధయాగ,ములను జేయింప యోగ్యులవలన దాన
ములను జేకొనుటయును నీమూఁడు జీవ,నములు విప్రులకై యొప్పనయగుణాఢ్య!

సీ. అటు నాలుగవభాగమందు మాధ్యాహ్నిక, స్నానమ్ము గావించి సకలదేవ
తలకు ఋషులకుఁ బితరులకు నాయాతీర్థ,ములగుండఁ దర్పణములను జేసి
యవల "నాపోహిష్ఠ" యనెడు మంత్రములచే, జలమును శిరముపైఁ జల్లికొనుచు
'నాపః పునంతు'చే నభిమంత్రితం బైన, యంబువులను గ్రోలి యాచమనముఁ
జేసి పిదప నీరు దోసిటఁ బట్టి గా,యత్రిఁ జెప్పి రవికి నర్ఘ్యము నిడి
స్వస్థచిత్తుఁ డగుచు సావిత్రి జపియింప, వలయు నింక వినుము వసుమతీశ! 87

వ. సావిత్రి జపియించిన పిమ్మట సూర్యోపస్థానము చెప్పి ప్రదక్షిణనమస్కారము
లను జేసి దర్భాసనాసీనుండై పవిత్రములను వ్రేల ధరియించి చేతులు జోడించు
కొని బ్రహ్మయజ్ఞముకొఱకు శక్తి కొలది వేదము పఠియించి ఋక్కు, యజుస్సు,
సామము అనబడు మూఁడు వేదములందును జెప్పఁబడినమంత్రములను శాస్త్రపద్ధ
తిని జపించి జందె ముపవీతముగా దేవతలకును, నివీతిగా ఋషులకును, ప్రాచీన
వీతిగాఁ బితరులకును గ్రమముగాఁ దర్పణముచేసి యెల్లభూతములకు జలప్రదానము
జేసి జలదేవతలకు మ్రొక్కి, 88

ఆ. ఇంటి కరుగుదెంచి యీశ్వరారాధనఁ, జేయ నుత్సహించి శివుని పార్వ
తిని వినాయకుని రవిని విష్ణుఁ బూజించి, యవల వైశ్వదేవ మలరఁ జేసి. 89

వ. యథావిధిగా బలులుపెట్టి పిమ్మట పంచమహాయజ్ఞములను భూతబలిని జేయ
వలెను. శ్లో. శ్వానౌ ద్వౌ శ్యావశబలౌ, వైవస్వతకులోద్భవౌ
తాభ్యా మన్నం ప్రదాస్యామి రక్షేతాం పథి మాం సదా.

అను మంత్రమును జెప్పి కాకికిని, కుక్కకును బలి యిచ్చి యవల దేవతలు పశు
వులు పక్షులు సిద్ధయక్షసర్పరాక్షసులు ప్రేతములు పిశాచములు వృక్షములు
మొదలగు ప్రాణులలో నేప్రాణు లన్నమును గోరుచుండునో యాప్రాణు లెల్లను
నాచేత నియ్యఁబడెడి యీయన్నముచేతఁ దృప్తిఁబొందవలెను. చీమలు పురుగులు
ఈఁగలు మొదలైనవి పూర్వముచేసిన చెడ్డపనులవలనఁ దక్కువజన్మము నొంది
యాఁకలిఁగొనియుండు నట్టివన్నియు నాచేత నియ్యఁబడునట్టి యీయన్నమును దిని
తృప్తిపడి సుఖింపవలయును. 90

సీ. తలిదండ్రు లన్నదమ్ములు చుట్టములు లేమి, నన్నము గానక యలమటింతు
రెవరు వారలకు నేనిడినట్టిదగు నన్న, మున దృప్తులయి సుఖమున వసింతు
రను మంత్రమున బలులను బెట్టి యాచమ,నము చేసి బైటద్వారమున నిలిచి
యభ్యాగతుని బూజకయి సాలు నావున, బితికినంతటికాల మతిశయించు
ఆ. కాంతుఁ డనరఁ జూడఁగా నంతలోపల, నతిథి వచ్చెనేని యధికభక్తి
పూజ లొనరఁజేసి పాలుపార భోజన,మునను దృప్తిపరచి మోద మొదవ. 91

ఆ. యతికి బ్రహ్మచారి•కన్నము పప్పు కూ,రలను భిక్ష చేయు • వలె గృహస్థుఁ
డైనవాఁడు జరుప•మాని భుజింప చాం,ద్రాయణవ్రతమునఁ • దనరవలయు. 92

ఆ. యతికి భిక్ష చేయు•నపుడు వాతని పాణి,తలమునందుఁ దొలుత•జలము నుంచి
యన్నకబళ మొకటి • హస్తమునం దుంచి, మరల నుదక మిడఁగఁ • బరగు భూప!

తే. ఇటుల చేసిన భిక్ష పెం•పెసఁగుఁ గాంచ, నాద్రివలె జలం బబ్ధిగ•నతిశయ మగు
నేగృహస్థుఁడు యతిభిక్షనిటుల చేయు,నతఁడు గోదానఫలముఁ దా•నందఁగలఁడు,

తే. కలఁ డనుచు షడ్గుణైశ్వర్య•కలితుఁడైన. యమునుమహర్షి వచించె గృ•హస్థుఁడైన
వాఁడు పితరులు గురువు లా•బాలవృద్ధు,లతిథులును గర్భవతులు న•భ్యాగతులును

సీ. వీరు భుజించిన • వెనుక నింపాదిగా, గాళ్ళును జేతులు, • గడిగి వార్చి
పరిశుద్ధుఁడై యంత•బాగైన తావున, మౌనియై యుండి ని•ర్మలినమైన
పాత్రమం దిడినట్టి • పక్వాన్నమునను లో,పముల నెన్నక ముందు•ప్రాణములకు
నాహుతుల్ వేయుచు • నవల భక్షణసేయఁ,దగును ప్రభాత సం•ధ్యలను రెంట

తే. నెటుల హోమము వేల్చెద•రటుల నియత,మౌను భుక్తికిఁ దలఁప గృ•హస్థుఁడైన
వాఁడు వేర్వేరుగా మరి•తోడు లేక, భోజనముచేయఁ గూడదు • రాజసమున. 96

సీ, కంచుపాత్రమున భుం•జించువానికి నాయు,వును కీర్తి బలమును • బుద్ధి చాల
నధికమై కనుపట్టు•నాలు మగఁడు నొక,పాత్రయందు భుజింప•వలయునన్న
నది నూటరూఁబడి•యగు పలములరొత్తు, కంచుగిన్నియను జే•యించవలయు
నటులఁ గాకుండిన•నాదంపతులు భుజిం,చుట వేరువేరు గాఁ • జూడవలయు

ఆ. నువనయనము కాక•యుండినమగవాని, పెండ్లికొని యాఁడు•పిల్లదాని
ప్రౌఢలైనయాఁడు•వారల పొత్తున, భోజనమును జేయఁ•బోసఁగ దెపుడు. 97

సీ. అటుల భుజించుబ్రా•హ్మణుఁడు చాంద్రాయణ,వ్రతమును జరుపఁగ•వలయు జన్ని
దము కంఠమునఁ బూల•దండగా నిడుకొని, పసిబిడ్డలయు నాఁడు•వాండ్రపొత్తు
శేరి భుజించుట•చేత సంభవమైన, పాప మావిధమున•బాపికొనఁగ
వచ్చునుగాని, దం•పతులుపొత్తున నొక,కంచమందున దిను•కలుష మెటుల
బాపుకొనఁజాల రటుగాన•భార్యపొత్తు,నన్నమును గూడ డెప్పుడు • నాకులోన
వంటకము నుంప నది రస•వర్గములను,బిడికెఁడన్నముఁ జేర్చి నే • వేసి కలిపి. 98

శ్లో. నమాంతాన్ ప్రణవాదీంశ్చ బలిం దత్వా ప్రదక్షిణే,
యత్రక్వచ నసంస్థానాం క్షుత్తృష్ణోపహతాత్మనామ్.

శ్లో. భూతానాం తృప్తయే తోయ, మిద మస్తు యథాసుఖం
యమాయేదం నమ శ్చిత్రగుప్తా యేదం నమోనమః.

వ. అను శ్లోకముల నుచ్చరించుచు యమచిత్రగుప్తభూతములకు బలిగా నీయఁబడిన యీయన్నము సమస్తభూతతృప్తికొఱకు నగుగాక యని యముని జిత్రగుప్తుని గూర్చి నమస్కారము చేసి ఓమ్ అనునది మొదటను స్వాహా యనునది కడ

వటను గల ప్రాణాదిమంత్రములను జెప్పుచు ప్రాణాహుతులను దీసికొని భోజనముచేయవలెను. 101

ఆ. ప్రాణములకు నన్న♦మాహుతు లిడువేళ, దంతములకు నవియుఁ ♦ దగులనీక
జప్పరించి మ్రింగ ♦ నొప్పగు నాలుక, చేత భోజనంబు♦ సేయునపుడు. 102

తే. బుద్ధి నితరవిషయములఁ ♦ బొందనీక, మొదట మంచిపదార్థముల్ ♦ పిదప నువ్వు
పులుసు కారము వగరుచే ♦ మిళితమైన, శాకసులతోడ భుజియింప♦జను నరేంద్ర.

ఆ. అవల ద్రవము కఠిన ♦ మావల ద్రవపదా, ర్థముల నిటుల భోజ♦నమును జేసి
నట్టులైన బలము♦ నారోగ్యమును దేహ, మునను బాయకుండు ♦ జనవరేణ్య! 104

సీ. ఆహారనియత మె♦ట్లనఁగఁ జెప్పెద శ్రద్ధ, వినుమయ్య సన్న్యాసి♦యెనిమిదియును
నరయ వానప్రస్థుఁ♦డైనట్టియాతఁడు, పదియాఱు దాని కి♦బ్బడి గృహస్థు
వడుగు తా నిష్టము ♦పగిదిని వంటక, కబళముల్ భుజియింప♦గాఁ దనరును
పిడికిలినిండుగా ♦ పిడుచ చేసిన నది, యొకకబళ మనంగ ♦ నొప్పుచుండు
తే. ఇట్టి నియమము లన్నియు ♦ మట్టుపరచి, శాస్త్రపద్ధతి విడుచుట ♦ సరణి గాదు
శీతసుప్పాన్నభక్షణ ♦ చేయఁగూడ, దనుచు నార్యులు పలుకుదు ♦ రఘువిదూర!

సీ. బ్రాహ్మణుఁ డెపుడు నేఁ♦బైనఁ జెల్పినపద్ధ, తిని భోజనము నాచ♦మనము చేసి
కాళ్లను జేతులు ♦ గడుగునప్పుడు మట్టి, తో హస్తములు మూఁడు ♦ తోమి కడిగి
పదియాఱుమారులు ♦ నుదకముచే పుక్కి, లించి, వేయఁగ నోట ♦ మంచి దగును
భక్షించునప్పుడు ♦ పండ్లసందున చిక్కు, కొనుదాని నొకయాకు♦ననో పాఱకనో
తే. గ్రుచ్చితీయుచుఁ జెయి గడు♦గుకొని యాచ, మనముజేసియు నవల భో♦జనము చేసి
నట్టియాకును దీసి తా ♦ నచట శుద్ధి, జేసి తిరిగియాచమనము♦ చేయవలయు. 106

వ. అట్లు పరిశుద్ధుండై చెయ్యి కొంచెము తేమచేసికొని శ్వాసము విడువక కూర్చుండి యరచేత నాభిప్రదేశమును దడివి "అంగుష్ఠమాత్రః పురుషః" అనుమంత్రమును జెప్పి చేతివ్రేళ్లను నీళ్లతోఁ దడిపి బొటనవ్రేలిగుండ నర్ఘ్యమును విడిచి యాచమనముచేసి చేతులు పైకెత్తుకొని సూర్యుని జూచుచు "శ్రద్ధాయాం ప్రాణేన" అను నైదుమంత్రములచేతను సూర్యోపాసన జేసి నిర్మలమును శాంతిబొందినదియు నైన మనసుతోఁ బీటమీఁదఁ గూర్చుండి యిష్టదేవతల ధ్యానముచేసి యాచమించి సంతోషము నొందినవాఁడై తాంబూలచర్వణం బొనరించి. 107

సీ. భోజనాయాసము ♦ పోగొట్టుకొనుటకై, కూర్చుండి పిమ్మట ♦ కొంతవరకు
తత్త్వవిచారము ♦ ధర్మశాస్త్రవిమర్శ, చేత నఖిలపురా♦ణేతిహాస
కథలచే నాతఁడు♦ కాలములను బుచ్చి, యష్టభాగమున లౌ♦క్యవిషయముల
మర్యాదచొప్పున ♦ మానక కావించి, యవల సాయమున సం♦ధ్యావిధులకు
తే. పురము వెలుపడి జలముల♦దరికిఁ జేరి, కాళ్లు చేతులు తిన్నఁగాఁ ♦ గడిగి వార్చి
వ్రేళ్లయందు పవిత్రముల్ ♦ బెట్టి భానుఁ, డర్థముగ నస్తమించెడు♦నట్టివేళ. 108

వ. ప్రాణాయామము చేసి జలదేవతాకమైనమంత్రములచేత నుదకము ప్రోక్షించుకొని
'అగ్నిశ్చ' యను మంత్రమును ఋషిచ్ఛందాది దైవవినియోగములతోడ 'నుచ్చ
రించి యామంత్రములచేత నభిమంత్రించినజలమును బుచ్చుకొనవలెను. 'అగ్నిశ్చ'
యను మంత్రమునకు ఋషి సూర్యుఁడు, ఛందము గాయత్రి, అగ్నిహోత్రుఁడు
దేవత, జలమును బుచ్చుకొనుట వినియోగము నని చెప్పఁబడియున్నది. ఈమంత్ర
ముచేత నుదకము పుచ్చుకొని రెండుమారు లాచమనముఁ జేసి. 109

సీ. కూర్చుండి వరుణది♦క్కున కభిముఖముగా, మౌనియై చెదరని♦మనసు గలిగి
జపమాల ధరియించి ♦ చక్కగా రిక్కలు, గనుపడునంతదాక ♦ గదలకుండ
ప్రణవపూర్వకమును ♦ వ్యాహృతిసహితము, గాయత్రి జపియింప♦గాఁ దనరును
నవల వరుణదేవ♦తాదిమంత్రములచే, భాస్కరోపాసన ♦ బరగఁ జేసి
ఆ. మరి ప్రదక్షిణము న♦మస్కారమును జేసి, దిక్పాలకులను మరల ♦ దినకరునకు
మ్రొక్కి గృహము జేరి ♦ గ్రక్కున సాయంత్ర,హోమ మొనరఁ జేయ♦నొప్పిదమగు.

ఆ. అతిథి వచ్చెనేని ♦ యాదరించి తగిన, పూజచేసి పిదప ♦ భోజన మిడి
హితపదార్థములను ♦ మితముగా భుజియింప,వలయు తాను బంధు♦వర్గములును.

ఆ. తిండి రాత్రిపూట ♦ దినకుండువాఁడైన, వహ్ని వేల్చుటయును ♦ వైశ్వదేవ
ములను భూతములకు ♦ బలులు పెట్టుట లివి, సాయ ముదయములను ♦ జరుపవలయు

సీ. ఆటు చేయకున్న గృ♦హస్థుండు దోషసం,కలితుఁడౌ; నారాత్రి♦కాలమందుఁ
గుడిచి చేతులు కాళ్లు ♦ గడిగి యిరుగడలఁ, దలగడదిండ్లు నిం♦పలరఁ గలుగు
మృదుశయ్యపైని స్వ♦గృహమైనఁ దూర్పుగా, నత్తవారింటను ♦ యమునిదిశను
పరదేశగతుఁడైన ♦ బడమరవైపుగాఁ,దలఁజేర్చి నిద్రింప ♦ వలయు నెపుడు
ఆ. నుత్తరపుదలాపి ♦ బొత్తిగాఁ గూడదు, రాత్రివేళ నిదుర♦రాకమును పె
సూక్తమును జపించి ♦ సుఖముగా శయనించి, యెల్లదేవసమితి ♦ యుల్ల మలర.

సీ. తలఁచి గారుడసర్ప♦దైవతాకములైన, మంత్రముల్ జపియించి ♦ మరి సమాధిఁ
జలనము లేక నా♦శన మెప్పటికి లేని, చక్రపాణికి నమ♦స్కార మొనరఁ
జేసి స్మరించిన ♦ జీవికి శుభముల, నిచ్చునగస్త్యుని ♦ శ్రీశుఁ గపిలు
ముచికుందు నస్తీక♦మునిచంద్రు మనమందుఁ, బేర్కొనఁగావలెఁ♦ బ్రియముతోడ
తలగడదిశయందునను మం♦గళకరమగు, నిర్మలోదకకుంభంబు ♦ నిలువవలయు
తగ విధివిధాన గరుడమం♦త్రమున రక్ష, చేసికొని సుఖనిద్రను ♦ జెందవలయు.

సీ. ఎల్లప్పుడును భార్య♦యెడల నాసక్తుఁడై, ఋతుసమయములందు ♦ సతిని గవయఁ
దగు వానిలోఁ గూడఁ ♦ దగనిదినంబుల, రతి మానవలయును ♦ రాత్రికాల
మగు నాల్గుయామము♦లందునఁ దొలిజాము, వేకువజామున ♦ వేదశాస్త్ర
ములచేత కాలము ♦ బుచ్చి తక్కినరెంట, బ్రహ్మత్వ మొందిన ♦ వానిపగిది
నిదురఁబోవలెసుఖముగా♦నిరత మిటుల, జరుపుకొనుట గృహస్థుల♦క్షణము అనఁగఁ
బరగు, నింకఁ బతివ్రతా ♦ పద్ధతులను, వినుము బోధింతు వాని సం♦విస్తరముగ. 115

## పతివ్రతాధర్మములు

ఉ. స్త్రీలపతివ్రతామహిమ ♦ జీవ విరించి ఫణీంద్రు లెన్నఁగా
జాలరు నాఁడువారు విన ♦ సంశయముల్ విడి ధర్మమందు సం
శీలత నొప్పు తద్విధము ♦ చిత్తమునందునఁ జేర్చి చేయఁగా
జాలుదు రీకథల్ వినుము ♦ చంచలబుద్ధి వహించి భూవరా! 116

తే. బ్రహ్మకులమున జనియించు ♦ బ్రాహ్మణులకు, మంచిమార్గమునందు వర్తించువారి
కేగతి లభించునని శాస్త్ర ♦ మెన్నఁబడెనొ, యాగతిని భర్తచేఁ బొందు ♦ నాఁడుదిగను.

క. పెనిమిటి కురూపియైనను, ననిశము చెడుపనులయందు ♦ నాసక్తుండై
నను రోగియైన దయ్యాపు, గుణచర్యగలట్టిఁడైనఁ ♦ గోపిష్ఠుఁడైనన్ 118

తే. త్రాగుబోతైనఁ గోపస్వ ♦ భావుఁడైన, జెడ్డనడుపడి చేతఁ బ్ర ♦ సిద్ధినొందు
నట్టివాఁడైన నిర్ధనుఁ ♦ డైన జూద, మాడువాఁడైన బధిరుఁడు ♦ నంధుఁడైన. 119

సీ. మూఁగవాఁడును భయ ♦ మును జూపువాఁడైన, గుచ్ఛితుండైనను ♦ గుష్ఠరోగ
ములు గలవాఁడు ముం ♦ డలమారి కడులోభి, ధనవంతుఁడైనను ♦ మనము వాక్కు
కర్మము లొకటిగాఁ ♦ గలిగి పూజించుట, కర్తుండు భర్తయా ♦ యనుదినంబు
నెపుడును బెనిమిటి ♦ కిష్టము లేనట్టి, పనులు సేయుట యెంతఁ ♦ బనికిరాదు
తే. చిన్నదైనను పెదువ ♦ చ్చినదియైన, ముసలిదైనను నన్నద ♦ మ్ముల్లును బంధు
వులును దలిదండ్రులును గొడు ♦ కులు మనుమలు, పీర లెందఱుఁ బోషించు ♦ వార లున్న.

సీ. తనవారివలనఁ బొం ♦ దినరాజయోగ్యము, లగు భోగవస్తువు ♦ లన్ని యున్న
నింటిలోఁ గలపను ♦ లెంతచిన్నవియైన, స్వాతంత్ర్యమునఁ జేయఁ ♦ జన దెపుడును
గర్వపడక కోరి ♦ కలు లేనిపోనివి, విడిచి కోపము మాని ♦ పిసినిగొట్టు
తనము లేక పరులఁ ♦ దలయొత్తి చూడక, భర్తను సంతోష ♦ పరుపవలయు
తే. నితరపురుషులచేత మో ♦ హింపఁబడక, ప్రియము పుట్టించుమాటలు ♦ వినక జనుల
రాపిడిని దేహమున వికా ♦ రమును బొంద, నీక యెప్పటికుల్ల వర్తింప నగును. 121

ఆ. మనము వాక్కు కర్మ ♦ మునఁ బరపురుషుని, దలఁపకునికి మోహ ♦ తాప మొదవ
కెంట నంట బహుగ ♦ వేద బలాత్కార, మునను బట్టువడిన ♦ మోసపోక. 122

క. చేలములఁ గప్పబడియును, జాలగ రూకలను గోర్కి ♦ జనియించుట చేఁ
జాలినదైన జనింపని, బాలిక త్రిజగములఁ గీర్తిఁ ♦ బడయు నృపాలా! 123

ఆ. పరపురుషుఁడు సతిని ♦ బలవంతముగఁ దీసి, కొనుచుఁ బోయి యింట ♦ నునిచెనేని
ధైర్య మొదవ వాని ♦ దలఁపనివృత్తిచే, మెలఁగ నిచ్చగించు ♦ మేదినీశ. 124

ఆ. పాపకర్ముఁడైన ♦ పరునిచేతను బలా, త్కారముగను జిక్కి ♦ కదలఁజాల
నట్టి యువతి వాని ♦ నంటక ప్రాణముల్, వదలెనేని మోక్ష ♦ పదవి నొందు. 125

క. తనకులమువారి నెల్లను, గనికరమున నుద్ధరించు ♦ కాంతామణి నే
మనుజుఁడు కోరకతోఁ జూ, చిన తలవంచుకొని వాని ♦ చిత్తమునందున్. 126

క. తలఁపక నవ్వీన నవ్వక, పలికించిన మారుమాట ◆ పలుకక వినన
ట్టులు నుండ యోగ్యతాగుణ,ములచేతఁ బ్రసిద్ధినొందు ◆ ముజ్జగములలోన్. 127

ఉ. చక్కనిచూపు యౌవనము ◆ సద్గుణసంపద గల్గి పేరుపెం
పెక్కినచాన యింటిపను ◆ లింపుగఁ జేయుచుఁ దన్నుఁగోలు వే
ఱొక్కని జూచి మోహపడ ◆ నొల్లక భర్త కురూపియైన లో
మక్కువ నుంచి దైవముస◆మానముగా మది నెంచి యెల్లెడన్. 128

క. సేవించునదె పతివ్రత, యీవిధముగ నుండువనిత ◆ కెపుడును లక్ష్మీ
దేవి సరస్వతి గౌరియు, వావిరి మ్రొక్కుదురు మిగుల◆వాంఛ దలిర్పన్. 129

ఉ. సుందరమౌ శరీరమును ◆ సొంపగుమాటలు శ్రోత్రప్రియముల్
డెందమునందు గోరికలు ◆ డీకొను స్త్రీలకు ప్రేమగల్గఁ జే
యందగునట్టి పూరుషుఁడు ◆ నైన మనంబునఁ దల్పకుండు నే
సుందరి సంతతంబు బరి◆శుద్ధపతివ్రత యద్ది యిద్ధరన్. 130

ఉ. కోపమునం బరాకునను ◆ గొట్టినఁదిట్టినగాని భర్తచే
నాపద గల్గెనంచు మది ◆ నాత్రము జెందక బంధుగేహముల్
తాపమునొందఁ బోక తలి◆దండ్రులడాయక నాథుఁడే సదా
ప్రాపనియోర్చి యుండగల ◆ భవ్యగుణాఢ్యలె పో పతివ్రతల్. 131

క. పరుఁ డెంతటివాఁడైనను, సరిరారని భర్త నెన్ను ◆ సతి లక్ష్మి యగున్
నరసురగంధర్వులలో, వరుకంటెఁ బ్రియుండు లేఁడు ◆ వనితల కెందున్. 132

తే. కాన బ్రహ్మాదిదేవతా◆గణముకన్న, భర్త ప్రియమైనవాఁడగు ◆ భార్య కెపుడు
అటులవర్తింపసాధ్వీకు◆లాంగన యనఁ, బరగు ముజ్జగములయందుఁ ◆ బార్థివేంద్ర!

సీ. తనభర్త భుజియింపఁ ◆ దాను భుజింపుచు, దుఃఖింప దానును ◆ దుఃఖపడుచు
సంతోషమందిన ◆ సంతోషమందుచు, మారుదేశం బేగ ◆ మానినట్టి
చేలములను దాల్చి ◆ శృంగారహీనయై, పతిరాకఁ గోరెడి ◆ సతియు నెన్న
మంచియిల్లాలన ◆ మహినొప్పు నాథుండు, నిదురబో నావల ◆ నిదురజెంది
తే. పెనిమిటికి ముందుమేల్కాను ◆ వనిత నిరత, మత్తమామలు నాథున ◆ కన్న యెడల
నధికులని వారిసేవించు◆నది మహాప,తివ్రత యనంగ దనరును◆దివిని భువిని. 134

సీ. తననాథుఁ డొనరించు ◆ ధర్మపద్ధతులందు, ననుకూలతయు బను ◆ లార్జనమును
కామకార్యముల శృం◆గారవర్తన దేవా,పరిశుద్ధతయుఁ దన◆పతికిఁ బ్రియము
లగుమాట లెప్పుడు ◆ నాడుచుండుట శుభ,యుక్తకార్యముల నా◆సక్తి గలిగి
కావింప గృహ మలం◆కారము జేయుట, నిరతమును గృహోప◆కరణములను
ఆ. శుద్ధిజేసికొనుచు ◆ శుచియై ప్రవర్తింప, పొలము నడవి నూరుఁ ◆ బోయి కొంతు
డింటి కరుగుదేర ◆ నెదురేగి మ్రొక్కి పీ,ఠమున నునిచి తగఁ బం◆దములఁ గడిగి

ఆ. స్నానమాదిక్రియలు ◆ జరిగినతదుపరి, శాకపాకములను ◆ శ్రద్ధగలిగి
వండివార్చినట్టి ◆ వంటకమును బెట్టు,నదియె పరమసాధ్వి ◆ యనఁగ నొప్పు. 136

సీ. పాత్రికనమగు పదా॰ర్థముల పాక మొనర్చి, పెనిమిటి కొడుకులు ॰ పెద్దలకును
బంధువులకు నారి ॰ వారిభార్యలకును, నతిథు లభ్యాగతు॰లాశ్రితులకు
సంన్యాసులకు బ్రహ్మ॰చారులకును బని, సేసెడుదాసదా॰సీజనులకు
నందంద సంభవ॰మైన వారలగుణ, గతములు గనిపెట్టి ॰ కనికరమున
తే. నాసనము లిడి తగినమ॰ర్యాదలొనరఁ, జేసి వారలుతృప్తిని ॰ జెందునటుల
నన్నమిడి మంచిమాటల॰నాదరించు, నదె పతివ్రతగానొప్పు ॰ నవనినాథ. 137

తే. ఎల్లవిధములసామర్థ్య॰మెఱిఁగికనదు, గృహమునకు ముఖ్యురాలైన॰గృహిణి చేయఁ
దగినవెచ్చమునకు భర్త॰ద్రవ్యమెంత, తెచ్చినను కొంచెమని మది॰నెంచకపుడు.

ఆ. ఇంటికర్చుక్రింద ॰ నెంతదెచ్చినదాని, నంతవాడుకొనక ॰ యందులోన
దగినఖర్చుపెట్టి ॰ మిగిలినదానిని, కొంచెమైన నింట ॰ నుంచవలయు. 139

ఆ. యాచనార్థులకయి ॰ యాచించి తెచ్చిన, దానిలోనఁ గొంత ॰ దాచియుంచఁ
గూడదెపుడు బంధు॰కులకైన భర్త్రాజ్ఞ, లేక యియ్యఁ దగదు ॰ లేశమైన. 140

క. ఇతరులతో భాషించుట, మతి సంతోషమును లేక ॰ మసలుట మదిలో
నితరుల నడవళ్ళను సం,తతమును దలపోసికొంట ॰ తగ దంగనకున్. 141

క. మిక్కుటమగు కోపము నెక,సక్కపుబల్కులును నవ్వ॰సాలించుట తా
నెక్కడ కోపము రాదగు, నక్కడికిని బోవకుండు॰నదె సాధ్వి యగున్. 142

సీ. తన వల్లభుండేమి ॰ త్రాగక భక్షింప, కుండు నావస్తువు ॰ లజ్జగింప
వలెఁ బతివ్రత భర్త ॰ పరదేశమున కేగ, నభ్యంజనస్నాన॰మాడుటయును
దంతధావనమును ॰ దలదువ్వుకొనుట నీ, పను లన్ని విడచిన ॰ పరమధర్మ
మిదిగాక పెనిమిటి ॰ కెదుర భుజింప వ,స్త్రముగట్టి నిఁదురింపఁ ॰ దలఁపరాదు
తే. వాహనము నెక్కుటయు నొంటి॰నైనిసొమ్ము, దాల్ప సర్వతగాదింక॰దనకుముందె
భర్త చనిపోవ నతనితో ॰భయముదక్క, యగ్నిజొర సాధ్వి యనఁజెల్లు॰నవనినాథ!

సీ. చచ్చినభర్తతో ॰ సహగమనముజేయ, కున్న నేమని లోకు॰లెన్నఁగలరొ
యనియెడి నిర్బంధ॰మునగాని చూచుచు, నగ్నిలో నెటుజొత్తు॰ననుటగాని
భయము దుఃఖము గల్గి ॰ పటుకోపమునఁగాని, కొడుకులు లేరను॰కొనెడిచింత
గాని చిత్తమునందు॰గలదాని కీపని, కూడ చెప్పటికైనఁ ॰ గోరదగినఁ
తే. యెల్లశుభలక్షణములచే ॰ నెన్నఁదగిన,పనుల నన్నిటి నెరవేర్చు॰వనిత తనదు
భర్తతో పిండ మొక్కటి॰బడయ నగ్ని,దరికొనఁగఁజొచ్చి బ్రహ్మప॰దవినిబొందు.

తే. వేశ్య, ముట్టైనసతి, పసి॰బిడ్డతల్లి, గర్భవతి యనుమానము॰గల యువతియును
సహగమనము సేయఁగరాదు ॰ సతికి ముట్టు, నెలనెలకువచ్చుచుండును॰విలసితముగ

సీ. ముట్టైనభామిని ॰ మొదటిదినంబునఁ, జండాలితోఁబోల్పఁ ॰ జాలినదగు
మరునాఁడునదియుబ్రా॰హ్మణునిజంపినయట్టి, యువతినిబోలు మూఁ॰డవదినమున

బ్రాహ్మణహత్యఁ జో◆ప్పడిన పాతకములో, సగమావరించిన◆సతికి నెనయు
నాల్గవనాఁడు సు◆స్నాతయై పరిశుద్ధ,రాలగు కడనుండు ◆ ప్రమద జలక
తే. మాడ నవయవములు శుద్ధి◆నాచరింప, నేడ్వ నవ్వ ప్రయాణము◆నెచటికైనఁ
బోవుట తలంటు గంధము◆బూసికొనుట, పండ్లు దోముట జూదము ◆పగటినిద్ర.

సీ. మనసునం దైనను ◆ మగవారిసాంగత్య,మునఁ గోర్కె దేవతా◆ర్చనవిషయము
దెలుపుట దేవతా◆ములకు మ్రొక్కుట లిటు,వంటి కార్యము లన్ని ◆ వదలవలయు
తాను బహిష్ఠయై ◆ తనవలె ముట్టైన,దానితో ముచ్చట ◆ తాకుటయును
నదియు భుజింపఁ దా◆నందు నిల్చినవంట,కముఁ దినఁగోరుట ◆ గమనములకుఁ
తే. బోవ గమకింప సంచార◆మునగను బైటఁ, దిరుగుటయు నేటిలోపల దిగుట ◆ దేహ
మునకు నేమాత్రమును నూనె ◆ పులిమి నలుగు,బెట్టుకొనునిట్టిపనులన్ని◆మట్టువరచి

క. తినుబండము కొంచెమునై, దను జప్పుడు గలుగునట్లు◆నమలి తినుట గో
ళ్లను దీసివేయుటయుఁ బం,డ్లను దరుగుట త్రాడుఁ బేను◆టయు మానవలెన్.

సీ. బిడ్డల కన్నముఁ ◆ బెట్టుట వారల, హత్తున భుజియింపఁ ◆ బొసఁగ దావు
దూడల విడుచుట ◆ దోడరి సూర్యేందులఁ, గనుఁగొన మైలబ◆ట్టను వదలుట
శిరము దువ్వుట లివి ◆ చేయఁగూడదు వంట,కమ్ము దిన్న పాత్ర ను◆గాలుసేతు
లను మొగమును గడుగు◆కొనఁబుక్కిలించి వే,యను మలమూత్రము◆లను వదలను
తే. ఈపనులు ముట్టుతలఁ నింటి◆కెడముగాను, గొంతదూరములోఁ జేసి◆కొనఁగవలయుఁ
గానిమందిరమునఁ జేయుఁ◆గాదు మూఁడు,దినము లిటు పుచ్చి నాల్గవ◆దివసమందు.

ఉ. ప్రొద్దున లేచి తా నిదుర ◆ వోయినతావున గోమయంబుచే
శ్రద్ధగ నల్కి మూఁడు దివ◆సంబులు నన్నముఁ దిన్నచోటునన్
శుద్ధి నొనర్చి నీటి నెటు◆జూచిన నాలుగు వ్రేళ్ళలోతునన్
గ్రద్దనఁ ద్రవ్వి మృత్తికను ◆ గ్రామబహిర్గతమందుఁ జల్లుచున్.
ఆ. క్రొత్తమట్టిచేత ◆ గోయి పూడ్చి యెప్పటి,యట్లచేసి పైన ◆ నలికి శుద్ధ
జేసి కట్టుకొనిన◆చేలము ప్రక్కవ,స్త్రమును గట్టకట్టి◆చాకలికిని. 151

ఆ. ఉదుక వేసి పిదప ◆ నదికి స్నానమునకుఁ,బోవవలెను చాకి ◆ పొసఁగఁ డేని
తనదువస్త్రములను ◆ దాఁ బిండుకొనవచ్చు, నటుల నుదుకుకొనెడు◆నట్టివేళ. 152

ఆ. మైలబట్ట చవిటి◆సిబుల ముందుగాఁ, దడిపిపెట్టి పిదవ ◆ నదికి పరచు
కొన్నబట్ట లుదుకు◆కొని కత్తిరాతిచేఁ, గాళ్లగోళ్లు దీసి ◆ కడిగికొనుచు. 153

ఉ. ముప్పదిరెండుమార్లు గుద◆మున్ దొలివట్టిని నీళ్ల నావలన్
దప్పక శుద్ధిజేసికొని ◆ దంతము లెండినగడ్డి యుత్తరే
ణప్పుడు సంభవించు నెది ◆ నందుల నొక్కటచేత నేదియున్
జొప్పడకున్న బూడిదెను ◆ శుభ్రత మీరఁగఁ దోమి పిమ్మటన్. 154

ఆ. పుక్కిలించి వదులు ♦ మూఁటిపై కెండుసార్లవల ముఖము గడిగి ♦ యామలకఁపు
గాయపిండిచేత ♦ కాయము శిరమును, బులుముకొనియు నవల ♦ జలము పైకి.

ఆ. తెచ్చి చెంబుతోడ ♦ దేహమునంగల, మురికిఁ గడిగి శుభ్రముగ శరీర
మప్పులందు ముంచి ♦ ముప్పదిమారులు, పరచుకొన్న కట్టువస్త్రములను. 156

క. ముప్పదిరెండావృత్తులు, నొప్పుగ జాడించి పిండి ♦ యొనరుగ మఱలన్
దప్పక ముప్పదిసారుల, నప్పుడు మునుగంగవలయు ♦ నంబువులందున్. 157

ఆ. జలకమాడువేళ ♦ శ్వాసలు విడువక, యిటుల జరిపి యింటి ♦ కేగునపుడు
భాస్కరునకు మ్రొక్కి ♦ భర్తను మదిఁ గోరి, శిరము వంచి యితర ♦ పురుషజనుల.

ఆ. పాలుత్రాగునట్టి ♦ పసిబిడ్డలను దల,నెత్తి చూడఁ ♦ గూడ దేమరియును
బరపురుషుఁడు కంటఁ ♦ బడిన నా వెంటనె, ధవుని ♦ మానసమునఁ దలఁచుకొనుచు.

ఆ. భవనమునకు నేగి ♦ భానుని గని మ్రొక్కి, యెనిమి దాఱు దర్భ ♦ లేకముగను
చేర్చి కట్టినట్టి ♦ కూర్చజలముపుచ్చు, కొనఁగవలయు శుద్ధి ♦ కొఱకు భూప! 160

తే. పంచగవ్యము పుచ్చుకో ♦ వలయునవల, నది తటస్థింపకుండిన ♦ నావుపాలు
త్రావి పిమ్మట మంచితీ ♦ ర్థమును గ్రోలి, యన్నకబళంబు నొక్కటి ♦ యారగించి.

సీ. చిన్నపాపలను జూ ♦ చిన ముట్టుదోషము, గలుగ దావల నఖం ♦ కార మొనరఁ
గావించుకొని మిత ♦ కాలము దప్పక, పరిశుద్ధమై యొప్పు ♦ వంటకమును
భక్షించి మనసులో ♦ భర్తను దలఁచుచు, నంత రాత్రికాల ♦ మౌట నెఱిఁగి
పతిచెంతఁ జేరఁబో ♦ వలె భార్య వచ్చిన, దానికి మైలర ♦ క్తము స్రవింప
తే. నట్టిదానిని గూడుట ♦ కర్తవ్యతయును, గాదు కామాతురుం డయి ♦ కలయ నందు
జననమందిన సుతుఁ డభి ♦ శస్తుఁ డెపుడు, పరసతులకూటమిని గోరు ♦ పాపి యగును.

క. సతి గర్భము గలదైనను, హితమతి నియమంబులందు ♦ నేమరకుండన్
సతతము వర్తింపందగు,నతివకు నవి యెల్ల వినుము ♦ నవనీనాథా! 163

సీ. తనుఁ దాన పోషించు ♦ కొనుచు నలంకార,మును జక్కగాఁ జేసి ♦ కొనఁగవలయు
బెనిమిటిపైఁ జాల ♦ ప్రేమ దుష్టస్త్రీలఁ, జేరి మాట్లాడక ♦ చేటగాలి
నొంటికి సోక నీ ♦ కుండఁ జచ్చినబిడ్డలను గనువారి హ ♦ స్తును వదలుచుఁ
బొరుగువారిండ్లలో ♦ బోనము దినకుండ, రోతవిషయముల ♦ బ్రీతిఁ జేసి
తే. కనుఁగొనక యుంటయును భయం ♦ కరములైన, కథలు వినమానిమందము ♦ గలుగుమిగుల
కారమున్నము మది కింపు ♦ గాని కటుప,దార్థములు పుచ్చుకొనఁగూడ ♦ దవనినాథ.

క. మిగులఁ గృశింపఁగఁ జేయఁగ,నగు తినుబండముల నట్టి ♦ వగు శాకము లిం
పుగ దినుసుకంటకము నే,పగిదినిఁ దినరాదు గర్భ ♦ వతు లగు సతులున్. 165

తే. హెచ్చుతగ్గులు గల పీఠ ♦ మెక్కఁగూడ, దింటిపనులందు మిగుల వ ♦ ర్తింపరాదు
గడప లలుకుట చేత రో ♦ కండ్లు వట్టి, దంచుటయు నిచ్చెనెక్కుట ♦ తగదు సతికి.

శా. మైలస్నానముఁ జేసివచ్చు సతితో ◆ మాటాడకేఁ జూడకే
కోలిం దొల్పక యిట్టినియమముల నా◆రూఢిం బ్రవరింపనే
చూలాలైన పతివ్రతామహిమచే ◆ శోభాకరంబైన స
ద్బాలుం గాంచును మంచిలగ్నమున సం◆భావంబు రంజిల్లఁగన్. 167

ఆ. అటుల నడువమాని ◆ నట్టి గర్భిణియైన, బాలతి కడుపు జారి◆పోవుటయును
గాని పిండ మెదురు◆గాఁ దిరుగుటగాని, యిట్టిగడుసుపనులు ◆ నేరుపడును. 168

క. సవతులయెడ వైరము గల, యువతికిఁ జూలైన మిగుల◆నోరుపు దనరన్
శ్రవణానందఁపు◆బలుకులు, ప్రవిపులమతి వారిమనసు◆బడయుట నొప్పన్. 169

సీ. సతికి గర్భంబైనఁ ◆ బతికి దూరము నిల్వ, వలదు దగ్గఱగాను ◆ నిలిచి యేమి
వినిపించునో దాని ◆ వినఁగోర్కి మనమునన్, గలదియై భర్త సం◆కథలు దెలుప
నవియెల్ల శ్రద్ధతో ◆ నాలకింపుచు ముచ్చ,టాడుచు నతనివా◆క్యముల కెదురు
పలుకక క్రీడకై ◆ పిలువ నుత్సాహము, గలిగిన దగుచు నే◆గంగవలయు
ఆ. శాస్త్రధర్మములను ◆ జాల నేర్పరి నాల్గు, పదియు విద్య లాఱు◆వదులు నాల్గు
కలలు నెఱిఁగినట్టి ◆ కాంతుని జూచిన, వనిత సంతసింప◆వలెను మిగుల. 170

సీ. పురుషున కెదురుగాఁ ◆ బొలఁతి కలత నొంది, తాలిమిలేక డెం◆దమునఁ గలుగ
నుండుట నవ్వుట ◆ నొడలను విఱుచుట, తుమ్ముట చేతుల◆తో శరీర
మును గీఱుకొనఁ గోప◆మునఁ బెదవులు గొఱుఁకుట నిట్టిచేతలు ◆ గూడ వెపుడు
పెనిమిటి కొట్టిన ◆ బెదరించి తిట్టిన, నప్రియమగుమాట ◆ లనిన నధిక
తే. బాధ పెట్టిన నేడ్వక ◆ భయము నొంది, బైట కుఱుకక పరుగెత్తి ◆ పరులతోడ
నిరుగుపొరుగులవారితో ◆ నిటుల భర్త, చేతియాపద లెవ్వియుఁ ◆ జెప్పికొనక.

తే. భర్తనాలింగన మొనర్చి ◆ బహువిధముల, మీరు గోపింప నా కింక◆నెవరు దిక్కు
గలదు? నేనెటుజొత్తు? మీ◆కరుణ దనరఁ, దెలిసి తెలియక చేయుత◆ప్పులు క్షమింపు.

క. వనితలకు భర్తయే గతి,యని వేదార్థముల నెఱిఁగి◆నట్టి మహాత్ముల్
అనయముఁ బలుకుచునుందురు, రను మృదువాక్యములఁ గోప◆మణఁపుచు నవలన్.

తే. భర్త చెయిఁబట్టి నేఁ జేయు◆పనుల కాజ్ఞ, నిమ్మనుచు మీకు సౌఖ్యము◆నొసఁగునట్టి
కార్యమును దెల్పు నా కది ◆ కష్టమనక, చేతు శిరసా వహించి మీ◆చిత్త మలర.

క. అని వేడుకొనఁగవలె భ,ర్తను దూషింపుచును బాడు ◆ దైవము న న్నీ
పెనిమిటికి నేల యొడఁగూ,ర్చెనో యని నిందింపఁదగదు ◆ చిత్తముగలఁగన్.

క. తనచుట్టుపక్కముల యిండ్లను వేడుక లెవ్వియును ద◆టస్థించిన నా
థు ననుమతిఁ బొంది పోవలెఁ, జనఁగూడ దటన్న మానఁ◆జను సతి కెప్డున్.

క. పెనిమిటియు దూరదేశముఁ, జనునప్పుడు దెలిపినట్టి ◆ సత్సంగతులన్
మనమున నెన్నుచు నెపుడా,పనులను జేయంగవలయు ◆ భార్య యనఁదగున్.

ఆ. అట్టిరాత్రిని నత్త ♦ యాడుబిడ్డలయొక్క, పక్కలందుఁ బండ ♦ వలెనుగాని
యితరచోటులందు ♦ నెప్పుడు నిద్రింపఁ, దగదు ప్రతిదినమును ♦ తనపెనిమిటి.

ఆ. కుశలవార్త లెఱుఁగఁ ♦ గోరి తగినవారి, ననుపఁదగును సుఖము ♦ దనరగృహముఁ
జేరునంతకును బ్ర ♦ సిద్ధులైనట్టిదై, వములఁ బూజచేయ ♦ వలయు నధిప ! 179

ఆ. పెనిమిటి పరదేశ ♦ మున కేగునప్పుడు, నాజ్ఞ నొసఁగు పనుల ♦ నంటవలయుఁ
గాని స్వేచ్ఛవృత్తి ♦ గాఁ బ్రవర్తించుట, కూడ దెపుడు సతికిఁ ♦ గువలయేశ!

సీ. పరపురుషుని ముట్టి ♦ పదములచే నొత్త, మఱయిన బైటకుఁ ♦ బోవ సిగ్గు
మాలినచేష్టలు ♦ మానక పొరుగిండ్ల, కేగుట పనిలేక ♦ నివి మొదలగు
దుర్వృత్తు లన్నియుఁ ♦ దొరగి ప్రత్యహమును, జేయఁదగినపనుల్ ♦ చేసి తాన
ముం జేసియుఁ బసు ♦ పుం బూసికొని చక్కఁగా నలంకారము ♦ చే నలరుచుఁ
బ్రియునిఁ జేరి కాళ్లు ♦ పిసికి రతిక్రీడ, నతనితోడ సలుప ♦ నగు పతివ్ర
తకు నియతము లైన ♦ ధర్మము లివియు నీ ♦ నడత గలిగినట్టి ♦ నాతి భువికి. 181

క. మేలైన కీర్తి నొందఁగఁ, జాలినదై పరమునందుఁ ♦ సద్గతిఁ జెందుఁ
ఈలోకమందు నే యిల్లా లీధర్మమున నేగృ ♦ హంబునఁ గలదో. 182

ఆ. అట్టి యింట నుండ ♦ నగు పురుషుఁడు నటు, గాని పత్నిమందుఁ ♦ గాననగునఁ
జేరి నిలువ నధిక ♦ శ్రేయస్కరము నీకుఁ, దేటపడఁగ నేను ♦ దెలిపినట్లు. 183

క. ధర్మముఁ దప్పక యిటు సత్కర్మలచే మెలఁగుచున్న ♦ తనపత్నులపై
మర్మ ముడిగి మృగశృంగుఁడు, నిర్మలమగు చిత్తవృత్తి ♦ నిలిపినవాఁడై. 184

## మృకండు చరిత్ర.

సీ. దర్పకక్రీడలఁ ♦ దవిలి సుఖింపుచు, గృహమేధిధర్మము ♦ లెఱిఁగికొనుచు
సంసారమందు నా ♦ సక్తుఁడై తిరుగుచు, మలినరహితమగు ♦ మానసమునఁ
జయనాదిక్రతువులు ♦ చాలగాఁ జనికృ, తార్థుఁ డయ్యును గృహ ♦ స్థాశ్రమమును
గడుపుచుండఁగ నొక ♦ కాలమందున భార్య, లందఱిలో ముఖ్య ♦ మగు సువృత్త
తే. సుతునిఁ గనఁగ నప్పుడు ♦ పితరుల ఋణబంధ, మోక్షణుండు తనదు ♦ పుత్రునకును
జాతకర్మక్రియలు ♦ జరిపి కాఁగలకార్య, మునకు నితఁడు తగిన ♦ జనన మొందె.

ఆ. తపము సేయు వేళఁ ♦ దనశరీరము భీతి, నింత లేక యడవి ♦ మృగము లొరసి
కొనుచుఁ బోవునని మృ ♦ కండుఁ డనుచు నామ, కరణ మపుడు చేసె ♦ ఘనవతి మెరయ.

తే. ఆమృకండుఁడు తనవంశ ♦ మంత నుద్ధ, రించువాఁ డెల్లగుణముల ♦ మంచివాఁడు.
నగుచుఁ దమతండ్రి చేఁదగు ♦ నంతయీడు, రాఁగ నుపనీతుఁ డయ్యె సం ♦ భ్రమ మెలర్ప.

ఆ. బ్రహ్మచారి యగుచుఁ ♦ బరిశుద్ధుఁడై గురు, నిల్లుఁ జేరి వేద ♦ మెల్లఁ జదివి
గురువుచేత నాజ్ఞఁ ♦ గొని మరుద్వతిని ము, ద్గలునిసుతను బత్ని ♦ గా వరించె. 188

క. ఆమృగశృంగుని భార్యల, లో మరి కమలయను నొక త♦లోదరి పిదపన్
క్షేమముగ నొకసుతుం గనె, నామము నుత్తముఁడనంగ ♦ నయమునఁబరగెన్.

తే. అతఁడు నాచారమందు వే♦దార్థములను, వినుటచే నన్నివిద్యల ♦ విదితుఁడగుచు
నడఁకువైనట్టి నడవడి ♦ ననుసరణగ, సకలవిధములచేత ని♦శ్శంకుఁడగుచు. 190

తే. ఉత్తముఁడనంగఁ దనపేర♦నొప్పిదమగు, నటుల సార్థకనామధే♦యమున నెగడి
జనకుచే నుపనీతుఁడై ♦ సకలవిధము, లైన వైదికక్రియలయం♦దంద మెలఁగి. 191

తే. వేదములు నాల్గు మిగిలిన ♦ విద్య లభ్య, సించి శాస్త్రమునందునఁ ♦ జెప్పనొప్పు
సుందరంబైన ముంగురు♦లందనుగల, తనువు తామరపూలతోఁ ♦ దవరునట్టి. 192

తే. గొప్ప నేత్రములను సొబ♦గొప్పి మంచి, గుణములను మించనగు కణ్వ♦మునికుమారి
విమలయను పేరఁ బరగిన ♦ రమణి ధర్మ, పత్నిగా వరియించెను ♦ పార్థివేంద్ర!

క. ఆ మునివరు మాఁడవకాం, తామణి విమలయది యొక్క ♦తనయుని గనఁగా
క్షేమ జనింపఁగ నతనికి, భూమీధవ! పేరు సుమతి ♦ పొలుపుగ నమరెన్.

తే. ఆ సుమతి వేదశాస్త్రము♦లన్ని, యను సమర్థతను జాల నమరి సు♦మంతమౌని
తనయ సత్యను గృహిణిగాఁ♦ దనకుఁగాను, బరిణయంబయ్యె నాల్గవ♦పత్ని సురస.

క. ఒకకొమరుని గనఁగా వా, నికి సువ్రతుఁడనఁగఁ బేరు♦నెగడె ధరిత్రిన్
బ్రకటముగ వేదశాస్త్ర, ప్రకరణముల నతఁడు చదివి ♦ ప్రాభవమెసఁగన్. 196

క. సదమలమతి గురుపూజను, విదితముగాఁ జేసి పృథివి♦ప్రియతనయ ప్రియం
వద యను పేరటికన్యను, బదపడి వైవాహికమున ♦ భార్యగఁ బడసెన్. 197

సీ. అటు మృగశృంగుభా♦ర్యలు నల్వురందున, నల్వురు తనయులు ♦ గలిగి రందుఁ
సుమతి యుత్తముఁడును ♦ సువ్రతుండన ముప్పు, రకు వేఱువేఱను ♦ రాగ మొదవఁ
దుదముట్ట వేదముల్ ♦ జదివినకొడుకులఁ, జనియించి పెక్కండ్రు♦జన్మములను
సంపూర్ణమైన ద♦క్షిణలచే నందఱ, జేతఁ జేయించి ప్ర♦సిద్ధిఁ జెంది

ఆ. తండ్రులకును బ్రియము♦దనరు కార్యములొన, రించుచుండి రిటు చ♦రింప మంచి
గుణము లతిశయించు ♦ కొడండ్రుకొడుకులు, తనదుసతులతోడ ♦ మునివరుండు.

సీ. ఇహపరసాధక♦గృహమేధిధర్మముల్, జరుపుచు మా♦ఘమాసమున కల్య
మున పైనిఁ జెల్పిన ♦ తనయులు వారిస, తులు మనుమలు తన♦తోడ రాఁగ
నూరిచెల్పలిశీత♦నీరములందున, స్నానము తప్పక ♦ సలుపుచుండు
నెపుడు మాఘస్నాన♦మేమరఁబోకను, జేసె భక్తిని మృగ♦శృంగమౌని

తే. మఱియును నెవరు మాఘ♦మాసమునందున, స్నానదానములను ♦ సకలవిధము
లైన వ్రతము లీశ్వ♦రారాధనలు సేయుఁ, దగు నివియె గృహస్థ♦ధర్మములన. 199

తే. తలఁచి మృగశృంగుఁడిటులఁద♦ద్వ్రతము చేయు, చుండి సంసారసుఖముల♦నొందిపిదప
సుతులు సంతానపరులౌట ♦ సతముగాని, తన శరీరపు వార్ధక♦దశ నెఱింగి. 200

క. ముదిబాఱి తనువు బిగువును, వదలినదై సడలి ముడుత♦పడు చర్మంబుల్
జెదరిన దంతంబులు నీ, విధమునఁ గనుపట్ట గృహము ♦ విడుచుటకొఱకై. 201

క. తనయందు సమారోపణ, మొనరఁగ నగ్నులను జేసి♦యును భార్యలఁగా
గొనిన సువృత్తాదులఁ జెలు,లను వారియనుంగుదనయు♦లను నొప్పదలన్. 202

ఆ. చేసి గహనభూమిఁ ♦ జేరి జీర్ణించిన, పర్ణభక్షణమును ♦ బడియలందు
జలముఁ ద్రావి కఠిన♦శిలలచే నొత్తిడి, చాలఁ గలుగ నట్టి ♦ నేలపైని. 203

క. అగణితమగు కష్టముచే, మృగములలోఁ జేరికొనుచు ♦ మృగములవలెనే
మృగశృంగుఁడాదు లలములు, దగ నోటను దినుటకాక ♦ తా నటువలెనే.

ఆ. కుల్యలందు నీరు ♦ గొనకొని త్రావుచు, వంగి హస్తములను ♦ వసుధపైని
మోప సంచరింప♦నోపికతో బహు,కాల మిటుల నతఁడు ♦ గడుపుచుండ. 205

సీ. అంతట మృతకాల♦మగుచు నాదేహము, దప్పిన నేఁబొందు♦తనువు జొచ్చి
బ్రహ్మలోకమునొంది ♦ పరమేష్ఠిచేఁ దగి,నట్టి మర్యాదల♦నంది ధాతృ
సింహాసనము సాటి ♦ చెలువొందు గద్దెపైఁ,జేరి యాదరను దాఁ♦జేసినట్టి
పుణ్యము ననుభవిం♦పుచు పద్మకల్ప ప,ర్యంతము సుఖముగా ♦ నచట నిలువఁ

తే. బరగి శ్వేతవరాహక♦ల్పమున బుభువు, నామమునఁ ద్వష్టతనయుఁడై♦ ప్రేమచే ని
దాఘుఁడను విప్రునకు మోక్ష♦ధర్మములను, దెలిపె నుపదేశముగను సం♦దేహముడిపి.

తే. అట్టి మృగశృంగమునిసతు♦లగు సువృత్త, కమల విమల సురసయును ♦ నమితయశలు
సుస్వభావుల రై,తమ♦సుతుల చెంత, నిలిచి సద్వ్రతపరలుగా♦ మెలఁగుచుండ. 206

తే. రదనములు నూడి దేహము♦ముదిసి తోలు, సడలి ముడతలు బడుచు కేశములు నెరసి
బొక్కి నోరయ్యు నింద్రియ♦ముల వికార,మడఁగి వార్ధకదశకు సం♦ప్రాప్తలైరి.

## మార్కండేయ జననాది వృత్తాంతము.

ఆ. అపుడు జ్యేష్ఠపుత్రుఁ♦డైన మృకండుఁడు, తల్లులందు ముసలి♦తనము చూచి
పత్నివలన సుతులఁ♦బడయరామికి నతి,చింతపడుచు మదిని ♦ శివుని దలఁచి. 208

సీ. చనిపోవువానికి ♦ శంకరుఁడెచ్చోట, తారకమంత్రి మిం♦పారఁ గర్ణ
ములు సోకునట్లుగా♦ బోధించు నట్టి కా,శీపట్టణమునకుఁ ♦ జేర నాలు
తల్లులతోఁ బోవఁ♦దగిన యాలోచన, యత్నింపుచుండఁగా ♦ నంతలోన
నాదేశమునకు రా♦జైన రాష్ట్రవివర్ధ,నుఁడు కుటుంబముతోడ ♦ వెడలి కాశి

తే. యాత్ర సేవించుకొఱకు ప్ర♦యాణమైన, నాసమూహము వెంటఁ దా♦మరుగఁ దలఁచి
మెల్ల మెల్లనఁ బోవుచు♦నుల్లమలర, మార్గశ్రమ బాయుకొఱకుఁ ద♦న్మహిమఁ దెలుప.

వ. ఉపశ్రమించువాఁడై యా మృకండుమహాముని తల్లులతో నిట్లని చెప్పందొడంగె.

సీ. తల్లిదండ్రులు చుట్ట♦లెల్లవారలు విడు,వఁబడినవారల ♦ వార్ధకమున
వ్యాధినిఁ జిక్కి ప♦రాధీనులగువారి, కెల్ల దుష్కృతముల ♦ నీగువారి

కిని దరిద్రిమున డంస్సినమానవులకు సం,సారబంధములను • సంకటములుఁ
గలుగువారలకు యోగభ్రష్టులకుఁ దపో,జ్ఞానరహిత దుష్టజనములకును
తే. వీచ్చ తక్షయ దగ్గులను రోగపీడితులకు, దుష్టచేష్టలు గల భార్యమనుకుసుతులుఁ
గలుగువారికి నిచపుఁగులమునందు, జననమందిన వారికిఁ • జక్కదనము
లేనివారికి నీకాశి • తానకమగు. 211

ఆ. ఏ మహేశుచెంత • నెట్టిదుష్కర్మలు, భంగపడునో యెచట • పాపపుంజ
మెట్టిచోటఁ గాలు • నట్టి మహాశ్మశా,నమునఁ బడు వారణాశిపురిని. 212

ఆ. దిక్కు లేక యెందు దిక్కనివేయని, నమ్మి యచట శివుని • నెమ్మనమునఁ
గొలుచుచుట్టి ప్రాణికోటి సర్వో,త్తమ,గతిని జెందఁగలదు • కాశిపురిని. 213

తే. సంసరణమను సర్పదష్టమున విషయ,సుఖవిషములన్ని శిరమునఁ • జొచ్చి జ్ఞాన
హీనులగువారికెల్ల విశ్వేశ్వరుండు, శివుఁడు తారకమగును గాశీపురమున. 214

సీ. వినుఁడేను మీకుఁ దెల్పిన యంశనులుగల, కాశిని జేర యోగమగుఁగాని
యమనియమాను లభ్యాసగతులచేతఁ, గావించు టెల్ల యోగములు కావు
కాశియందు వసింప • ఘనతపోమంత్రిముల్, పశుపతిపూజలఁ • బరగుఁగాని
గహనమందు వసించి • కాయ లాకులు దిని, చేసినయది తపస్సిద్ధి కాదు
ఆ. కాశిలో నుంట నదియె నాకమగుఁ గాని, దేవతాస్త్రీలతోఁ గూడి • దేవలోక
మందు నిల్చిన నది స్వర్గ మనఁగఁదగదు, తల్లులార! గుణవతీమతల్లులార! 215

ఆ. వారణాశియందు • వర్తించు సుఖము శ,బ్దాదివిషయములను • లేదు తల్లి
దండ్రిగురువు నన్నదమ్ములు చుట్టాలు, కాశి యితర మేమి • కాదు కాదు. 216

ఆ. ఏను నచటి కేగ • నింపుగ దర్మార్థ, కామములును నాకుఁ • గాశి యొసఁగు
కాటుకవలె నల్పు • గలిగి పర్వతిమున, కెనయు యమునివలన • నేమి భయము?

ఆ. కాశిపట్టణమునఁ • గాపుర ముండెదు, వాని యముఁడు నతనిభటులు నేమి.
చేయఁజాల రిపుడు • చిత్త మీశ్వరుని పైఁ, గలుగుకతన మిగులఁ • గాంతుతనర.

క. కామాదిషడ్వికారము, వేమఱు సాటునను గలుగ • వెర్యేడ నరులా
కామారిని సేవించుట, నోమానినులార! తమకు • నొనరినభక్తిన్. 219

క. అని యిట్లు నిరంతరమున్, దనతల్లుల మార్గకష్టదశ దోరఁగుటకై
వినిపింపుచుండ నెమ్మది, గను వారలు జేరి రంత • కాశీపురమున్. 220

సీ. అటు మృగశృంగమహాముని సుతుఁడు మృ,కండుమునీందు్రిండు • కాశిఁ జేరి
కాలయాపనలేక • కడు మణికర్ణిక,ఘట్టమందున మొలం • గట్టుకొన్న
వస్త్రముల్ విడువక • శాస్త్రవద్ధతిని సు,స్నాతుఁడై సంధ్యాదిసత్క్రియలను
దీర్చి పుష్పములను • దిలలచే దేవర్షి,పితృసుతర్పణముల • వితతి జేసి
ఆ. రచటి తీర్థవాసులందఱ భోజన, సౌఖ్యములను దన్పి • సరగ బీద
సాదులకును దగిన • శాల్యన్నపాయస,భక్ష్యములను దృప్తిపరచి పిదప. 222

తే. ఢుండివిఘ్నేశునకు నెయ్యి ♦ తోడ మెదిపి ♦ నట్టిసిందూరమున పూఁత ♦ నలఁది పూజ
లొనరఁగాఁజేసి వారలు ♦ నొకరొకరికి, నైదు కుడుములు నైవేద్య ♦ మమరఁజేసి.

సీ. సకల జీవులయెడ ♦ సమభావ ముంచి కా, శీక్షేత్రమును బ్రవే ♦ శించి చుట్టు
ప్రక్కలనుండు దే ♦ వతల కెల్లను బూజ, లను జేసి విశ్వనా ♦ థునకు మ్రొక్కి
నుతు లొనరించి స ♦ మ్మతిని మృకండుఁడు, తల్లులు దాను య ♦ థావిధిగను
క్షేత్రోపవాసము ♦ జేసి విశ్వేశ్వరు, సన్నిధి నారాత్రి ♦ జాగరణము
జరిపి మణికర్ణికను మఱు ♦ సటి దినమున, స్నానసంధ్యాదివిధులచే ♦ జక్కఁగ బరి
శుద్ధుఁడై చంచలింపని ♦ బుద్ధి తనర, ప్రతిదినము చేయుచుండి యీ ♦ పగిది నచట.

సీ. శైవాగమముల వి ♦ శారదు లనఁదగు, గొప్ప బ్రాహ్మణులతోఁ ♦ గూడ నెల్ల
కోరికలను దీర్ప ♦ కారణమగు లింగ, మును ప్రతిష్ఠను జేసె ♦ దనదుపేరఁ
దల్లులు నల్వురు ♦ తమతమపేరిట, దరిశింప ముక్తినిఁ ♦ బరగునట్టి
నాలుగులింగముల్ ♦ లాలితముగ బ్రతి, ష్ఠించిరి సంతోష ♦ చిత్తు లగుచు.

తే. ఢుండిలంబోదరునకు నెం ♦ మరనిలువఁ, బడిన మృకండేశ్వరుని సుద ♦ ర్శనము జేయు
వారి కెల్లను మదిఁ గల ♦ వాంఛ లమరఁ, గలిగి నివసింతు రెప్పుడు ♦ కాశిపురిని.

తే. ఆమృకండేశ్వరుని తూర్పు ♦ నందు నెదురు, గా సువృత్తేశ్వరుఁడన లిం ♦ గమును గలదు
దాని దర్శింప కలతలఁ ♦ మానసమునఁ, దొలఁగి సత్స్మార్గవృత్తిని ♦ గలుగుచుండు.

క. కమలేశ్వరుఁ డన నొకలిం, గమునందులఁ దూర్పునందుఁ ♦ గల దది దర్శిం
ప మనసు మంచిదియై యను, పమపరిశుద్ధుఁడనఁ బరగుఁ ♦ బ్రవిమలచరితా! 226

ఆ. విమలవలన ఢుండి ♦ విఘ్నేశుకడపద, గ్గఱ ప్రతిష్ఠవలనఁ ♦ గలిగినట్టి
విభవ మెసక మెసఁగు ♦ విమలేశ్వరుని దర్శ, నమున జ్ఞానపరుఁడు ♦ నవులఁ దగును.

క. విమలేశ్వరునకు నీశా, న్యముగా సురసేశ్వరుండు ♦ నాఁ జెలువొందున్
గ్రమముగ దర్శించిన మో, క్షము కాశీపురమందుఁ ♦ గలుగు మహీశా! 128

సీ. ఆమృకండునిభార్య ♦ యగు మరుద్వతి మణి, కర్ణికపడమట ♦ గట్టుదరిని
తనపేర నొకలింగ ♦ మును బ్రతిష్ఠించె నా, లింగదర్శనమున ♦ భంగమగుచుఁ
బాపపుంజములు దే ♦ వత్వముం బొందుదు, రటుల వారలు సాయు ♦ రారు లింగ
ముల నిల్పి కాశిలో ♦ పల నొక్కవత్సరం, బును నిల్వ నప్పుడ ♦ ప్పుడు విచిత్ర

తే. ములు పవిత్రమునగు కాశి ♦ పురముఁ జూచి, తృప్తిఁ బొందక యచ్చటి ♦ తీర్థయాత్ర
అందువిహరింపుచును బుణ్యమగు జలముల, స్నాన మొనరించుచుండె నా ♦ సత్పురుషుఁడు.

ఉ. కాలము నీవిధంబుగ మృ ♦ కండుఁడు పుచ్చుచునుండెఁ దల్లులున్
గాలము దప్పకుండ మణి ♦ కర్ణికయం జని తజ్జలంబులన్
జాలఁగఁ దోఁగి వార లతి ♦ సంతస మొప్పగ విశ్వనాథు దే
వాలయమున్ గనుంగొనుచు ♦ వచ్చి ప్రదక్షిణ మాచరింపుచున్. 230

తే. శంకరునిదర్శనము చేసి ♦ సకలవిధము, లయిన పూజలు సేయుచు ♦ ననవరతము
నంతనొకనాఁడు నిత్యకృ ♦ త్యములు నటుల, సలిపి వారలు మధ్యాహ్న ♦ సమయమునను.

క. అంబికానాథదేవాల◆యమున కరిగి, యాగుడిని జుట్టి తిరుగ నా◆యాస మొదవి
కనులు దిరుగుడువడ నెటుఁ◆గదలలేక, భవుని మదిలోఁ దలంచి ని◆ర్భయముగ దుర.

ఆ. ఎల్లలోకములకు ◆ నేలికవై సమ, సమును గలుగఁజేయఁ◆జాలువాఁడ !
శూలహస్త ! సకల◆శుభములనొసఁగెడి, వాఁడవైన భక్త◆వరద ! మాకు. 233

క. రక్షకుఁడవు నీ వగు మని, దక్షునిజామాతఁ గూర్చి ◆ తగ మొఱలిడుచున్
ఆ క్షణమె కళలు దప్పఁగ, నీక్షితిపై నొరిగి రంత ◆ నీశ్వరుఁడు దయన్. 234

ఆ. వచ్చి వారితలలఁ◆బట్టి హస్తములను, బైకి లేవఁదీసి ◆ ప్రణవ మపుడు
చెవులలోన శివుఁడు ◆ చెచ్చెర నుపదేశ, మొసఁగె నోర వనుచు ◆ నొక్క మొగిని.

తే. మరణము నొందినతల్లుల, కిరవగు పరలోకగతులు ◆ నేర్పడుటకుఁగా
సరగునను త్తరక్రియఁ, గరమర్థిఁ జేసి యామృ◆కండుఁడు నంతన్. 236

సీ. కాశిలోపలఁ గొంత◆కాలము కాపుర,ముండి యీశ్వరుకృప◆నొంది ధర్మ
పత్నిమరుద్వతి◆వలన మార్కండేయుఁ, డనువాని గాంచె ◆ దనరు తనయుఁ
బడసె నాకొమరుండు ◆ బహుకాల మీశ్వరుఁ, బ్రార్థనజేసి దీ◆ర్ఘాయువుఁగల
వాఁడయి మఱికొన్ని ◆ ప్రశ్రయములను జూచె,ననఁగ దిలీపుఁ డి◆ట్లనియె మునికి

తే. నామృకండుఁడు పుత్రసం◆ప్రాప్తి మొదట, నొందఁజాలక పిమ్మట ◆ నిందుధరుని
దపముచేతను మెప్పించి◆తనదుభార్య, యందు సుతునెట్లువడసెనా◆నంద మెసఁగ.

తే. అట్టికొమరున కెటుల దీ◆ర్ఘాయు వమరె? నంబికానాథుఁ డెట్లు ప్ర◆త్యక్ష మయ్యె
నాతనికిఁ దద్విధంబంత ◆ నానతీయు, మనెడి రాజును జూచి యి◆ట్లనె గురుండు.

## మా ర్కం డే య జ న న ము.

ఆ. ఇనకులాబ్ధిచంద్ర! ◆ వినుము మార్కండేయు, పుట్టు నీకు నెఱుఁగ◆బోధపరతు
సంతులేక యాత్మ◆సతితో మృకండుఁడు, దపముఁజేయఁగోరి ◆ తనయులకయి.

వ. గోమతీతీరమునందలి తపోవనమునకుం జని యయ్యేటనేటఁ ద్రిసంధ్యాస్నానము సేయుచు "త్ర్యంబకం యజామహే" యనుమంత్రముచేత నీశ్వరు నారాధింపుచు దేవఋషిపితృతర్పణంబులు సేయుచు. 240

క. ఫలముల నాహారముగా, నెలదినములు గడపి పిదప ◆ నేలఁబడిన యా
కులు రెండునెలలు దిని యా,వలను ద్విమాసములు నన్ని ◆ వదలినవాఁడై. 241

తే. మండుచుండెడి వేసవి◆యెండనుండి, వర్షకాలమ్ము తడియు న◆వ్వానయందు
నిలిచి బయలున శివమున◆కులికిపడక, యవలనఁ బంచాగ్నిమధ్యము◆నందు రవిని.

క. కనుఁగొనుచు వేయియుగములు, ఘనతపమును జేయు నామృ◆కండుమునీంద్రున్
గని యింద్రాదులు భయమున, ననుపమ స్వ◆పదవి కేమి ◆ హాని కలుగునో. 243

చ. అను భయమంది మానసము◆లందున దాని కనేక విఘ్నముల్
బనుపఁ జేయు నా తపము ◆ భంగము నొందక యంత కంత కం

దున జనియించినట్టి శిఖి♦ధూమము మూఁడు జగంబులందు నిం
డినదయి కాల్ప శంకరుని♦డెందమునం దయ వుట్టి దీనులై
ప్రణతులు సేయ నాసురల♦ప్రార్థనఁ జేకొని చంద్రమౌళియున్. 244

సీ. అప్సరోంగన లెల్ల ♦ నాటలఁబాటల, వందిమాగధులు కై♦వారములను
చారణగంధర్వ♦సమితి వీణాగాన,మున వెంట నరుదేర ♦ మునులు ముందు
నాశీర్వచనములు ♦ నరుగ సురలు పారి,జాతసుమములు పైఁ ♦ జల్లుచుండ
నమరకన్యలు చామ♦రము లిరుదెస వీవ, బృందారకులు తాళ♦వృంతములను
ఆ. విసర వైభవమున ♦ వృషభవాహనముపైఁ, గదలి కదిసి ప్రమథ♦గణము గొలువ
ధరణిసురునికడకుఁ ♦ బరతెంచి ప్రత్యక్ష, మగుచుఁ బార్వతీశుఁ ♦ డనియె నిట్లు.

ఉ. ఓమునిచంద్ర! నీదుతప ♦ మొప్పిదమై గిరిజాతతోడ నేఁ
బ్రేమ జనింప నీకడ క♦భీష్టము లియ్యఁగ వచ్చినాఁడ నీ
కోమలి యా మరుద్వతిని ♦ గూడుక యెద్దియొ కోరుమన్న నా
కామవిరోధిపల్కులు మృ♦కండుఁడు వీనుల సోక నత్తఱిన్. 246

సీ. తపమువిడచి కను♦దమ్ములు మెల్లగాఁ, దెఱచి మృకండుఁడు ♦ తేఱిచూఁడ
ముత్యాల కెనయగు♦మ్ముక్మన శరీరముఁ గ్రమ్మి, కొని పర్వతసమాన♦తనువుఁ గల్గి
శిరముపైఁ బాలశ♦శిని దాల్చి యాదిశే,షుని నిగపువ్వుగా ♦ నునిచి సర్ప
ములు హారములును భో♦గులు కంకణంబులు,గలవాఁడయి వసంత♦కాలమందుఁ
ఆ. జల్లనగు చిఱుగాలికిఁ ♦ జలనమొందు, చిగురుటాకులఁ బోలిన ♦ దుగపెదవులు
ధవళకాంతులచే నొప్పు♦దంతములును, మీనకేతు దహించిన ♦ మేటికన్ను. 247

సీ. స్ఫటికపుఱాలతో ♦ సమమైనతెల్లని,తనువు క్షీరాంబుధి ♦ దఱువఁ దొలుత
నందుఁ బుట్టిన విష ♦ మానుటచే భయం,కరమగు నల్లని♦గళము గిరిజ
కుచయుగ్మమందలి ♦ కుంకుమరాపిడి, గుఱుతైన రుద్రాక్ష♦సరముల మెడ
రత్నము లూపిన ♦ రాణించుభుజకీర్తు,లమరి భక్తులకోర్కు ♦ లందఁజేయు
తే. కల్పవృక్షములకు దీటు♦గలిగి పాశ,మంకుశమునాదిగాఁ గల♦యాయుధములు
గలుగు నాలుగుచేతుల ♦ నలరి యెదుట, హరుఁడు సాక్షాత్కరించె ధ♦రామరునకు.

తే. అటులఁ బ్రత్యక్షమైనహి♦మాద్రిజాధి,నాథుఁడగు శంకరునిదర్శ♦నమునఁ బరమ
హర్ష మిగురొత్త మ్రొక్కియి♦ట్లనుచుమనము,వాక్కునకునందఁజాలని♦భవునుతించె.

వ. దేవా! సర్వోత్కృష్టుండవైన నీవు మహాదేవుండవును, సురశ్రేష్ఠుఁడవును, సురాధిపుండవును, ప్రాకృతజనులకుమేలుసేయువాఁడవును,మాయయేసాధనముగఁ గలవాఁడవై యవిద్యకు దూరమై యుండు పాదపద్మములు గలవాఁడవును, స్వాభావికమైన యందము గలవాఁడవును, గొప్పవిలాసము నధికబలము గలవాఁడవును, నెల్లలోకములకుఁ బ్రభుఁడవయి జగంబులు నీవయై త్రిజగములను ధరించి సూర్యునివలెఁ బ్రకాశింపుచు శాశ్వతమైన తండ్రియును, నాశనములేని యునికిపట్టు గలవాఁడవయి చెడనియాకృతితో భంగము నొందని జీవనము గలుగఁజేయువాఁడవు

నైనస్వామీ! నీకు జయము జయము జయము. ఆత్మశక్తియమును గల్పించి పాలింపుచునణచివేయఁగలదానవునైన యోపరమేశ్వరీ! నీవు సర్వోత్కృష్టురాలవయి యుండుము. నీచూపుచేత నెల్లలోకములను ప్రకాశింపఁగలకారణమును గలుగఁజేయువాఁడవునై ఫాలనేత్రాగ్నిచే భుక్తమైన భూతములయనుభవము గలవాఁడవును, సూక్ష్మబుద్ధిచేతఁ దెలిసికొనఁదగినవాఁడవై స్వకీయాత్మయందు సూక్ష్మరూపమునఁ బ్రకాశించువాఁడవును, స్థూలాంశశక్త్యంశములచే వ్యాపించినచరణములును, నచరణములునైన భూతములు గలవాఁడవును, వాసనయోగములచే నుంచఁబడిన సమస్తతత్త్వసమూహములు గలవాఁడవై నిన్నాశ్రయించినవారి నేలుకొను సామర్థ్యము గలవాఁడవును, సంసారవిషవృక్షముయొక్క మొలకను వేళ్ళతోఁ బెల్లగించివేయువాఁడవును, నెదుటఁ గనిపించెడి యైశ్వర్యవీర్యవ్యాపారవిజృంభణము గలవాఁడవును, మాటిమాటికిఁ దిరస్కరింపఁబడుశత్రువులకు భయంకరమైనవాఁడవును, మిక్కిలి కొనియాడఁబడిన పంచేంద్రియార్థములరోగమునందు మేలైన యమృతమువంటివాఁడవైన స్వామీ! నీవు సర్వోత్కృష్టుండవయి యుండుము. పంచేంద్రియార్థముల నెఱిఁగినవారికిఁ బ్రణవనాద మను నమృతప్రవాహమే మంచి రూపముగాఁగలదానవైన యోతల్లి! నీవుసర్వోత్కృష్టురాలవై యుండుము. మిక్కిలి భయంకరమైనసంసారమను పెద్దరోగమునకు శ్రేష్ఠుఁడవైన వైద్యుఁడా! నీవు సర్వోత్కృష్టుండవై యుండుము. గాఢమైన కలవరము నిచ్చెడునజ్ఞానమనుచీఁకటిసముదాయమునకు వెన్నెలవైన యోజగదంబా! నీవు సర్వోత్కృష్టురాలవైయుండుము. త్రిపురములకుఁ బ్రళయకాలపునిప్పువంటివాఁడవును భయంకరుండవును, సత్త్వరజస్తమములనెడు మూఁడుగుణములచేత విడువఁబడినవాఁడవై యణఁచినవాఁడవై యనేకులైన ప్రమథగణములు గలవాఁడవును, సమస్తమును దెలియఁజేయువాఁడవునైన స్వామీ! నీవు సర్వోత్కృష్టుండవై యుండుము. మిక్కుటమైన పరిశుద్ధమైన యన్నము నిచ్చినయన్నపూర్ణవును కోరినకోరికల నిచ్చెడిదానవునైన యోయంబా! నీవు సర్వోత్కృష్టురాలవైయుండు మని వారలతో మఱియు నిట్లయె. 250

సీ. మీర లెక్కడ దేవ! ♦ మీతేజ మెక్కడ, నామాట లెక్కడ ♦ నాకు మీకుఁ
గల తారతమ్యముల్ ♦ గజమశకాంతర,మగు భగవంతుల♦రైన మిమ్ము
భక్తిచే నుతియింప♦బరగిన నన్నుఁ గ,టాక్షించి రక్షింపుఁ ♦ డీక్షణమున
నెల్లలోకములందు ♦ నెపుడు ప్రాణులయెడ, వాత్సల్య ముంచిన♦వార లగుచు

ఆ. జననమృత్యుహీన♦తనువులచే నొప్పి, రాజమానులగుచు ♦ రమణిరమణు
లైన పార్వతీశు♦లగు మీకు నిరతము, మ్రొక్కువాఁడనైతి ♦ నిక్కముగను.

క. సేవలలో భవరహితుని, సేవలు సేయుటయ మిగుల ♦ శ్రేయస్కరమా
కావున నీపదసేవయు,కావించెడుబుద్ధి నాకుఁ ♦ గల్పింపఁగదే! 252

క. ఇతరులతో నా కేమిఁక, సతతము మీచరణసేవ♦సంగతులందున్
జతురత ననుగ్రహింపుఁడు, గతదోషుఁడ నగుదు నని మృ♦కండుఁడు వలుకన్,

క. విని పార్వతీపరమేశ్వరు, లనుపమకరుణాసమేతు♦లై భార్యను గూ
డిన మునిపుంగవుఁ గని నీ,మనమునఁ గల వరము నడిగి♦మా చేఁ గొనుమా. 254

చ. అనిన మృకండుఁడుం బలికె ♦ నయ్యా! మహాత్మక! నీకృపారసం
బును గలదేని నాయెడలఁ ♦ బుత్రులు లేక తపించువాఁడ నే
ననయము, నీదుభక్తుఁ డగు♦నట్టి నమోభవు నా కనుగ్రహిం
చిన నదె సద్వరం బనుచుఁ♦జిత్తమునం గల కోర్కెఁ దెల్పఁగన్. 255

ఉ. అంచుల కీశ్వరుం డనియె ♦ నల్పతరాయువు సద్గుణంబులున్
సుందరమూర్తి విద్య గల♦సూనుఁడొ లేక కురూపియాకృతిం
జెంది విశేషకాలమును ♦ జీవితుఁడైన సుతుండొ నీమనం
బందుఁ గోర్కెఁ దెల్పఁదగు ♦ నట్టికుమారుని నీ కొసంగెదన్. 256

వ. అనిన శంకరునితో మృకండుమునీంద్రుం డిట్లనియె. 257

సీ. గుణహీనుఁడైనట్టి ♦ కొడుకు కురూపి దీ,ర్ఘాయువు గలవాని ♦ నైన నొల్ల
నల్పాయువైనవాఁ ♦ డన్నిసంగతులను, దెలియఁజాలినగుణ♦ధీరుఁడైన
తనయుఁడు చాలును ♦ దయసేయు మన శివుఁ, డట్లకానిమ్ము ప♦దారు నేండ్లు
జీవించు నన్నిఁట ♦ శ్రేష్ఠుఁడై ధర్మాత్ముఁ, డై బుద్ధిమంతుఁడు ♦ నగుచుఁ గీర్తి
ఆ. జ్ఞానవంతుఁడైన ♦ సూనుఁడు గలిగెడు, ననుచు శివుఁ డదృశ్యుఁ ♦ డయ్యె నంత
సంతసించి తనదు ♦ సతితో మృకండుఁడు, నాశ్రమమున కరిగె ♦ నవనినాథ!

ఆ. అవలఁ గొంతకాల ♦ మరుగ మృకండుని,సతి మరుద్వతికిని ♦ సకలమగు
గర్భచిహ్నములును ♦ గనుపింపఁ గడుపు ది,గఁబడకుండ శిశువు ♦ గర్భమందు.

ఆ. వృద్ధినొందుకొలఁది ♦ వృద్ధానుమతమున, గృహ్యసూత్రమందు ♦ నెన్నఁబడిన
మాడ్కిఁ బుంసవనము ♦ వేడ్కతో నొకశుభ,దినమునందుఁ జరిపి ♦ రనఘచరిత!

ఉ. అంతట నాసతీమణికి ♦ నానవమాసము రా నెఱింగి చూ
లెంత సుఖప్రసూతి నగు♦లీలగ నయ్యెడిమార్గమంచు సీ
మంతము సేయఁగా నవల ♦ మంచిదినంబున జీవుఁ డుచ్చ న
త్యంతశుభంబుగన్ గ్రహము ♦ లన్నియు స్వస్థలమందు నుండఁగన్. 261

క. శతభిషమందున నెన్నఁగ, నతులితశుభలగ్నమందు ♦ నాసుదతి మరు
ద్వతి భానుతేజ మమరిన, సుతుఁ గనెఁ ద్రిజగములయందు ♦ శోభ జనింపన్.

ఉ. అప్పుడు దేవదుందుభులు ♦ నంబరమందున మ్రోఁగె దిక్కులన్
గప్పినచీఁకటుల్ విరిసి ♦ కాంతులచేఁ బ్రసరింపఁజొచ్చె నే
రొప్పుగ దేవతాంగనలు ♦ నొప్పిరి పాటల నాటలందు వే
తప్పక దేవతల్ మునులు ♦ దార్కొని రచ్చటి బాలుఁ జూడఁగన్. 263

ఆ. వచ్చినట్టిమౌని♦వర్గంబునందున, ముఖ్యుఁడైన వ్యాస♦మునివరుండు
జాతకర్మమపుడు ♦ శాస్త్రోక్తముగ నొన,రించె శివునికొఱకు ♦ నంచితముగ. 264

తే. పదునొకండగుదినము న♦బ్బాలునకును, నామకరణము సేయించెఁ ♦ జేరిమతోడ
నంత బ్రహ్మాదిదేవత ♦ లఖిలమునులు, పూజలందిరి మృకం♦డుసన్మునివరుకడ.

తే. సంతసింపుచు నాశ్చర్య♦సహితు లగుచుఁ, జనిరి వారలు తమనివా♦సముల కంత
నొక్కదినమున నారదుఁ♦డొక్కఁ డరుగు,దెంచె దద్బాలుఁ గనఁగ సం♦దేహ ముడిగి.

క. ఆనారదునకుఁ బ్రత్యు,త్థానము గావించి భక్తి♦తాత్పర్యములన్
మానుగ నర్చన లిడి స,న్మానించె మృకండుఁ డమిత♦మర్యాదలచేన్. 267

తే. మౌనివరుఁడప్డు మార్గశ్ర♦మంబు దీఱ,కొలఁదిగా విశ్రమింపుచుఁ ♦ గొంతసేపు
సర్వశుభలక్షణములచే ♦ జనకునితోడ,నైన నుండు మృకండుజు ♦ బాలుఁ జూచి.

తే. ఆమృకండునివరపుత్రు♦నవయవములు, హస్తతలమున నిమిరి ప్ర♦శస్తమైన
యెల్లశుభలక్షణములు దా ♦ నెఱిఁగి తొంబ,దాఱునంగుళములు పొడ♦వైనవాని.

సీ. ఆపాదమస్తక ♦ మట్టె యెగాదిగఁ, గనుచు మార్కండేయు♦కరము తనదు
కరమునఁ బట్టె మృ♦కండునితో నిట్టు, లనియె నీకొమరుండు ♦ నఖిలసుఖము
లను గలిగెడు మంచి♦లక్షణములచేత, నరయపరిజ్ఞాత♦యగుచు మఱియు
మితిలేనికాలజీ♦వితుఁ డగు నట్టులఁ, దెలియఁజేసెడిదేహ♦తేజ మలర
తే. పదములందు నితని♦పాణితలములందుఁ, గుంభమత్స్యపద్మ♦కులిశచక్ర
ధ్వజహలాదిరేఖ♦లతు లమరుట శత,వత్సరములు బ్రతుక♦వచ్చు ననుచు. 270

తే. ఎల్లశుభలక్షణములచే ♦ నితనికి సరి,వారు గనుపింప రెచట నీ♦వసుమతిపయి
నైన వీనికిఁ బూర్ణాయు♦వగును షోడ,శాబ్దము లటంచుఁ దెలిపి తా ♦ నరిగె మౌని.

తే. అంతనారదువాక్యము ♦ లంబికేశు,చేత నొందినవరమును ♦ జిత్తమందుఁ
దలఁచి బాలునినాల్గవ♦నెలను నిదుర, కనిచి పొరుగూరి కవల రాఁ♦బనిచె మఱల.

క. అనిసువున కపు డన్న, ప్రాశన మారవనెలను శు♦భోన్నతి దనరన్
జేసి త్రిదశమాసములోఁ, దీసిరి తలవెండ్రుకలను ♦ దివిజులు మెచ్చన్. 273

తే. చౌలమును జేసి శ్రవణన♦క్షత్రమందు, బ్రహ్మవర్చస్సొలుకఁగాఁ ♦ బంచమాబ్ద
మున నుపనయన మవల స♦మ్మోద మొదవ, ధర్మవర్తనచే నుపా♦కర్మచేసి. 274

తే. వేదశాస్త్రములను జది♦వించి సుతుని, గని మృకండుఁడు పలికెను ♦ గరుణ దనర
విప్రులను జూచినంతనె ♦ వివిధగతుల,చే నమస్కార మెపుడును ♦ జేయువలయు.

తే. అటుల నొనరింప నీకుఁ బూ♦ర్ణాయు వగును, వేదవాదులపలుకులు ♦ వృథలుగావు
బ్రాహ్మణాశీర్వచనములఁ ♦ బ్రబలియుముదను,కను బ్రతుకఁగల వీవు న♦న్గన్నతండ్రి!

క. అని జనకుఁడు నియమించిన, విని మార్కండేయుఁ డపుడు ♦ విప్రులగృహముల్
జని దివమురాత్రులందునఁ, గనుపించిన బ్రాహ్మణులకుఁ ♦ గర మనురక్తిన్.

క. మ్రొక్కుచు వారలదీవన, లక్కజ మలరఁ గొనుచు రాఁగ ♦ నబ్దములును పై
కెక్కఁ బదునైదు నతనికిఁ, జక్కఁగ నాబాలుఁ జూడ ♦ సప్తమహర్షుల్. 278

తే. ఆమృకండుమహాముని♦యాశ్రమమున, కరుగుదెంచిన నొకనాఁడు ♦ నధికభక్తిఁ
పీఠముల నిచ్చి కూర్చుండఁ♦బెట్టితగిన,పూజ లొనరించి ఋషులకు♦మ్రొక్కుమనుచు.

క. తనసుతుఁ డగు మార్కండే,యుని నియమింపఁగ నతండు ♦ నుత్సుకుఁడై స
ద్వినయముగ నందు నాఱ్వుర,కును మ్రొక్కఁ జిరాయు వగుట♦కును దీవింపన్.

క. అంత వశిష్ఠునిపదముల,చెంతకు మ్రొక్కుటకుఁ జన ని♦షేధింపుచు నీ
వంతటనె నిలువు మనవుఁడుఁ, జింతను భయకంప మొదవఁ ♦ జిత్తముగలఁగన్.

క. తత్తరపాటును జెంది ని,రుత్తరుఁడై నిలిచె హాస్త♦యుగ మొకచక్కన్
హత్తించి పిదప నాఱ్వురు, మొత్తముగా నేకవాక్య♦ముగ నని రపుడున్. 282

క. మ్రొక్కఁగవచ్చిన డింభకు, నక్కట లేదనుచు నీవు♦నాడినపలుకుల్
నిక్కముగఁ గారణముతోఁ, జక్కఁగ నెఱిఁగింపవలయు ♦ సరగున మాకున్.

సీ. తనకుఁగా మ్రొక్కవ♦చ్చినవార లెవరైన, వలదనఁగూడదు ♦ బ్రాహ్మణునకు
ననువారితోఁ బూజ్యుఁ♦డగువశిష్ఠమునీంద్రుఁ, డనియె మీవాక్యము ♦ లనృతము లగు
నన మేము నెచట స♦త్యము దప్పనాడితి, మెఱిఁగింపు మనవుఁడు ♦ నతని కిపుడు
షోడశవర్షముల్ ♦ జొచ్చె నావల వచ్చు,సంవత్సరాదిన ♦ చావు నిక్క
తే. మది విచారణ లేక దీ♦ర్ఘాయురస్తు,టంచు దీవింప నెటులఁ బూ♦ర్ణాయు వమరు
దైవకృతమైన కార్యము ♦ దప్పఁద్రోయ, నితరులకు సాధ్యమా నే ము♦నీంద్రులార!

చ. అనవుఁడు కశ్యపాదిఋషు ♦ లాఱ్వురు నిట్లని రావశిష్ఠునిం
గనుఁగొని యీకుమారు మృతి♦కాలము పై నరుదెంచువత్సరం
బునఁ దొలినాఁడు గా నెఱిఁగి ♦ భూరిచిరాయువు గల్గునట్లు దీ
వన లిడువారమైతి మవి ♦ వ్యర్థ మసత్యము లాయె నెంతయున్. 285

ఉ. నావుఁడు నమ్మునీంద్రుల ఘ♦నమ్మగఁ జూచి వశిష్ఠుఁ డాడె మీ
భావములందుఁ గుందకుఁడు ♦ పద్మజుఁ జేరఁగ నేగి వినిచే
నీవిధి మ్రొక్కఁజేత మపు♦డేమి వచించునొ బ్రహ్మ దానిపై
వావిరి స్రష్టతోఁ దగిన ♦ భంగిని బల్కుద మర్థి నప్పుడే. 286

చిత్రపదము. ఆయన యిట్లన వా రా,హా యని యాతని బాలుం
బాయక ముం దిడికొంచున్ ♦ బోయిరి బ్రహ్మను జేరన్. 287

మానిని. అప్పుడు స్రష్ట చరాచరభూతము ♦ లన్నిట సృష్టివిచారణ చే
నొప్పి పురందరుఁ డాదిసుపర్వులు ♦ నోలి భజింపఁ జతుర్ముఖముల్
మెప్పిరి గా నిగమార్థములందుఁ బ్ర♦మోదము నొందఁగ నిశ్చలతన్
గొప్పగుపుష్కరపీఠముపైఁ దగఁ ♦ గొల్వున నుండె మహోన్నతుఁడై. 288

సీ. అంత మరీచ్యాదు ♦ లనిరి మార్కండేయుఁ, గని మన మిప్పుడు ♦ కమలభవుని
ఘొమటికి నేగుద ♦ మేము నమస్కరించిన నీవు మ్రొక్కుము ♦ వినయ మమర

నని తెల్ప నతఁడు న♦ట్లొనరింప దీర్ఘాయు, వగు మని దీవించె ♦ నబ్జయోని
అవల నచ్చటి మును♦లందఱకును మ్రొక్కి, వారలచేత దీ♦వనలఁ బడసి

తే. పిదపఁ దేశోభివృద్ధి వెం♦పొందవ హస్త, యుగము బంధించుకొని నిల్చి♦యుండె నప్పు
డామునీంద్రుల సభ్యుల♦కభిముఖుఁడయి, నవ్వుచు వశిష్ఠుఁ డిట్లనె ♦ నలువను గని.

క. మునిపుంగవు లియ్యెడఁ గన, ననృతముల వచింప నొప్పి ♦ రవని సృజింపన్
దనరిన నీవును వారల, కనుగుణముగఁ బల్కినాఁడ ♦ వంబుజసూతీ ! 290

క. అన విని మును లప్పుడు బ్రహ్మను మనము నబద్ధ మెటుల ♦ నాడితి మని ప
ల్కిన సృష్టి వశిష్ఠునితో, ననె మే మెటు నిజముఁ దప్ప ♦ నంటిమొ చెపుమా!

చ. అనిన వశిష్ఠుఁ డిట్లనియె ♦ నయ్యా! విరించి మునీంద్రులార! మీ
రనయము సత్యవాక్యముల ♦ నాడెడునట్టి స్వభావసిద్ధుల
య్యును నిపు డిం దబద్ధమున ♦ కొప్పితి రెట్లనఁ దద్విధంబు నేఁ
బనివడి తెల్పెదన్ వినుఁడు ♦ బాగుగ వీనుల సోఁకునట్లుగాన్. 292

తే. దేవతలలోన నో బ్రహ్మ♦దేవ! నీవు, శ్రేష్ఠుఁడవు ♦ సృష్టికర్తవు త్రిజగములకు
నైన నీకు రజోగుణ♦ప్రాప్తి తనరి, దూరపాలోచనమ్మేమి ♦ తోఁచదయ్యె. 293

ఉ. ఇప్పటి వత్సరాంతమున ♦ నెన్నివిధంబులఁ జూడ వీనికిన్
దప్పదు చావు మీపలుకు ♦ తథ్యము గావున దాని నెంతయే
నొప్పిదమై నటింపఁగల ♦ యోజన చేయు మటన్న బ్రహ్మ తా
నప్పుడు కొంతసేపు మన♦మందు విచారముఁ జేసి యిట్లనెన్. 294

క. ఔ నేను బొంకులాడితి, మౌనివరా! దీని కేమి ♦ మార్గ మటంచున్
మౌనవ్రతుఁడై నిముసము, మానసమునఁ జింతనొంది ♦ మతి ధైర్యమునన్. 295

ఆ. హరుఁడు నాత్మసదృశ ♦ మైన జవ్వనము నా,యువును భక్తవరుల♦కొసఁగి మృతిని
దొరగకుండునటులఁ ♦ గరుణించు విషయము, జ్ఞప్తిదగుల నపుడు♦ కమలభవుఁడు.

సీ. ననుఁ బద్మనాభుని ♦ నాగాంతకుని వాయు,సూనుని బ్రహ్లాదు♦శుకుని ధ్రువుని
బాణు విభీషణు ♦ బలిని వ్యాసుని జిరా,యువులనుగాఁ జేసె ♦ శివుఁడు గాన
నాయువు నొసఁగుట ♦ నభవునకంటె నా,కెవరును గనుపింప ♦ రితరు లనుచుఁ
దలఁచి మార్కండేయు♦తనువుపైఁ దనవామ,కరమును జేర్చి ♦ కౌఁగిలించి

తే. దక్షిణకరంబునాతని♦తలపయి నిడి, మాడు మూర్కొని నిరతము♦మనమువాక్క
ర్మచే నాకు శివభక్తి ♦ గలిగెనేని, నితని కబ్దశతాయుష్య♦మిచ్చు భవుఁడు.

తే. సకలవాంఛ లొసంగెడి ♦ సాంబశివుని, దక్క వరదేవతలనుమా♦స్తములఁ బూజఁ
నేత పొగడుట మొదలగు♦చెయువు లేను, నెఱుఁగకుండిన వీనికిం♦కరుఁడు ప్రోచు.

క. అని యిటుల బ్రహ్మదేవుఁడు, మనమునఁగల తనప్రతిజ్ఞ♦మహిమయు సభ్యుల్
వినునటులఁ బ్రమాణముగాఁ ♦ బనివడి శూలినిగురించి ♦ ప్రార్థించి తగన్. 299

సీ. కరుణదలిర్ప మార్కండేయుతో, నోరి చిన్నికుమార! కా♦శికిని జేరి
తనభక్తవరులు కో♦రినకోరికల నిచ్చు, భవుఁడు సంతోషింప♦ భాగ్యమైన
యమనియమాదియో♦గములచేతను దప, మాచరింపు మటంచు ♦ నబ్జభవుఁడు
దెలిపిన మ్రొక్కి యా♦ దేవునను జ్ఞను, బొంది యచ్చటినుండి ♦ భువికి నరుగు
దెంచి జననీజనకులను♦ గాంచి శిరము, వంచి వందన మపు డాచ♦రించి పిదప
సత్యలోకమునందలి♦ సంగతులను, దెలియఁబలుక మృకండుఁడు ♦ దిగులునొంది.

ఉ. అప్పటి కాయు వీతనికి ♦ నాలునెలల్ గల దంచు మీఁదటం
దప్పదు చావు సిద్ధమయి ♦ దాకొనెనంచు నెఱుఁగువాఁడునై
ముప్పిరిగొన్న శోకమున ♦ మున్గుచు నింద్రియపాటవంబులుం
దప్పినవై మదింగలఁగఁ ♦ దా విలపించుచునుండె నెంతయున్. 301

క. నీవు గతించిన తండ్రీ, యేవిధమున బ్రతుకువార ♦ మిహపరములకుం
దోవ గనుపడదు మాకిఁక, నీవే గతియనుచుఁ దల్లి ♦ స్పృహదప్పి పడెన్.

సీ తనయులులేనట్టి ♦ తల్లిదండ్రులకు లోకము లేదు లోకసౌ♦ఖ్యములు లేవు
గృహధర్మములు సెడు ♦ నితరులచేఁ జేయఁ, దగిన సత్క్రియలు వ్య♦ర్థములనఁబడు
గాన సంతానము♦ లేనివానికి సర్వ, శూన్యమౌ నాయనా! ♦ సుతులులేమి
గొప్పదుఃఖము చెడ్డ♦ కొడుకులు గలిగిన, తరుగనిదుఃఖ మా♦ద్యమునకంటె.

ఆ. సజ్జనుఁడగు సుతుని♦ చావు మిక్కిలిశోక, మిందు కేమిసేతు ♦ మీశ! నీదు
కరుణ లేకపోవ ♦ గతకాలమునఁ దప్పు, లేమిసంభవించె ♦ నింతపనికి? 303

ఆ. పూర్వకాలమేను ♦ భూసురద్రవ్యము, పాపకర్మనగుచుఁ ♦ బడసినానొ
తల్లిదండ్రులకును ♦ పిల్లలకెడలు బాపితినొ యెన్నడైన ♦ భీతిదక్క. 304

ఆ. రాత్రిపూట నతిథి ♦ రా విచారింపక, యిల్లుసేరనీక ♦ వెళ్లనడిపి
తొక్కి యొకనికలిమి♦ కోర్వకపోతినో, యతులనిందచే గృ♦హస్థకులము. 305

క. వాని చెడిపోవునటులను, జేసితినో మున్ను నేను ♦ జెడుతలఁపులతో
నానించితినో సతులను, గాసిలినొందుటకు నేది ♦ కారణ మనుచున్. 306

క. అతిదుఃఖమున మృకండుఁడు, మతి చెడి విలపింపసాగె ♦ మఱియంత మరు
ద్వతి కళలుదేరి శోకా, న్వితయై పలుకంగఁదొడఁగె ♦ వివిధగతులచేన్. 307

తే. పూర్వభవమునందు ♦ గర్వించి యావులనఁటఁబితికి దూడ♦ లాఁకలిగొనఁ
జంపినానొ లేక ♦ చంటిపిల్లల తల్లి, పాల కపుడు నెడలు♦ బాపినానొ. 308

సీ. నాకు బిడ్డలులేమి ♦ నాసవతులకును, గలుగ నోర్వఁగలేక ♦ కలహమేను
నేసినానో లేక ♦ శ్రీమంతుఁ డధికసుందరమూర్తిగా, నొప్పు ♦ పరపురుషుని
జూచి నా పెనిమిటి ♦ చూపరికాఁడు దరిద్ర్యముగలవాఁడు కాఁ♦డనుచు మిగుల
కక్కసపడితినో ♦ కాక జారునిగూడి, భోగింపనెంచి దు♦ర్బుద్ధిఁ దనర

ఆ. భర్త కనుకూలమొదవెడి ♦ భార్యవగిదిఁ, దగిన శుశ్రూష లొనరించి ♦ దట్టమైన
నిదురఁబోఁజూచి వంచించి ♦ మదిఁదలఁకక, జారపురుషుని చెంతను ♦ జేరినానొ.

ఆ. ఇంటఁ గలుగుదద్రివ్య • మితరులకును గొల్ల,పెట్టి చెప్పినటుల • వినక మీరి
పొరుగుగృహములందుఁ • దిరుగుటచే నేను, భర్త నెపుడు దుఃఖ•పఱచినానొ.

క. అని పలువిధముల వఱలుచు, ఘనశోకాబ్ధిని మునింగి • కౌఁగిట దుఃఖం
బున సుతుని జేర్ప జననీజనకుల మార్కండుఁ డపుడు • సవినయమతియై. 311

క. మీ కింతదుఃఖమేటికిఁ, జెకొనె వివరింపు మనుడుఁ • జిత్తము గలఁగన్
నీకొఱ కంచు మృకండుఁడు, ప్రాకటముగఁ దద్విధంబుఁ • బలుకఁదొడంగెన్.

తే. వామదేవుఁడు షోడశాబ్దములు నీకు, నాయువు నొసంగె నిప్పటి • కందులోనఁ
బంచదశవత్సరములు గంతించెఁ బైన, నాఱుమాసము లాయె నీ•కాయు వికను.

తే. కలదు షణ్మాసములె యవి • గడువ మరణ,కాల మా నని దుఃఖము•గలిగెఁగనుల
లేనివానిని సంతానహీనుఁ బోల్తు, రందు వారికిఁ దారత•మ్యములు గలవు. 314

ఆ. అవియు నెట్టు లనఁగ • నంధున కిహలోక, మొకటె చూడఁబడదు • సకలలోక
ములును సంతులేక•విలపించువానికిఁ, గానుపింపదని మృ•కండుఁ డనఁగ. 315

క. విని మార్కండేయుఁడు తన,జనకునితో ననియె మీకుఁ • జన దిఁక దుఃఖం
బును నాకుఁ గాన నెట్లన, ననలాక్షుఁడు మేలుకొలికె • యల్పాయు విడెన్. 316

క. ఏవిధి మెలఁగిన ముదిమియు, జావును దొలగంగఁజేయు • శంకరుఁడు కృపన్
ఏ పెరవున మర్త్యత్వము, పోవునొ తద్వ్రతముఁ జేయుఁ•బూనుఁడు తండ్రీ! 317

సీ. ఎల్లలోకములకు • నీశ్వరుం డయి మృత్యు,వును జయించిన మహా•ఘనుఁడు కోర్కు
లెలమి సత్పురుషుల•కీడేర్చు ప్రభువు ల,లాట నేత్రుఁడు కాల•కూటధరుఁడు
ప్రళయకాలమునందు•వైవస్వతుఁడు దండ,ధరుఁడునా యముఁడు నా•బరగు శివుని
శ్రీమహాదేవుని • సేవింతు నని పల్కు, సుతునివాక్యములు స•మ్మతి దలిర్ప

తే. నాలకింప మదికి • నాయాసదుఃఖము, వదలి సంతసమునఁ • బొదలి రంత
కరుణ దనర సుతుని•గాంచి మృకండుఁడు, పలికె నవ్వు డిటులఁ • బార్థివేంద్ర!

తే. మాకుఁ గలిగిన దుఃఖము • మానుటకయి, మృత్యువును ధిక్కరించిన • మృడునిసేవ
గొప్పమే లది నీచేతఁ • జెప్పఁబడియె, నింతకును మించు కార్యమిం•కేది కలదు?

క. కావునఁ బుణ్యఁపుఁగాశికిఁ, బోవుము శంకరునిగూర్చి • పొలుపుగఁ దపమున్
గావించి కార్యసిద్ధిని,నేపెరవునైన బొందు•మీశ్వరువలనన్. 320

ఆ. తపము సేయ నెఱుఁగు • ధన్యులు గౌతమీ,తీరమందుఁ బుణ్య•దేశ మనుచుఁ
బలుకుచుందు రిపుడు • బాలక! నీవు న,చ్చోటి కరిగి శివు ల•లాటనేత్రు. 321

ఆ. త్రిపురహరుని దేవ•దేవు నారాధన, చేయుమనుచుఁ దెలియఁ•జెప్పి తండ్రి
సుతునిగూర్చి యొక్క • యితిహాసమును విని,పించె నదియు నీకు • విస్తరింతు.

వ. సావధానంబుగా నాకర్ణింపుమని రాజేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 323

తే. శ్వేతకేతువు శమనుని ♦ చేతఁ బూర్వ, కాలమునఁ బాశముల నంటఁ ♦ గట్టఁబడిన
శివుఁడు వదలించి వాని ర ♦ క్షించినకథ, నీవు వినియుందువేకద ♦ నిక్కముగను.

క. విను నందీశ్వరుఁడు శిలా, దునికొమరుఁడు లోకము పరి ♦ తోషణ మొనరిం
పను జాలువాఁడు నేఁడులు, నెనిమిది నా వృత్తిని బొంద ♦ నీశ్వరుఁడు దయన్. 325

సీ. తననిజస్థానమం ♦ దున నిల్చి రక్షించె, నమరులు దానవు ♦ లమృతమునకుఁ
బాలసంద్రము మథిం ♦ పఁగ నందుఁ బుట్టిన, హాలాహలము లోక ♦ మావరించి
పీడింపఁ బార్వతీ ♦ విభుఁడు తద్విషమును, భక్షించి ప్రాణులఁ ♦ బ్రతుకఁజూచె
త్రిభువనపదవి హ ♦ రించి మించిన జలం, ధరుని వధింపఁగఁ ♦ దలఁచి కాలి

ఆ. బొటనవ్రేలిగీరఁ ♦ బుట్టినచక్రము, నంబుమధ్యమందు ♦ హరికి నొసఁగి
శంకరుండు విష్ణు ♦ సంబంధమగు శూల, మపుడు దాల్చి తనదు ♦ హస్తమందు. 326

క. హరితోఁ గూడుకొని జలం, ధరుని వధించెను శివుండు ♦ తనయా! నీవున్
హరునిన్ సేవింపని కని, కరమునను మృకండుఁ డనియెఁ ♦ గాంక్ష జనింపన్. 327

క. అని యిటు మార్కండే, యునకును జనకుఁడు తెలిపె ననఁగఁ ♦ గుతుకము దనరన్
వినఁగ దిలీపుఁడు కులగురు, వనఁదగనవశిష్ఠుతోడ ♦ ననియెను మఱలన్. 328

ఆ. హరికిఁ జక్రమనియు ♦ హరునిది శూలము, ననియుఁ ద్రిజగములను ♦ బ్రచురమయ్యెఁ
జంద్రధరుఁడు తనదు ♦ చక్రము వెన్నున, కేల యిచ్చె శూల ♦ మెటులఁ గొనియె!

క. ఎవఁడు జలంధరుఁ డనఁగా, శివుఁ డెటుల వధించె వాని ♦ సిద్ధగతు లెటువం
టివి తద్వివరము మునిపుం, గవ! నా కెఱిఁగింపు మనుడుఁ ♦ గరుణాన్వితుఁడై. 330

సీ. రాజేంద్ర! వినుము పూ ♦ ర్వమున హిరణ్యుండు, పదుగురుతనయులఁ ♦ బడసె నందు
జిన్నవాఁడగు నగ్ని ♦ జిహ్వుఁ డసురరాజు, పేరు విన్నంత నే ♦ భీతి దనరు
నన్నిజగంబుల ♦ నతనికి నూకరుఁ, డనువాఁడు జనియింప ♦ నబ్జభవుని
దపముచే మెప్పించి ♦ దానవసురనాగ, యక్షాదిగణముచే ♦ నాయుధములఁ

తే. జావకునికి నధిక ♦ సలిలనివాసము, గలఁగునట్లు బ్రహ్మ ♦ వలన వరము
నొంది లోకముల జ ♦ లంధరుఁ డనుచుఁ బ్ర,సిద్ధిఁ జెందె నతఁడు ♦ చెలువ మమర.

క. అతిగర్వితుఁ డగుచుఁ బ్రజా, పతివరమునఁ ద్రిజగములను ♦ బాధించి మహో
న్నతపదవి నెసఁగు నమరావతిఁ, జీకొని సురల గెలిచి ♦ వసుధాధీశా! 332

ఉ. అంతట దుగ్ధవార్ధిరజ ♦ తాద్రిలపైని గమింప దానవుం
డంతకుమున్నె నారదమ ♦ హామునిచే విని వానిరాక క
త్యంతవిషాద మంది గిరి ♦ శాచ్యుతు లిర్వురు మేరుపర్వత
ప్రాంతమునందు మానసస ♦ రస్సున డాగిరి భీతచిత్తులై. 333

తే. ఆజలంధరుఁ డంతట ♦ నచటి కరిగి, హరిహరుల నందుఁ గానక ♦ తిరిగి నూఱు
దేవసంవత్సరములు గ ♦ తించె మూఁడు, లోకములు జూచు కాలము ♦ ప్రాకటముగ.

వ. అంత నద్దానవుండు తనమనంబున నిట్లని వితర్కించె. 335

ఉ. నాకు విరోధులై తగుజ ♦ నార్దనశంకరులర్ వశంబుగాఁ
జేకొనకే త్రిలోకముల ♦ శ్రీయును లేనిదె వారి నింక నే
నేకొలఁదిం గనుంగొనెద ♦ నెక్కడ దాగిరొ తోఁచదంచు నా
నాకరరాజు శాత్రవుల ♦ జొప్పు నెఱుంగఁదలంచుచుండఁగన్. 336

సీ. సలిలమందున రహ ♦ స్యముగా వసించిన, హరిహరు లసురుని ♦ హతముజేయు
కొఱకుఁ బ్రయత్నింపఁ ♦ గొంతకాలమునకు, నొకయుపాయములోఁచెఁ ♦ బ్రకటితముగ
నది యెట్టు లన వార ♦ లసురునిచేఁ దమ, కెందు నపాయంబు ♦ జెంద దనుచు
నెఱిఁగి దైత్యారి శం ♦ కరుని త్రిశూలము, ధ్యానించి దాని స్వా ♦ ధీనపరచు

తే. కొనఁగ ద్రిగుణాత్మకంబయి ♦ తనరుశూల, మే స్వరూపముగల పర ♦ మేశ్వరుఁడు త్రి
శక్తులను గూడి దియును ♦ శమనునైన మరణ, మొందింపఁగలుగు స ♦ మర్థతయును.

తే. ప్రళయకాలాగ్ని యే స్వరూ ♦ పముగఁగల్గు, చక్రమును దక్షిణంబున ♦ శంకరుండు
తనదుకుడికాలిబొటనవే ♦ లినిఁ బొడమిన, గీరయందునఁ గలిగించి ♦ కేశవునకు.

క. ఇచ్చి తనశూల మంతటఁ, బుచ్చుకొనం జంద్రధరుఁడు ♦ పురుషోత్తముచేఁ
బెచ్చుపెరిగి యద్దానవు, చచ్చునుపాయంబు వెదుక ♦ సాగి రిరువురున్. 339

సీ. అప్పుడు నారదుం ♦ డాప్తునివలె జలం, ధరునిచెంతకు వేగ ♦ నరుగుదెంచి
హరిహరులవిధము ♦ నంతయు నెఱిఁగింపఁ, బొంగి విరించిచేఁ ♦ బొందినట్టి
వరబలిమిని మేరు ♦ పర్వతాగ్రమునకు, నేగువాయువుక్రియ ♦ నేగి రాద్రి
రసము నుప్పొంగ మా ♦ నససరస్సున జల, ములను బ్రవేశించి ♦ కలయఁదిరుగు

తే. చుండువానికిఁ గానరా ♦ కుండ బైటి, కరుగ శివకేశవులు దైత్యుఁ ♦ డందు వెదకి
వార లిరువురు లేకుంట ♦ వారి వెడలఁ, జూచి తమహస్తలచక్ర ♦ శూలములను.

తే. ఏరికి నజేయుఁడైన దై ♦ త్యేంద్రుశిరముఁ, ద్రుంచి లోకులబాధ లం ♦ డంచి రపుడు
హరుని విష్ణువు తనదునే ♦ త్రాబ్జములను, బూజగావించి చక్రముఁ ♦ బుచ్చుకొనియె.

క. చిరకాలముక్రిందట నా, హరిహరులకు మార్పు గలిగె ♦ నాయుధములు నే
విరళముగఁ దత్కథావలి, నెఱిఁగించితి నిపుడు నీకు ♦ నినకులతిలకా! 342

క. అనుచు జలంధరువర్తన, మును దెలిపి వశిష్ఠమౌని ♦ భూమీశునకున్
వినుపించెను మార్కండే, యునిచరితము నదియు నీకు ♦ నొనరఁగఁ జెపుదున్.

వ. సావధానంబుగా నాకర్ణింపుమని సూతుండు శౌనకాదుల కిట్లనియె. 344

## మార్కండేయచరిత్ర.

సీ. అపుడు మృకండుఁడు ♦ ననియెమార్కండేయ! శివునిప్రభావము ♦ చెప్పెద విను
చందురుం డగ్ని గో ♦ విందుండు నాయువు, నొకటియై యుంబుగా ♦ నొప్పఁ దనదు

ధనువున సంధించి ♦ దామోదరుఁడు వృష, భముగా రథముక్రిందఁ ♦ బరగ ననికిఁ
దోడ రా బాణాగ్ని ♦ తోఁ ద్రిపురములను, గాల్చె శంకరుఁ డది ♦ గాక త్రిజగ

తే. ములను నైశ్వర్యపదవిని ♦ బొంది గర్వ, మునఁ బ్రవర్తించునంధకుఁ ♦ డనెడి దైత్యు
శూలమున గ్రుచ్చి పైకెత్తి ♦ సూర్యకిరణ, ములను నొకవేయివత్సర ♦ ములను వాని.

తే. కాల్చి భస్మము చేసె, శం ♦ కరుఁడుమూఁడు, జగములను మోహ మొందింపఁ ♦ జాలినట్టి
రతిపతిని నయనాగ్నిచే ♦ హతము చేసెఁ, గాన బ్రహ్మాదులకు ముఖ్యుఁ ♦ డైన కర్త. 346

తే. ఇంద్రుఁడును నాశరహితుండు ♦ నెప్పటికిని, రత్నమును బోలి త్రిజగముల్ ♦ రక్షకత్వ
మును వహించినఫాలనే ♦ త్రునిగురించి, పొమ్మనుచుఁ దండ్రి సుతునకు ♦ బోధచేయ.

క. విని మార్కండేయుఁడు తన, జనకునివాక్యములు మదికి ♦ సంతస మొదవన్
మును గౌతమఋషి పూజిం, చిన గోదావరినదికిని ♦ జెలువుగ నరిగెన్. 348

క. ఆనదిదక్షిణదిక్కున, మానుగఁ దత్తీరమందు ♦ మంచిదినమునన్
స్థాణుని లింగాకారము, గా నిలిపెఁ బ్రతిష్ఠతో మృ ♦ కండునిసుతుఁడున్. 349

తే. అటులఁ గావించి కాలత్ర ♦ యమున నదిని, స్నానమును శంకరార్చన ♦ స్తవము జపము
జేయుచు సమాధినిష్ఠచేఁ ♦ జిత్త మితర, వృత్తులను జెందనీక వ ♦ ర్తింపుచుండె. 350

క. కాలునకు శమనుఁడును లయ, కాలంబున గొప్పయముఁడు ♦ కరుణాన్వితుఁడున్
గాలాతీతుఁడు విద్యలఁ, జాలి తదనురూపమునకుఁ ♦ జాలినవాఁడున్. 351

తే. అఖిలజగములుపుట్టుచో ♦ నైనవాఁడు, మ్రొక్కఁదగువాఁడులోకముల్ ♦ మూఁడిఁటికిని
గారణుఁడురక్షకుఁడు ప్రభు ♦ గాఁ దలంచి, ధ్యాన మొనరింపుచుండె సం ♦ తతము మదిని.

తే. అమృకండునితనయుఁడు ♦ నమితమైన, యోగనిష్ఠను మౌనియై ♦ యుండ నాఱు
నెలలు జీవితకాలము ♦ నిండి కొన్ని, నాఁడులు నతిక్రమింప ని ♦ రూఢముగను. 353

ఉ. అంత మునీంద్రులుం ద్రిదశు ♦ లందఱు గొల్వఁగ బ్రహ్మదేవుఁ డ
త్యంతకుతూహలాప్తి రజ ♦ తాద్రికి నేగి మహేశు నీశుఁ గా
లాంతకు నిందుశేఖరుఁ గృ ♦ పాకరు గోత్రకులంబు నెప్పి తా
సంతస మొప్ప వందనము ♦ సల్పి సువాక్కులచే నుతింపఁగన్. 354

సీ. అంబికాధవుఁడు ప్ర ♦ త్యక్షమై నలువను, గని నీమనంబునఁ ♦ గల తలంపు
తెలుపుము దాని నేఁ ♦ దీర్చెదనని పల్కఁ, శంకరుఁ జూచి ని ♦ శ్శంక తనర
పద్మజుఁ డిటులనెఁ ♦ బరగ మార్కండేయు, నకు షోడశాబ్దముల్ ♦ ప్రకటితముగ
నాయువు నొసఁగుట ♦ నది నే నెఱుంగను, బ్రతిదినంబును నీవు ♦ బ్రాహ్మణులకు

తే. మ్రొక్కుమనుచుఁ దండ్రి ♦ మొదమున నియమింప, జనకునాజ్ఞ నతఁడు ♦ జరుపుచుండి
ద్విజులచేత నమిత ♦ దీవన లందుచు, వృద్ధి నొందుచుండె ♦ విమలచరిత! 355

క. అంతట నొకదినమున నా, వంతకు నరుదెంచి మ్రొక్కఁ ♦ జిరకాలాయు
ష్మంతుఁడ వగుమని నేన, త్యంతప్రియంబుగను బలికి ♦ తండ్రివరలె నే. 356

తే. అతనికి వశిష్ఠుఁ డల్పాయు ♦ వనుచు నాకు, దీవెనలొసంగ నావలఁ ♦ దెలిపె మునులు
నేను బల్కినవాక్యము ♦ చెప్పుడు చెదని, పద్ధతి ననుగ్రహింపు మో ♦ పార్వతీశ!

క. శ్రీమన్మృకండుకొమరున, కే వొసఁగిన వరము లన్నృత ♦ మేని జగముల౯
మామాట లబద్ధములయి, నీముజ్జగములు నసత్య ♦ మిది నిక్కమగు౯. 358

సీ. ఆచిన్నవానికి ♦ నాయుష్య మొకశతా,బ్దము లని తొలుత దీ ♦ వన లొసంగి
యంతట నిలువక ♦ నాలు నావృత్తులు, పలికితి నటువలె ♦ భవ్యచరిత!
కావున నాదువా ♦ క్యము లసత్యము లయి, పోని సద్వ్రతమును ♦ బూనవలయు
నని పెక్కుభంగుల ♦ వినుతింపఁ బరమేష్ఠి, వినయవాక్యములను ♦ విశ్వసించి

ఆ. శివుఁడు నతనికొందలి ♦ జీవితకాల ని,బంధనలఁ దలంచి ♦ బ్రహ్మ ననిపి
గౌరితోడ వృషభ ♦ గమనుఁడై దివిజులు, ప్రమథగణము తన్ను ♦ బలసికొలువ.

క. చని మార్కండేయు తపో,వనమునకును నచటఁ జేయు ♦ వ్రతనిష్ఠను దా౯
మనమునఁ గని మెచ్చుచు నా,తని కంతఁ బ్రసన్నుఁడయ్యెఁ ♦ దడయక శివుఁడు౯.

ఆ. అప్పు డుదయకాల ♦ మర్చన గావించి, శంకరుని నుతింప ♦ సాగె నతఁడు
యముఁడు తనదుసదన ♦ మందున శివపూజ, సలిపి నుతు లొనర్చి ♦ సక్రమముగ.

చ. తనవెనువెంట మృత్యు వతి ♦ దర్ప మెలర్పఁగఁ దోడురాఁగ గుం
డ్రని మిడిగ్రుడ్డు లెఱ్ఱనయి ♦ క్రాలెడికన్నులు కోఱమీసముల్
దనరి కరాళవక్త్రమును ♦ దద్దయు వృశ్చికసర్పరోమముల్
ఘనమగు భీతి నొందెడి ము ♦ ఖంబును గాటుకకొండదేహము౯. 362

క. ఈవిధమున మార్కండుని, జీవితకాలమును దనదు ♦ చిత్తమునందు౯
భావించి శమనుఁ డతనిత,పోవనమున కరిగి వటుని ♦ బొలియించుటకై. 363

క. తనచేతిపాశ మపు డా,తనికుత్తుకకు వేయ నేమి ♦ తలఁకక సమవ
ర్తిని నీవు బుద్ధిమంతుఁడ, వనఁదగుదువు నాదుపలుకు ♦ లాలింపు మొగి౯. 364

సీ. అన్నిలోకంబుల ♦ కాధ్యుఁడౌ శంభుని, నుతు లొనర్చుచునుంటి ♦ నతులితముగ
నది నాకు ముగిసెడు ♦ నంతపర్యంతము, దలఁపను నేను నీ ♦ స్థలము విడిచి
పోను నిద్రింపను ♦ భోజనాపేక్షను, వర్తింప మెలఁగని ♦ వ్రతము నాకు
ప్రాణములందు స్వ ♦ భార్యయం దితరసు,ఖములందు శివభక్తి ♦ గలుగునంత

ఆ. కంటెఁ బ్రియము లే దొ ♦ కప్పుడు శివపూజ, జేయకున్న నవియు ♦ జేతు లనుచు
నెన్న; నాలయమున ♦ కేగనిదినములఁ, గాళ్ళు విఱిగినట్లు ♦ గాఁ దలంతు. 365

ఆ. శివునిదర్శనంబు ♦ చేకూరకుండిన,వేళఁ గనులు లేని ♦ వే; నుతులను
జేయకున్నదినము ♦ జిహ్వ లేనిదె యని, తలఁచుచుందు నెపుడు ♦ ధర్మనియతి.

క. హరునకు మ్రొక్కనిదినమున, శిరమును దెగిపోయినట్లు ♦ చిత్తమునందు౯
స్మరియింతుఁ బ్రదక్షిణ మీ,శ్వరునకుఁ జేయంగలేని ♦ సమయమునందు౯. 367

ఆ. ప్రాణసహితమైన◆వానిగా నెన్నదు, మనము వాక్కు కర్మ◆మును నొకటిగ
సత్య మేను బలుకఁ◆జాలిన శివుఁడు ప్ర◆త్యక్షమగు నసంశ◆యంబుగాను. 368

ఆ. అనృత మేను నెపుడు ◆ నాడెడువాఁడను, గాను గాన నీవు ◆ కరుణ తనర
నేను నిపుడు జేయు ◆ నీశ్వరనుతు లగు,నంతవరకు నేమి ◆ యనకు నన్ను. 369

సీ. అనుచు మార్కండేయ◆ముని పల్కువినయోక్తు, లాలించినవ్వుచుఁ ◆ గాలు డిటుల
ననియె నీ వెన్నఁడు ◆ నార్యులవాక్యము, ల్వినలేదు కాఁబోలు ◆ వెఱ్ఱివాఁడ!
ఏబుద్ధిహీనుండు ◆ కృతకృత్యుఁ డగుటకు, యత్నింపకుండిన ◆ వ్యర్థుఁ డగుచు
దారిబత్తెము లేక ◆ తల్లడిల్లెడుబాటు, పారివిధమున వి◆చార మొందు

ఆ. అష్టమాసములను ◆ గష్టింప సౌఖ్యము, నొక్కవత్సరమున ◆ నిక్కమగును
బాల్యమందుఁ దగిన ◆ పాటుబడిన వార్ధకమున మానవునకుఁ ◆ గలుగు సుఖము.

ఉ. ఏపనిచేత మానవుఁడు ◆ నెల్లపుడున్ సుఖియింపవచ్చునో
యాపని వెంటనే జరుగు◆నట్టిఫలం బొనగూడుఁ గాన నీ
మాపును రేపు జేయుపని ◆ మానుగ రేపె ముగింతునంచుఁ దా
రేపటిరాకకై మది ని◆రీక్షణచేయఁగఁబోల దెప్పుడున్. 371

సీ. కావున నీచేతఁ ◆ గావించు శివనుతు, లగుదాఁక నేవేళ ◆ నదియుఁగాక
యిది జేయనాయెను ◆ నిదిజేయవలెను నే, నిది జేయఁబడుచుంటి ◆ నిదియుఁజేయ
లేదనువిషయము ◆ నేది నాకును సరి,పడ దని విప్రుని◆మెడకుఁ బాను
దగిలించియున్నట్టి◆త్రాడును లాగుచు, శమనుఁ డిట్లనియె నో◆విమలచరిత!

తే. మరణకాలము రానిది ◆ మానవునకు, బాణములచే శరీరము ◆ బ్రద్దలయిన
జావకుండును కాల మా◆సన్నమైన, దర్భపోచను మృతి నొందు ◆ తథ్య మరయ.

తే, చక్రవర్తులు నిందుఁడ్రిలు ◆ శతసహస్ర,సంఖ్యగలవారు నాచేత ◆ శమనలోక
మునకు నేగిరి కావున ◆ మునికుమార! అలుకుజెందకు మీవిష◆యమున కిపుడు. 373

చ. అని యిటు లద్దులేక తను ◆ నాఁడెడుకాలునివాగ్విజృంభణ
మ్మును విని శంకరస్తవము ◆ బుద్ధిని నిల్పి మృకండునూనుఁ డి
ట్లనె యముఁడా! శివస్తుతుల ◆ కడ్డుదలంచిన శీఘ్రకాలమం
దున నశియింతు రెవ్వరును ◆ దుష్టప్రవర్తన మాను టొప్పగున్. 374

తే. కాన నీకార్యమునకు వి◆ఘ్నము దలంప, వలవ దిఁక రాజు తనభట◆వర్గమునకుఁ
దానె శిక్షకుఁడైనట్లు ◆ తనదుభృత్యు,లకును శంకరుఁడే శిక్ష◆లను విధించు. 375

ఉ. కొండలఁ బిండిసేయ నొక◆గుఱ్ఱికను సంద్రపునీరు నంతయున్
గుండెల కొనఁ ద్రావ మది◆గొంకక భూమియు నాకసంబు ను
ద్దండత మీదుక్రిందుగను ◆ దా మొనరింపగఁజాలువారునై
యుండుదు రాశివార్చకులు ◆ నుజ్జ్వలభక్తిసుమోదచిత్తులై. 376

తే. బ్రహ్మమఘవాదులనుదృణ ◆ ప్రాయములుగ, నెన్ను శివభక్తులకుదోష ◆ మృత్యుభయము
లెక్కడివి యముఁడును దూత ◆ లేమిజేయఁ, గలరు వారికి నధికులు ◆ గానఁబడరు.

సీ. ఈశ్వరభక్తుల ◆ కెపుడు నాపదలు లే, వనుచు నార్యులవల్ల ◆ వినఁగలేదొ
అధికకోపము వచ్చి ◆ నంతమాత్రమున శం, కరుకింకరులఁ జంపఁ ◆ గమలగర్భుఁ
డైన సమర్థుఁడే ◆ యనుచు మార్కండేయ, మునిపల్కువాక్యముల్ ◆ విని శమనుఁడు
కాలాగ్నివలె మండి ◆ కాటుకకొండదే, హముతోడ రక్తనే ◆ త్రముల వటుని

తే. గనలి యిట్లని పలికె గం ◆ గాస్రవంతి, నిసుక లెక్కింపగా నవి ◆ యెన్ని యగునొ
యంతమొత్తముగల హరి ◆ హరులు బ్రహ్మ, లిందఱ లందఱు నాచేత ◆ మృతినిగనిరి.

ఉ. వేయును మాట లేల యిఁక ◆ విప్రతనూభవ! నాప్రతాపమే
నీయెడఁ జూపెదం గనుము ◆ యిప్పుడు నీమెడయందుఁ బాశమున్
వేయక యంగుఁ జిక్కువడి ◆ బాధల నొందుచు శంకరస్తుతుల్
జేయఁగ నిన్ను నీశ్వరుఁడు ◆ చెచ్చెరఁ గాచినఁ గావని మ్మొగిన్.

క. అని యిటు మార్కండేయుని, గనలుచు బెదరించి యముఁడు ◆ కరుణరహితుఁడై
మును నాతని మెడకుఁ దగిల్చిన, త్రాడును బిగియదీసి ◆ చివ్వన లాగెన్. 380

క. అప్పుడు నామునిపుంగవుఁ, డొప్పుగ మెడరజ్జువునకు ◆ నోడక శివుపై
నొప్పిన మనసు చలింపక, యెప్పటివలె దిగువ లింగ ◆ మెదురుగ నిలిచెన్. 381

ఆ. బ్రహ్మచేత మును పె ◆ ప్రార్థింపఁబడినవాఁ, డగుట నట్టిదిట్టఁ ◆ డనఁగరాని
వయసు రూప మొక్క ◆ పగిదిని గనుపట్ట, నంత శిరమునందు ◆ నర్ధశశిని. 382

సీ. ధరియించినట్టి శం ◆ కరుఁడు పార్వతితోడ, నప్పుడు లింగము ◆ నందు వెడలి
యుఱుముతో దీర్ఘైన ◆ హుంకారశబ్దము, గలిగి యాశమనువ ◆ క్షఃస్థలమునఁ
దనపాదతలముచేఁ ◆ దన్న నావ్రేటున, కతనిశరీరము ◆ నవయవముల
సందులు వదలగా ◆ జగతిపైఁ బడి పైకి, నిక్కిన మొగముతో ◆ నిలువుగ్రుడ్లు

ఆ. తెరవఁబడిననోరు ◆ గిరిగహ్వరములను, బోలు ముక్కురంధ్ర ◆ ములును భయము
చేత వ్యాధులనెడి ◆ నేనలు నరిగిన, వాఁడు నయ్యె యముఁడు ◆ వసుమతీశ! 383

చ. అడర మృకండుపట్టి యము ◆ నక్కునఁ దాకిన శూలికాలిచ
ప్పుడు విని చిల్వతాల్పుదొర ◆ పూజను మాని గిరీశు ముంగలం
బొడఁగని వెంటనే నళిన ◆ భూముఖదైవతకోటి శూలివా
దడములఁ బ్రాణిసంఘములఁ ◆ దాకెడుభీకరు నంతకుం దగన్. 384

చ. పొడఁగని యుబ్బు నబ్రమును ◆ బొందికరమ్ములు మోడ్చి యాదలన్
వెడవెడ వంచి మంచుమల ◆ పెండ్లికుమారుని జూచి సర్వ మా
యొడయఁడ కాఁదలంచి మెయి ◆ యుబ్బున గగ్గురుపాటు నెందఁగా
జడియక నేలపై నొఱఁగి ◆ చక్కఁగ నిల్చి నుతించె నిట్లొగిన్. 385

## శ్రీమార్కండేయకృతశివస్తోత్రము.

పంచచా. సిరిన్గలాని జిచ్చుబమ్మ ♦ శేషు నల్లె స్వర్ణభూ
ధరమ్ము విల్లుఁ జేసి ప్రోళ్ల ♦ దర్ప మార్చె రౌప్యభూ
ధరమ్ముపై వసించె నట్టి ♦ దైవవంద్యుఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్నుఁ ♦ గాలుఁ డేమి సేయునో. 386

పంచచా. హరించెఁ జిచ్చుకంటిమంటు ♦ నాత్మభూతు లోకముల్
హరించెఁ గల్పసూనగంధ ♦ హారిపాదపద్ముఁడై
స్ఫురించె జోక నిల్చె నట్టి ♦ బూదిదాల్పుఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్నుఁ ♦ గాలుఁ డేమిసేయునో. 387

పంచచా. మురారిబిడ్డగంగనీటి ♦ బొట్లనానగల్ జడల్
మురారిపద్మయోనిపూజఁ ♦ బొల్చు పాదపద్మముల్
కరీంద్రచర్మవస్త్ర మోలిఁ ♦ గల్గువానిఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్నుఁ ♦ గాలుఁ డేమిసేయునో. 388

పంచచా. పురారి నంధకారి నాల ♦ పోతురాతు నాశ్రితా
మరద్రుమంబు నారదాది ♦ మౌనివంద్యుఁ బాపరా
మెఱుంగుటొంట్లవాని విష్ణు ♦ మిత్రు నాద్యుఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్నుఁ ♦ గాలుఁ డేమి సేయునో. 399

పంచచా. మురారి సాము మేనఁ ♦ బూనినట్టివాని గి
న్నరాధిపాప్తు నైణధారి ♦ నాగయక్షహారు శం
కరుం గుహాంకధారి నీల ♦ కంఠు నీశుఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్ను ♦ గాలుఁ డేమిసేయునో. 390

పంచచా. పురారి దక్షయజ్ఞహారి ♦ భుక్తిముక్తిదాయకుం
బరశ్వధుం భవోగ్రరోగ ♦ వైద్యునిం ద్రిలోచనున్
ఖరుం గొలల్ దొలంచువాని ♦ గానలోలుఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్నుఁ ♦ గాలుఁ డేమిసేయునో. 391

పంచచా. పరాత్పరుం డణూపముండు ♦ భక్తవత్సలుండు న
క్షరుండు భూతపుండు భూజ ♦ కాండదవ్యరాశిభా
స్కరాదిసోష్టమూర్తులం బొ ♦ సంగువాఁ డమేయుఁడున్
ఖరుండు దిక్పటుండు నైన ♦ కాలు రుద్రుఁ జంద్రశే
ఖరు న్సమాశ్రయింప నన్ను ♦ గాలుఁ డేమిసేయునో. 392

పంచచా. షటిక్ మటిక్ జగాల్ సృజించి ♦ మన్చి తుంచువాఁడు రా
తిరిం బవల్ గణమ్ము లెన్నఁ ♦ దిర్గువాఁడు జందురాల్

నెఱిం గలాఁడు విశ్వగుండు • నేఁడునైన చంద్రశే
ఖరు న్నమాశ్రయింప నన్ను • గాలుఁ డేమిసేయునో. 393

పంచచా. పరుల్ వివేకహీను లైన • వారి సంసృతిఃఫణా
ధరాభిదష్టు లైనవారిఁ • దన్ను నాత్మభక్తి నా
నెఱౌషధంబుచేత మన్పు • నీలకంఠుఁ జంద్రశే
ఖరు న్నమాశ్రయింప నన్ను • గాలుఁ డేమి సేయునో. 394

పంచచా. ధరాత్మజామనోహరుండు • స్థాణుఁ డుక్షపుండు దుః
ఖరాజిఁ దొల్గఁజేయువాఁడు • కాలకంఠుఁ డగ్నిసూ
ర్యఋక్షపాంబకత్రయుండు • నైన శర్వుఁ జంద్రశే
ఖరు న్నమాశ్రయింప నన్ను • గాలుఁ డేమి సేయునో. 395

పంచచా. హరుం డుపద్రవమ్ము లూన్చు • నట్టిఁడుల్ వినిర్మలుం
డు ఋక్షపార్యమాగ్ని నేత్రుఁ • డుల్ భవుండు శైలమం
దిరుండు నీలకంఠుఁ డైన • దేవదేవుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱింగు నన్ను • గాలుఁ డేమిసేయునో. 396

పంచచా. పరుండు సత్కళాస్వరూప • భాసురుండు గాలకం
ధరుండు కాలవహ్నికాల • దర్పభంజనుండు సా
దరుండు వాసుదేవుఁ డైన • దైవవంద్యుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱింగు నన్ను • గాలుఁ డేమి సేయునో. 397

పంచచా, హరుం డనంతుఁ డవ్యయుండు • నాద్యుఁ డక్షమాలికా
ధరుండు శాంతమూర్తి సర్వ • ధర్మవేద్యుఁ డుగ్రుఁ డ
క్షరుండు పుణ్యమూర్తియైన • సత్త్వమూర్తిఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱింగు నన్ను • గాలుఁ డేమి సేయునో. 398

పంచచా. పురాంతకుండు శాశ్వతుండు • మోక్షహేతుభూతుఁడుల్
బరుండు తోషణస్వరూప • భాసురుండు భవ్యుఁడుల్
మురాంతకాప్తుఁ డైన భక్త • పూజనీయుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱింగు నన్ను • గాలుఁ డేమిసేయునో. 399

పంచచా. సురేశ్వరుండు నుక్షపధ్వ • జుండు దేవదేవుఁడుల్
బరేశ్వరుండు సర్వలోక • పాలకుండు శర్వుఁ డ
క్షరీశ్వరాసురారియైన • కాలకంఠుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱింగు నన్ను • గాలుఁ డేమి సేయునో. 400

పంచచా. స్మరాభియాతి స్వర్గమోక్ష • సంప్రదాత లోకముల్
పోరింబోరిల్ సృజించి మంచి • త్రుంచి మించువాఁడు కి
న్నరాధినేతమిత్రుఁ డైన • నాగహారుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱింగు నన్ను • గాలుఁ డేమి సేయునో. 401

పంచచా. నెఱా సుకమ్మ నిగలాఁడు ♦ నింగిఁ బొఱుచుక్కలన్
నెఱిం దలం ధరించినట్టి ♦ నేఁడు శూలపాణి యీ
శ్వరీమనోహరుండు నైన ♦ వామదేవుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱంగు నన్ను ♦ గాలుఁ డేమిసేయునో. 402

పంచచా. మెఱుంగులీను బూదిచూర ♦ మించు మేనివాఁడు గా
నరానికాల్ నగల్ తెగల్ ♦ ఘనమ్ముగా ధరించువాఁ
డురుపరిభావశాలి యైన ♦ యుగ్రు భర్గుఁ జంద్రశే
ఖరుంగుఱిం చెఱంగు నన్ను ♦ గాలుఁ డేమి సేయునో. 403

పంచచా. శివా! భవా! హరా! మహేశ! ♦ శీతశైలకన్యకా
ధవా! మహానుభావ! దేవ ♦ దైవరాయ! పద్మసం
భవాయు విచ్చి వ్యాధబాధ ♦ బాపివేయు మెప్పుడుం
భవా! కృపామృతప్రవాహ! ♦ భక్తకల్పభూరుహా! 404

పంచచా. లలాటనేత్రునం దెవండు ♦ లక్ష్యభావ మూంచి యీ
బలాఢ్యుచెంత నిమ్ముకొండు ♦ పట్టి స్తోత్ర మాఘణీట్
కలాపుచేతమున్ గడంగఁ ♦ గాఁ బఠించువానికిం
దొలంగు మృత్యువంచుఁ బల్కు ♦ ముం ద్రిశుద్ధిగా ధరన్. 405

చ. అని యిటు లామృకండుసుతుఁ ♦ డంచితభక్తి నుతింప శంకరుం
డొనరినకూర్మిచేఁ బలికె ♦ నో మునిపుంగవ! నీవు నన్ను కో
రిన దొకకల్ప మాయువె విరించియు నందుల కౌఱురెట్లు ని
మ్మన నటు సప్తకల్పముల ♦ నాయువొసంగితి నీకు నిప్పుడున్. 406

తే. నానుపదభక్తి యూరక ♦ పోద యెల్ల, కోరిక లొసంగునని సుదివ్యుతుల మెసగఁ
దెలిపి భూతేశుఁ డప్పు డదృశ్యుఁ డయ్యె, నని దిలీపునితోడ నిట్లనియె మరల.

సీ. అపుడు మార్కండేయుఁ ♦ డమితతేజము నొంది, శంకరుకృప చేతఁ ♦ జావులేని
వరములచేఁ బెక్కు ♦ ప్రశ్రయములను జూచె, నాతఁడు తలిదండ్రు ♦ లండను విడి
పోయినవ్యాత్మసంములకు శివానుగ్రహమ్ముఁ బొంది చిరకాల ♦ మాయువు గల
వాఁడు నై యవల నివాసమునకుఁ జేరి, జననిజనకులకు ♦ సవినయముగ

ఆ. మ్రొక్కి తనకుఁగాను ♦ మిక్కిలి దుఃఖింపు,చున్నవారి కపుడు ♦ విన్నవించె
ఖండపరశుచేతఁ ♦ గల్పము లేడింటి,వఱకు బ్రతుకు గన్న ♦ వరము నధిప! 408

చ. అది విని తల్లిదండ్రి సుతు ♦ నాదర మొప్పఁగఁ గౌఁగిలింపుచున్
ముద మలరంగ నేత్రజలముల్ ప్రవహింపఁగ రోమజాలముల్
గొదగొని దేహమందున గగుర్పొడ సూనునిచావుదుఃఖమున్
వదలి సుఖంబుగా నిలిచి ♦ వర్ధిలుచుండిరి వారు సంతయున్. 409

ఆ. గరళకంఠువలనఁ ♦ గల్పము లేడింటి,వరకు బ్రతుకు గలుగు ♦ వరము నొంది
తల్లిదండ్రులను ♦ దగినశుశ్రూషలు, సేయుచుండె వారి ♦ చిత్త మలర. 410

క. చిరకాల మిటుల సేవా, పరుఁడైన మృకండుసూతి ♦ భావము తీర్థా
చరణమునకు సందడిగొన, నరుగుటకై తల్లిదండ్రు ♦ లనుమతి గొనుచున్. 411

చ. పనివడి తీర్థయాత్రలనెం♦పమ్మున దేశము లన్ని చూచుచున్
అనుపమలీల గంగ మొద♦లైన మహానదులందు మాఘమం
దున మఱి నన్యకాలములఁ ♦ దోఁగుచునుండె మృకండుసూతి దా
నొనఁగ స్నానమాడ నిది ♦ యొక్క నదీపదమైన లేదిలన్. 412

సీ. అనఘుఁ డామృగశృంగ♦మునికి మాఘస్నాన,మందు నాసక్తి బెం♦పొంద నటులఁ
జేయఁగ దానిచేఁ ♦ జెందిన పుణ్యాతి,శయమున నిటువంటి ♦ సంతు గలిగె
నట్టిమార్కండేయుఁ ♦ డఖిలతీర్థముల మా,ఘస్నానమును జేసి ♦ ఘనత కెక్కి
మిక్కిలి మహిమచే ♦ మెలఁగి శంకరునకు, నర్పించు మానసం ♦ బలరుకతన

తే. నెల్లజగములందు ♦ నేప్రొద్దుఁ దిరుగుచుఁ, బ్రళయముల ననేక♦ములను జూచెఁ
జూచుచుండెఁ జూచు ♦ సొరిది నాయువు చిర,కాల మగుట నట్టి♦కారణమున.

చ. అనఁగ దిలీపుఁ డిట్లనియె ♦ నాసమవర్తి పినాకిపాదఘ
ట్టనమున భూమిపై నొరుగు♦టన్ గన నిజగ మెట్టు లుండె నా
కును వివరింపవే యనఁగఁ ♦ గోవిదుఁడైన వశిష్ఠమౌని త
జ్జనపతితోడ నిట్లనియెఁ ♦ జక్కఁగ దాని నుపక్రమించుచున్. 414

ఆ. శమనుఁ డంత భువిని ♦ శంకరుతన్నుచే, నొరుగ జీవచయము ♦ నొక్కవ్రేలి
మాత్రమైన సందు ♦ మర్త్యలోకమున లే,కుండ నిండియుండె ♦ బెండువడక.

క. కలుషాత్ముల శిక్షింపను, గల ప్రభు వెచ్చటను లేక ♦ కల్మషమగు నీ
యిల భరము మోవలేమికి, నలమటచేఁ బొగులుచుండె ♦ నాసమయమునన్. 416

తే. అంత బ్రహ్మాదిదేవత ♦ లంద ఱొక్క, పగిదిఁ బ్రార్థించి శంకరు♦వలన యముని
మఱల బ్రతికింప భవుఁడు స♦మ్మతి దలిర్పఁ,గాలునికి నిట్టు లనియెఁ ద♦త్కాలమందు.

ఉ. ఓయి కృతాంత! నీవు కడు ♦ నొప్పిదమైన మదీయభక్తులం
దేయెడఁ గ్రూరదృష్టిని వ♦హింపకు నాకు సమానభావముల్
బాయక లోఁ దలంపు మిఁక ♦ భక్తిని నాకొనరించునట్లుగాఁ
జేయుము వారికిం దగిన♦సేవలు పూజలు నెల్లవేళలన్. 418

క. అని శంకరుఁ డాజ్ఞాపిం,చినపలుకులు శిరమునందుఁ ♦ జేరిచి మోదం
బున యముఁడు తనదుపట్టణ,మున కేగి నటింపుచుండె ♦ మునుపటివలెనే. 419

క. అనుచు దిలీపమహారా,జునకుం బరమేష్ఠిసూతి ♦ చొప్పడ వినుపిం
చినకథను మీకుఁ దెలిపితి, ననియెను సూతుండు శౌన♦కాదిమునులకున్. 420

## ఆశ్వాసాంతము.

మ. కరుణాంభోనిధి! నీరజేక్షణ! రమా♦కాంతామనోల్లాస! సుం
దరరేఖాకరపద్మ! భక్తజనసం♦తానార్తివిచ్ఛేద! భా

స్ఫురత్కోటిప్రభ! కాంచనాభరణ! భాస్వత్కీర్తివిస్తార! శ్రీ
హార! దామోదర! దానవాంతక! సురాధ్యక్షా! క్షమానాయకా!

ముక్తపదగ్రస్తమత్తేభము.

మ. మునిహృత్పంకజసూర! సూరతనయామోదామలాకార! కా
రుణికాగ్రేసర! ధీర! ధీరజనసారూప్యాత్తసంచార! చా
రణగేయాన్వయభార! భారతరణారంభారథిక్ఫార! కా
రణసుత్రామకుమార! మారగురవారాధార! రాధారతా!

స్రగ్విణి. పద్మపత్రేక్షణా! భక్తసంరక్షణా!
పద్మజాండావనా! భిద్రిశైలావనా!
పద్మసద్మామనః పద్మమిత్రారుణా!
పద్మనాభా! నతవ్యాస! నారాయణా!

మాలిని. వరమునిహృత్పద్మావాస! హేమాద్రిసద్మా!
ఉరుగుణమణిధామా! సోమసంస్తుత్యనామా!
కరధృతశరచాపా! కాలమేఘస్వరూపా!
నిరుపమభవనాశా! నిత్యసత్యప్రకాశా!

ఇది శ్రీ బాలగోపాలకృష్ణవరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్యసగోత్రపవిత్ర శ్రీమదబ్బరాజువంశపయఃపారావారరాకాకైరవమిత్రమ్మక్కాంబానృసింహామాత్యమణిపుత్ర సూరిజనవిధేయ శేషాచలశర్మనామధేయ ప్రణీతంబైన శ్రీమత్పాద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునందు తృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# మాఘమాహాత్మ్యము.

[ శేషాచలకవీయము. ]



## చతుర్థాశ్వాసము.

రామాప్రియవల్లభ!
దారుణభవరోగగహనదావానల! సం
సారపయోనిధితారణ!
నారాయణ! వాసుదేవ! నరనుతచరితా! 1

తే. అవధరింపుము శౌనకుండాదిమునుల,తోడ సూతుఁ డిట్లనె దురితహరణుఁ
డగు వశిష్ఠునకమితిజోహారు లొనరఁ,జేసి రాజేంద్రుఁ డొక ప్రశ్న చేసె నపుడు.
క. ఘనమాఘస్నానముఁ జే,యను దలఁచిన పుణ్యపురుషు లంచితభక్తిన్
గనుఁగొనెడితీర్థమహిమల, వినవేడ్క జనించె నవియు వివరింపు తగన్. 3

### తీర్థమాహాత్మ్యము.

చ. అనవుడు నమ్మునీంద్రుఁ డపు డానృపపుంగవుతోడ నిట్లనెన్
ఘనమగు నెట్టితీర్థములగణ్యత కర్ణములందు సోఁకినన్
మును గల పాపముల్ దొలఁగి ముక్తిఁ బ్రాపగునట్టితీర్థముల్
బనివడి తెల్పెదన్ వినుము పాపము లేదిఁక నీకు భూవరా! 4

సీ. అనఘ! మాఘము జొరు నపుడు గ్రామమునను, వెలుపల నెం దుండు జలము లైన
స్నానయోగ్యమునకుఁ జాలిన వన్ని గంగా,నదీసలిలము కరణి నొప్పు
ననిమిషు లందఱు ననుచుండి రైన మా,ఘస్నానములు శేయఁగాఁ దగినవి
ముఖ్యములగు తీర్థములు కొన్ని గలవు ని,పుడమిపైఁ దూర్పుసముద్రమునను
తే. బశ్చిమసముద్రమునఁ జేరఁ బరగుచుండి,నట్టినదులందునఁ బవిత్రమైన తీర్థ
ములును బుణ్యస్థలములు సమ్మోద మొదవ,వినుము వినుపింతునవియుసవిస్తరముగ.
సీ. పుడమినిఁగల తీర్థములలోపలఁ బ్రియాగ,నది శ్రేష్ఠమై యొప్పు నదియుఁగాక
పాపపుంజములఁ బోనొపఁదగిననదియు, సురయక్షసాధ్యకిన్నరభుజంగ
సిద్ధచారణులచే సేవింపఁబడునది, రాణించుశాస్త్రపురాణములును
నిగమార్థములు మనోనిశ్చయమార్గులై, ఋషులు ప్రసంగింతు రెపుడు నచట

ఆ. శౌనకాదిమునులు ♦ సత్త్రయాగ మొనర్చి, రట్టిచోట నిమిషము ♦ నేకతమునఁ
దన్ను దాను చూడఁ ♦ దనరిన నానంద, మొసఁగె నేస్థలంబు ♦ నెసక మెసఁగ. 6

క. ఆనైమిశగహనంబున, మానుగఁ గల తీర్థములను ♦ మనుజుఁడు భక్తిన్
స్నానము సేయఁగ ముక్తికిఁ, దా నరుగును సంసరణము ♦ దాటి నరేంద్రా! 7

ఆ. దేవతలకుఁ బ్రీతి ♦ దివిరి యొసంగు శ,మంతపంచక మను ♦ మహితతీర్థ
మొకటి గలదు దాన ♦ నొనరఁగా స్నానముఁ, జేయఁ బుణ్యములను ♦ జెందు నరుఁడు.

సీ. ఎచట భీష్మద్రోణు ♦ లెలమి భారతవంశ,జాతులు కురుకుల ♦ జాతులైన
దుర్యోధనాదులు ♦ తొడరి యుద్ధమునందుఁ, జచ్చి మోక్షము నందఁ ♦ జాలినారొ
అట్టికురుక్షేత్ర ♦ మందుల కేగి నీ,సొంత నేలగ దాని ♦ జూచుకొనుము
తొలి వినుజాలిమ ♦ ందు నలఁబొట్ల పిరుంద, నైదు నాపైమూఁడు ♦ నలర నంచి

తే. యెన్న నెన్నిక కెన్నియా ♦ నన్ని పున్ని,యంపుఁజోటులు త్రిజగము ♦ లందుఁ గలవు
నవ్వియెల్లఁ గురుక్షేత్ర ♦ మందుఁ గలవ, టనుచుఁ బలికెను భానువం ♦ శాబ్ధిచంద్ర!

క. సురలోకముఁ బొందుటకును, గర మరుదుగఁ బెక్కుసుతులఁ ♦ గనుటకు మోక్షం
బిరవుగఁ జేకూరుటకును, దురితములఁ దొరంగుటకును ♦ దొడరిన దగుచున్. 10

క. గంగాద్వారము గలదు చె,లంగుచు నీ వచటి కేగి ♦ లాలితభక్తిన్
గంగాస్నానముఁ జేయు నొ,సంగును మోక్షంబు నీకు ♦ జనవరతిలకా! 11

మ. అవనిం గల్గు నవంతిపట్టణము పు♦ణ్యస్థానమై యొప్పు నీ
భువియం దయ్యది పాపసంఘముల ని♦ర్మూలంబు చేయంగ నా
నెవరైనన్ మృతి నొంద నచ్చట శివుం ♦ డిచ్చు న్నిజస్థాన మీ
యవకాశం బిడి స్నాన మచ్చటను జే♦యంబూను మాఘంబునన్. 12

చ. తరణికులంబునం బొడము ♦ ధారుణినాథుల వృద్ధిచేయఁగాఁ
బరగిన దై నివాసులగు ♦ వారికి ముక్తిని నీయఁజాలుగా
సరసముగా నయోధ్య మతి ♦ చక్కఁగ నాపురిప్రక్కనున్న దే
సరయువు దానిలో నెవరు ♦ స్నానముఁ జేసిన మోక్ష మబ్బెడిన్. 13

సీ. మధుసూదనుఁడు పంక్తి♦రథునకు శ్రీరామ,చంద్రుఁడై యచ్చోట ♦ జననమంది
సోదరయుతముగా ♦ సారిది బ్రహ్మక్షత్త్రి,వైశ్యశూద్రుల నాల్గు♦వర్ణములను
ధర్మము నడుపుచుఁ ♦ దగ రాజవంశజు,లను నూఱురెట్లుగా ♦ మునుపుకంటె
వృద్ధినొందింపుచుఁ ♦ బృథ్విని బదకొండు, వేల వత్సరములు ♦ నేలి పిదప

తే. ఎందుమాత్రికులు రాళ్ళు నీ♦ళ్లివియుఁ దప్ప, ప్రాణిసంఘంబు నెల్ల స♦రయువునందు
ముంచి స్వర్గముఁ బొందించి ♦ మునుపటి నిజ,సదనమున కేగె నాదట♦ జనవిభుండు.

సీ. అయ్యయోధ్యాపుర♦మందు నెవ్వరు నివా,సము చేతురో వారు ♦ సరయువుజల
మందు మాఘమున ♦ నింపొంద స్నానముఁజేసి, తిలతర్పణముఁ జేయఁ ♦ దివిరి వారి

పితరులు పెద్దయ్యేండ్లు ♦ ప్రీతిగాఁ జేయుశ్రాద్ధములఁ దృప్తి వహించె♦దరు నెవరును
కాపురముండి మా♦సోపవాసముల నా, సరయువునందున ♦ స్నాన మొనరఁ

ఆ. జేయఁగా సుఖములఁ ♦ జెంది సంతానము, పడసి స్వర్గలోక♦ఫలము నొంద
నంతమునఁ బోదు ♦ రధికపుణ్యమున వి,మానమందు నిలిచి ♦ మనుజనాథ! 15

ఆ. అధికపుణ్యమైన ♦ మధువన మొక్కటి, కలదు దానియందుఁ ♦ గాలవశతఁ
జచ్చెనేని మరల ♦ జన్మకు రాకుండ, విష్ణురూప మొంది ♦ వెలుఁగుచుండు. 16

ఉ. అందుకు నుత్తరంబుగ స♦హర్పతిచేత జనించి కృష్ణ నా
నందము నొందఁజేయ యము♦నానది నల్లనినీటిచేతఁ బెం
పొందుచు గంగలోఁ గలిసి ♦ యొప్పిదమై ప్రవహించుచుండు నిం
పొందగ దానిలో మునుఁగ ♦ నూర్జితమౌ హరిరూప మబ్బెడిన్. 17

సీ. వాకిళ్లు నాలుగు♦వైపులఁ గల్గి యే, పట్టణ మిల ద్వార♦వతి యనఁ దగి
యతిరమణీయమై ♦ యలరు తత్పురమందు, విష్ణుదేవుండు శ్రీ♦కృష్ణుఁ డనఁగ
బరఁగి నివాసుఁడై ♦ పాండవులకు మేలు,గోరుచునుండి భూ♦భార ముడుపఁ
దనరి భారతయుద్ధ♦మునఁ గౌరవాదుల, దుష్టరాజులనెల్లఁ ♦ ద్రుంగఁజేసి

ఆ. తుదకుఁ దాను పరమ♦పదమును జెందె నీ,పట్టిద్వారవతికి ♦ నరిగి యచటఁ
గలుగు పుణ్యతీర్థ♦ములయందు మకరమా,సమున స్నాన మొనర ♦ సలిపి పిదప. 18

క. దేవాదితర్పణంబుల, నావరుసను జేసి దాన ♦ మవనిసురులకున్
గావించిన నీవంశము, నీవును సుఖజీవనముల ♦ నిలచెదరు భువిన్. 19

సీ. వినుము దేవతలు సే♦వింపఁగాఁ దగిన మా,యావతీపట్టణ ♦ మవని నొకటి
గల దందునకు నుద♦గ్భాగముదరిని మ♦లాపహారిణి పేర ♦ లాలితముగఁ
బుణ్యతీర్థం బొండు ♦ పొలుపొంది తనయందు, స్నానముఁ జేసిన ♦ జనులదోష
సంఘముల నడంపఁ♦జాలినదాట నీ,యభిధాన మానది ♦ కలరె నందు

ఆ. స్నానదానములను ♦ మానక యుపవాస, మొనరఁజేసి నాఁటి♦దినమునందు
జాగరణముఁ జలిపి ♦ సంకల్పమున మఱు,రోజు నీఁట మునిఁగి ♦ రూఢి దనర. 20

ఆ. తీర్థశ్రాద్ధములను ♦ తిన్నఁగాఁ గావింప, నతఁడు పాపపుంజ♦మడరి స్వర్గ
మందుఁ గలుగుసుఖము ♦ లన్నియుఁ బొందు నీ,విందు కేమి సంశ♦యింపవలదు. 21

క. వాణీనదిలో మాఘ,స్నానముఁ జేసిన సుషుమ్న♦నాడివలన గీ
ర్వాణీయనుగ్రహమున చతు,రాననరంధ్రమున ముక్తి ♦ కరుగు నతండున్. 22

శా. గంగాసాగరసంగమస్థలమునం ♦ గౌతూహలం బొప్పఁ ద
ద్గంగానీరములందునన్ మకరమా♦ఘుస్నానముం జేసి మేల్
బంగారుం గపిలావు నువ్వులును స♦ద్భావంబుతో విప్రు లు
ప్పొంగన్ దానము లిచ్చి తృప్తిగను సం♦పూర్ణంబుగా శ్రాద్ధముల్. 23

క. పితరులకుఁ జేయుమానవుఁ, డతులితమగు బ్రహ్మలోక◆మందు వసించున్
గతదోషుఁ డగుచు నీ వటు, హితమతితోఁ జేయఁదగును ◆ నినకులతిలకా! 24

సీ. మనుజేంద్ర! విను ధరా◆మండలంబున రమ్య, మగుచుఁ గాంచీపురం ◆ బలరు నందు
క్షీరాబ్ధిసుతయైన ◆ శ్రీదేవి పెనిమిటి, వాసుదేవుండు ని◆వాసుఁ డగుట
సకలలోకములందు ◆ సత్యవ్రతక్షేత్ర, మను నామము వహించె ◆ నాస్థలమున
కొద్దిపుణ్యముఁ జేయఁ◆ గోటికోటులు హెచ్చు,గా నొప్పు నచట వి◆మానమునకుఁ
ఆ. బుణ్యకోటిపేరు ◆ గణ్యత కెక్కెను, దేనిదక్షిణమునఁ ◆ దీవ్రగతినిఁ
బారుచున్న వేగ◆వతి యనునది గల, దట్టి కాంచిపురము◆నందు ధాత. 25

ఉ. యాగము సేయుచున్న సమ◆యంబున నానదినీరు నంతయున్
వేగము గల్గి యాసవన◆విఘ్నతకై ప్రవహింప నందుపై
వేగవతి యనందగిన ◆ పేరు వహించె మనోహరంబులై
బాగుగ మూఁడువందలకుఁ ◆ బైపడు లారును గల్గు తీర్థముల్. 26

తే. కలవు వానిలోనఁ ◆ గలుగు నీరములను, మకరమాఘమందుఁ ◆ బ్రకటితముగ
స్నానములను జేసి ◆ దానము లొసఁగిన, స్వర్గభోగములను ◆ సౌఖ్య మొందు.

వ. త్ర్యంబక మను పుణ్యక్షేత్ర మొకటి గలదు. అది త్రిలోకములవారికిని మోక్షముఁ
గలుగఁజేయు నని మఱియు నిట్లనియె. 28

ఉ. ఆతతగౌతమీతటికి ◆ నంటినదక్షిణమందు నొక్కెడన్
గౌతమమౌని పావనమ◆గాఁ గనుపట్టెడు నాశ్రమంబునన్
బ్రీతి నహల్యతో నిలువ ◆ భీతిని దక్కి పురందరుండు కా
మాతురుఁడై రమింపఁగ న◆హల్యను గన్గొని క్రోధచిత్తుఁడై. 29

తే. అప్పు డమ్మునీంద్రుఁ ◆ డాసురుఁ జూచి దే,హమున యోను లొకస◆హస్రముగను
భార్యయగు నహల్య ◆ పాషాణముగ శాప, మిచ్చి వారి కరిగె ◆ హిమగిరికిని. 30

సీ. ఆగౌతమమునీంద్రు◆ నాశ్రమమున శుకుఁ, డొకమత్త చెట్టుకొ◆మ్మకును గాళ్లు
తగిలించి క్రిందికి ◆ తలఁ బెట్టి వ్రేలుచు, నగ్నికణాగ్గల◆మైన ధూమ
మాహారముగఁ గొంచు ◆ నధికమైన తపంబు,చేతను మెప్పించి ◆ శివునివలన
మృతిని జెందినవాని ◆ బ్రతికింపఁగలది సం,జీవనీవిద్యను ◆ జెందఁగలిగెఁ
తే. గాన నచ్చోట విప్రుండు ◆ స్నానమాడి, పితరులకు తర్పణముల సం◆ప్రీతి దనరఁ
జేసి త్ర్యంబకమంత్రము ◆ చిత్తమందుఁ, జేర్చి జపియింప నపమృతి ◆ చెందఁడనఘ!

ఆ. మాఘమకరము జొర ◆ మనుజుఁడు గౌతమీ,నదిజలంబులందు ◆ నుదయ మపుడు
మునుఁగ సప్తజన్మ◆ములఁగల దోషము, లడఁగి పుణ్యుఁ డగును ◆ పుడమిఱేఁడ!

సీ. మును క్షీరసాగర◆మున జనియించిన హాలాహలంబు కా◆లాత్మక మను
పర్వతమం దుండి ◆ భక్షించి జీర్ణించు,కొనియె శంకరుఁడు నా◆కొండదిగువ

నుత్తరదిక్కున ♦ నొకయోజన పంపాఖ్య, చే నొప్పు దానిద♦క్షిణంపుదరినిఁ
దన్నామము వహించి ♦ తనరు పట్టణ మొండు, గలదు వాపురమందుఁ♦గాని శిఖరి

ఆ. యందుఁగాని సూక్ష్మ♦మందున నిలిచి క,ల్యమున నట్టిజలము♦లందు స్నాన
మగ్నిహోత్రములను ♦ నతిథులపూజల, చేతఁ గాల మొక్క♦రీతిఁ గడుప. 33

తే. అతఁడు పుణ్యుండు యోగుల ♦ కందరాని, శివునిసాయుజ్యపదవిని ♦ జెందునట్టి
వరమపావనమైన పం♦పానదికిని, నాగల ప్రభాసుక్షేత్ర ♦ మనఁగ నొకటి. 34

తే. కలదు శంకరుఁ డచట లో♦కులకు మేలు,కొలుపు లింగస్వరూపమై♦పరగుచుండు
బ్రహ్మహత్యాదిదురితము♦వాపునట్టి, కథ యొకటి నీకుఁ దెల్పెదఁ♦గాన వినుఁడు.

## శివుఁడు బ్రహ్మహత్య తొలఁగించుకొనుట.

ఉ. ధాతశిరంబు నైదవది ♦ దర్పకవైరి హరింప పూర్వమం
దాతతబ్రహ్మహత్య యెను♦నంటె విచారము దోఁపఁగాఁ దలం
కేరులు సేర్చి యేపవిత్రము♦చేత నశించునో హత్య నాకనే
యాతురతన్ ధరాతలము ♦ నంతయుఁ ద్రిమ్మరుచుండె శంభుఁడున్. 36

చ. అనిన దిలీపుఁ డిట్లనియె ♦ నామునిపుంగవుఁ జూచి శంకరుం
డనుపమకోపమున్ బొడమ ♦ నబ్జజుపంచశిరంబు లెందుకై
హననము చేసెనో పిదప ♦ నాతఁ డేమిగ నాయె బ్రహ్మకుం
బనివడి నాల్గుమోములని ♦ పల్కెడి వేదములున్ బ్రసిద్ధిగన్. 37

క. అని వేడుకొను నరేంద్రుని వినయోక్తులు మదికి నమిత♦విస్మయముగ దోఁ
చిన మునిపుంగవుఁ డనె నృపుఁ, గనుగొని విను మనుచుఁ ♦ బూర్వకాలమునందున్.

సీ. స్థావరజంగమా♦త్మకమైన ప్రాణులు, గల లోకములు మఱి ♦ గగనతలము
భూమి దిక్కులు నగముల్ ♦ నామరూపములను, నేవి లేనివియయ్యె ♦ నిది యసత్తు
నిది సత్తనెడుభేద ♦ మించుక తెలియక, సత్తమాత్రం బుండె ♦ చలనమొంద
కుండ దిక్కులును వే♦రొండు నేమియు లేక, యంత నిచ్ఛాశక్తి ♦ యవతరించె

ఆ. సకల మొదలిసృష్టి ♦ కాధార మనఁదగు, నహము నుద్భవించె ♦ నటుల విష్ణు
వలన బ్రహ్మ శివుఁడు ♦ పంచముఖంబుల, జనన మొంది రపుడు ♦ జనవరేణ్య! 39

క. వా రిరువురు నొండొరు లింతగాఁ గని యొకఁడు నాకు ♦ నధికుం డని వెం
బోరఁగ నొకని నొకండుం, భోరున రెట్టించుకొనుచుఁ ♦ బో రొనరింపన్. 40

ఆ. అటుల దేవమాన♦మగు నూఱుసంవత్స,రములు రణము నడువ ♦ బ్రహ్మనడిమి
శిరము కోప మడర ♦ శివుఁడు నఖముచేతి, చిన్న వ్రేలిగోఁట ♦ భిన్నపరచె. 41

క. అదిమొదలు ధాత నాలుగు, వదనంబులు గలుగునట్టి ♦ వాఁడైయుండెన్
మది ఖేద మొందవ భవుఁ డర, పదిమోములఁ దనరుచుండి ♦ పద్మజుశిరమున్. 42

తే. చేత నంటిన మది కెంతొ ♦ భీతి గదుర, బ్రహ్మహత్యాప్తదోషసం♦భరితుఁ డగుచు
వీఁక చెడి భిక్షుసేయుచు ♦ నేకతమున, సంచరింపుచు శివుఁ డొక♦సమయమందు.

సీ. దారుకయను పేరఁ ♦ దనరుమహారణ్య,మునఁ బోవ లోకముల్ ♦ మోహపరచు
నట్టిసుందరమగు ♦ నాకృతి లావణ్య,మునకు నిధియునైన ♦ మునివధూటి
గన మన్మథావేశ♦మును గల్గె నచ్చట, మునులభార్యలు చూచి ♦ మోహ మడరు
వారైరి మన్మథ♦వ్యథచేతఁ బీడింపఁ,బడి గృహకృత్యముల్ ♦ వదలి శివుని
తే. వెంట జారినకొప్పులు ♦ విడినవస్త్ర,ములును రాలినసొమ్ములు ♦ పూలదండ
లలర నరిగెడు తమభార్య♦లందఱఁ గని, మునులు కోపించి పలికిరి ♦ ముదముదక్కి.

తే. ఈశ్వరునిమగగురుతును ♦ వృషణములును, దెగి ధరంబడు గాకని ♦ యగణితమగు
శాపమియ్యఁగ నవి తెల్పి♦క్ష్మాతలమునఁ,బడియుఁ బాతాళమునఁ జొచ్చెఁ♦ బాముకొనియె.

తే. వేడుకకుఁ ద్రిజగము లభి♦వృద్ధిఁ జేయుఁ,గలుగువాఁడును ద్రిపురము ♦ ల్గాల్చినట్టి
శంకరుఁడు విప్రు లొసఁగిన♦శాపమునకు, లొంగి వారికి మేలుసే♦యంగఁ దలఁచి.

శా. పాతాళంబునఁ బాసుకొన్న మగరూ♦పం బింతటన్ లోకవి
ఖ్యాతిన్ లింగముగా నిలంబయిని నా♦ల్గానంగుశాల్ గల్గి తా
చేతోమోదము నొంది యైక్యముగఁ జొ♦చ్చెం శంకరుం డంతఁ బ్ర
ఖ్యాతంబై యొక తేజమున్ వెలయు లిం♦గబంధనన్ వెల్వడన్. 47

సీ. అట్టి తేజము దిశ ♦ లన్నిలోకములకు, వ్యాపింపఁ బ్రాణులు ♦ వ్యసన మంది
నంత సురలు మును ♦ లచ్యుతుఁ డాదిగాఁ, బ్రహ్మను ముందు బు♦రస్కరించు
కొనివచ్చి పాతాళ♦మునకు నాశివలింగ,మును గని నిగమార్థ♦ములను జపము
తపము పూజలు నుతుల్ ♦ ధ్యాననమస్కార,ములభయంకరముచే ♦ మొనరిచిన్ని
తే. గణపతిని ముందు నిడుకొని ♦ గారవించు,చున్నశూలికి సంతోష ♦ మొనరఁజేసి
రపుడు దేవతలకు దేవుఁ♦డైన విష్ణు,దేవుఁ డనె శంభుతోఁ దన ♦ భావ మలర. 48

క. లోకము లన్నిఁటిసుఖమును, బ్రాకటముగ గలుగజేయు♦ భారకుఁడవు న
స్తోకైశ్వర్యము గలిగిన, నీకును మ్రొక్కెదము ఫాల♦నేత్ర! సురేశా! 49

క. నీ తేజంబున భువనము, లాతతముగఁ గ్రాగుచున్న ♦ వనఘాత్మక! సం
ప్రీతి నది నీదులోపలి, కే తెఱఁగుననైన గొనుము ♦ నీశాన శివా. 50

తే. అనుచుఁ బ్రార్థించునట్టి బ్ర♦హ్మాదిసురలఁ,గాంచి బుధులార! నేఁడాది♦గా జనులకు
సకలపురుషార్థములకు నా♦సన్నిధాన, మనెడులింగస్వరూపము ♦ నలరుచుండు.

తే. ఓనలువ! బ్రాహ్మణులు మేలు♦నొందుటకయి,నిగమశాస్త్రములందు వ♦ర్ణింపఁబడిన
వ్రతములను దానముల యాగ♦తతిని నాకుఁ, బూజలొనరింపవలయు సం♦పూర్ణముగను.

చ. ఇనశశివంశజాతనృప♦వృద్ధిని జెందఁగ నీదుకార్యముల్
అనిశము తిన్నఁగా జరుగ♦నందులకున్నను నీవు పూజలన్
ఘనముగఁ జేయుచున్ శుకమృ♦కండునినూతి వశిష్ఠ వామదే
వుని భృగు వీరలం గొనఁగఁ♦ బోలును శిష్యులఁగా రమాధవా! 53

ఆ. విప్రవృద్ధకోటికు ♦ వెలసినశిష్యులు కశ్య,పాత్రిభృగులు ♦ గౌతముఁడు ద
ధీచి దక్షవామ♦దేవుఁ డగస్త్యుఁడే, ఘోరమునులు వీరిఁ ♦ గొనుము నలువ! 54

ఆ. అనుచు బ్రహ్మవిష్ణు ♦ లడిగినవరముల, నిచ్చి లింగమందుఁ ♦ జొచ్చె శివుఁడు
నంత నతని తేజ ♦ మఖిల జగంబుల, భవుఁడు తెలిపినట్టి ♦ ప్రకరణముగ. 55

తే. శివుని బూజింపుచుండి ప్ర♦సిద్ధులైన, శిష్యగణములఁ గొని వారి♦చేత భువిని
బ్రాహ్మణక్షత్రివైశ్యుల♦వలన లింగ,పూజఁ గావింపఁజేసి రా♦పురుషవరులు. 56

తే. ఓమహారాజ! నీకు నే ♦ నొప్పిదమగు, దర్పకారాతిలింగాఖ్య♦తారకథను
దెలిపితిని తీర్థమహిమలఁ♦ దేటపడఁగ, విను మనుచుఁ బలికె నిటులని♦మునివరుండు.

క. నరనాథ! యోఘవతియనఁ, బరఁగినయొక యేటిదరిని ♦ బహుచిత్రముగా
నరనారాయణక్షేత్రము, ధరణినిఁ గల దొకటి చక్ర♦ధరుఁ డచ్చోటన్. 58

సీ. సృష్టినిర్మాణము ♦ సేయఁజాలక భ్రమ, నొందినమనసుతో ♦ నున్నధాత
కపు డమృతము పర♦బ్రహ్మస్వరూపమై, సృష్టి కాధార మ♦శేయమైన
యోంకార ముపదేశ ♦ మొనరఁగా జేసెను, గాన నేమానవుఁ ♦ డైన నోఘ
వతిజలస్నానము ♦ హితమతిఁ గావించి, యానదిగట్టున ♦ నవతరించి
ఆ. నట్టిప్రణవమునకుఁ ♦ నర్చనలను జేసి, తీర్థశ్రాద్ధములను ♦ దృప్తి దనరఁ
బితృదేవతలకుఁ ♦ బ్రీతితో నొనరింప, నతఁడు విష్ణులోక♦మందు నిలుచు. 59

సీ. గోకర్ణమను నొక♦గొప్పపుణ్యక్షేత్ర,మందు గోకర్ణేశుఁ ♦ డధికమునగు
నర్థమోక్షములందు ♦ నర్థుల కిహపర,సాధన లొసఁగు నా♦స్థలమునందు
మాఘమాసమున నే♦మనుజుఁడు స్నానము, జేసి క్షేత్రజ్ఞు న♦ర్చింప నతఁడు
కామధేనువుఁబోలు ♦ కామారిమహిమచేఁ, బుణ్యలోకమునకుఁ ♦ బోవఁగలుగు
తే. సంతతము నెవ్వఁడేనియు♦స్నానకాల,మందు మువ్మారు గోకర్ణ♦మనుచుఁ బలుకు
నట్టిపురుషుఁడు గోకర్ణ♦మందుఁ జేయు,స్నానఫలమును జెందు స♦జ్జనవిధేయ! 60

తే. అవనిఁబురుషోత్తమక్షేత్ర ♦ మనఁగ నొకటి, కలుగు నందులకును జని ♦ గౌతమనది
స్నాన మొనరించి శక్త్యను♦సారమైన, దానములు జేయుని విష్ణుప♦దవిని జెందు. 61

తే. ఎల్లపాదిత్యములను న♦శింపఁ జేయు, నట్టి భృగుకచ్ఛమను క్షేత్ర ♦ మవనిఁ గలదు
దానియందున స్నానము♦ దానములను, జేయుమనుజుఁడు పుణ్యముఁ♦ జెందు ననఘ!

తే. ఇలను భృగుతుండ మనియెడి♦కొలను పుష్క,రమునుపుణ్యస్థలం బతి♦రమ్య మగుచుఁ
దనరు నచ్చోట స్నానము♦దాన మమరఁ,జేయ స్వర్గాదిభోగము ల♦జెందునతఁడు.

సీ. వసుధేశ! విను తుంగ♦భద్రానదీతీర,మందు విరూపాక్ష ♦ మనఁగ నొకటి
పుణ్యస్థలము గల్గి ♦ పుణ్యుఁడౌ శంకరుఁ, డచట విరూపాక్షుఁ ♦ డనెడి నామ
ధేయుఁడై పార్వతీ♦దేవితో నెలకొనె, వాలిసుగ్రీవులు ♦ వాయుసుతుఁడు
మునులు నాశివుని ♦ బూజించి రాదికా,లమున దానవవీరు ♦ లమరవరులు
ఆ. నమృతకలశమునకు ♦ నాలముఁ గావింప, నందు రాక్షసులకు ♦ నమరు లోడి
శరణుజొచ్చి రంత♦ శంభుఁడు నసురులఁ, జంపి కలశమును ని♦లింపుల కిడి. 64

ఆ. భూమియందు బుశ్యమూకాద్రిపై నుండు, పలిని గూడి క్రీడ ♦ సలుప నిచ్చ
దనరి తుంగభద్ర♦దరిని విరూపాక్షు,మందు నిలిచెఁ గాన ♦ నచటి కరిగి. 65

సీ. తుంగభద్రనుగల♦తోయాలి స్నానమ్మ, నానదీతీరము♦నందుఁ గలుగు
హరిహరులకుఁ బూజ ♦ లవల హోమము జప,దానముల్ జేసిన ♦ మానవునకు
నధికతపంబుచే ♦ నందినఫలమును, గలుగు నెవ్వండేని ♦ కల్యమందు
మాఘమాసమున స♦మ్మతిమీర నందున, స్నానము జేయఁగాఁ ♦ జాలెనేని
తే. తనదునిరువదియొక్కటి♦తరమువారి, దురితరహితులఁగాఁ జేసి ♦ తుదకు దాను
సూర్యలోకము బొందును♦సుగుణుఁ డగుచు, నమితభోగేంద్ర! భానువం♦శాబ్ధిచంద్ర!

తే. సహ్యపర్వతమందున ♦ జనన మంది, తుంగభద్రకు మిన్నయై ♦ దోష మడఁపఁ
జాలునది లోకమందుఁ బ్ర♦శస్త మగుచు, విరివిగాఁ బ్రవహించు ♦ కావేరి కలదు.

క. ఘనమగు కావేరికి మ,ధ్యనుగల శ్రీరంగమందు♦ నధికమహిమచేఁ
దనరుచు విష్ణుస్థానము, మును పచట విభీషణునకుఁ ♦ బురుషోత్తముఁడున్. 68

ఆ. మేలుసేయఁగోరి ♦ మిన్నగు వైకుంఠపు,రము విడచి రంగపు♦రమునందు
రంగనాథుఁ డన వి♦రాజితనిత్యని,వాసుఁ డనఁగఁ బరఁగె ♦ వసుమతీశ! 69

సీ. దీనిపూర్వప్రకథఁ ♦ దెలిపెద విను పంక్తి,రథునకుఁ దనయుఁడై ♦ రామనామ
మున భగవంతుండు ♦ జనియించి రావణా,దులఁ జంపి లంకకు ♦ నలవిభీష
ణుని రాజుగాఁ జేసి ♦ తననిజస్థానప్ర♦వేశముఁ జేయ ♦ విభీషణుండు
సతతము హరిపూజ ♦ వ్రతనిష్ఠ కలిగిన,వాఁ డౌట వైకుంఠ♦పట్టణమున
తే. కరిగి వినయవిధేయుఁడై ♦ హరికి మ్రొక్కి, నిన్ను లంకకు నధిపుఁగా♦ నిర్ణయింప
నిందులకు నేలవచ్చితి ♦ వెలుఁగఁబలుకు, మనఁగ లంకాధిపతి యిట్టు♦లనియె నపుడు.

క. నీపాదపూజ సేయక, యాపోశన చేతఁ బట్ట♦ ననెడు ప్రతిజ్ఞన్
గాపాడంగను నాకున్, నీపూజను గలుగనిమ్ము ♦ నిరతము దేవా! 71

చ. అనుచు విభీషణుండు విన♦యంబునఁ బల్కిన ధర్మపద్ధతిన్
విని నిరతంబు నీవు విను♦వీథినిఁ గల్యమునందు వచ్చి నా
కనయముభక్తి నర్చనల ♦ నీగుచు నేగి త్వదీయరాజ్యమున్
ఘనముగ నేలుకొమ్మనుచుఁ ♦ గైటభమర్దనుఁ డానతిచ్చినన్. 72

తే. ప్రజల నేలెడువాని కొ♦కప్పుడైనఁ, దీరుబడి లేదు మీఁదటఁ♦ దెలుఁగు మీర
లానతిమ్మని లంకేశుఁ♦డనుచు నిటుల,పలుకఁ బలుకంగఁ దొడఁగె శ్రీ♦హరిని గూర్చి.

సీ. ఎవరు సింహాసన♦మెక్కి రాజ్యమునందుఁ,గల మంచిచెడ్డలఁ ♦ గలయ నరసి
సరసగుణాఢ్యులై ♦ సభ్యులతో జన,పాలన సేయని ♦ పాపమతులు
ఘోరనిరతియందుఁ ♦ గూలుదు రదిగాన, నేను రాజ్యము సేయ♦ నెవరు మీకుఁ
గలదేని నాకెంటఁ ♦ గదలు మిప్పుడ యట్లు, కాదేని యీరాజ్య♦కాంక్ష విడచి
ఆ. మీకు పూజ లింపు♦మీర నిచ్చోటనె, చేయుచుందు ననఁగ ♦ శ్రీవిభుండు
నెందు నీవు నిలుతు ♦ వందుల కేతెంతు, నన విభీషణుండు ♦ నాత్మ నలరి. 74

ఉ. సారగుణిన్ విభీషణుఁడు ♦ స్వర్ణమయంబగు మందసంబు ప్రా
కారము గోపురం బలరఁ♦గా నతిచిత్రవిచిత్రమౌ నలం
కారముతో నొనర్చి కుతు♦కంబున శ్రీహరితోడ నిట్లనెన్
నారదగానలోల! కరు♦ణం దయసేయుఁడు నిందు నిల్చినన్. 75

క. నినుఁ గొనిపోయెద నంబర,మున నానగరమున కనుచు ♦ మోదమున విభీ
షణుఁడు వచింపఁగ శ్రీహరి, తనభక్తునియందు మిగుల ♦ దయఁగలవాఁడై. 76

క. ప్రణవమునుబోలు మందస,మున వసియింపఁగా నతండు ♦ ముదమున నదియున్
గొనిపోవుచుఁ గావేరిని, గని మాధ్యాహ్నిక మొనర్పఁ♦గా నచ్చోటన్. 77

క. శ్రీరంగక్షేత్రమునన్, గారవమున పెట్టి డించి ♦ కౌతుకమునఁ గా
వేరీనదీజలము నిం, పారఁగ స్నానాదికముల ♦ నతివేగమునన్. 78

సీ. సిరవేర్చి పేటికన్ ♦ మరల గొంపోవుట,కై సమర్థతచాల ♦ కతఁడు రాజ్య
భారము చెడునను ♦ భయముతోడ ప్రయాణ,భంగక్రియకుఁ జాలఁ ♦ బరితపించి
అతిదుఃఖపీడితుఁ♦ డగుచు శార్ఙ్గపాణి,తలమునఁ గలిగి దుష్టులను హతము
గావించు నీపాద♦సేవకుఁడను దేవ!, నీకు మ్రొక్కెద నిఁక ♦ నాకుఁ గలుగు
తే. దిగులు వెడఁబాపి తేలిక♦యగు మటంచు, దీనమానసుఁ డగుచుఁ బ్రా♦ర్థింప దాన
వేశ్వరునిపైనిఁ గారుణ్య♦ మినుమడింప, నతనితో విష్ణుఁ డిట్లనె ♦ నవనినాథ! 79

క. అలవైకుంఠపురంబునఁ, గల నామందిరముకంటెఁ ♦ గడురమ్యంబై
తలకొను ముక్తికి సాధన,ముల నలరుచునుండు నిట్టి♦పుణ్యస్థలమున్. 80

సీ. వదలఁజాలను దీని ♦ నదిగాక కావేరి, గంగానదికి హెచ్చు♦గా మదికిని
దోఁచుచున్నది నీవు ♦ దుఃఖింప కిఁక నాదు,హితవాక్యముల నాల♦కింపనగును
నొకటి రెండును మూఁడు♦యుగముల నిటువలెఁ,గలియుగమందున ♦ గాలిరూప
మునఁ బ్రతివైశాఖ♦పూర్ణిమదినమందు, వచ్చి నన్నర్చింప ♦ వత్సరమును
తే. పూజ గావించుఫలమును ♦ బొసఁగుచుండు, నేదియు విశాఖనక్షత్ర♦మెనయుచున్న
మది నిశాకరుగ్రహణము ♦ ననుకరించు, నట్టివైశాఖపూర్ణిమ ♦ ననఘ నీవు! 81

క. వచ్చి యథావిధిగా నను, సచ్చరితా పూజ లొనర ♦ సలుపు మటంచున్
మచ్చికతోఁ దెలిపిన హరి,ముచ్చటు లాలించి మదిని ♦ మోద మొదవఁగన్. 82

తే. అంతట విభీషణుండు శ్రీ♦హరికి మ్రొక్కి,తనదులంకాపురమునకుఁ ♦ జని మునుపటి
వలెనె రాజ్యసుఖంబుల ♦ నలరి ప్రజల,పాలనము సేయుచుండెను♦ బార్థివేంద్ర! 83

క. అదిమొదలుగఁ గావేరీ,నది శ్రీరంగమ్ము దక్షి♦ణవియద్గంగా
నది కాశీపురము లనన్, విదితంబై లోకమందు ♦ వెలుఁగుచునుండెన్. 84

ఆ. కాన నీవు నరిగి ♦ కావేరిజల మని, గ్రామమునకు బైట ♦ గంగలోన
మాఘమాసమందు ♦ మానక స్నానముఁ, జేయ ముక్తి నిన్నుఁ ♦ జెందు ననఘ! 85

సీ. మాఘమాసమున నే♦మానవుం డుదయమం, దెళను దలంచి కా♦వేరినదిని
నాస్నానమునకుంగా ♦ నాదుష్కృతముల నశింపంజేయుట కిటు ♦ శీఘ్రముగను
దయచేయు మనెడిమం♦త్రము చెప్పి యూరికిం, జేరువ వెలుపలి♦చెఱువు మొదలు
గాంగ నెచ్చోటను ♦ గల తీర్థమందైన, శాస్త్రసమ్మతముగా ♦ స్నాన మొనరం
తే. జేయునో వాఁడు కావేరి♦చెంత కరిగి, స్నానమాడిన ఫలమును ♦ సంతరించు
సందియంబిందునకు లేదు♦జనవరేణ్య!, యని మునీంద్రుండు రాజుతో♦ ననియె మఱల.

క. ఏనదులందున మాఘ,స్నానము జేసిన నరునకు ♦ సద్గతి కలదో
దానికిని దుల్యమగు నీ,మానసతీర్థమునం, గలుగు♦మహిమ వినందగున్. 87

ఆ. న్యాయ మోర్పు నింద్రియ♦జయము దానము, ప్రాణులందు కరుణ♦క్రమము దప్ప
కుంట క్లేశములకు ♦ నోర్చుస్వభావము, సంతసమును బ్రహ్మ♦చర్యవ్రతము. 88

ఉ. కోపము ద్రోహచింతనము ♦ కోరిక కుత్సితబుద్ధి రాగమున్
బాపి శుచిత్వముం దపము ♦ బాల్పడ సజ్జనసంగమంబునున్
బ్రాపుగం బ్రాణులందు సమ♦భావము సద్గురుపూజలాదిగా
నీపగిదిం జరింప నతం ♦ డెన్నంగ నీభువిం గల్గు తీర్థముల్. 89

ఆ. సత్యము మొదలైన ♦ సకలతీర్థములను, భావమందు నిలుప ♦ సేవంజేయ
నలరు పుణ్యతీర్థ♦ముల స్నానఫలము నీ, వట్టితీర్థమహిమ ♦ నాలకింపు. 90

ఆ. దేని వినుమాత్రమునం బుణ్య♦తీర్థములను,స్నానఫలము లభించునో ♦ సత్పురుషులు
సంతసించెదరో మాన♦సమున, గలంత,దేరి సంతోష మొదవునో ♦ ధీరవర్య! 91

క. అదె సూనృతమని పండితు, లుదితంబుగం బలుకుచుందు♦ రుచితక్రియలం
దదె సకలతీర్థములఫల, మొదవించును గలుష మడంపు♦నుర్వీనాథా! 92

తే. కాన సత్యము ప్రియ మైన ♦ దానిం బలుక,వలె నసత్యము ప్రియమగు♦వాక్యమైన
నప్రియంబగు సత్యము ♦ నాడంగూడ, దిది సనాతనధర్మమౌ ♦ నెఱుంగ దీని. 93

క. ఒకహస్తము నగ్నిని వే,ఱొకహస్తము చందనమున ♦ నుంచుకొనియు రెం
డొకవిధముగ భావించినం, బ్రకటితముగ క్షమ యనంగం ♦ బఱంగు నరేంద్రా!

సీ. తనకంటె నెవ్వాండు ♦ తక్కువై నిందింపం, బలహీనుండై చిక్కి ♦ వానిచేత
తన్నులం బడియును ♦ దాను పట్టినపట్టు, సాధించుటకుం దగు♦సాధనములు
గలిగి సమర్థత♦గలవాండయి బదులు, గావింప కెట్టి ప్ర♦తీకారములను
బూరలక యుండు నా♦పురుషుండు నిజమును, గలవాండు మిక్కిలి ♦ బలముగలుగు
తే. నతండు సంపన్నుండును లోకు♦లందఱకును,బూజ్యుండాచార్యుండును జాల♦బొగడదగిన
గొప్పవాండగు నాతని ♦ కొప్పిదమగు, సహనమే క్షమ యనంబడు ♦ సార్వభౌమ!

తే. విషయములు నింద్రియములు ప్ర♦వృత్తి సహజ, మట్టిదానిని మనమున♦కంటకుండు
నదియె నింద్రియనిగ్రహ♦మనుచు బుధులు, పలుకుచుందురు నెప్పుడు న♦పార్థివేంద్ర!

క. ధ్యానముచేతఁ జలింపని, మానసమున నిల్చియున్న ♦ మతి యెవ్వనికిన్
మానుగ గగనము బొందునొ, వానియునికి నచలత యనఁ ♦ బరఁగు నరేంద్రా! 97

ఆ. చలనమొందు విషయ♦ములవెంటఁ జనునింద్రి,యములను మరల విష♦యములతోడఁ
ద్రిప్పునతఁడు సకల♦తీర్థయాత్రలను సే,వించుఫలము జెందు ♦ నంచితముగ. 98

సీ. ధరఁగల జంగమ♦స్థావరమ్మైన యీ,ప్రాణికోటులయందు ♦ భావ్యమైన
దుఃఖముల్ గలిగిన ♦ దుఃఖము నొందుచు, సుఖము గల్గినఁ జూచి♦సుఖము గనుచు
అకలిగొన నతం ♦ డాకలిఁ జెందుచు, కొట్టఁబడినఁ దన్ను ♦ గొట్టె ననుచుఁ
గొఱతలేమిని గని ♦ కొఱత లేకుండుచు, ఋషివలె వర్తింప ♦ ఋషిని బోలి
ఆ. నట్టిపుణ్యపురుషుఁ ♦ డఖిలంపు ప్రాణుల, నధిక కరుణ గలిగి♦నట్టిమనుజుఁ
డని దయాస్వరూప ♦ మాద్యంత మెఱిగిన,వారు బలుకుచుంద్రు ♦ వసుమతీశ! 99

తే. అతఁడు మిక్కిలి పరిశుద్ధుఁ ♦ డనఁగ నొప్పు,నట్టిదయలేనివాఁడగు ♦ నతఁడు కోటి
వత్సరములను బ్రతికిన ♦ వసుధనుగల, తీర్థముల దోఁగ నవియు ని♦రర్థకమగు. 100

ఆ. మనము వాక్కు కర్మ♦మను మూఁడు నొకటిగాఁ, జేయు నార్జవమని ♦ చెప్పుచుందు
రదియె సకలనదుల ♦ నాడినస్నానఫ,లముల నొసఁగుచుండు ♦ లాలితముగ. 101

ఆ. ఎవఁడు సభలయందు ♦ హెచ్చుగాఁ దనప్రజ్ఞ, సత్పురుషులు వినఁగఁ ♦ జాటిచెప్పు
నతఁడు తనను దానె ♦ యపహరించినవాఁడు, పాపకృత్యములకు ♦ బద్ధుఁడగును. 102

ఉ. ఎవ్వఁడు తన్ను నమ్మిన సు♦హృత్తులకుం గడుఁ గీడు నెంచునో
యెవ్వఁడు నవ్వుమోము లొలయ ♦ నింపుగఁ బల్కుచుఁ గ్రూరకృత్యముల్
నెవ్వఁడు జేయునో యతఁడు ♦ లేములు పుత్రులు పౌత్రు లిండ్లలోఁ
గ్రొవ్వఁటి యల్పకాలమున ♦ గోడును జెంది నశించు నంతె కా
కవ్వలఁ దాను నన్వయము ♦ నంతయుఁ బోదురు దుఃఖితాత్ములై. 103

చ. విరివిగ భిక్షమన్నమును ♦ భిక్షుల కర్థుల కియ్య భూమి బం
గరువును గోవులున్ మొదలగు♦గాఁ గల షోడశదానముల్ భువిన్
మఱువక కల్మికిన్ దగిన♦మాత్ర మొసంగునొ వాఁడు వేడ్క నీ
ధరపయిఁ గల్గుతీర్థములఁ ♦ దప్పక క్రుంకుఫలంబు నొందెడున్. 104

ఆ. ఎల్లప్రాణులయెడ ♦ హితమతి నభయము, నొసఁగుచుండి హింస ♦ కోర్వలేని
కరుణఁ దనరు నట్టినరుఁడు తీర్థస్నాన,ఫలము నొందు నెపుడు ♦ పార్థివేంద్ర! 105

క. మనమే మృత్యువు శత్రువు, మనుజులకున్ భయము నొదవు ♦ మానస మదియున్
ఘనముగ వశపరచిన దమ,మని తత్త్వము నెఱుఁగు పెద్ద♦లందురు దానిన్. 106

క. మనమున్ విషయములందునఁ, బనుపరచిన బంధనమగు ♦ బాగుగ నదియున్
వినుఁ వైరాగ్యమునందును, జొనిపిన మోక్షమును దానఁ ♦ జొప్పడు నధిపా! 107

క. పురుషుఁడు నొకయాశ్రమమునం, దిరవుగ మానసము వశత ♦ నిగిన యోగీ
శ్వరుఁడగు నాతనిహస్త,స్పరిశనదర్శనలఁ దీర్థ♦ఫలముల నొసఁగున్. 108

తే. అమృతమునుబోలు మానస ♦ మలరి సంత,సమునఁ బొదలెడివారికి ♦ సకలలోక
మంతటను సేవకునివంటి ♦ దగును నట్టి,పురుషునకు శత్రువులు దివి ♦ భువిని లేరు.

సీ. పట్టెసేలను పాన్పు♦పైఁ బరుండుట చెల,గల మంచిబట్టలు ♦ గట్టుకొనుట
దెసలెల్లగా నుంట ♦ రసయుక్తమైన ప,క్వాన్నము జెడుబోన ♦ మైనఁ దినుట
సుతులు సంపద గల్గి♦సుఖియింప మృతి నొంద,వలయు వస్తువులు సం♦భవములైన
నటు గాకపోయిన ♦ నవమానమానముల్,సుఖదుఃఖములు పయి♦సుస్థిరమగు
ఆ. చిత్తమును రెంట సమముగాఁ♦జేర్చునట్టి,పురుషుఁడు మహాత్ముఁడానంద♦భరితుఁడగుచు
నతఁడువిద్వాంసుఁడననొప్పు♦నన్నియెడల,సౌఖ్యమొందవుచునుండుని♦స్సంశయముగ.

చ. పురుషుఁడు నెట్టితీర్థముల ♦ మున్గి మహాపరిశుద్ధుఁడౌనొ తాఁ
గర మనురక్తి క్షేత్రగృహ♦కాంచనపుత్రకళత్రధాన్యముల్
దిరముగఁ బొంది మానసము ♦ తృప్తివహించెద రట్టి పెల్లెడన్
వరుసను వృద్ధినాశములఁ ♦ బొల్పదు నొక్కక్షణంబులోపలన్. 111

ఆ. కాన బుద్ధిమంతుఁ♦డైన మనుష్యుఁడు, జ్ఞానదృష్టి నొందఁ♦గావలయును
అట్టివాఁడు నమృత♦మను జ్ఞానతృప్తిని, బొంద నితరవిషయ♦ముల వదలును.

తే. విషయముల నొందటంటఁగా♦విడచినట్టి, వారికిని బ్రహ్మమొందలగు♦వారు పొందు
నట్టి సుఖ మల్పముగఁ దోఁచు ♦ నదియె తృప్తి, పరమపావన మైనట్టి♦ బ్రహ్మచర్య
తీర్థమహిమను విను మింకఁ♦ దెలియపరతు. 113

తే. వినుట చూచుట తలఁచుట♦పనుల మాను,కొనుట నుత్సాహమొందవుట♦గోప్యమైన
ముచ్చటాడుట నాడుట♦పొగడుట నివి, మిథునకర్మకష్టాంగముల్ ♦ ప్రథితమయ్యె.

తే. మంచిబట్టలు నగలు ధ♦రించుకొనుచు, పతియుఁ బతి కూడి యేకాంత♦సదనమందు
మదనతంత్రముచే నుండ♦మిథునకర్మ,మనఁగొనియాడఁదగుసంగ♦మనఁగ నొప్పు.

ఆ. కట్టెపలకమీఁద ♦ గవ్వలు చేఁబూని, ప్రొద్దుపుచ్చుకొనుట ♦ నిద్దఱు జత
గూడి వంచెమాట ♦ నాడ మిథునకర్మ,మునకుఁ గేళి యనఁగఁ ♦ దనరు నధిప!

తే. తోడఁబుట్టువు కూఁతురు♦తోడ నేక,శయ్యపైఁ బీతముల నుండఁ♦జనుట బోల
దింద్రియబలము దిటముగా♦ హెచ్చి విషయ,మునకు లాగుట శ్రవణమా♦మనుజులేశ!

క. చేతులను గనులసైగలు, నాతతముగఁ జేయుచుఁ బరి♦హాసపుమాటల్
ప్రీతి జనింపఁగ ననఁ బ్ర,ఖ్యాతిగ నుత్సాహ మంగ ♦ మవనీనాథా! 118

ఉ. పెక్కులుగూడియుండునెడ ♦ వేఱొకయర్థము నిచ్చుపల్కులన్
జక్కఁగ భావముం దెలుప ♦ సమ్మతిగా నొకచోట నిర్వరన్
అక్కరతోడ నేకతర♦హాస్యముగాఁ దగుమాట లాడుటల్
మక్కువమీర గోప్యమగు ♦ మైథునకర్మకు నంగ మయ్యెడిన్. 119

తే. ఉవిద మగవాని కనుకూల♦ మొందవునటుల,భావమును దెల్ప రాతిరి ♦ పవలు నిదుర
వదలు మనమున యత్నింప ♦ మిథునకర్మ,మునకు సంకల్ప మంగమా♦మనుజనాథ!

తే. కీడు నాశనమును జావు ♦ మూడు నంత,ము న్నరకమగు పని కైనఁ ♦ బూని మనము
నందుఁ దలఁపక విహరింప ♦ నదియు మిథున,కర్మమునకొక వ్యవసాయ ♦ కార్యమగును.

తే. హాస్యములనున్న తెసుచంబు ♦ లంటికదిసి, యురమునురమునగదియించి ♦ యొరయునటులఁ
గౌఁగిలింపుచు పైఁగల ♦ కార్యములను, విడచి పోవుటఁ బ్రీతిని ♦ వృత్తి యగును. 122

ఆ. ఇపుడు తెలుపువిధము ♦ నెనిమిది మోహాన,కర్మములను విడువఁ ♦ గా నతండు
నెల్లకోరికలను ♦ నిహపరసాధన, మైన బ్రహ్మచారి ♦ యనఁగఁ బరగు. 123

సీ. బ్రహ్మచర్యమునకుఁ ♦ బ్రతిదినంబున నొక,పూట భుజించుట ♦ భూమిఁబడక
వేదముల్ సనువుట ♦ విహితవ్రతంబులు, సేయుట తప మను ♦ ష్ఠించుటయును
హింసకుఁ దొలఁకుట ♦ కృచ్ఛ్రచాంద్రాయణ,మును దేవతార్చన ♦ ము దగ మంత్ర
మాల జపించుట ♦ లోలి నియమములగు, నీపదివిధముల ♦ నేర్పరింతు

ఆ. నెల్లజీవులందు ♦ నేకభావము నుంచి, వాఙ్మనోబుద్ధుల ♦ వరుస నెందు
బాధ కలుగునట్టి ♦ పనులను వదలుట, హింసలేమి యొప్పు ♦ నినకులేశ! 124

తే. తల్లిదండ్రులు మిత్రబాం ♦ ధవులు పూజ,కర్హులగు పెద్ద లాచార్యు ♦ లాదియైన
వారిపడతల నెన్నక ♦ సారమతిని, గోపమును లేక యుంట న ♦ క్రోధుఁ డగును! 125

సీ. పాపపుణ్యములందుఁ ♦ బరిశీలనములేక, దోషకృత్యములకు ♦ దొడఁగుటయును
నితరులపైనిఁ ద ♦ ప్పితములు లేనివి, గలిపించి చాడిమా ♦ టలఁ బలుకుట
మనమున ద్రోహచిం ♦ తనము గాఠిన్యము, గలిగి వర్తించుట ♦ కఠినములగు
పరుషవాక్యములను ♦ బలుమారు నితరులఁ, గనలి భాషించుట ♦ కరుణలేమి

తే. నాదిగాఁగల చెడుపను ♦ లన్ని విడిచి, మంచినడవడిచేఁ బ్రవ ♦ ర్తించునతఁడు
ధీరవరుఁ డగు నాతఁ డ ♦ ద్రోహుఁ డనఁగఁ,బడును మేదినిలోపల ♦ వసుమతీశ! 126

సీ. ఇహపరములరెంట ♦ నెనయు వైరాగ్యము, వేదార్థములఁ దెలి ♦ విని విరక్తి
గలిగి నిత్యానిత్య ♦ ములవిచారణచేత, మనమున నిర్మల ♦ మార్గ మొదవు
మాలిన్యరహితమౌ ♦ మానసమునుగల, మనుజుండు పరిశుద్ధ ♦ తను వహించు
హృదయము శుద్ధమై ♦ యొదవినయాతండుఁ, బ్రహ్మాదులసుఖంబు ♦ బరఁగుకంటె

తే. మించుసౌఖ్యము గల్గి వ ♦ ర్తించుఁగాన, మానసమునందు నెల్లెడ ♦ మలినరహిత
మై ప్రవర్తింప నందుచే ♦ నన్నితీర్థ,ఫలములను జెందు నాతఁడు ♦ పార్థివేంద్ర!

సీ. మనమును లోఁజేసి ♦ కొని దేహసుఖముల, విడిచి యింద్రియముల ♦ నడచి నాశ
మాదిగా నన్నింట ♦ నటు లక్ష్య ముంచక, తగనివస్తువులు వ ♦ దలుచు యుక్త
మైన పదార్థము ♦ లాహారముగఁ గొని, యిల సుఖంబులు నెల్ల ♦ కలలవంటి
వని ప్రవర్తించెడు ♦ నట్టి యీవ్రతము ద,పంబన నెన్నఁగఁ ♦ బరగు నిదియె

ఆ. ఎల్లతీర్థములకు ♦ నెక్కువ గలదగు, విద్యవలన లేక ♦ విద్యవలన
మంచితెలివిచేత ♦ మించిన నుత్తమ,జ్ఞానతీర్థ మనఁగఁ ♦ జను నరేంద్ర! 128

క. హరిశంకరభాస్కరులను, బరువడి బ్రత్యక్షముగను • బ్రతిమలవలనన్
నిరతము సుజ్ఞానముగల, పురుషుఁడు ధ్యానింపవలయు • బుద్ధికుశలతన్. 129

క. న్యాసము హస్తాంగములన్, జేసి ఋషిచ్ఛందములను • జెలువుగ జపమున్.
భాసురముగ దైవతములఁ, జేసిన తీర్థఫలమెల్లఁ • జెందు నతనికిన్. 130

తే. కామవహ్ని వివేకము • గాల్పనే వి,చారమును మాని నరుమాన•సమున మాయ
చేత రమ్యము లగునట్టి • స్త్రీలదేహ,ములను జూచినమాత్రనె • మోహ మొందవు.

ఆ. అందుగలనఁ బురుషుఁ • డట్టియాఁడుది నన్నె, కాంచ నిపుడు నేను • గౌఁగిలింపఁ
గోరుచున్న దనెడి • గుణములచేఁ బర,తత్త్వమందు బుద్ధి • తారసిలదు.

క. పరతత్త్వ మెఱుఁగుమనుజుఁడు, పురుషస్త్రీభేదములను • బుద్ధిని దలఁపం
డిరవుగ లోపల వెలుపల, నరయఁ బరమాత్మరూప • మని భావించున్. 133

క. జలరూపములగు తీర్థము, లిలపయిని ననేకములుగ • నేర్పడె వానిన్
గల ఫలము లేదు నాచా,ర్యుల సేవనమునను ముక్తి•సూఢిగఁ గల్గున్. 134

సీ. ఆచార్యుఁ డనఁగ శి•క్షాదిషడంగము,లను నేర్చి వేదము•లను బఠింపఁ
జేయుచు నందులోఁ • జెప్పినవిధమున, నడువ నేర్పిన పురు•షుఁడు గురుండు
తండ్రియు నన్నయుఁ • దండ్రిలోఁ బుట్టువు, లగువారిచేత గా•యత్రి వేద
శాస్త్రములను బ్రహ్మ•చారి గ్రహింపఁగా, వలయును గాయత్రి • పరులవలనఁ

తే. బొందరాదు వేదములందుఁ • బొందుపరచి,నట్టుల శిక్షాదులైన ష•డంగములు ప
దక్రమముగా స్వశాఖవే•దమును ముందుఁ, జదువవలయును నటుగాక • జనవరేణ్య!

ఆ. ఇతరశాఖవేద • మెవఁడు ముందుఁ బఠింప, గడఁగుచును స్వశాఖ•ఖండనమును
జేయునాతఁ డెల్ల • చేతలకుం దూరుఁ,డయి చతుర్థవర్ణుఁ • డనఁగఁ బరగు 136

తే. మంత్రములఁ బిండములకు సం•బంధు లిల స్వ,జాతివారలు గావున • సకలవిధము
లకును పైతృకములఁ గన్య•లను స్వకీయ,కులమువారల కియ్యఁగా•వలయునధిప! 137

సీ. మానినులకు భర్త • మామ గాకుండిన వే,ఱొండు నాచార్యుఁ డొ•కండు లేఁడు
తరుణుల కెపుడు స్వా•తంత్ర్యమ్ము లేదు బా,ల్యమునందుఁ దండ్రి వ•యసున నెన్నఁ
బెనిమిటి వార్ధక•మునఁ బుత్రకులు వీరి,చే రక్షకత్వము • చెందుచుండు
రట్టివారలు లేని • యతివలు నాథుస,హోదరుగృహముల • నుండవలయు

ఆ. బావమఱదులు లేనట్టి • భామినులకు, దాయలనివాసముల నుంట•తగును గాని
యితరమగుచోట్లనుండుట•యెప్పటికిని, మంచిపని గాదు స్త్రీలకు•మానవేంద్ర! 138

చ. ధనములు ప్రాణముల్ గురుప•దంబుల కర్పణచేసి వారలే
పని నియమింపనుండినను • భావ మెఱుంగుచు భక్తియుక్తుఁడై
యనయము సేవలన్ సలుపు•నట్టిమహాత్ముఁడు నెవ్వఁ డొక్కఁ డా
మనుజుఁడు బ్రహ్మలోకమున • మాన్యుఁడుగా నివసించు నెంతయున్. 139

మ. పరిశుద్ధత్వము రెండుభాగములుగఁ ♦ బాటిల్లెడిన్ వానిలోఁ
గరపాదంబులు మృత్తునన్ జలమునన్ గ♦డ్గన్ దగన్ స్నానమా
చరుసన్ జేయఁగ బాహ్యశుద్ధియగు సం♦భావింప నాపైని స
త్వరతన్ బ్రహ్మవిచారమున్ సలుప నం♦తశ్శుద్ధియౌ భూవరా! 140

ఆ. కలుషమానసుండు ♦ నిలఁగల తీర్థము,లందుఁ జేయుస్నాన ♦ మరయ నల్ల
బొగ్గు తెల్లఁబాలు ♦ పోసి కడిగనవి,ధముగఁ బరగుచుండు ♦ ధరణినాథ! 141

క. తనదేహమందు జాయా,తనయులపై మమత వదలి♦ తగుకార్యములం
దున నహము విడువ నాతఁడు, నిశ్శేషరూపములఁ జూచు ♦ నెల్లవిధములన్. 142

సీ. రాజేంద్ర! వినుము వై♦రాగ్యము దెలిపితి, యమనియమాదియో♦గములయందు
జ్ఞానవిరక్తిమా♦ర్గము వేదసమ్మత,మగు సాం♦ఖ్యయోగము ♦ నభ్యసింప
దుర్విషయములును ♦ దుష్టసాంగత్యము, దోషము లన్నియుఁ ♦ దొలఁగిపోవ
సత్పురుషులతోడి ♦ సహవాసమే గతి,గాని వేఱొక్కటి ♦ కానఁబడదు

తే. కనుక సంసారబంధఖం♦డనముకొఱకు, నెల్లవిధముల సత్సంగ♦ మెసఁగ మెసఁగఁ
జేయవలె సదాచారము♦చేత సంప,దలు లభింపుచుఁ జెడుగుణ♦ములు తొలంగి. 143

తే. ముక్తి సంప్రాప్త మగునని ♦ పుణ్యవంతు,లైన పెద్దలు చెప్పుదు ♦ రది నిజంబు
సత్పురుషుఁడెల్లెడల మోక్ష♦సాధకమగు,మంచియాచారము నదృష్టి♦నుంచఁగడఁగు.

క. ఆచారము విడచిన నతి,నీచుండై చెడునుగాన ♦ నిర్మలమతిచే
నాచార మొదవుపద్ధతి,నే చిత్తము నిలుపు నతఁడు ♦ నెట్టి జెడడుకదా! 145

సీ. ఆచారహీనుఁ డై♦నట్టివాఁ డాషడం,గములతోఁ జదువువే♦దముల నేమి
పరిశుద్ధి నొనరింపఁ♦బడఁజాలఁ డదిగాక, మరణకాలమ్మున సం♦ప్రాప్తమగుడు
వేదముల్ రెక్కలు ♦ విప్పినపులుగుల, పిల్లలు గూండ్లను♦ విడచిపోవు
నగిది వెళ్లును వాని ♦ బాసి కావున సదా,చారము గలిగిన ♦ సకలతీర్థ

ఆ. రూపుఁ డగు నట్లుగాని ♦ యెందు జదివి,నట్టినిగమము కలుషంబ♦ యుండుఁ బోయు
నీళ్లవలెఁ కుక్క దాకిన ♦ పాలు చవిటి, భూమియందుండు జలములఁ ♦ బోలు నధిప

తే. ప్రాణులందును ద్రోహము మాని మంచి, మనసుచేతఁ జరించుబ్రా♦హ్మణుని బ్రహ్మ
విష్ణువు మహేశ్వరుఁడు పల♦విధములైన, యతిశయపూజలు నేయుదు♦ రనుదినంబు.

సీ. నే నిటుఁ దెల్పిన ♦ మానసతీర్థము,లను దోఁగునరుఁడు పా♦వనుఁడు లేక
చిత్తచాంచల్యము ♦ చే బైటిజలముల, స్నానము చేసిన ♦ మానవుండు
కప్ప తాఁబే లెల్ల♦కాలము నీటిలోఁ, దిరుగుచు సిద్ధిఁబొంది♦నవి కావొ
ఆవిధం బౌను దే♦హమునందుఁ గలిగిన, మతికిఁ బోఁగొట్టిన ♦ ముక్తుఁడౌనె

తే. శబ్దములు మొదలైన వి♦షయములందుఁ, జలన మొందిన నదె మనో♦మల మనఁబడు
వానియందున నాసక్తి ♦ వదల మాన,సమున మలనాశనుండగు ♦ జనవరేణ్య! 148

క. అనురాగము విషయములం, దనఁ జొనుపక మంచి తెలివి♦తో యములను నిం
డిన జ్ఞానానంద మనెదు, ఘనజలధిని మునుఁగఁ జెందుఁ ♦ గైవల్యంబున్. 149

క. దేనిని వినుమాత్రమునన్, జ్ఞానక్రతుఫల మతనికిఁ ♦ గలుగునో యవియే
మానసతీర్థములందున, నే నెఱిఁగిన లక్షణములు ♦ నీకుఁ దెలిపితిన్. 150

క. అనిన దిలీపుఁడు నిటులనె, మునివర! ధర గల్గు తీర్థ♦ములు సిరముల
య్యును శ్రేష్ఠత్వము హీనము, లను భేదము వానికేల ♦ యవి తెలుపఁగదే. 151

సీ. అన మునిపుంగవుఁ ♦ డనియె రాజును జూచి, తనువు కారణమగు ♦ మనుజులయెడ
నధికులు నల్పులు ♦ ననుభేదములు నెటు, కలిగెనో యటు క్షేత్ర♦ములవిశేష
ములఁబట్టి కొన్నిటఁ♦బుణ్యంబు గలుగుట, యతిశయం బని చెప్ప♦నయ్యె నీటి
పరిశుద్ధ మధికప్ర♦భావముచే మును, లంగీకరించిన ♦ వై పవిత్ర

ఆ. ములఁ దనరెను భూమి ♦ పుణ్యతీర్థముల మా,నససరస్సుజలమ♦నను నెవండు
స్నాన మాచరింప ♦ సర్వోత్తమమగు స,ద్గతిని జెందు నతఁడు ♦ ధరణినాథ! 152

వ. అనిన రాజేంద్రుఁ డిట్లనియె. 153

చ. మునివర! పుణ్యతీర్థముల ♦ మున్గెడుపండితు లెట్టినీమముల్
బనివడి యూనఁగావలె స♦భార్యుఁడు నే నియమాళి నూననా
చని వడి నెట్టితీర్థముల ♦ స్నానము సేయఁగ నొప్పు నెవ్వి కూ
డని వవి యన్నియున్ వినఁగ♦డంగితిఁ దెల్పవె నాకు నావుకున్. 154

ఆ. తీర్థయాత్రలందు ♦ దృఢమతిచే ఫల, మందువాఁడు జరుప♦నట్టినీమ
ములు మొదలగు నెవ్వి ♦ కలవో తద్విధములు, నెఱుకపఱతుఁ దెలియు♦వరకు భూప!

సీ. భుజియించి యొకపూట ♦ భూశయ్యఁ గలిగి త,లంటు పరులచేతి ♦ వంటకంబు
పొరుగింటిభోజనం♦బును దినఁగూడని, యన్నము వదలుచు ♦ హాయను నెద్దు
మొదలగువాహనం♦బుల శతాంగములఁ బు,ష్పకముల నెక్క దే♦వతలసేవ
పనిబూనుకొని పోఁక ♦ తనువున బడలిక, సంభవించుటకు వి♦స్తారమైన

తే. నడక తురకల దేశము విడి ♦ నిషిద్ధ,మైన పల్లెల కేగక ♦ యట్టిగ్రామ
ములకు నొకపక్షమందుఁ బో♦వలసె నేని, నిలువఁదగును కులాలుని♦నిలయమందు. 156

సీ. పుణ్యతీర్థమునకుఁ ♦ బోయినతొలిదిన,మున శాస్త్రపద్ధతి ♦ ననుసరించి
సంకల్ప మొనరించి ♦ స్నానసంధ్యాద్యను,ష్ఠానాదికృత్యముల్ ♦ సలిపి నాఁటి
దినమున నుపవాస♦మున రాత్రికాలము, సత్కథలందున ♦ జాగరణము
సలిపి తీర్థశ్రాద్ధ♦ముల మఱునాఁ, బితరులఁదృప్తిగా♦వించి పిదప

తే. వేదపఠనము జేయించి ♦ విప్రతతిని, దానముల భోజనాదులఁ ♦ దనిపి మూఁడు
రాత్రు లచ్చటిపుణ్యతీ♦ర్థముల నిలిచి, యావల వేఱొక్కస్థలమున ♦ కరుగవలయు.

క. ఈవిధమున నెవఁడేనియు, భావము రంజిల్లఁ దనదు॰పత్నీయుతుఁడై
సేవించు తీర్థయాత్రిల. బో విడి దురితముల ముక్తిఁ॰ బొందు వరేంద్రా! 158

క. ఋతుసంవేశన తీర్థం, బతులమహాదోషయుక్త॰ మగుఁగాన సతీ
యుతుఁడైన బ్రాహ్మణుం డా,యతమతి నదిజరుగకుండ॰ నరయఁగవలయున్. 159

సీ. స్నానము జేయ నా॰జలమున మాసోప,వాసచాంద్రాయణ॰వ్రతము లెన్ని
కలవో వానిఫలంబు॰ దొలఁగును దజ్జల,మందుఁ గూడదు స్నాన॰ మాచరింపఁ
గాంచనమునఁ గల్గు॰ కల్మష మగ్నిలోఁ, బుటము వేసిన పయి॰మురికి వదలి
పరిశుద్ధమైనట్లు॰ పాపులదోషముల్, తీర్థయాత్రలు జయఁ॰దీరిపోవు
తే. నొకరికొఱకు నొకరు॰ నొప్పిదమయి తీర్థ,యాత్రి సలుప నందు॰ నాలుభాగ
ములుగఁ దనరి దాని॰ఫల మొకభాగముఁ, బొందు యాత్రసేయు॰ పురుషునందు.

సీ. తీర్థయాత్రిలను నెం॰తేఁ జేయఁదగినట్టి,సరణిఁ దెల్పెద విను॰ సక్రమముగ
నెవనికిఁగాను॰ దా నెవ్వఁడు నాతతి, ప్రతిరూపమందు దర్భల నమర్చి
అట్టిప్రతిమయందు॰ ప్రాణప్రతిష్ఠలు, చేసి శాస్త్రమునందు॰ చెప్పఁబడిన
క్రమమున గోత్రనా॰మములను జన్మన,క్షత్రము చెప్పుచు॰ సలలితమగు
ఆ. నట్టిప్రతిమ కప్పు॰ డాలింగన మొనర్చి, తొలుత శుద్ధమైన॰ జలమునందు
నవల మృత్తుతోడ॰ నావలను పవిత్రము లగు నీరులందు॰ మునుఁగవలయు.

చ. పురుషుఁడు తీర్థయాత్రిలకుఁ॰ బోయినవెంటనె క్షౌరకర్మకై
యరయుచు నట్టికర్మము మ॰హామతులై యొనరింపఁగావలెన్
బరువడి నెల్లపాపములు॰ బాసి శిరంబున రోమకూపమం
దిరవుగ నిల్చియుండు నవి॰ హేతువుగా మది నెంచు మెంతయున్. 162

తే. తీర్థయాత్రిలవిధములు॰ దెలిపితి నీక, స్నానములు జేయఁ దమపరి॰ధానములను
జేయుక్రమమును జెప్పెద॰ చిత్త మలర, వినుము మనుజులజాతీ! స॰విస్తరముగ.

సీ. కదళి మాజియు నిమ్మ॰ఖర్జూరఫలములు, రేగు కిత్తిళి యుసి॰రికఫలములు
పాలును పెరుగు॰ పిప్పలి శుంఠి కటుతేనె, శర్కర బెల్లము॰ జాజి గెనుసు
జీర కంబళి కటిం॰చేల జందెములను, సన్న్యాసులకు దగు॰ సలిలపాత్రి
లన్నము రసయుక్త॰ మగుచు నిండినఁ గంచు,పళ్లెరముల మంచి॰పానకములు
తే. తెలుపు శంఖ మెసఁగు॰ నలుపుసాలగ్రామ, ద్యుమణికాంతఘటిత॰దుర్గప్రతిమ
స్ఫటికశిలలఁ జేయఁ॰బడినవిఘ్నేశుని, భగవదర్చన కగు॰పరికరములు. 164

ఆ. అవ్వి నిత్యదాన॰మందు మాఘస్నాన, మైనపిదప జేయు॰ నతఁడు విష్ణు
పదవి నొందు లేక॰ పదపడి జన్మకు, వచ్చెనేని చక్ర॰వర్తి యగును. 165

తే. కనుక వ్యర్థము సేయక॰ దినము నిత్య,దాన మేవస్తువును జేయఁ॰దగును మాఘ
మాస మర్కోదయమున గ్రా॰మము వెలుపలి,శీతలోదకస్నానము॰ జేసి పిదప. 166

సీ. సంధ్యాదివిధులను॰ జరిపి పుష్పాక్షత,తిలలచే దేవతాం॰శములకుఁ దర్ప
ణములు గావించిన॰ క్రమమునఁ బరిశుద్ధ,మగుచోట దర్భల॰ప్రతిమలందు

ఆవాహనాసన • మర్ఘ్యపాద్యము మధుపర్కమును స్నానము • వస్త్రయజ్ఞ
సూత్రగంధాక్షత•సూనదీపసుధూప, నైవేద్య తాంబూల•నవవిభూష
తే. ణములు సంగీతనృత్యవా•ద్యము పురాణ,నతుల శ్రీవిష్ణుదేవుని • బ్రతిదినమును
పూజ లొనరించి దానముల్ • భూసురులకు, సంతసింపుచుభక్తితో•సలుపవలయు

ఉ. ఏనరుఁడైన భానుఁ డుద•యించెడివేళను మాఘమాసమం
దీనియమంబులన్ వ్రతము • లింపుగఁ జేసిన పుణ్యకర్మచే
వానికి నెల్లభోగములు • వావిరిగా సురలోకమందుఁ బెం
పూనినవై భువిం జనన • మొంద సమస్తసుఖంబు లందెడిన్. 168

వ. అని కౌండియు నిట్లనియె. తీర్థయాత్రాఫలము నిచ్చునట్టిదైన రంగనారదసంవాదమను,
పురాతనకథ యొకటి కలదు. దానిని దెలిపెద, సావధానుండవై యాకర్ణింపుము.

సీ. గతకాలమందు నొ•కానొకదినమున, రంగరా జొకఁడు నా•రదముని జేరి
మునినాథ! నామన•మునఁగల సందేహ, మడుగవచ్చితి దీని • నాలకింపు
జగతిలో నొకఁ డెల్ల•సాధనములు ధన,ధాన్యసమృద్ధిచేఁ • దనరుచుండు
నేమియు లేనట్టి • హీనుఁడై తనధర్మ,మునకుఁ దప్పనిశుద్ధుఁ • డన నొకండు
తే. వీర లిరువురు కడకు త్రి•విష్టపమును, బొందుచున్నారు దాని నా•కెఱింగ మఱలఁ
దెల్పుమన నట్టిరంగని • దేవమౌని, కాంచి తత్కథ నెఱిఁగింపఁ•గడఁగె నిట్లు. 170

క. ధనమును సాధనముగఁగల, మనుజుఁడు దానములచేత • మహితసుకర్మల్
పొనరఁగఁజేయుచుఁ బాపము,లను విడి స్వర్గమును బొందు • లలితాత్ముండై. 171

సీ. దరిద్ర్యహీనుండు వేదముఁ బఠింపుచు, వేదశాస్త్రార్థముల్ • వినుచు హెచ్చు
తాలిమి గలిగి వి•ద్వాంసుఁడై కోపము, నింద్రియముల నిగ్ర•హించి తనకు
ననుకూలయైన భా•ర్యను గూడి కృచ్ఛ్రచాం,ద్రాయణజపహోమ•తపములందుఁ
దనకుఁ గలంతట • దానముల్ దేవతా,ర్చన మొదలగునిష్ఠ•లను దనరుచు
ఆ. నెల్లప్రాణులందు • నెక్కుడు దయగల,వాఁడు నగుచు మనము • వాక్కు కర్మ
లనెడి త్రికరణముల • నన్యుల కుపకార,మున నటింపుచుండి•యును మఱియును.

చ. పనిపడి దుఃఖపీడితుల•పై దయ సత్క్రియలన్ మెలంగు స
జ్జనులను జూచి మానసము • సంతస మొందుచుఁ గ్రూరకర్మ లెం
దునఁ దమి జేయువారియెడ • దోసము లెంచక మిన్నకుండి తా
నణఁచి విరోధివర్గముల • నాఱిటి దర్పమపేక్ష సేయకే 173
తే. తనరిధర్మంబులందు నెం•తయు మెలంగు, బ్రాహ్మణుఁడు బ్రహ్మసాయుజ్య•పదవినొందు
నిందు కొకపూర్వకథ గల • దింద్రసభను, జరిగె నది విను దెలిపెద•జనవరేణ్య!

సీ. ఏ నొకకాలమం•దింద్రుని జూచుట,కొఱకు స్వర్గమునకు • నరిగి దేవ
సభయందు నప్సరల్•సంగీతముల గిన్న,రాంగన లాటల • నమరసతులు
గొలుచుచుండఁగ చుట్టు • వెలలేనిసొమ్ముల,చే నలంకృతుఁడునై • శిరమునందు
ముత్యాలు నవరత్న•ముల నమర్చినకిరీ,టము నాతపత్రము • నమరి దివిజ

ఆ. సతులు వీవఁగఁ గదలెడి ♦ చామరముల, ధర్మవాహనరాజు నా♦తనికి నెదుర
నభిముఖుండగుశ్రుతిపాలుఁ♦డనెడిబ్రాహ్మ,ణోత్తమునిగంటినచటలో♦కోత్తరముగ.

సీ. ఆబ్రాహ్మణుఁడు నింద్రుఁ♦డాదిదిక్పతులచే, దివిజులు ద్వాదశా♦దిత్యవిశ్వ
దేవకిన్నరసిద్ధ♦దేవయోనులు గుహ్య,కులు స్వర్గమందునఁ ♦ గలుగువారి
చేతఁ బొగడ్తల♦చే నొప్పి విస్తార,బలసంపదలు కాంతి ♦ ప్రబ్బికొనఁగ
ధర్మవాహనునకుఁ ♦ దగ మించువాఁడునై, యుండుటఁ జూచితి ♦ నొప్పిదముగ
తే. అనఁగ రంగఁడు నారద♦మునిని జూచి, పలికె నిట్లని విప్రుఁడు ♦ బహుదరిద్రుఁ
డౌను రాజంతటికి పూజ్యుఁ ♦ డౌట పుణ్య.లోకమును బొందె విప్రవ♦కేకతమున.

క. కలిగెను పుణ్యము నా కది, తెలియఁగ వినిపింపు మనుఁడు ♦ దేవర్షి నృపుం
దిలకించి పలికెఁ దత్కథఁ, దెలుపుదు నిటు విను మటంచు ♦ ధీరవరేణ్యా! 177

తే. పూర్వకాలమునందు నే ♦ బుధులవలన, వినినవిధమును దెలిపెద ♦ వినుము భాస్క
రాన్వయంబునఁ గలిగిన♦ యజ్ఞసేనుఁ, డనఁగ నొకరాజు గలఁడు సి♦యవనియందు.

సీ. ఆరాజు సవనము♦లందు నాసక్తుఁడై, భగవంతుఁ డందుఁ దో♦డ్పడుట గలుగ
నర్కకులవాఁడు♦నయ్యు నహర్పతికి, జేరి విశేషద♦క్షిణల యాగ
ములు జేయుకారణ♦మున లోకమున యజ్ఞ,సేనునామమునఁ బ్ర♦సిద్ధి కెక్క
అతనిభార్య పుణ్యాత్మురాలును బతి,వ్రత పృథుకీర్తి నా♦ రాజమహిత
తే. యనఁగ సుగుణములందుఁ బ్ర♦ఖ్యాతి నొందె, తేరు సపరివార లామెకుఁ ♦ బేరు సోమ
కల యనఁగ నొప్పు నాదంప♦తులకు ధర్మ,వాహనుండు జనన మందె ♦ వసుమతీశ!

తే. యజ్ఞసేనుం డొనర్చిన♦యాగఫలము, లనెడిసోపానముల స్వర్గ♦మునకు నతఁడు
గగనపథమునఁ జన కొంత♦కాలమునకు, ధర్మవాహనుఁ డయ్యె నీ♦నరకు రాజు. 180

సీ. అతనిప్రతాప మే♦పునవచ్చు శూరుల,నోడ యుద్ధమునకు ♦ తొడరునపుడు
ధర్మదేవతయె నా♦తనికి వాహనము గాఁ, గలుగుట నమితప్ర♦ఖ్యాతి నొందె
నారాజుసుగుణము ♦ లతిశయించినకలా, నిధిని జేకొనఁగ నా♦మిథునమునకు
తనయుఁడు వృషసేనుఁ ♦ డనుపేర నుదయింప, ప్రియమురా♦యువరాజు గాఁగఁ
తే. బ్రజల పాలించుకొఱకు నే♦ర్పరచి ధర్మ,వాహనుఁడు భార్యతో ధర్మ♦వాహనమున
పయనమై తీర్థయాత్రల♦ఫలముకొఱకు, సంచరింపుచు సకలదే♦శములయందు.

తే. వాజిపేయాశ్వమేధస♦వనములు ప్రతి,తీర్థమందునఁ జేయుచు ♦ సార్థకమగు
నట్టిషోడశదానము ♦ లవనిసురుల, కొసఁగుచుండెను దా సతీ♦యుక్తుఁ డగుచు. 182

సీ. అతఁడు శ్రీవత్సాన్వ♦యమునఁ గల్గినవిప్ర,శతధృతిసుతుఁడు న♦చ్యుతునిభక్తుఁ
డగుశ్రుతిపాలుఁడు ♦ నాలుగుశ్రుతులతు,ల్యాఖ్యయు వేదకా♦ర్యాఖ్యసుతుఁడు
సత్పశీలభూషణుఁ ♦ సుకృతములగుతీర్థ,యాత్రలు సేవింప ♦ నరుగుచుండి
పండినచేనిలో ♦ పరిపెన్నులు కంద,మూలముల్ భక్షించి ♦ కాల మొక్క
తే. రీతి దేహపోషణ జేసి ♦ ప్రీతినిర,తమును గాలత్రయమును దీ♦ర్థముల స్నాన
మాదిగాఁ గల్గు నిత్యకృ♦త్యములు నగ్ని,హోత్రములు విష్ణుపూజలు ♦ నొప్పుచుండి.

క. యాత్రాఫలసిద్ధిగ కా,లత్రయమున, మంత్రపఠన◆లను యోగములన్
ధాత్రిని దీర్ఘాచరణల, పాత్రుండు తీర్థోపవాస◆భరితుండు మతియున్. 184

తే. కోప మింద్రియముల గెల్చి◆కువలయమున, నెల్లప్రాణులయెడ దయ◆నెనయనిట్టి
నడవడిని దీర్ఘయాత్రల◆ గడుముదమునఁ, జేయుచుండెను బ్రాహ్మణ◆శ్రేష్ఠుఁడనఘ.

ఆ. ధర్మవాహనుండు◆ దానయాత్రలయాగ,ములఁ దపములచేత◆ ముజ్జగముల
యశము నొంది శుద్ధుఁ◆డగుచు స్వర్గమునకు, నేగి సౌఖ్యపదవు◆ లీగుచుండె. 186

క. శ్రుతిపాలుఁడు తీర్థములను, సతీస్నుషాసుతులఁగూడి◆ సకలవిధములన్
హితమతితో సేవింపుచు, క్షితికి ప్రదక్షిణము నొనరఁ◆జేసెను కడిమిన్. 187

ఉ. అంతట భూసురప్రవరుఁ◆ డబ్జజులోకమునందు పిమ్మటన్
సంతస మొప్ప నచ్యుతుని,◆ శంకరుపట్నములందు మూఁట న
త్యంతకుతూహలం బొదవ◆ నక్కడ నొక్కొకచోట కల్పప
ర్యంతము నిల్చి వా రొసఁగు◆నాజ్ఞను జేకొని స్వర్గమందునన్. 188

తే. ధర్మపాలన కనువుగాఁ◆ దగినపీఠ,మున వసింపఁగ దేవతా◆వనిత లతని
బలసి కొలువఁగ నింద్రుని◆వలన పూజ, లందుకొనుచుండి భోగము◆లందుఁ దనరి.

ఆ. కామధేనువందుఁ◆ గలుగుపదార్థము, లనుభవించుచుండె◆ ననవరతము
నిటుల విప్రరాజు◆లిరువురు మాఘమా,సమునఁ జేయుస్నాన◆సరణివలన. 190

ఆ. నాకవాసు లగుచు◆ నానావిధములైన, సౌఖ్యములను దగిలి◆ సంతసింపు
చుండఁ గంటె నీవు◆ నుచితమౌ మాఘమా,సమునఁ దీర్థయాత్ర◆ సలుపవలయు.

సీ. ప్రొద్దు పొడుపువేళ◆ పుణ్యజలంబుల, స్నానము నే నరుఁ◆ డైనఁ జేయఁ
జను రాజవిప్రులు◆ జని మాఘమునఁ దీర్థ,యాత్రలు సేవింప◆ నైన మహిమ
నలరుచు నిరతాన్న◆దానము జేయుము, విష్ణువు శివుఁ డను◆ భేదబుద్ధి
నెన్నక పూజింపు◆ మిరువుర తీర్థయా,త్రలఫలమును నన్న◆దానఫలము
ఆ. చేత నెన్నటికి న◆శింపని స్వర్గము, గలుగు ననుచు మౌని◆ తెలుపునట్టి
పలుకులు తనమదిని◆ దలపోసి రంగఁడు, తీర్థయాత్రలందు◆ దివ్యబుద్ధి. 192

మ. తను భార్యాసుతయుక్తుఁడై సకలతీ◆ర్థస్నానముల్ జేయుచున్
జని కేదారముఁ జొచ్చి చచ్చి పిదపన్◆ స్వర్గంబునుం బొందెఁ గా
వున నీవున్ ధరఁ గల్గు తీర్థముల సం◆పూర్ణంబులైనట్టి ద
క్షిణలన్ స్నానము నన్నదానములచే◆ శ్రేయంబులం గాంచుమా. 193

తే. ఇది పురాతనకథ దీని◆ నెవ్వరేని, బ్రాహ్మణులసమ్ముఖంబునఁ◆ బఠన మాఘ
మాసమునఁ జేయ వినఁ దీర్థ◆మహిమలన్ని, చెంది స్వర్గము వారలు◆ చేరఁగలరు.

ఆ. అనుచు బ్రహ్మతనయుఁ◆ డాదిలీపునితోడ, మరలఁ దెలిపె మాఘ◆మాసమహిమ
దాని మీకుఁ జెప్పె◆దను వినుమని సూతుఁ, డనియె శౌనకాది◆మునులఁ జూచి.

క. ఘనమాఘస్నానవ్రత,మున సుతహితబంధువర్గ◆మును సహితుండై
ధనము ప్రభుత్వము నాకము, ననువొందఁగఁ బొందు నాతఁ◆ డవనీనాథా! 196

తే. మాఘమునకంటె నింకొక◆మార్గమందు, సకలధర్మార్థకామమో◆క్షములు గలుగ
బట్టిమాఘవ్రతమును జే◆యక యుపేక్ష,చేత నయనకు నదె గొప్ప◆చెఱుపు కాదె.

సీ. కల్యమునందు మా◆ఘస్నానమును జేయ, దోషపుంజమ్ములు ◆ దొలఁగిపోవుఁ
గ్రిందటిజన్మంబు◆నందుఁ జేసినపాప,ములు నాశనము నొందు ◆ పుణ్య మబ్బు
నవనిగల జనుల◆యజ్ఞాన మేమన,వచ్చును పొరపాటు ◆ బడినవార
లగుచు మాఘస్నాన ◆ మాచరింపక యన్య,విషయములందుఁ బ్రా◆వీణ్యు లగుచుఁ
తే. దిరుగుచుండిరి యిఁకనైన ◆ తెలివిగలిగి, పైనిఁ జెప్పినస్నానాద్య◆హీనకార్య
తతిని జరిపిన రక్షక◆త్వమును మేలు, జన్మసాఫల్య మగును స◆జ్జనవిధేయ! 198

ఆ. దురితహరము పుణ్య◆కరము మనోహర, మెన్నరానిమహిమ ◆ హెచ్చువింత
మాయనపహరించు◆ మాఘమాసస్నాన,ఫలము శుభద మగుచుఁ ◆ బార్థివేంద్ర!199

సీ. గతకాలమందు సు◆వ్రతనామధేయబ్రా,హ్మణుఁడు విద్వాంసుఁడై,◆యనవరతము
పాపము లార్జించి ◆ వార్ధకదశను బ,శ్చాత్తాపమునఁ గడు ◆ శాంతుఁ డగుచు
నర్మదాసలిలస్నా◆నము మాఘమునఁ బది,దినములు జేయ నా◆మనుజుఁ డేడు
మనువులపర్యంత◆మును నాకమందున, నిలిచి మహాభోగ◆ములను జెంది
తే. మరలభూలోకమందు బ్రా◆హ్మణునితనయుఁ,డగుచుజనియింపవినుతప్ర◆యాగజలము
లందు స్నానము మాఘము◆నందుఁ జేయు,చుండి తగునీమములచేత ◆ నుండి పిదప.

చ. విలసితపుణ్యమూలమున ◆ విప్రుఁడు స్వర్గనివాసమందు సొం
పలరఁగ నిల్చె నొక్క-ప్రళ◆యాంతమునంతటికాల మంతఁ దా
నిల ధరణీసురత్వము వ◆హించి సదా నియమంబులందుఁ బెం
పలరుచుఁ గాశికాపురికి ◆ నంతటఁ జేరఁగఁబోవ నాదటన్. 201

తే. విశ్వనాథునిచెంతను ◆ విప్రముఖ్యుఁ, డుసురులను విడి శివునిసా◆యుజ్యపదవిఁ
జెందె నని పల్కె-నాముని◆శేఖరునికి, నాదిలీపవిశాంపతి ◆ యనియె నిటుల. 202

మ. ఎఱుగంబల్కు మునీంద్ర! సువ్రతుఁడు ముం ◆ దేవీడునం దుండెనో
వరుసన్ విద్యల నెల్ల నేర్చి యిల స◆ర్వజ్ఞుండు నా నొప్పి దు
ష్పరమౌ పాపము లెట్లొనర్చెనొకొ ప◆శ్చాత్తాప మెట్లొందెనో
గురుకారుణ్యసముద్ర! నాకు వినఁ గో◆ర్కుల్ గ్రెల్లు దాటెన్ బడిన్. 203

ఆ. అనుచుఁ బ్రశ్న సేయు◆నట్టి దిలీపుని, గని వశిష్ఠుఁ డనియెఁ ◆ గనికరమున
దురితహరము సువ్ర◆తునిచరిత్రము నీకుఁ,దెలియఁజెపుదు దాని ◆ దేటపడఁగ. 204

సీ. విను నర్మదాతీర◆మున వేదములు పఠిం,చినవిప్రజనముల ◆ కునికిగాఁగ
జెలఁగును లోకప్ర◆సిద్ధమయిన వశం,గాగ్రహారము గొప్ప ◆ దగుచు నందు

ఫలములు వంటక♦ట్టెలు గడ్డి దినుసులు, నాకులు కూరగా♦యలును వ్రేల్మి
సమిధలు దర్భలు ♦ సకలపుష్పములును, పైరులు దుంపలు ♦ పలువిధములఁ
ఆ. ధాన్యములును దటాకముల్ ♦ దట్టమైన, వనములును నీటిబావులు ♦ బలుపుదనరి
నట్టిపశువులమందలు ♦ నాహితాగ్ను, లగ్ను లుంచినవారలు ♦ నగుచునుండ్రి. 205

తే. పంచయజ్ఞప్రకారముల్ ♦ వైశ్వదేవ, శీలు రక్కరగలవారి♦చేత నిండి
ధర్మవర్తన ధనము శే♦దములరావ, మధికమై నలుదిక్కుల♦నంటియుండు. 206

సీ. అయ్యగ్రహారము♦నందు సువ్రతుఁ డను, విప్రోత్తముఁ డొకండు♦ వెలయుచుండు
నతఁ డెల్లవేదము ♦ లాద్యంతమును ధర్మ,శాస్త్రముల్ చక్కఁగాఁ ♦ జదివి వాని
యం దుండునర్థము ♦ లరసి పురాణేతి,హాససమర్థుఁడై ♦ యంత వేద
ములకుఁగల షడంగ♦ము లగు శిక్షావ్యాక,రణ నిరుక్తాదులఁ ♦ బ్రజ్ఞగల్గి
తే. మహిత మైయొప్పు నుభయమీ♦మాంసల మఱి, నీతిజ్యోతిషభేషజ♦నృత్తశిల్ప
వాజిగజయానశాస్త్రముల్ ♦ వరుస నేర్చి, కలలు నరువదినాలుగు ♦ గలయ నెఱిఁగి.

తే. మంత్రతత్త్వము యమనియ♦మములు సాంఖ్య,యోగశాస్త్రములాదిగా♦నొనరఁజదివి
దేశభాష లనేకముల్ ♦ దేటపడఁగ, నేర్చి వ్రాయను జదువను ♦ నిపుణుఁ డయ్యె.

క. ధన మార్జించుట కగు సా,ధనము లనేకముల నధిక♦దక్షుఁడు నయ్యెన్
ధనకాంక్షచేత గురుద,క్షిణ లియ్యక లోభవృత్తి♦చేత నతండున్. 209

క. ధనధాన్యములను గ్రమమగు, పనులను నార్జించి యాశ ♦ పైకొనఁ దృప్తిన్
గనలేక చెడ్డనడతల, ననుచితవిత్తార్జనమున ♦ కారంభుండై. 210

సీ. మొనసి యేకోద్దిష్ట♦ముల నవశ్రాద్ధము,లను నగ్నములను జే♦కొనుచు నార్ద్ర
కృష్ణాజినము గేదె ♦ నీనుచుండెడిదాని, గోదానములు పట్టి ♦ కొద్దిగొప్ప
వెలకు నమ్మచుఁ గన్ని♦యల విక్రయింపుచుఁ, జండాలులాదిగా ♦ సకలజనుల
వలన దానములను ♦ బట్టి దుకాణము, బెట్టించి సటికించె ♦ విపినములను
ఆ. నెయ్యి వంటచెఱకు ♦ బియ్యము మొదలగు, నన్నివస్తువులను ♦ నమ్మకొనుట
దీర్ఘయాత్రసేవ ♦ దేవతార్పన సేయు, నొకరికొఱకు మదికి ♦ నొప్పిదముగ 211

తే. విత్తమును గొని చదివించు ♦ వేదములను, స్నానసంధ్యాద్యనుష్ఠాన♦శ్రాద్ధములను
మఱచి పొరుగింటనెపుడు నో♦గిరముదినుచు, నతఁడు నార్జించు సొమ్మప్ప♦టప్పటికిని.

ఆ. లెక్కబెట్టుకొనుచు ♦ నొక్కరికైనను, కాసువీస మిడక ♦ కడుపునిండ
దాన కొక్కశతస♦హస్రనిష్కములను, సంగ్రహించె నిట్టి♦సరణివలన. 213

తే. ఈవిధమ్మున ధనము నా♦ర్జింపుచుండ, వార్ధకము రాఁగ నింద్రియ♦పాటవమును
దప్పి దేహము సడలఁగా ♦ ద్రవ్యముగల,వాఁడునై యుండ సేవకుల్ ♦ గోడుజెంది.

తే. అన్నవస్త్రములకు లేక♦యలవటించి, యాకలికి నోర్వఁజాలక ♦ యతిశయముగఁ
దిట్టుచుందురు పలుమారు ♦ మట్టువిడచి, వార్ధకము నంతకంతకు ♦ ప్రబల మగుడు.

సీ. కూర్చుండి లేచుట◆కును శక్తిచాలక, ధనము గూర్చుటకునై ◆ తగినపాటు
బడలేనిదుఃఖము◆వలన నేడ్చుచునుంటి, జనులతో మీరిఁక ◆ జచ్చిపోండి
లేక యెక్కడికైన ◆ లేచి పొండై పొండి, నాసొమ్ము మీరు ది◆నకుఁడు నేను
చూడఁజాల నటంచు ◆ వాడుదుర్భాషలు, విని సతీసుతబంధు◆జనులు నతని
ఆ. పలుకులం దలక్ష్య◆భావులై యిటువంటి, తగనిమాట లనుట ◆ తగదు మాను
మనుచు వారి కిష్ట◆మైన పదార్థముల్, తెచ్చి వండుకొనుచుఁ ◆ దిందు రధిప! 216

కం. అటువంటివేళ బ్రాహ్మణ,జటిలుం డొక పురమునందు ◆ శయనించి తమః
పటలము గ్రమ్మగ పెదవులు, పెటపెట దంతములు కొఱుకు ◆ విడు నిట్టూర్పుల్.

చ. అతని యవస్థ చూచి కను◆లారఁ బరాపక నవ్వువారలై
సతిసుతబంధువర్గములు ◆ చక్కఁగ నిష్టపదార్థసంపదల్
హితమతిల భుజింపుచు య◆థేచ్ఛముగాఁ దనదిక్కు జూడకే
యతులసుఖోన్నతిం బొదల ◆ నావిధి గాంచి సహింపఁజాలమిన్. 218

ఆ. గొప్పనాదము గల ◆ గొంతెత్తి యేడ్చుచు, నిట్టివ్యాకులతను ◆ బుట్టినట్టి
మనసు దనరుబ్రాహ్మ◆ణునకు నొకవివేక, ముదితమయ్యె వినుము◆ విదితముగను.

సీ. తలఁపగూడని చెడు◆దానము లన్నియుఁ, బట్టితి పుణ్యత◆పములు వేద
విద్య కన్నియలను ◆ విక్రయింపుచు నింత,ధనము నార్జింప నా◆మనసు నింక
నూరట నడఁగదు ◆ మేరుపర్వతమంత, రాశిగా నుండువ◆రాలకుప్ప
గోరుచున్నది దుఃఖ◆కారణ మన మన, సెంతచెడ్డది దీని ◆ కెప్పటికిని
ఆ. తృప్తిలేదు నాకు ◆ నెల్లకోరికలును, దీరి మరల నొకటి ◆ గోరుచున్న
దార నారు నెరసి◆నట్టి కెండ్రికలును, రాలిపోవుచున్న◆రదనములును. 220

ఉ. కన్నులచూపు మధ్యమయి ◆ కర్ణముల్ వినరాకయుంట నా
కిన్నియుఁ దగ్గి దేహబల ◆ మింద్రియదార్ఢ్యములున్ నశించె నన్
బన్నుగ నాశమాత్ర మెడఁ◆బాయక వార్ధక మింతలేక పో
కున్నది మంచిప్రాయమున ◆ నొక్కట దీని జయించు టొప్పగున్. 221

కం. జనములు బంధువులు సతీ,తనయులు రోయుదురు ముసలి◆తనమందున కా
వున వానికి సుఖ మెక్కడి, దనయము దుఃఖమె తటస్థ◆మా నిజ మిదియున్. 222

సీ. జనములు నాశపా◆శములచేతను జిక్కి, చిన్నతనంబును ◆ జెందుచుందు
రది గాక నీచమా ◆ నాశచే విద్వాంసుఁ, డైనవానివివేక ◆ మడఁగిపోవు
శాంతచిత్తుఁడు కోప◆సహితుఁడౌ నెటువంటి, మంచివర్తన గల ◆ మనుజుఁడైనఁ
జెడుపను లెప్పుడుఁ ◆ జేయు సుగుణుఁడైన, దుర్గుణములు నెందుఁ◆ దొలఁగకుండు
ఆ. గీడు మూడు నగ్ని ◆ కలలవంటిది, కాలుచుండునట్టి ◆ కట్టెమీఁద
నెయ్యి వేయ మందు◆నేర్పున కోరిక,చేత నాశ పెరుగు ◆ నాతతముగ. 223

తే. ఆశ కలిగిన మనుజున ◆ కన్నిలోక,ములను సుఖలేశ మింతైనఁ ◆ గలుగఁబోదు
పూన్కిఁజేసియాశాపాశ◆ములఁద్రెంపఁ, జెందు సుఖము లోకత్రయ◆మందు నతఁడు.

తే. కాన నెవ్వండు శాశ్వత◆మైన పరమ,పదము నొందుట కభిలాష◆పడునొ బుద్ధి
మంతుఁ డగునాతఁ డాశను ◆ మాని ధర్మ,వర్తనలచేతను నటింప◆వలయు సుమ్ము!

తే. సత్కులమునందు జననము ◆ సకలవిద్య,లందుఁ గలిగిన తెలివి ◆ హెచ్చైనకీర్తి
గొప్పదనమును దేజముఁ ◆ గోలుపోవు, నాశచే నెట్టిమానవుఁడై◆న భువిని. 226

ఆ. ఆశవలన మోహ◆మతిశయమగుఁ దిర,స్కార మొందినట్టి◆జనుల కంటె
మచ్చరమును బెరుగు ◆ మాలమలస్థుల,చేతికొద్దిదాన ◆ మాకతమున. 227

చ. తలఁతురు మానభంగమున ◆ దాఁకొనుదుఃఖ మెఱుంగలేరు నేఁ
జెలువుగ నన్నిదానములు ◆ జేకొని ద్రవ్యము సంగ్రహింప నా
బల ముపయోగమై చెడితిఁ ◆ బైకొనె వార్ధక మింక సద్గతిన్
గలుగుప్రయత్నముం గలుగఁ◆గా మది నూఁదెద నంచు విప్రుఁడున్. 228

సీ. న్యాయమార్గము నెడ◆జేయక మనమున, నాట యత్నించెడి◆నాఁటిరాత్రి
చోరులు శూరులై ◆ చొచ్చి పట్టణమందుఁ,గల సువ్రతునియింటఁ ◆ గలుగుధనము
గని నిసివేళ బ్రా◆హ్మణునిసుతాదుల, బంధించి ద్రవ్య◆లాభమును బొంది
చనఁగ విప్రుఁడు దుఃఖ◆మునఁ బరవశమును, దనర నేడ్చుచు నాదు◆ధనము ధర్మ
ఆ. కామమోక్షములకు ◆ గానిక తినుటయు, లేక పరుల కీయఁ◆బోక దాచ
దుష్టధనము తుదకు ◆ దొంగలపాలు గా, కెవరి కగును దీని ◆ కేమిచేతు? 229

ఉ. పిల్లలు తల్లి కూటికయి ◆ బెగ్గిలి యాకలిబాధ కోర్వకే
తల్లడమంద సోదరుల ◆ దాయల మోసముజేసి విప్రులం
జెల్లెడ లోభవృత్తి తన ◆ కేర్పడ బట్టఁగరానిదానముల్
కొల్లగఁ గొంటి నింతపని ◆ కూడ దటంచుఁ దలంప కెంతయున్. 230

తే. ఆత్మవంచన దగుల న◆న్యాయమైన, పనుల నేమేమొ చేసితి ◆ పట్టరాని
దానములఁ గొని గోవులఁ ◆ దగనిధరకు, నిచ్చితి నకృత్య మింతకు ◆ నేవి గలవు!

సీ. గోదానములు తీసి◆కొనఁగూడ దెప్పటి,కైన దానముబట్టి◆నట్టిగోవు
నమ్మినవానివం◆శమ్మున నేడుత,రములవారిని గాల్చుఁ ◆ బ్రకటితముగ
నిట్టిదోవఁపుఁబను ◆ లెన్నెన్నొ చేయుచుఁ, జిరకాల మేను వా◆ర్జించినట్టి
ధన మొక్కక్షణకాల◆మున దోపు డయిపోయెఁ,గనుగొన వింతయా◆కరము మదికి
తే. ద్రవ్యసంపాదనకు బుద్ధి ◆ తగుల నధిక,శ్రమముతోఁ బరదేశముల్ ◆ సంచరింతుఁ
దిరిగితిని గాని నే నొక◆దినమునైన, నెమ్మదిగ నింటిపట్టున ◆ నిలువనైతి. 232

తే. స్నానసంధ్యాద్యనుష్ఠాన◆సమయ మెఱిఁగి, చక్కఁగా నొకదినమైన ◆ సలుపనైతిఁ
బ్రాణయామము నొకనాఁడు ◆ పట్టనైతి, వేదమాత గాయత్రిని ◆ విడిచిపెడితి.

ఆ. మూఁడుమారు లుదక•మును బుచ్చుకొని రెండు, సార్లు తుడిచివేసి • జలముచేత
నాచమనముఁ జేయఁ•నైతిని తిన్నఁగా, నొక్కరోజునైన • నిక్కముగను. 234

తే. దర్భ మార్జనఁజేయఁ దొం•దరనుబట్టి, కమలనాభునినామ మే•కాంతమందుఁ
దలఁపనైతిఁ బవిత్రముల్ •దనర మూఁడు, పాదములను, గాయత్రి జ•పము నెఱుంగ.

సీ. పశువులవలె నొప్పు•భక్తులసంసార, బంధముల్ తెగగొట్టు • పార్వతీశు
నెప్పుడు పూజింప•నెఱుఁగ మంత్రము చెప్పి, కాని యూరక నైనఁ•గాని వంశ
మును బవిత్రముసేయు • భూతేశులింగము, పైనిఁ బువ్వమునైనఁ • బత్రిమైనఁ
జేయలే దెంతటి • వృజినముల నశింపఁ, జేయు వారికి నతులు • సేయనైతి.

ఆ. కామముల నొసంగు • గణనాథునకు సర్వ, రోగహారణు భాస్క•రునకు సకల
భద్రములను గూర్చు • పార్వతికిని బూల, నక్షతలను జేయ • నర్చనలను. 236

సీ. తరుగుట నూడ్చుట • దంచుట నూరుట, వండుట లనియెడు • పంచసూన
ములు నొప్పు; వీనిచేఁ • గలుగుపాపము లూడ్వ, వైశ్వదేవమ్మును • బార్వతి రవి
విష్ణువు శంభుని • విఘ్నేశుఁ బూజలు, సేయ నధ్యయనము• సేయను బితృ
వర్గతృప్తికిని ద•ర్పణములు హోమము, భూతములకుఁ బ్రీతి•పుట్ట నన్న

తే. మతిథిపూజలు నివి పంచ • యజ్ఞములనఁ, బరగు వానిని జేయుభూ•సురుల కధిక
పూజ లనవరతము జేయఁ•బోలునట్టి, పనులు నాచేతఁ గావింపఁ•బడవుసుమ్మ! 237

తే. స్వర్గలోకము బొందించు • సత్పురుషుల, సత్కరించుట విడిచితి • సంచెబిచ్చ
మైన నొకరికి వేయలేనైతి • బ్రహ్మచారికిని గన్య నిమ్యఁగాఁ• జాలనైతి. 238

క. యతియును వటువును నిరువురు, ప్రతిదినమును బరులచేతి•వంటకమునకుఁ
సతతము గోరుదు రన్నము, హితముగ మున్ముందు వారి • కిడవలయుఁగదా! 239

తే. ఆతులఁజేయక ముందుఁదా•ననుభవించు, వాఁడు చాంద్రాయణము చేయ•వలయు దాని
నెఱిఁగి వారికి ముందుగా • నిడక భిక్ష, మేను దింటినయో పర•గృహములందు.

తే. వివిధవస్త్రసమృద్ధికై • విప్రతతికిఁ, జేలదానము లెన్నడుఁ • జేయనైతి
యవల నాజ్యముతోఁ గూర్చి•నట్టివస్తు, వులను హోమము వేల్చుచు • దలఁపనైతి.

సీ. పవమాన పురుష శ్రీ • బ్రహ్మ నారాయణ, సూక్తపంచకము నే • సుస్థిరముగ
జపియింపనైతి దో•షములు బోవనడంపఁ, దనరునశ్వత్థ ప్ర•దక్షిణమును
శనిత్రయోదశిదిన•మున శుక్రవారము, రాత్రివరకుఁ దిన • రా దటంచు
నెఱుఁగనైతిని బాట • ఇరుపక్కలను గొప్ప, చల్లగా నుండు వృ•క్షములు నాట

తే. నైతి నే నెల్లభోగము • లలరు దూది, పరుపు దీపము పీట ద•ర్పణము నిట్టి
దాన మిడలేదు బ్రాహ్మణ•తతికి నెపుడు, గాన సద్గతి నా కింకఁ • గలుఁగఁబోదు.

సీ. పెరుగుతోఁ గూడిన • పేలపిండిని మేఁక, గుఱ్ఱ మెనుము గొఱ్ఱె • యుఱ్ఱితోలు
తిలలును బరిశుద్ధ•జలములకలశముల్, పరిచారిక లనిశముఁ • బడయనైతి

బ్రాహ్మణపదముల ♦ భక్తిఁ బైలము రాయ,నైతి చలువపందిరైనఁ బెట్టఁ
జాలనైతిని ఛత్ర♦చామరతాంబూల,పరిమళవస్తువు ♦ లూరుల కెపుడు
తే. దానముల నిచ్చువాఁడను♦గాను నిత్య,శ్రాద్ధ మతిథుల యతులపూ♦జలను జరుప
నైతి నీక్రియలను జేయ♦నైన మనుజ,వరులు యమపురిఁ జొత్తు రె♦ప్పటికినైన. 243
తే. యముని దూతల శమనుని♦యాతనల న,జయు లౌదురు కృచ్ఛ్రచాం♦ద్రాయణము
దినము రాత్రి వేళ భో♦జనము నిట్టి, వ్రతములను జేయనైతి సం♦తతము మఱియు.
తే. దేవపరిభ్రితకు నాక♦దినమునైనఁ, దగిన కార్యములను జేయఁ♦దలపనైతి
గోవునకు గడ్డి వేయుట ♦ సావుదురద, పోవ గీరుట నెఱుఁగక♦పోతి నెపుడు. 245
సీ. యాచకు లాసించు♦నట్టివస్తువు నిచ్చి, సంతోషపరుపఁగాఁ ♦ జాలనైతి
హరిపూజ కుపయోగ ♦ మగు తులసిని దెచ్చి, తోఁటగా నెన్నఁడు ♦ నాటనైతి
శివరాత్రి నేకాద♦శిని నిరాహారము, నుండఁజాలక పోతి ♦ నొక్కదినము
లఘువుగానైన సా♦లగ్రామతీర్థము, ద్రావుట శిరమునఁ♦ దాల్చ నెఱుఁగ
తే. వేదశాస్త్రపురాణాది♦విద్య లవల, భార్య తనయులు బంధువుల్ ♦ పంటభూము
లను గృహంబులు ధనము నీ♦తనువు విడిచి,పోవ నొకనైనఁ దోడు రాఁ♦బోదు వెంట.
ఉత్సాహ. కదల మెదల శక్తిలేని ♦ గాఢమైన వార్ధకం
బొదలె నిప్పు డేమిసేతు ♦ నోపి కంతకంతకున్
ముదిమిచేత డస్సి కాలు♦పురము చాల చేరువై
కదియవచ్చుచున్న దింత ♦ కష్టదశకు మూలమై. 247
సీ. అయ్యయో నే నెంతు ♦ నరుగుచు నిఁక దారి, బత్తెమునకు వీస♦మెత్తు పుణ్య
మైనఁ జేయఁగ లేదు ♦ యమునియాజ్ఞను దూత,లరుదెంచి పటురోష ♦ మడర నీడ్చు
కొనిపోయి నన్నెట్టి♦ఘోరనరకములఁ,బడద్రోతు రేమేమి♦బాధ సంభ
వించునో యని విచా♦రించుచుఁ గడుమన,స్తాపాగ్నిచేఁ బరి♦తప్తుఁ డగుచుఁ
తే. బెదవులును గొంతు నెండగా♦మదికి నెంతొ,కలఁత మిక్కిలి యొదవఁగ♦నిలను మంచి
కర్మలను జేయనైతి దు♦ష్కర్మబుద్ధి, ననుచు నాలోచనము సేయ ♦ నతని కపుడు.
ఆ. ఒక్కగొప్ప తెలివి ♦ గ్రిక్కన నేర్పడి, పూర్వకాలమందుఁ ♦ బుణ్యలోక
సుఖము గలుగుమార్గ♦సులభత వ్యాసమ,హర్షి వలన శ్లోక♦మర్థమందు. 249
క. చెప్పఁబడె దాని విషయం, బిప్పుడు మది కంటఁదోఁచె ♦ నింతకు నది నే
నొప్పుగఁ జేసెద నా క,ముప్పున వేఱొంట మోక్ష♦మును గల దెందున్. 250
సీ. ధనము సంపాదింపఁ ♦ దలఁచి కాశ్మీరదే,శమున కొకప్పుడు ♦ చనఁగ నచట
బహుజనవిప్రులు ♦ భాగీరథజల,స్నానము నుదయాన ♦ సలిపి వేద
ములు షడంగములతోఁ ♦ బూర్తిగాఁ జదివిన;వారిని గంటిఁ ద♦త్తీరమందు
బ్రాహ్మణుఁ డొకఁడు పు♦రాణముఁ జెప్పుచుఁ, జదివినశ్లోకము♦సగము వింటిఁ
ఆ. గాన మదికి ప్పుడది తోఁచె ♦ దానిభావ, మేమనఁగ కల్యమున నరుఁ♦ డెవఁడు శీత
జలములను మాఘమునఁ దోఁగ♦సకలకలుష,ములు నశింపుచు నాతఁడు♦ముక్తుఁడౌను.

ఆ. అనుచు నీవిధమున ♦ మునువినిన పురాణ, మొకపరిమాణమయ్యె ♦ నటుల
దానిఁ జేయ నాకుఁ ♦ దగియున్న దని సువ్రతునకు నిశ్చయముగఁ ♦ దోఁప మదికి.

ఆ. ధైర్య మొందవ నర్మ♦దానదీజలమున, మంచి తెలివి దనర ♦ మాఘమందుఁ
దొమ్మిదిదినములును ♦ దోఁగినతదుపరి, దీనదశను శక్తి♦హీనుఁ డగుచు. 253

క. పదియవదినమున స్నానముఁ, బదిలముగాఁ జేసి యేటి♦పయి కరుగఁగ నా
పద చలిచే మిక్కుటమై, వదలెను ప్రాణమును వారిని ♦ వదరుచు మదిలోన్.

ఆ. అపుడు మేరుశైల♦మంతటి హేమవి,మాన మొకటి మాఘ♦మహిమవలన
రాఁగ సువ్రతుండు ♦ రయమున దానిపై, నెక్కి స్వర్గమునకు ♦ నేగుటయును.

ఆ. ఒక్క మనువుకాల ♦ మక్కడ నివసించి, భూమియందు మరల ♦ భూసురుఁడయి
జననమంది మాఘ♦మునఁ బ్రయాగస్నా,నములను జేయ ధాత్రీ♦నిలయమందు. 256

క. నిలిచి యొకప్రళయకాలము, సలలితముగ విప్రవంశ♦సంజాతుండై
యిల నవతరించి కాశిని, దలఁచుచు నచ్చోటి కరిగి ♦ తనరెడిమతియై. 257

క. తా నొనరించినమాఘ,స్నానప్రభావమున విశ్వ♦నాథునికరుణన్
మానుగ శివసాయుజ్యము, తానకమై పొందెఁ దనువు ♦ తప్పినపిదపన్. 258

సీ. సువ్రతుఁ డిటు మన♦శ్శుద్ధిని నర్మదా,జలమున మాఘమా♦సమునఁ జేయు
పదిరోజులస్నాన♦ఫలమున నొక మను,పర్యంత మింద్రుని♦పట్టణమున
నిలిచి బ్రాహ్మణజన్మ ♦ నిలను బుట్టి ప్రయాగ,మందున నొకమాఘ♦మందు మునిఁగి
బ్రహ్మసన్నిధి నొక♦ప్రళయము వసియించి, మంచివంశమున జ♦న్మించి మరల
ఆ. వ్రతము లాచరించి ♦ క్రతువుల నొనరించి, స్నానదానములను ♦ జరుపుచుండి
కాశిఁ జేరి కొంత♦కాలమునకు మృతి, నొంది శివుని పదవి ♦ జెందె నచట. 259

తే. ఈవిధంబున సువ్రతు♦వృత్తమెల్లఁ, బలికి రాజేంద్రుతో ముని♦వరుఁడు మాఘ
మహిమ దెలిపెనుమరలసం♦మ్మతముగదుర,వినుమనుచుసూతుఁడనియెనా♦మునులజూచి

తే. మాసములలోన నుత్తమ♦మాస మనఁగఁ, బరగు మాఘము దానిప్ర♦భావ మితర
మాసముల లేదు ప్రియమైన♦మాస మిదియె, పితరులకు దేవమునులకు♦ బృథివినాథ.

తే. దురితములు మాఘమాసము♦జొరఁగ భానుఁ,డుత్తరాయణమును బొందు♦చున్న వాఁడు
మాకు నాశనకరమగు ♦ మాస మొదవె, నింక నివసింప మేము నే♦వంకఁ గలదు.

క. చిరకాలం బతిసుఖముల, ధర నుండితి మిపుడు నెచట ♦ దాగెద మనుచున్
మొరబెట్టుచుండ నప్పుడు, కర మొప్పఁగ బ్రహ్మహత్యఁ ♦ గని కలుషములన్.

క. మిమ్ము నొడఁబాయకుండెద, సమ్మతితో భువినిఁ గలుగు♦జనులు తెలివిహీ
నమ్మున నీమాఘమునం, దిమ్మగఁ గల మహిమ లేమి ♦ నెఱుఁగరు మతియున్. 264

తే. చేతులను గాళ్ళఁ బలుకుల♦చేత నెపుడు మనము దుష్కర్మలందున ♦ మరగనీక
యొవఁడు నియమించునో నాతఁ♦ డిలను గలుగు,తీర్థఫలములఁ జెందును ♦ తీవ్రగతిని.

ఆ. మనము వాక్కు కర్మ మనుజుల కివి మూఁడు, కరణములుగ నెప్పు డుగలుగునివియు
నొకటఁ జేయ ముక్తి నొందవును లేనిప, క్షమున జలచరముల సాటి దవరి. 266

సీ. కామాదిదోషముల్ గలిగి దూష్యము నొందఁ, దగువారి నత్యాశ తనము నోర్వఁ
జాలనిమనములో సంచరించెడివారి, నాచారహీను లై నట్టివారి
నిలను దీర్ఘస్నాన ఫలములఁ జెందరే, నట్టివారికి వృద్ధి నలరు దేవా
మందుల వసియింత మను బ్రహ్మహత్యతో, సాపములనెని డి పరమధర్మ
తే. సూక్ష్మ మది గోప్యమై యొప్పెఁ జూడ నలవి, కానిచిలువలపదముల శరణిగుహను
గలుగు పరమాత్మవిధమునఁ గానఁబంటె, మీరహస్యము పెద్దల కెఱుక గలదు.

తే. అయిన నీమాఘమాసము నందుఁగలుగు, ధర్మసూక్ష్మములను చెల్పెదము వినుఁడని
పావములు బ్రహ్మహత్యతోఁ బగఱ దాని, విధము నిట్లని పలికె సంవిత్తరముగ.

సీ. జ్ఞాని యజ్ఞానుఁ డహంకారగలవాఁ డేమి, లేనివాఁడు వివేకహీనుఁ డధికుఁ
డును బాపకృత్యములను జేయువాఁడు చెడ్డనడవడిగలవాఁ డనగ నెవఁడు
మాఘమాసమున ప్రమాదవశమునైన, నాదిత్యుఁ డుదయించు నట్టివేళ
స్నానముఁ జేసిన జనులదేహములందు, మనకు ముమ్మాఁటికి నునికి కూడ
ఆ. దదియుఁగాక మాఘ మదయము గనుమల, మీఁదఁ బోవువాని పాదయుగము
జారి వరిచుడిగల జలములఁ దడసిన, స్నానఫలము గల దసంశయముగ. 269

ఆ. సక్రమముగ నెవఁడు సంకల్పవిధిని సు, స్నాతుఁ డైనవాఁడు స్వర్గమోక్ష
మందు నొకటి జెందు నందు విచారింప, వలసినట్టిపనులు నిలను గలవె.

క. సరియగు నియమముతోనో, మరియేవిధముననొ యెవఁడు మాఘస్నానం
బిరవుగఁ జేసిన వానికి, దురితములు దొలంగ ముక్తి దొరకొనుచుండున్. 270

ఆ మాఘముదయమందు మనుజుఁ డెవ్వండేని, స్నాన మాచరింపఁ దాను దన్ను
జంపుకొన్న దోష సంఘము నెల్ల న, శించి పుణ్యపదవిఁ జెందు నతఁడు. 271

ఆ. ఎన్న రాని పుణ్య మిచ్చెడిమాఘమా, సమున దేవగణము సలిలమందుఁ
దేజ మొకట నుంపఁ దేట పవిత్రిత, గలిగి జలము లడఁచుఁ గలుషములను.

సీ. మనసు నిర్మలమైన మనుజులకెల్ల మా, ఘస్నానమున నెట్టిగతి లభించు
నట్టియుత్తమగతి నాలమందునఁ బారి, పోక చచ్చినవారు పొందఁజాల
రని బ్రహ్మహత్యతో నఘములు మా కిఁక, భయము తప్ప దటంచుఁ బలుకుచుండె
నంతట మాఘము నాసన్న మగుటయు, నెఱఁగి పాపములన్ని పరుగులెత్తి
ఆ. నట్టిగొప్పమహిమ నలరెడిమాఘమా, సమునఁ బారుచున్న సజలనదిని
స్నాన మాచరింపఁ జను రోగబలహీను, లైనవారు గాక యన్యజనులు. 273

ఆ. బలము గలుగ నింట జలములస్నానము, వలన ఫలము లేదు బావినూరి
చెఱువులందు నెవఁడు చేసిన మధ్యస్థ, మైన పుణ్య మబ్బు నవనినాథ. 274

క. శీతజలస్నానముచేఁ, బాతకములు దొలఁగి మిగులఁ ◆ బరిశుద్ధుండౌ
నాతతమగు చలిచేఁ గల, భీతిని విడువంగవలయు ◆ ధీరము దనరన్. 275

ఆ. పెరుగు చిలికి దాన ◆ వెన్న; గానుగ నాడి, చెఱకుగడలలోని ◆ క్షీరములను
గన్నవగిది వెంత ◆ కష్టపెట్టిన దేహ, మంతఫలము గలుగు ◆ నతిని కనఘ! 276

ఉ. స్నానముఁ జేయఁగాఁ దగును ◆ చల్లనినీటను శీతబాధకై
పూనఁగరాదు గాచుకొనఁ ◆ బొల్పుగ మంట వరుల్ రచించినం
దాను జనంగఁగూడ దది ◆ తథ్యము బాలక వృద్ధ రోగులన్
మానుగ శీత మేగుటకు ◆ మంటవరిన్ నిలుపంగఁబోలు నే. 277

సీ. ఆబాలవృద్ధులు ◆ నాతురు లెవరైన, స్నానము చేయఁగాఁ ◆ జలి విశేష
మైన మంటను గాచ ◆ నగు నది వరులచే, గడ్డిపోచలచేతఁ ◆ గాల్పరాదు
అగ్గిసెగను వెన్ను ◆ వరకాళ్లు ముఖమును, ప్రక్కలు గాచుట ◆ పనికిరాదు
ఇదియుఁగాక నదులు ◆ మొదలగునవి లేని, యెడల కూపజలంబు ◆ లేని మనము
తే. చేఁది యొక కొత్తబానలోఁ ◆ జేర్చి మంత్ర, మూలముగ నెల్లదేవతా ◆ పూజ్యుఁడైన
పూషణుని గంగ కావేరి ◆ మొదలుగాఁగ, నదుల నావాహనముజేసి ◆ విదితముగను.

తే. అలఘుపావనమైన త◆జ్జలమువలన, స్నాన మెవ్వఁడు చేయునో ◆ సకలతీర్థ
సేవ మాఘమునందునఁ ◆ జేయుఫలము, జెందు నాతని కప్రుడె ని◆స్సంశయముగ.

క. తొలిదినసాయంకాలము, జలమును కూపమునఁ దీసి ◆ చక్కఁగ బయలన్
నిలిపిన భాండముతో నం,ముల వాయువు సోఁకి సకల◆దోషము లణఁగున్. 280

ఆ. అట్టినీటిచేత ◆ నరుణోదయము వేళ, స్నాన మాచరించు ◆ మానవునకు
నదియు మాఘమాస◆మందు గంగాస్నాన,మునకు సమము నగును ◆ మనుజులేశ! 281

తే. వహ్నినిఁ బుటము వేయుసు◆వర్ణమందు, మలినత యడంగువిధమున ◆ మాఘముదయ
కాలమున స్నాన మొనరింపఁ◆గలుషములను, దొరఁగి ముక్తిఁజేరు నై◆వరఁగునధిప.

సీ. అగ్నియందునఁ గాల్చు ◆ నట్టిశక్తి ధాత, మును పుంచిన విధ◆మున జలములఁ
బ్రాణికోటులనెల్లఁ ◆ బరిశుద్ధి నొనరించు, శక్తి నిలిపె ప్ర◆శస్తముగను
దివిజులందరు తమ◆తేజ మొక్కొక్కటి, మాఘమాసమునందు ◆ మహినిఁ గలుగు
సకలతీర్థములలోఁ ◆ జక్కఁగా నుందురు, పార్థుల కగ్నిలోఁ ◆ బడుటకంటె
తే. పారులకు గోవులకుఁ గాను ◆ ప్రాణములను, వదలుకంటెను శరణన్న ◆ వారిఁ బ్రోచు
కన్న మిక్కిలి ఫలము మా◆ఘమున నుదయ,మందుఁజేసిన స్నానమం◆దుఁ గలుగు.

క. చక్కెరను తిలలు మిళితము, చక్కఁబడఁజేసి విప్ర ◆ జనులకు నిరతం
బక్కఱతో మాఘమునన్, మక్కువతో నిడఁగవలయు ◆ మనుపక యెవరున్. 284

తే. మాఘమాసము కడపటు ◆ మహితవిప్ర,జనులకును షడ్రసముగ భో◆జనము చేత
దృప్తి జెందించువానికి ◆ నిలచు సకల, సౌఖ్యములుఁ బుత్రపుత్రికల్ ◆ జాలఁగలిగి,

చ. తనయులు పౌత్రు లెన్నఁదగు ♦ ధైర్యము దేహబలంబు తేజమున్
ఘనమగు కీర్తి పెంపు సుఖ♦గత్వము రూపము మంచివాక్యముల్
ధనపశుబంధుమిత్రులు స♦దా సుగుణంబులు గల్గి ప్రియమున్
దనరుచు సుందరాకృతిని ♦ దాల్చినభార్య లభించు నెంతయున్. 286

సీ. అభ్యంజనము కూడ♦నట్టిపదార్థముల్, దినుట స్త్రీసంగమ♦మును వదలుచుఁ
జండాలుతో ముట్టుసతి♦పతితులతోడ, వేదముల్ చదివి త♦ద్విధము నొసర
నడపక నిందించు ♦ నగ్నునితో మాట,లాడుట వ్యర్థము ♦ లైనవాక్య
ములును బల్కుటయు స♦భలయందు యోగ్యులు, గానివారలప్రసం♦గమును బూరు

తే. పల్కు లితరులగృహముల ♦ భక్షణమును, పరుల దూషణపరిహాస♦భాషణములు
నొకరినేరము లెన్నుట ♦ నొకరిపైనిఁ, గొండెములు సెప్ప నివి యేమి♦కూడ వనఘ!

క. పరులందునఁగల తప్పులు, పరికించుట గుణములందుఁ ♦ బాపములను నే
ర్పరచుట నోర్వఁగఁజాలమి. నొరుభార్యలఁ జెనుతలఁపున♦ నొగిఁజూచుటయున్.

ఆ. అన్యసతులయందు ♦ నాస దుఃఖించుట, నితరవిత్త మపహ♦రించుటయును
పరులమర్మములను ♦ బహిరంగపరచుట, కలుషజనుల మదిని ♦ దలఁచుచుంట. 289

తే. గోవులను విప్రజనముల ♦ దేవతలను, నిందసేయుట లివి మాని ♦ నియమములను
మౌనమున నుండి వ్రతముల ♦ నూని యిష్ట,దేవతలఁ దొల్త ధ్యానించి♦ధీరమతిని. 290

సీ. అజుఁ డచ్యుతుఁడు శివుఁ ♦ డగ్ని చంద్రుఁడు భానుఁ, డంబిక విఘ్నేశుఁ♦డైనదేవ
తలను ధ్యానించి సం♦తతబ్రహ్మచారియై. కోపము విడిచి స♦ద్గోష్ఠిఁ దగిలి
ప్రతిదినంబును వేద♦పఠనము నింద్రియ,జయము సత్యప్రతి♦జ్ఞను జరుపుచు
తల్లిదండ్రులసేవ ♦ తప్పక సలుపుచు, గురువులపూజ న♦క్కారను జేయు

తే. మంచియాచారమునఁ బ్రవ♦ర్తించి తపము,వలని క్లేశమునకు నోర్పు♦ గలిగి మూఁడు
కాలముల దేవతార్చన ♦ గడుపుచుండు,వానితో బ్రాహ్మణక్షత్త్రి♦వైశ్యులైన.

ఆ. మరియు శూద్రులైన ♦ మాఘమాసస్నాన, మాచరింప హరిహ♦రాబ్జనాభు
లకును బూజ్యుఁ డగుచుఁ ♦ బ్రళయమునంతటి,కలకు నిలుచు వార♦పురములందు.

సీ. వ్యాధిచేఁబీడితుఁ ♦ డగుచు మాఘస్నాన,మున కపేక్షించిన♦మనుజుఁ డొరుని
తనకుఁగా నియమించి ♦ తగనటు లొనరించు, బ్రాహ్మణునకు నత♦భక్తితోడ
గట్టఁ బైకి నాల్గు♦గట్టి బట్టలుగప్ప, దుప్పటి కాళ్లకు ♦ చెప్పులజత
ఛత్రిపాత్రి లొసంగి♦ స్నానము జేసిన,దినముల నింట భో♦జనము నిడఁగ

ఆ. వలయు వివిధశాక♦ములు నెయ్యి బెల్లము, తేనె గలిసినట్టి♦ తీపిభక్ష్య
ములను పాలు పెరుగు♦ఫలములు శాల్యన్న,ములను దృప్తినొసఁగ♦వలయుమరియు.

క. తనకై మాఘస్నానము, ననుకూలతగాఁగఁ జేయు♦నావిప్రునిభో
జనతృప్తుని జేయుచు నా,తని కీవలె నింటిఖర్చు ♦ ధాన్యము కొంతన్. 294

సీ. ఎవఁడు మాఘస్నాన ♦ మెవనికిఁగాఁ జేయు, నతఁడు ముందుగ స్నాన♦మాచరించి
తననిత్యకృత్యము♦లను దీర్చుకొని తాను,నియమింపఁబడినవా♦నికిని గాను

సంకల్పమును గోత్రసహిత మాతని పేరు, చెప్పి తలంచుమం జిత్తమందు
మంత్రము చేత నమ్మదిగ స్నానము జేసి, దేవతాప్రార్థన తీర్థములను
తే. విడప నావాహనము జేసి సదలమతిం, దనర స్నానము చేయంగా దగును మాఘ
మాస మొకశిల నిటుల నేమరక చేయు,చుండి యాతనిగృహమందు నుండవలయు.

క. వ్రతమంత సైన కడవటు, వ్రతమును జేయించినట్టి వానికిం గాం ద
ద్వ్రతఫలమును సంకల్పస,హితముగం దాం ధార విడువ నెంతయు నొప్పున్.

ఆ. ధారగొన్న ఫలముం దాను గ్రహింపును, బ్రాహ్మణునకు మరల వసనములను
దూడగలుగు సాదు పాడి మొదవును ద,క్షిణల నిచ్చి యింటి కనుపవలయు. 297

ఆ. ఇటుల నెవనివలన నెవ్వండు నీమాఘ, ఫలము వడయు నతండు పలువిధములం
దాను జేయు స్నానదానపుణ్యముకంటె, నధికఫలముం జెందు నవనినాథ! 298

సీ. అల రహస్యము శ్రేష్ఠమైన మాఘస్నాన,మహిమను వినుపింతు మరల వినుము
బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు సుకృతను,ష్ఠితములు చేసిన నెవరు మాఘ
మాసోపవాసంపు నుహితనియమమూని, యింద్రియ నిగ్రహం బెలమిం బూని
వ్రతములం గలిగిన శ్రమ కోర్చి మౌనియై, హరిని ధ్యానింపుచు ననవరతము
తే. విషయములయందు నాసక్తి విడిచి తిలల, శయనహోమము దానభక్షణము దేవ
తార్చన త్రికాలములం బవిత్రములు వ్రేల,గలుగ దర్భాసనము శయ్యగా వహించి.

క. ఇరుప్రొద్దు వైశ్వదేవము, నిరువుగ యజ్ఞములు నైమ నిష్టాపూర్తిన్
దొరకొని మాఘస్నానము, జరుపుచు మాసాంతమందు సంతస మొదవన్. 300

సీ. పాడియావు నొసంగి బ్రాహ్మణునకు రాజ,నముల బియ్యము వంటకము నమర్చి
సరసపదార్థముల్ సమకూర్చి విప్రుల,కును దృప్తిగనర భోజనము బెట్టి
దక్షిణఫలములు తాంబూలముల నిచ్చి, సకలజీవులయందు సమత నొప్పి
బ్రాహ్మణాశీర్వాదవచనముల్ గైకొని, బంధుజనులం గూడి పారణమును
తే. జరుప పరమేష్ఠి కేశవశంకరేంద్ర,లోకములు నాలుగంటను జోక దనర
వయసు నొక్కొక్కచో నతం డిరువదైదు,కల్పములు నివసించును తథ్యమెంచ.

ఉ. మానవుం డెల్లభంగులను మాఘమునం దరుణోదయంబునన్
స్నానము జేసి కర్మలకు సాక్షి మహోజ్జ్వలుండైన భాస్కరున్
జ్ఞాన మొసంగి లోపలను గల్గినకల్మషమున్ హరింప లో
నూనినవాండ నీవుం గడు నొప్పుగ నర్ఘ్యము లిత్తుం గావునన్. 302

క. ఏ నొనరించెడిమాఘ,స్నానఫల మొసంగు మనెడి సన్మంత్రమునన్
భానునకును నర్ఘ్యం బిడి, స్నానము జేసినతమపరి సమ్మద మొదవన్. 303

ఆ. ధ్యాన మొనరం జేసి మానసమున రాత్రి,పూట నిదురచేతం బొలిసినటులం
బరవశతను బొంది పడియున్న వానికిం, చెలివిని మేలుకువను గలుగం జేసి.

క. తనపనులకైన ప్రేరే,పణ జేసెడిసూర! నీకుం బ్రణతులు గావిం
తు ననెడిమంత్రము జెప్పుచు, మునుపటివలె మరల స్నానమును జేసి తగన్. 305

సీ. తీర్థములందు న◆దీనదములు మడు,గులును పుణ్యస్థల◆ములును నీవ
పాతకహారుఁడవు ◆ జ్యోతిస్స్వరూపుఁడ, వానందభరితుఁడ ◆ వవ్యయుఁడవు
జనులనిద్దుర బాపి ◆ జాగర్య నిడువాఁడ, వెల్లలోకములకుఁ ◆ దల్లిదండ్రి
వివి మొదల్ తుదమధ్య◆మును నీవు నగువాఁడ, వేదత్రయమునకు◆నాద్యుఁడ వగు
తే. నీకుఁ జేసెద ప్రణతు ల◆నేకములుగ, మత్కృతంబగు నీమాఘ◆మాసమందు
స్నానమునకుఁ దగుఫల మెం◆సంగు మనెడి,మంత్రముచ్చారణము జేసి◆మానవుండు.

ఆ. ఉదయమప్పుఁ డెగ్వఁ ◆ దూరిబహిర్జల,మందు దోఁగ మాఘ◆మందు సూర్య
బింబమందుఁ జొచ్చి ◆ భేదించుకొని విష్ణు,పదవి నొందు నతఁడు ◆ పార్థివేంద్ర.

క. కోరికల నెల్ల నొసఁగెడి,కారణమున మాఘమహిమ ◆ ఘన మేనెలకున్
గాకాదు తద్విధంబును, భూరమణా! వింటికాదె ◆ బుద్ధిం దెలియన్. 308

క. ఏకాదశులన్ మాఘుని, తైకాదశి శ్రేష్ఠతమము◆నై యొప్పెడు నీ
లోకమున దదుత్కృష్టత, బ్రాకటముగఁ దెల్పవాఁడ ◆ రక్తిన్ వినుమా.

క. అని యిటుల దిలీపునితో, మునిపుంగవుఁ డనినవిధము ◆ మునుకొని సూతుం
డనె శౌనకాదిమునులను, గనుఁగొని తత్కథను దెలియఁ ◆ గంజదళాక్షా! 310

## ఆశ్వాసాంతము

మ. విరజాతీరవిహార హారగిపువ్రా◆ద్భేత్త్రార తారక్షమా
ధరసంకాశ సుధీర ధీరజనవ్రా◆త్కాసార సారంగమా
ధరణీవ్రాత్కజనూర సూరశశినే◆త్రా శూర శూరక్షమా
వరసంతానవిదార దారదధరా◆భా వీర వీరక్రమా!

మాలిని. ఖరకరశశినేత్రా! ◆ కంజసద్మాకళత్రా!
నిరుపమశుభగాత్రా! ◆ నిర్జితానంతపుత్రా!
సురరిపుకులజైత్రా! ◆ సూరహృత్పద్మమిత్రా!
సరసగుణపవిత్రా! ◆ సన్మునిస్తోత్రపాత్రా!

## గద్యము

ఇది శ్రీ బాలగోపాలకృష్ణవరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్యగోత్రపవిత్ర
శ్రీమ దబ్బరాజవంశపయఃపారావారరాకాకైరవమిత్ర [illegible]శా
నృసింహామాత్యమణిపుత్ర సూరిజనవిధేయ శేషాచలశర్మనామధేయ
ప్రణీతంబైన శ్రీమత్పాద్మపురాణమునందలి మాఘమాహా
త్మ్యమునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# మాఘమాహాత్మ్యము.

[ శేషాచలకవీయము. ]

## పంచమాశ్వాసము.



రత్నాకరధామా!
ధీరత్నాభినుతనామ! ♦ దితిజవిరామా!
నీరజనేత్రాకామా!
నారాయణనామ! కంధి♦నందినికామా! 1

వ. అవధరింపుము సకలసద్గుణసంపత్పరిపూర్ణులయిన శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియె; నట్లు హరివాసరప్రభావంబు దెలుపువాఁడైన వశిష్ఠమహామునీంద్రుండు కువలయపతియగు దిలీపరాజేంద్రుం గనుంగొని. 2

సీ. గతకాలమున పాండు♦సుతులలో రెండవ,వాఁడు నగు భీమ♦సేనుఁడు తన
స్వపురోహితుని ధౌమ్య ♦ బ్రాహ్మణోత్తమునితో, నేకాదశిని భువి♦నెల్లజనులు
నుపవాస ముండెద ♦ రుచితకార్యములచేఁ, బటిబాలు రైనను ♦ బాలు ద్రావ
రదిగాన నీవరు ♦ లందఱు నను జూచి, హరివాసరము గాఁదు ♦ వన్నము దిను
తే. తిండిపోతటంచు ♦ మెండుగా దూషణ, చేతు రెపుడు దుస్స♦సేనుఁడాది
కౌరవులును మిగులఁ ♦ గాఱులు బల్కుదు, రదియుఁగాక నాకు ♦ నాదివమున. 3

ఆ. జాలఁ బ్రజ్వరిల్లు ♦ జఠరానలము దాని, కోర్వలేక జిహ్వ ♦ యుదర మేను
గట్టివేసి కొన్ని ♦ కాయలు దుంపలు, తెలికపిండి పండ్లు ♦ దినుటగాక. 4

ఆ. పెరుగు పాలు నెయ్యి ♦ పేలపిండినిఁ జేర్చి, తినుచుఁ గొంతవరకుఁ ♦ దీర్చుచుంట
జాక లిపుడు నాకు ♦ వాపోవుచుండును, విష్ణువాసరమున♦విమలచరిత! 5

తే. ఎల్లయేకాదశుల ఫల♦మియ్యఁదనరి,నట్టి హరివాసరము దాని ♦ కైన నియ
ములను భుజియింపఁదగు వస్తు♦వులను దీని,విధము దెలుపంగదయ్య స♦విస్తరముగ.

క. అని యడుగ భీమసేనుని, గని ధౌమ్యుం డనియె నపుడు ♦ కడుభుజబలమున్
దనరిన వాయుతనూభవ! ♦ విను మీఁకఁ దత్క్రమము దెలియ♦ వినుపింతు దగన్.

క. హరివాసరముల నన్నిఁటి, కిరవొందఁగ మాఘమున సి♦తైకాదశియే
పరఁగఁగ వైతారణమునఁ, గర మరుదుగ హరికిఁ బ్రీతి♦కర మగు నదియున్. 8

క. అది పుష్యమింనక్షత్రము, గదియు నొకవిశేష పుణ్య◆కారణ మదియున్
గదిసినను లేక యుండిన, బదపడి తిద్వాసరం బు◆పవాసము నొప్పున్. 9

సీ. ఇపు డేను దెల్పెద ◆ నేకాదశిని శాస్త్ర,సమ్మత మగునట్లు ◆ జరుపునతఁడు
నిరుపదివాఁడగు ◆ నేకాదశుల నుప,వాసము జేసిన◆ఫలము నొందు
నందుకు సందేహ ◆ మనఁగరా దీహరి, వాసరమున నుప◆వాస మొనరఁ
జేసిన పాపముల్ ◆ చెడు చెడ్డ రాజును. వానిరాజ్యము నెట్లు ◆ వదలిపోవు
ఆ. నటుల నదియుఁ గాక ◆ నర్యముఁడు తుషార, మడఁచినట్లు దురిత◆హరత నొందు
చాను జేయునట్లు◆నర్మవివయములఁ, జెప్పికొనుట నది న◆శించుపగిది. 10

తే. బ్రాహ్మణాభావశ్రాద్ధము ◆ భయములేని,బాలురును కాపులేనట్టి◆పసులు కోప
మునఁ దపంబు సదాచార◆మును విడిచిన, వంశ మభివృద్ధిలేనిద్ర◆వ్యము విధమున. 11

చ. చదువనిబ్రహ్మవిద్య చెడు◆చాన గృహస్థుఁడునయ్యు వేదమున్
వదలినబ్రాహ్మణుండు విభుఁ ◆ బాసినయాఁడుది భార్యలేమి చిం
తఁ దనరువానిమాడ్కి దురి◆తంబు లడంగును మాఘమందునన్
బదపడి శుక్లపక్షమున ◆ భాసిలు శ్రీహరివాసరంబునన్. 12

ఆ. పరధనాపహరణ ◆ గురుసతీసంగమ, బ్రహ్మహత్యమద్య◆పానము, లివి
గాంచు పాపిచెలిమి, ◆ పంచమహాపాత,కంబు లనఁగఁబడు జ◆గంబునందు. 13

ఆ. మూఁడు పుష్కరములు ◆ మొనసి గంగాస్నాన, మాచరింపఁబోలఁగ ◆ నవ్వియైదు
మరియు శుభము లొసగు ◆ మాఘశుద్ధైకాద,శిని సభక్తి నుప◆వసించుకతన. 14

సీ. నర్మద కావేరి ◆ నైమిశారణ్యము, గంగ కురుక్షేత్ర◆గయప్రయాగ
యమున వేదిక మొద◆లైన తీర్థములును, క్షేత్రము లేకాద◆శికిని సమము
గానేరవు తపంబు ◆ దానహోమములాది,కార్యము లెల్ల నే◆కాదశివలె
దోషపుంజములను ◆ దొలఁగింపఁ గాఁజాల, వొక హరివాసర ◆ ముపవసింప
తే. కలుషములు నెల్లఁ బాయు నే◆కాదశిఫల, మొక్కదిక్కునభూదాన◆మొకవయిపున
నుంచి తూచిన మొగ్గ గ◆న్పించు నందు, నొక్కయేకాదశీఫలం◆బుండు దిశను. 15

సీ. ఏకాదశీవ్రత◆ మొనరఁజేసెడునట్టి.పూరుషుఁ డొకపూట ◆ భోజనంబు
దశమినిఁ జేయుచుఁ ◆ దనభార్యతో నైనఁ, గలయకుండఁగ రాత్రి ◆ గడపి పిదప
హరివాసరస్నాన ◆ మటు జేసి సంధ్యాది,సత్క్రియ లన్నియుఁ◆ జక్కఁజేసి
ఔపాసనము బ్రహ్మ◆యజ్ఞము గావించి, యుపవాస మొనరింప ◆ నుత్సహించి
తే. అచ్యుతానంత కేశవ ◆ హరి ముకుంద, పుండరీకాక్ష మాధవ ◆ పురుషవర్య
యీదినంబున నాహార ◆ మేమిలేక, రేపు పారణసేతు సం◆ప్రీతి దనర. 16

ఆ. మఱపువలన దేహ◆మాంద్యముచేత నే, నాచరింపఁదలఁచి◆నట్టివ్రతము
నీయనుగ్రహమున ◆ నెరవేరునను నర్థ,మునఁ దనరెడుమంత్ర◆మును జపించి. 17

సీ. శాస్త్రసమ్మతమగు ◆ సంకల్ప మొనరించి, పోత్రిరూపంబును ◆ బూను ధరించి
నట్టి శ్రీకృష్ణుని ◆ హాటకమునఁ జేసి, యిల గోమయంబున ◆ నలికి శుద్ధి
పరచిన యొకమంట ◆ పము నాలువాకిళ్లు, గలుగ నిర్మించి ము ◆ గ్గులను దీర్చి
నలుదిక్కులను బుష్ప ◆ ములను శృంగారించి, జలకలశము నుంచి ◆ సకలవిధము
తే. లైన శుభలక్షణములచే ◆ నతిశయించు, మేలుకట్లును ముత్యాల ◆ పూలదండ
లమరఁ జుట్టిన మండప ◆ మందు ఛత్రి, చామరలు ధాన్యదర్పణ ◆ సమితి నునిచి. 18

ఆ. ధవళవస్త్ర మొకటి ◆ ధాన్యము నిండారఁ, బఱచి జలకలశము ◆ పైని శ్వేత
వసన మొనరఁ గప్పి ◆ బాగుగ నది ధాన్య, రాశిమీఁదియంబ ◆ రమున నుంచి. 19

వ. ఆకలశముపైని శ్రీభూపతులఁ గూడినవాఁడైన శ్రీవిష్ణుదేవుని నిలిపి యందుల కష్ట
దిక్కులయందును దూర్పు మొదలుకొని యవలు, ఎఱ్ఱవడ్లు, నువ్వులు, మినుములు,
పెసలు, గోధుమలు, రాజనములు, చామలు ఈధాన్యముల నొక్కొక్కటి నాలుగు
తూములచొప్పున క్రమముగా రాసులు పోయించి. 20

తే. అంత మధ్యాహ్నకాలము ◆ నందు మరల, స్నానసంధ్యాదికృత్యముల్ ◆ సలిపి వైశ్వ
దేవ మొనరించి పిమ్మట ◆ దేవపూజ, కైన తులసిని బుష్పము ◆ లమర దెచ్చి. 21

సీ. పూజార్హమగు ద్రవ్యం ◆ బులు సాధనములతోఁ, దగినవి సమకూర్చి ◆ పగలు నిదుర
పలుమాఱు దాగుట ◆ పండ్లు దంపలు వేల్లు, దినకి తాంబూలచ ◆ ర్వణము మాని
తగ నొకవేళ నిం ◆ త్యము సేయుకర్మకు, శక్తిహీనంబైన ◆ జలము వచ్చి
పాలు నే యొకగింజ ◆ ఫలమును భక్షించి, ప్రాణముల్ శోషింప ◆ వలయుఁ గాని
ఆ. అగ్నితప్తమగు పంచ ◆ దార్ధము లెవ్వియుఁ, బుచ్చుకొనుట తగదు ◆ ప్రొద్దు గ్రుంకు
సమయమందు నతఁడు ◆ సంధ్యాదికృత్యముల్, సలిపి మండపమున ◆ కలశమునకు.

క. ఘనముగ నాలుగుదిశలను, పనివడి దీపముల నిలిపి ◆ ప్రాణాయామం
బును సంకల్పము జేయుచు, విను మున్నొనరిచిన కృష్ణ ◆ విగ్రహమునకున్. 23

సీ. ప్రాణప్రతిష్ఠ మం ◆ త్రములచేఁ గావించి, కలశముమీఁద వి ◆ గ్రహము నునిచి
ధ్యానార్చనము జేసి ◆ యావాహనాదిదీ, పాంతముకల్లకైన ◆ పదియు నాఱు
నుపచారములఁ బూజ ◆ లొనరించి తదుపరి, పదములు కటి నాభి ◆ యుదరహస్త
ములు మెడ మోము నొ ◆ సలు శిరమును గేశ,ము లగు దశస్థాన ◆ ములను హరిని
తే. మత్స్యకచ్ఛపసూకర ◆ మనుజసింహ, వామనపరశురామశ్రీ ◆ రామరామ
బౌద్ధకల్క్యవతారముల్ ◆ పదియుఁ జెప్పి, క్రమమొక్క పూజింపవలయు స ◆ మ్మోదమలర.

సీ. అర్చించి వాసుదే ◆ వాదినామములతోఁ, దను దనయంతరా ◆ త్మను గ్రహించి
పరమాత్మకుని భగ ◆ వంతుని జీవాత్మఁ, డైన ప్రాణునినిం ◆ చ్చయము నెఱిఁగి
కలశమునకు నాలుం ◆ కపలఁ గ్రమంబుగా, నావాహనము జేసి ◆ యవల ధూప
దీపనివేదనల్ ◆ దిరముగాఁ గావించి, పరిమళద్రవ్యముల్ ◆ బరగఁ గూర్చి
తే. నట్టి తాంబూల మర్పించి ◆ యంబరములు, పుష్పమాలికలు సువర్ణ ◆ భూషణములు
కృష్ణునకు నర్పణము జేసి ◆ కేశవాది, ద్వాదశాఖ్యలచేఁ బూజ ◆ దగ నొనర్చి. 25

క. పిమ్మటను హరిస్తోత్రము, సమ్మతి దనరంగఁ బురాణశ్రవణము చేతన్
ఇమ్మయిన పుణ్యకథలను, నిమ్మళముగ గడపిఁ రాత్రి నిదుర గనకయే. 26

తే. ఇనుఁడు నుదయింప నూరిబహిర్జలమున, స్నానసంధ్యాదిసత్క్రియల్ జరిపి దేవ
తార్చనము వైశ్వదేవము దగ నొనర్చి, కలశమునకును బునఃపూజ గలుగఁజేసి. 27

క. తనకలిమికొలఁది నారా,ధన భగవంతునకుఁ జేసి దార్ఢ్యముకొలఁదిన్
వ్రతము లొనరించి గురువున,కును బూజలు జేసి మిగులఁ గోరిక లొదవన్. 28

చ. కలశము దానిచుట్టు పయిఁ గప్పినచేలము కాంచనంబుచే
నలరెడుకృష్ణవిగ్రహము నందున నింపినధాన్యరాసులు
న్గలశముక్రిందిగింజలును నల్లెసలంగల పూర్ణకుంభముల్
గలుగువిశిష్టవస్తువులు గ్రమ్మినభక్తిని దాన మియ్యఁగా
వలయు సదక్షిణంబుగను బాపనికిం దమిదీర పావన! 29

ఆ. దాన మిచ్చి పిదప ద్వాదశిపారణ, జేయువలయునంచుఁ జెప్పుచుండు
రిట్టినియతమైన యేకాదశీవ్రత, మనఘ! దీని పెద్ద లైనవారు. 30

తే. ఇటుల నేకాదశీవ్రత మెవ్వరేని, జేయ నాతనికలుషముల్ పెకలు భాను
డుదయమగుచుండఁ జీకటు లుజ్జగించి, పాయువిధమునఁ గాన నో పాండుతనయ!

క. నీకిపుడు నేను దెలిపిన, నేకాదశివ్రతము నాచరింపుము పదిరెం
డేకాదశులఫలంబును, దాకొని నిను బొందు ననుచు ధౌమ్యుఁడు బలుకన్. 32

క. విని భీమసేనుఁ డాతని, వనజసమానపదములకు వందనములు స
ద్వినయమునఁ జేసి నే న,ట్లొనరించెద ననుచు మానసోల్లాసుండై 33

ఆ. అంత మాఘశుక్లమందు నేకాదశి, చేరఁగ ధౌమ్యుఁ డధికశుభము దనరఁ
జెప్పినటుల భీమసేనుఁడు నానాఁటి, యుదయ మగుడు వేగ నిదుర లేచి. 34

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానములను దీర్చి, ధౌమ్యుండు దెల్పువిధమున నతని
శక్తికి దగినపూజలు జేసి ఫలముల,తో విల్వదళముల తోఁట కనిపి
ఘనమైన కొబ్బరికాయలు నొకలక్ష, కదళీఫలములలక్ష లవి రెండు
పనసపండ్లొక వెయ్యి పదివేలనామాల,చెఱకులు తెప్పించి శ్రీహరికిని

ఆ. అరగింపుజేసి యవి ఫలాహారము, జేయఁ దృప్తిలేక చిచ్చుమంట
పగిది గర్భమందు బడబాగ్నివలె మండు,నంత పాత్రిద్దు గుర్రంకునవసరమున. 35

సీ. నిత్యకృత్యములను నెరవేర్చి దేవతా,పూజనమస్కారములు నుతులును
జాములు నాల్గింట జాగరణము జేసి, మఱుదివ ముదయాన మఱల స్నాన
మొనరించి సంధ్యాదివనుల నిర్వర్తించి, దేవతారాధన దీర్చి విప్ర
జనులకు పూజ దక్షిణలతో దానము, లిచ్చి భోజనము జేయించి పిదప

తే. కొండవలె రాశిపోసిన కూడు దాని, కొంచరు తినుబండములను పారణము దృప్తిఁ
జేసెఁగాన భీమైకాదశి యనుపేరఁ, బరగె నప్పటినుండియుఁ బార్థివేంద్ర!

ఆ. అన్ని నెలలకంటె • నధికమునగు మాఘ, మాఘమందు నినుఁడు మకరరాశి
పొంద సకలదేశ•ములు పవిత్రములగుఁ, గాలమునకు శుభము గలుగుచుండు. 37

తే. జలము లన్నియుఁ బాపసం•చయము లడఁచు, దానముల నీయు మనుజులు • దగినవార
లయ్యెదరు సర్వవస్తువు•లందు దాన,ములకు నర్హము లగుచుండు • భూవరేణ్య!

వ. యాగములయం దశ్వమేధమును, బర్వతములలో హిమవన్నగంబును, వ్రతములలో సత్యవ్రతమును, దానములలో నభయమును, దపములలోఁ బ్రాణాయామమును, మంత్రములలోఁ బ్రణవమును, ధర్మములలోపల నహింసయు, స్త్రీలలో లక్ష్మీదేవియు, విద్యలలో బ్రహ్మవిద్యయు, ఛందస్సులలో గాయత్రియు, శివభక్తులలో నారాయణఋషియు, విష్ణుభక్తులలో శివుఁడును, గోవులలోఁ గామధేనువును, పాత్రలలో నాహితాగ్నియు, నెట్లు విశేషించినవారో యట్లు మాఘస్నానము విశేషించినదై యున్నదని మఱియు నిట్లనియె. 39

ఆ. గరుడపక్షిఁ జూడఁ • గాకోదరములకు, గరళమును నశించు • కరణి మాఘ
మాసమందుఁ గలుగు•మహిమవలన పాప,ములకుఁ గళలు దప్పి • తొలఁగు ననఘ!

తే. కామితము లనుతాళ్ళచేఁ • గట్టఁబడిన, వారికిని భీదజనులకుఁ • బాపులకును
దుష్టచేష్టలఁ దిరిగెడి • కష్టులకును, మాఘమాసమె గతి యగు • మానవేంద్ర! 41

తే. చంద్రుఁడులేని రాత్రి • జలజసఖుఁడు, లేని దివసము జలములు•లేని కొలను
క్షీరములులేని గోవును • శిశువుల గన, నట్టి స్త్రీ దక్షిణలులేని • యాగములును

ఆ. తల్లిలేనియట్టి • పిల్ల ప్రాణరహిత, మైన తనువు విద్య•లేని విప్ర
వరుఁడు ధనములేని • వైశ్యుఁడును బ్రకాశ, మాన మొంద రెపుడు•మానవేంద్ర!

సీ. అటువలె మాఘము•నందు నెవ్వండేని, స్నానము నుదయాన • మానెనేని
చచ్చినవారితో • సమమగు నెంత, నేశ్వరియైనఁ దెలియని•వానిఁ బోలు
నఘునివలె నుండు • నంబకములు గల్గి, జ్ఞానవంతుఁడు మూర్ఖుఁ • డౌను వేద
శాస్త్రములను విన్న• సరసుఁడు మూర్ఖుఁడౌ, మూఁడునాళులు నొంటి•పూఁట పగలు

ఆ. నటుల రాత్రివేళ • నన్నిదినంబులు, భోజనంబు జేసి • భుక్తికొఱకు
నొరుల నడుగఁబోక • దొరకినవఱకు నా, హారమును ద్రిరాత్రు•లందు జరిపి. 44

తే. మూఁడుదినములు నుపవాస•ముగ వ్రతంబు, జరిపి పండ్రెండునాళులు• శక్తికిఁ దగు
నటులఁ బనుమూఁడవదినము•నందు దాన,ములను గావించి భుజియింప•వలయు ననఘ!

ఆ. మహిమచేతఁ దనరు • మాఘమాసమునందు, వ్రతము నిటులఁ జేయు•నతఁడు సకల
కలుషరహితుఁ డగుచుఁ • గల్పపర్యంతము, బ్రహ్మలోక మొందుఁ • బార్థివేంద్ర!

తే. అశుభకర్మలచే గ్రస్తు•లైనవారు, నరకమునఁ బాపములచేతఁ • బొరలువారు
జన్మ లనుసాగరమునకుఁ • జనెడువారి, కరయ మాఘమె తారక • మవనినాథ! 47

ఉ. మానవుఁ డెవ్వఁడేనియును • మాఘమునందునఁ గామహీనుఁడై
స్నానము జేయుఁ గల్యమున • సృష్టనివాసము జేయుచుండఁగా

జ్ఞానులు పుణ్యవంతు లని◆శం బొనరించెడి యాత్రికంబునన్
మానుగ బ్రహ్మలోకమున ◆ మాన్యు లటంచును జెప్ప నేటికిన్. 48

సీ. మాఘమాసమునందు ◆ మడుఁగులు జెలువులు, గుంటలు వాఁగులు ◆ గొప్పకొలను
లమితాపగలు జేరు ◆ నంబుధిజలములు, మనుజులస ప్తజ◆న్మముల పాప
ముల నశింపఁగఁజేయఁ ◆ గల వన్నిలోకము, లందు నెక్కుడు బ్రహ్మ◆మందిరంబు
నగునట్లు మాసమ్ము ◆ లన్నింటిలో మాఘ, మాస ము త్తమమగు ◆ మకరరాశిఁ
తే. బొఁదియుండఁగ భానుఁడిం◆పొంద నరుఁడు, చల్లనగు నూరివెలుపలి ◆ జలమునందు
రామహరశంకరాచ్యుత◆నామములను, స్నాన మొనరింపఁ బొందును ◆ స్వర్గపదవి.

సీ. మాఘమందునఁగల ◆ మహిమ యిట్టిదియని, వర్ణింప శక్య మె◆వ్వరికిఁ గాదు
అమాస నంతేయు ◆ నందు వచ్చెడుకృష్ణ, పక్షచతుర్దశి ◆ పలువిధముల
శివునకుఁ బ్రియమైన ◆ శివరాత్రి యనునది, దురితము లన్నియుఁ ◆ దొలఁగఁజేయు
నొకకారణంబున ◆ నొకబోయవానికిఁ, గైలాసమింపొందఁ ◆ గలుగఁజేసె
తే. నన్నివ్రతములలో శ్రేష్ఠమైన వ్రతము, శివునిసాయుజ్యపదవిని ◆ జెందఁజేయు
నట్టి శివరాత్రిమహిమ నీ◆కనుగుణముగఁ, దెలిపెదను విను రాజేంద్ర! తేటపడఁగ.

తే. మాఘఫాల్గునములు రెంటి◆మధ్యఁగృష్ణ, పక్షమందు జతుర్దశి ◆ పరగ శంక
రునకుఁ బ్రియమైన శివరాత్రి, యనఁగ నెల్ల, పాపముల నాశనము సేయు◆పార్థివేంద్ర!

క. శ్రీసాంబరాత్రిదినమున, శ్రీసాంబుని బిల్వపత్రి◆చేఁ దగుపూజల్
వానిగ నుపవాసమునన్, జేసిన శివపదవి నతఁడు ◆ చెందు నరేంద్రా! 52

తే. అట్టిఫలమును శివరాత్రి◆యందు దాన, మాదివిషయములను జెంద◆నలవిగాదు
ఇది రహస్యము ఖలులకు ◆ దెలుపఁజేయఁ, దగదు నీమది నిలుపుము ◆ ధరణినాథ! 53

సీ. గిరులందు మేరువు ◆ నరులందు విప్రుండు, గోవులలోఁ గపి◆లావు తేజ
ములయందు రవి మంత్రి◆ములలోన గాయత్రి, రసములలో సుధా◆రసము పురుషు
లందు శ్రీహరి సతు◆లందు నరుంధతి, ను త్తము లనఁ జాల ◆ నొప్పుచుండు
రటువలె వ్రతముల◆నన్నిఁటిలో శివ,రాత్రి యెక్కువ కదు◆రమ్య మయ్యెఁ
తే. గాన శివరాత్రివ్రత మగ్ని◆కణము లగుచు, శివుఁ డనెడుగాలిచే నతి◆శీఘ్రముగను
నెండియెండనికట్టెల ◆ కీడువచ్చు, పాపములఁ గాల్చు మొదలంట ◆ భస్మముగను.

తే. రక్తసలిలము పొలసు బు◆రదను గలసి, నట్టి వైతరణీనది ◆ హరునకుఁ బ్రియ
మైన శివరాత్రిదీక్షచే ◆ నలరువారి, కగుపడును బాలు పరమాన్న◆మగు విధమున.

## శివరాత్రిమాహాత్మ్యము

ఆ. భువిని బూర్వకాల◆మున శాకలము పేరఁ, బరగుచుండు నొక్క ◆ పురము నందు
నంకిలుఁడను నామ ◆ మలరెడుబోయవాఁ, డొకఁడు గాపురముగ ◆ నుండె; నతఁడు.

సీ. తా నివసించుప◆త్తనసమీపమునందుఁ, గల దేశముల భయం◆కరుఁడు నగుచు
నరుణనేత్రముల ద◆యాహీనమతి నరి, భక్షణ వికృతరూ◆పమునఁ దనర్చి

వేఁటాడుపనుల జీవించువాఁడును మాంస, మున దారపుత్రుల • పోషణత్వ
మున జరించుచు వాఁడు • ముదిసినదేహము, కాలునలుపు వెండ్రుకలు తెలుపును
ఆ. గలిగి యొక్కదినము • గహనవిహారముఁ జేయ నిశ్చయించి • చిత్త మలరఁ
దిరుగఁబూనె వాఁడు • దిగులు ఖగమృగాలి,కెల్లఁ బోఁపఁ జాల • నుల్లసమున.
తే. ఉడుముచర్మముచేఁ గుట్టఁబడినహస్త,కవచమును నల్లనైన చోళ్కాయ దొడిగి
విషము బూసినబాణముల్ • వెలయ భయద, మగుచుఁ గాటుకవంటిదేహమునుగలిగి.

సీ. విటపములను గడు • విజృంభించెడు నలి,కూరమృగంబుల, ఘోరమైన
సర్పములను బహు • సందడిగల్గి మా,రేడు కానుగు జువ్వి • పేరింకణమును
అంకాల గుగ్గిల • మందుగు పర్రబ్బి క,పిత్థకమీత మశ్వత్థసాల
మాదిగాఁగల భూరుహములతో దట్టమై, యున్న మహారణ్య • మొనరఁ జొచ్చి
ఆ. భయము విడచి బోయ • వాఁడు మృగావలి, తిరుగులోయలందు • నరయుచుండ
నడుగుజాడ భీతి • నణఁకుచుఁ బందులు, పులులు దుప్పులాది • గల మృగములు. 59
ఆ. యముని జూచి ప్రాణి • లతిభీతి నొందిన, కరణి బోయవానిఁ • గని భయమునఁ
బాఱిపోయె నంత • వాఁడు మృగావలి, సంచరించునట్టి • జాడ లరసి. 60
సీ. వల లొడ్డి గొప్పబొంటల మృగంబులఁ జంప, నిచ్చచే మెలఁగుచు • నెమరువాయు
వునఁ దనదేహవా • సన మాటువెట్టుచుఁ, బక్షులు తమజాతి • పక్షి కూయు
చున్నది యనుభ్రమ • నొంగి దగ్గఱ వచ్చు,నట్లు కంఠస్వర • మలరఁబాడు
చుండు వేఱొకచోట • నుండి బోను నమర్చి, యొకచోట నురివల • లొడ్డుచుండు
తే. నడవిలో నిటుఁ గావించు • యత్నములును, వ్యర్థమైపోవ నంతట • వాఁడు మిట్ట
పల్లములు గలభూమిని • బరుగులెత్తుచుండి యొకచోటఁ గుందేలు • నొసరఁ జూచి.
తే. హస్తగతదండమునఁ గోర్కు • లమర దానిఁ,దరుముకొని కొంతదూరము • నరుగ శశము
కానరాకుండఁబోవ నా • కారణమునఁ, బరితపించుచుఁ బెక్కు లుపాయములను. 62
తే. పన్ని విహరింపఁ దనదృష్టి • పథమున నొక, జంతువైనను బడదయ్యెఁ • గొంతసేపు
నిటుల చింతాభరంబున • నేఁగుచుండ, నంత సూర్యాస్తమయ మయ్యె • నవనినాథ!

ఉ. ఆయెడఁ గుంకుమంపు జిగి • నర్కుఁడు వెల్గులచేత సంజకెం
జాయ దలిర్చి పశ్చిమది • శాలలితాంగి నలంకరించి వేఁ
బోయెను మాసి నీటిపయి • బుగ్గవిధంబున జంత్రిగానిచేఁ
బోయినబొమ్మకైవడి న • భోమణి లేమికిఁ గ్రమ్మెఁ జీకటుల్. 64

సీ. అప్పుడు నిర్వాత • మగుచు రాలినపూల, గుత్తులచాలును • గూఁత లిడక
దాఁగనమృగపక్షి • దడములు కదలని, పర్ణములును నిద్ర • పాటు నొందు
విధమునఁ గనుపట్టు • విపినము నటుచూచి, చింతచేఁ బగలు నే • నెంతకష్ట
పడిన నాహారిని • బడదయ్యెనొకమృగం, బిప్పుడు చీఁకటిక్రమ్మె • నేమిసేయుఁ
ఆ. గలను దూరదృష్టి • గనుపింపదాయె నా, బాణములకుఁ దొలఁగి • పాఱిపోక
యెటుల దొరకఁగలవు • నిది యరణ్యముకాదొ? నాకుఁ గలుగు తెలివి • నష్టపడెనొ.

ఆ. అనుచుఁ జెడుగుకులము ♦ నందు జనించిన, పుణ్యజనుఁడు ఖేద ♦ మునఁ దపించు
పగిది బోయవాఁడు ♦ మృగములు దొరకని, కారణమున మది వి ♦ చార మొందవ. 66

తే. ఇట్టిదురవస్థచే నేఁడు ♦ నింటి కరుగ, వాఁడనా? లేక యీరాత్రి ♦ వనమునందు
నిలుతునా? కొంచెమైన ఫలములను లేక, యూర కేఁగిన నేమి ప్ర ♦ యోజన మగు.

కం. ఆఁకలిచేఁ బిల్ల లతి, వ్యాకులతను జెందఁ జూడ ♦ నలవియె నాకున్
ఏకరణినైన మృగములఁ, జేకొనెడిప్రయత్న మిపుడు ♦ చేసెద ననుచున్. 68

సీ. తా నుండుచోటికి ♦ దాపున నొక జలా,ధారము దానిప్రాం ♦ తమునఁ జాల
కాలము నాఁటిదై ♦ వేళ్లు మొదలుతోఁ, గనుపట్టు రేఁగువృ ♦ క్షములు నడుమ
మారేడుఁ జూచి యా ♦ మడుఁగునఁ గలసిరు, త్రాఁగవచ్చెడి జంతు ♦ తతిని జంప
యత్నింతు నని నిశ్చ ♦ యమగుబుద్ధిని బిల్వ, తరువు నల్దిక్కుల ♦ తిరిగిచూచి
ఆ. యొక్కదిశను నిలువ ♦ నూడిచి ముండ్లను, బాణ మొకటి చేతఁ ♦ బూని మిగత
నాయుధముల నెల్ల ♦ నవనిపై నుంచి కేల్,పైకి నెత్తినిలిచె ♦ భయము విడచి.

ఆ. ఇటుల బోయ బిల్వ ♦ వృక్షము చెంతను, దెలియఁజాలని బహు ♦ దినముల శివ
లింగ మొకటి గలుగు ♦ సంగతి నెఱుఁగక, నిలువ నంత మంచు ♦ నీటిచేత. 70

సీ. తలమీఁదివెంట్రుకల్ ♦ దడిసినవాఁడుగా, నాహారనిద్రల ♦ నడఁచికొనుచుఁ
దనచూపులకు నడ్డ ♦ దగులుచుఁగ్రిందికి, వ్రేలాడుచున్న మా ♦ రేడుచాలు
కొమ్మ లాకులు రాలఁ ♦ గొట్టిన నవి భూమి, పై నున్న లింగము ♦ పైనఁ బడఁగ
శివపూజ నాతఁడు ♦ చేసినవాఁ డయ్యె, నార యాబోయవాఁ ♦ డాఁకలిఁగొని
ఆ. మాంసమునకు నిదుర ♦ మాని మడుఁగుకట్టు, కొంగపగిదిఁ గదల ♦ కుండ నిలిచి
కొలనిమీఁద దృష్టి ♦ నిలిపి మృగంబుల, రాకఁ గోరుచుండె ♦ రాజవర్య! 71

ఆ. అట్లు బోయఁ డుండె ♦ నా రాత్రిఁ జీఁకటి, వేళ భయము నిదుర ♦ విడచి మృగము
లందు విష్టపత్రి ♦ యమున శంకరుఁడును, దృష్టినిలిపి రిరువు ♦ రీవిధమున. 72

సీ. బిల్వవృక్షముక్రింద ♦ విషభక్షకుఁడు శివ,రాత్రి మారేడాకు ♦ రాలఁగొట్టఁ
బడిన యాదళములు ♦ భవునిపైఁ బడుటయు, మాంసేచ్ఛచే నిద్ర ♦ మఱచి వేఁట
నెపమున శివునిస ♦ న్నిధియందు నుపవాస, జాగరణాదులు ♦ సలుపుటయును
దలవెంట్రుకలు మంచు ♦ వలనఁ దడియ శిరః, స్నానముగా రాత్రి ♦ సంభవమును
తే. నిటుల నుపవాసవ్రతమున ♦ కిన్నియును నొక, యంగమై కాకతాళీయ ♦ న్యాయమయ్యె
నంకిలున కింటినార్త లే ♦ మునఁగ వాని, భార్య పగలంతయును బసి ♦ బాలకులను. 73

తే. ఎటులనో యొకపగిదిఁ బో ♦ షించుకొనుచు, వేఁట కేఁగిన పెనిమిటి ♦ బాట కెదురు
సూచుచుండెఁగ నంతట ♦ సూర్యుఁ డస్త, మించి రాతిరిసగము గ ♦ తించె నపుడు,

చ. పురుషునిజాడ లేమికిని ♦ బొక్కుచు బోయది కోపవహ్నిచేఁ
గరఁగుచుఁ జిన్నిబాలకుని ♦ గాళ్ళపయి న్నిదురింపఁజేసి తా

సరగున వేఁటబిడ్డఁ దన♦చంకను బెట్టుక మంచమందునన్
దిరుగుచుఁ గూరుచుండి నలు♦దిక్కులఁ జూడ్కులు నిల్పి యిట్లనెన్. 75

సీ. పెనిమిటి యడవిని ♦ వేఁటాడఁబోయిన, కాలము భోజన♦వేళ మించెఁ
బోయినపిమ్మట ♦ బోయఁడు దినమునఁ, సగమురాత్రికి నెక్కు♦డగుచు నిపుడు
కనుపట్టె, రాకుండు ♦ కారణ మేమియొఁ, దోఁపకున్నది నాకు ♦ దాపునఁగల
యడవియందేమి యా♦హారము దొరకక, పసుబండినఁ బండఁ♦బడును గాని
తే. బాలురను నన్ను విడచి నా♦భర్త యొక్క, నిమిషమైనను వెలుపల ♦ నిలువఁ డెపుడు
మృగములను రాత్రి వానిపై♦దృష్టి నిలిపి, చెట్టుదాపున నిలువ నా♦చెట్టుమొదట. 76

ఆ. పాము పుట్టనుండి ♦ బయటికి నరుదెంచి, కఱవఁ జచ్చెనొక్కొ♦ కాక పొంచి
వేయునట్టిచిఱుత♦ వ్రేటుకుఁదప్పి కే,సరి తటాల్న దుమికి ♦ చంపెనేమొ? 77

సీ. అని చింతిలుచునుండ ♦ నాబోయసతియు రాత్రి, గడచి సూర్యోదయ♦కాల మగుచు
భాసిల్లె నట మేరు♦పర్వతగుహనుండి, కొంచె ముత్తరముగా ♦ మించినట్టి
యాతూర్పుచీఁకటి ♦ యనుసముద్రపుసిరు, ద్రావివచ్చిన కుంభ♦తనయుపగిదిఁ
బూషుండు నుదయింప♦బోయవాఁ డారాత్రి, యొక్కమృగంబైనఁ ♦ జిక్కకునికిఁ
తే. జింతనొందుచు నింటికిఁ ♦ జేరఁబోవు, దారిలోఁ బిల్లలను గొని♦తనను వెదుక
వచ్చుభార్యను జూచి సం♦భ్రమము గదురఁ, గౌఁగిటనుజేర్చి వారల ♦ గారవించి 78

ఆ. బోయఁ డంతఁ దాను ♦ బోయివచ్చినవిష,యములు సెప్పికొనుచు ♦ నాలితోడ
నింటికేఁగుదెంచి ♦ యిష్టసుఖంబులఁ, దనరుచుండెఁ గొన్ని ♦ దినములకును. 79

ఆ. ప్రాణులకును బాధ్య ♦ వర్తియై బలమును, గలిగి పాపులకును ♦ గానరాని
దెల్లజీవుల హరి♦యించెడిమృత్యువు, దగుల బోయఁ డపుడు ♦ తనువు విడిచి. 80

సీ. మాఱుదేహముఁ జొచ్చి ♦ కారుమబ్బులగొప్ప, తనువులు హస్తనే♦త్రములు బండి
కండ్లఁ బోలినలోతు♦గల భయంకరమైన, మిడిగుడ్లు నేత్రముల్ ♦ మిగుల తేజ
మలరఁ బ్రకాశించు ♦ యమదూతలను గని, గడగడవడక సె♦కలువచిత్తుఁ
బట్టి కొట్టుఁడు వీని♦బాధింపుఁ డని దూత, లాటోపములఁ జూప♦నందు నొకఁడు
ఆ. పలికెఁ గాలుచున్న ♦ వజ్రఁపుటెసుకను, దినను దాఁగుటకును ♦ చెరలఁగ్రాఁగి
నట్టినూనె పడక ♦ లగ్నిహోత్రపుఁగువ్వ, లగును వీని కనుడు ♦ నంతలోన. 81

ఆ. జ్ఞానవంతులైన ♦ గంధర్వగణముల, కరణి వెలుఁగుచుండు ♦ గగనవీథి
నుండి శివునిదూత ♦ లాగి చంద్రబింబస,మానమైన యొకవి♦మానముఁ గొని.

తే. వచ్చి వారలఁ గని యమ♦భటులనడుమ, నేడ్చుచుండెఁగ దూతలు ♦ నీడ్చుచుండు
బోయవానిని జూచి స♦మ్మోద మొదవ, బలముఁ దేజము దేవరూ♦పముల నొసఁగి.

క. శమనుభటులను దిరస్కా,రము సేయుచు బోయవాని ♦ రయమున నవి మా
నమునను శివభక్తులు స,క్రమముగ నధిపతిని జేయఁ♦గా యమభటులున్. 84

తే. పుష్పకమునందు వెలిఁగెడు • బోయవాని, శూలిగణములవిహరణఁ • జూచి నీరు
వలనఁ జల్లార్పఁబడు నిప్పు • పగిది తేజ,ములను జెడి దీనిమూలముఁ • దెలియఁ గోరి.

సీ. శంభునికింకరుల్ • సనెడుమార్గమునందు, నిలిచి వారలఁ జూచి • పలికి రిటుల
నెవరయా మీరలు • నిపుడు మాచేఁ జిక్కి,,పట్టి యీబోయని • బట్టి తీసి
కొనిపోయెదరు కుబేరుని శంకరుని విష్ణు, నిందునిభటులలో • నెవరో పలుకుఁ
డని వీఁడు దుష్టాత్ముఁ • డమితకాలము వేరు, వేరుగా ఘోరమౌ • నారకముల

ఆ. బాధ నొందఁదగిన • పాపుని బుష్పక,మందు నిలిపికొనుచు • నెందుఁబోదు
రెపుడు వీఁడు ప్రాణి • హింసను వర్తింపఁ, బుణ్యమెటులఁగలిగెఁ • బూజ్యుఁడయ్యె.

తే. భగవదాజ్ఞను మించిన • పనులచేత, నెసఁడు వర్తించు వారల • నెప్పుడు మేలు
గలుగ నేరదు కూడని • కార్యములను, బూనఁ డెప్పుడు దాను సు • బుద్ధి దనర. 87

ఆ. కాన వీని విడువఁ • గాఁదగు మీకు లే,కున్న యమునిభటుల • మైనమేము
శిరము లవిసి పగులఁ • జేసెద మనుచు వి,షాగ్నిఁబోలు పలుకు • లాలకించి. 88

ఆ. కోప మడఁచి మదినిఁ • దాపము నొందక, శాంతచిత్తు లగుచు • సంతసమున
వినయభాషణముల • మనవిగాఁ బ్రత్యుత్త,రములు సెప్పి రిటుల • యమభటులకు. 89

క. ప్రాగాదిచతుర్దిశలను, బాగుగ నింద్రయమవరుణ • ధవసఖులను నే
రాగాదిరహితుఁడు దయా,సాగరుఁడై నిలిపె నెవఁడు • జగదధిపతియై. 90

తే. తొలుత సృష్టికి మూలమౌ • నలుమొగములవే, ల్పునుసృజించె నెవ్వఁడు • పితృపతికిని
శమనుఁ డన నొప్పె నెవ్వఁ డా • శంకరుఁడు, మమ్ము నేలినవాఁ డని • మధురములగు

తే. భాషలాడిరి యధికసం • భ్రమమెలర్ప. భవునికింకరు లెప్పు డా • శివునియాజ్ఞ
నుండువా రౌటఁ గినుకచే • నుండి మందు,చున్న యమదూత లప్పుడు • నురిమిచూచి.

ఆ. ముదముదక్కి కోప • మున బుసకొట్టుచుఁ, జైకివచ్చునట్టి • పాపమతుల
శిరముఁ బగులవేయ • శివునియనుజ్ఞను, బడసినట్టిహరుని • భటులు నంత. 93

చ. పరిఘములన్ శిరంబులను • బ్రద్దలు సేయఁగ రక్తధారలన్
దొరగ భయంబునన్ శమను • దూతలు బోయని బాసి నోటఁ నె
త్తురు లొలుకంగ నేలఁ బడి • తూలుచుఁ జచ్చితి మంచు నేడ్చుచున్
అగిరి ధర్మరాజపుర • మందు సభాస్థలికిన్ రయంబునన్. 94

వ. ఇట్లు సాయంకాలమేఘమునుబోలి యెఱ్ఱనైనశరీరములతో నాయమునిముందర నిలిచి రప్పు డాసభయందు మృత్యుదేవత, కాలాంతకుఁడు, రోగములు, నను రాగము, క్షయము, కుష్టు మొదలుగాఁగల యెల్లవ్యాధులును, శీతోష్ణజ్వరములు, నింద్రజాలము, దారిద్ర్యము, మైమఱపు, కామక్రోధలోభమోహమదమాత్సర్యము లనెడిశత్రువర్గములును, క్షుత్పిపాసలు, శోకము, నిద్ర, కూరుకుపాటు, బొంకు, కలిపురుషుఁడు మొదలైనపాపములను, దమతమ నిజస్వరూపములతో దేహధారులై యా యమునిం గొలిచియుండి రంత. 95

తే. మఱియు ధర్మమధర్మము ♦ లెఱిఁగి చెప్ప, బ్రౌఢు లెవ్వారు ఋషులను ♦ బ్రాణులయెడఁ
గలుగుచుండు శుభాశుభ ♦ ములగు కార్య, ములనెఱిఁగి వారి యచిత్రగు ♦ ప్తులను గల్గి.

తే. సూరసుతుఁ డిట్లు కొలువునఁ ♦ దీరియుండ, భటులదురవస్థఁ జూచి, స ♦ భను గలిగిన
వారు పున్నమదిన మహా ♦ పారమువలెఁ, గలఁక బారిరి మానస ♦ ముల నరేంద్ర.

ఆ. చెట్లు గాలివాన ♦ చేతను బడినట్లు, రక్తధారలు సభ ♦ రాలుచుండఁ
బడిన యమునిభటుల ♦ పాటున కోర్వక, కలఁక నొందవారెఁ ♦ గొలువు మిగుల.

ఆ. ప్రాణిసంఘములకు ♦ భయమును దోపింప, యముని కపుడు కోప ♦ మతిశయింపఁ
జూడనలవికానివాఁ ♦ డయ్యెఁ గాలుఁడు, మొదలు గాఁగ నచటి ♦ ముఖ్యులకును.

సీ. కనుబొమల్ ముడివడఁ ♦ గా గ్రుడ్లు దిరుగఁగ, వదనము వేగిర ♦ పాటు నొంద
నగ్నిహోత్రసమాన ♦ మైన తేజమునఁ బ్రి, కాశించు శమనుని ♦ గని భయమునఁ
జేష్టలు విడనాడి ♦ చిత్తర్వుబొమ్మల, కైవడి సభ్యులఁ ♦ గదలరైరి
రక్తధారల శరీ ♦ రము లెఱ్ఱగాఁ దడి, సినదూతలను గని ♦ యినతనయుఁడు
తే. కటము లదురఁగ మూఁడులో ♦ కములు గాల్చు, నట్టికోపపరితాపము ♦ లతిశయిల్ల
భటుల నోదార్చి మీ కిట్లు ♦ పరిభవంబు, నెవనిచేఁ గల్గె దీనికి ♦ హేతు వేమి. 100

క. సురనరదానవకిన్నర, గరుడోరగసిద్ధసాధ్య ♦ గణములలో నె
వ్వరు మిము నవమానము చే, సిరి తెలుపుం డిపుడ వారి ♦ శిక్షింతుఁ దగన్. 101

క. కాలాంతకులును మృత్యువు, నీలాగున వానిఁ జంప ♦ నేఁగెదు పనిగాఁ
గ్రాలుచునుందురు మీ రా, మూలాగ్రము నెఱుఁగ విశద ♦ ముగఁ జెప్పఁదగున్. 102

తే. అది విచారించి తిన్నఁగ ♦ నవల మీకు, శత్రువైనట్టి వానిని ♦ జంపెద నని
పలుకుచుండెడి యమునితో ♦ భటులు నిటుల, విన్నపించిరి దానిస ♦ విస్తరముగ. 103

ఆ. చిత్రగుప్తునాజ్ఞ ♦ శిరమున ధరియించి, బోయవానికొఱకుఁ ♦ బోయి పాప
భరితుఁడైన వాని ♦ బంధించి తేఁగల, యాజ్ఞ మేము చేయ ♦ నంతలోన. 104

సీ. గగనవీధిని శివ ♦ గణములు గనుపించి, కౌటుకమబ్బుల ♦ కరణి దేవ
ముల చంద్రమండల ♦ ములవలె భూమికి దిగి, వచ్చి మా చేతులు ♦ పట్టి నతికి
బోయవానిని దీసి ♦ పుష్పకారూఢుని, జేసి యుత్తరదిశఁ ♦ జేర బోవ
నపుడు వారిని మేము ♦ నడ్డగించి పలుక, వాలు గుదెల మోద ♦ వారు నధిక
ఆ. బలమువలన నినుప ♦ బడితెలచే శిర, ములను రక్తధార ♦ లొలుకఁగొట్టి
మేము మమ్ము నేలు ♦ మృత్యుంజయుని యొక్క, భటుల మనుచుఁ జనిరి ♦ ధన్యచరిత! 105

తే. బడిశె దెబ్బల శిరములు ♦ వగిలి రుధిర, ములను బాధల నొందుమా ♦ తలను జూడు
మనఘ మీవంటిప్రభువుల ♦ నాశ్రయింప, దుష్టులకుఁ జిక్కి వారిచేఁ ♦ గష్టమొదవె.

చ. అని తనకింకరుల్ దెలుపు ♦ నట్టిప్రసంగము లాలకింపఁగన్
మనమునఁ గోపకంపములు ♦ మగ్నతఁ జెందఁగఁ జిత్రగుప్తునిన్
గనుఁగొని పల్కె నాయముఁడు ♦ కౌని యతం డొకవేళఁ బుణ్యవ
ర్తనల మెలంగెనేమొ వివ♦రంబుగఁ బట్టికఁ జూచి తెల్పుమా. 117

ఆ. అనినఁ జిత్రగుప్తుఁ ♦ డనియె నాబోయఁడు, ధర్మములను బుద్ధిఁ ♦ దారసిలుట
వినుట నెఱుఁగఁ డెప్పుడు ♦ వీనుల దుష్టాత్ముఁ డగుచు జీవహింస ♦ నానఁ జేసి.

చ. ప్రతిదినముల్ మృగంబులను ♦ బట్టి మారింపఁగ వాఁడు చేయు దు
ష్కృతములు లెక్క సేయునపు ♦ డేను మనంబునఁ గల్త నొందుదున్
బతితుఁడు నేకకాల మతి♦బాధల నొందఁగలట్టి ఘోరదు
ర్గతులను ద్రోయ నర్హుఁ డని ♦ కాలునితో వివరించి తెల్పఁగన్.

ఆ. యముఁడు పలికె మఱల ♦ నటులైన భటులతో, వానిని పట్టనమున ♦ కరిగి మనమ
పాపపుంజము గల ♦ పట్టిక దండము, ముద్ర సాంబశివుని ♦ ముందు నునిచి. 110

క. శంకరునిదూత లిటు మా, కింకరులను గొట్టి నన్ను ♦ గేడింపుచు ని
శ్శంకను బోయని గొనిచని, రింకన్ మా కాధిపత్య ♦ మేటి కటంచున్. 111

క. తెలియుద మని పరిజనములు, గొలువఁగ దనవెంటఁ జిత్రగుప్తుఁడు గదలన్
నిలువక కాటుకకొండకుఁ, దులయగు నెనుబోతు నెక్కి ♦ ధూర్జటికడకున్.

చ. వనరుచు నేఁగి శంకరుని♦వాకిటికాపరి నందికేశ్వరున్
బనివడి చూచివచ్చుతన ♦ వార్తను బంపి యనుజ్ఞ నొంది వేఁ
జని తనసేనతో నపుడు ♦ శంభునకుం బ్రణమిల్లి వార లి
చ్చినదగుపీఠమందు నిలి♦చెన్ సమవర్తియుఁ జిత్రగుప్తుతోన్. 113

సీ. ఆసభఁజూడ నిం♦ద్రాది దిక్పతులతో, బ్రహ్మ విష్ణువు సుర♦ప్రతతి చేత
గంగాదినదులును ♦ గంధర్వచారణ, యక్షులు హిమవన్న♦గాది పర్వ
తములు సకలఋషి ♦ సముదాయమునఁ బ్రకా, శించుచుండెను గడు♦ చిత్రమగుచ
నందుఁ బ్రసంగించు♦నట్టి వృత్తాంతము లైనపిమ్మట శంభుఁ♦ డపుడు నీవు

ఆ. నరుగుదెంచుకార్య♦ మెఱిఁగింపుమని కను,సైఁగఁ జేయ యముఁడు ♦ సవినయముగఁ
బలికె దేవదేవ ♦ భక్తులయెడఁ బ్రేమ, పరఁగుదేవ చేతుఁ ♦ బ్రణతు లిపుడు. 114

ఆ. నీదయారసమున ♦ నేఁ జేయువిన్నప, మాలకింపు మిప్పు ♦ డనఘచరిత
దైత్యదైవతములఁ ♦ దమతమయధికార, ములకు నిర్ణయించి ♦ నిలిపి తీవు. 115

క. అదిమొదలు ధాత సృష్టిని, విదితంబుగ రక్షకుండు ♦ విష్ణువు గాఁగన్
బదపడి ముల్లోకములను, వదలక తగువార లాధి♦పత్యముఁ జేయన్. 116

సీ. అప్పటినుండి మా ♦ కధికారములయందు, నధికమన్ననలచే ♦ నలరునట్టి
వరము లియ్యఁగ నాధి♦పత్యముచేత వ, ర్తింపుమంటిమిగదా! ♦ దివిజు లపుడు
నిదిసత్య మిదిసత్య ♦ మిదిసత్య మని పల్కి, రదిగాన నింతప♦ర్యంతము దివి
భూమిపాతాళముల్ ♦ బోకుండ నిలుచుట, నిజముమీఁదనెగదా! ♦ నిటలనేత్ర!
తే. అట్టిసర్వేశ్వరుండనై♦నట్టి నీవె, నిజముఁదప్పినవాఁడనై ♦ నేఁ డసత్య
మునఁ బ్రవర్తింప నితరులు ♦ మూర్ఖు లగుచు, నిజము మనమున నెట్భంగి♦నిలుపఁగలరు?

క. సకలము సత్యముమీఁదనె, వికలత లేకుండ నిలిచి ♦ వృద్ధిని జెందున్
ఇఁక సత్యము నశియించినఁ, బ్రికటితముగఁ గలుగు లోక♦భ్రష్టత్వంబున్. 118

సీ. సత్యము లేకున్న ♦ సకలలోకములకు, నక్షులౌ చంద్రసూ♦ర్యగ్రహములు
రాహుకేతువుల ప♦ర్వముల కానప్పటి, కాల మైనను రెండు♦కబళములుగ
మ్రింగుచు రిచిగాక ♦ యింగలముం గాన్పు, నేకమై ప్రళయము ♦ నెదురఁజూడ
కను భయంకరరూప♦మునఁ ద్రిజగములు నా, శనముఁజేయును నొక♦చక్కి నిలిచి
తే. సత్యము నశింప నాలుగు♦సంద్రములును, నల లనెడుగొప్ప చేతుల ♦ హద్దుఁ దప్పి
పొరలి చెలియలికట్టపైఁ ♦ బొంగి ద్వీప, ములను బ్రహ్మాండమంతయు♦ ముంచుననఘ!

తే. ఆదిశేషుఁడు కూర్మము ♦ నష్టదిగ్గ, జములు యజ్ఞవరాహము ♦ సకలపర్వ
తములతో నిండుకొనియున్న♦ ధరణి మోయఁ, జాలమికిఁ గ్రిందికడఁగును♦ఫాలనేత్ర!

తే. అంతరిక్షము చంద్రసూ♦ర్యగ్రహములు, తారకాదులు లేనిదై ♦ దట్టమైన
చీఁకటిన్ లోకములును న♦శింప నీవు, నపుడు నేకాకివై యుండు ♦ మార్యవినుత!

చ. నను నిఁక నింతకై నిలుప ♦ నాకు సమర్థతసాల దీవు నీ
పని నెఱవేర్పఁగాఁ దగిన♦వానికి నాజ్ఞ నొసంగఁబోలు నం
చని యిటుఁ బల్కి కాలుఁడు ర♦యంబున పాపులవ్రాఁతపట్టిక
న్ననువుగ ముద్రి దండములు ♦ నర్పణఁజేయుచు శంభుముందటన్. 122

ఆ. గట్టిమాటలాడు♦కాలుఁడు తత్తర, పాటునొందఁ జూచి ♦ భర్గుసభను
గలుగుపెద్ద లపుడు ♦ గజగజప్పణఁకిరి, బ్రతుకుతెఱవునందు ♦ భయము గదుర. 123

సీ. యముఁ డిటుఁ బల్కు వా♦క్యముల నాకర్ణింప, శివునకు ముఖమందుఁ ♦ జిన్నినగవు
పొడమ దేవతలును ♦ మును లాలకింపఁగాఁ, గాలునితోఁ గఱ♦కంఠుఁ డనియె
నిటుల ప్రసంగింప ♦ నెవ్వఁడు జాలు నీ, వంటివాఁ డవమాన♦పడకయున్నె
గాన నాటోపము♦గా నీవు పలుకుట, జనదు నిర్మలమైన ♦ సభికులమన
ఆ. ములకు వెఱపు గలిగె ♦ ముల్లోకములను గ, త్షణము సేయ నేను ♦ గలుగుచుండ
నెటు లకాలప్రళయ ♦ మేర్పడు సత్యముఁ, దొలఁగి తెటుల వానిఁ ♦ దెలుపవలయు.

ఆ. పాపములను వ్రాయు♦పట్టిక ముద్రిను, దండము వదలుటకుఁ ♦ దగినహేతు
వేమి యనుచుఁ బార్వ♦తీశ్వరుఁ డడుగ నా, యముఁడు పలికె సవిన♦యముగ నిటుల.

క. ఈపట్టికలో వ్రాసిన, పాపుల కనుశిక్ష నెచటఁ ♦ బడఁగొట్టఁదగున్
పాపాత్ముఁడైన బోయని, నీపార్శ్వపుభటులు దేర ♦ నీసన్నిధికిన్. 126

తే. అట్టిబోయఁడు పాపుల ♦ కధికుఁడగుచు, వాఁడు జీవించుకాలము ♦ ప్రాణిహింసఁ
జేసిమాంస మెతినుచుండు ♦ చెడుగుమనసు, గలుగువాఁడునుసతతమున్ ♦ గఠినుఁడగుచు.

క. ఎల్లజనంబులచే వాఁ, డెల్లప్పుడు దూషణముల ♦ నీఁగుచు ధర్మం
బెల్లెడల లేక పాపమె, కొల్లఁగఁజేసెనని చిత్ర ♦ గుప్తుఁడు దెల్పెన్. 128

సీ. అటువంటిపాపు న ♦ య్యయ్యో నీగణములు, సౌఖ్యముల్ గలుగుపు ♦ ష్పకముపైనిఁ
బెట్టి తెచ్చుటెగాక ♦ పట్టి నాదూతల, తలలను రక్తము ♦ లొలుక నినుప
పరిఘల మోది చం ♦ పిరి మఱి దేవతా, స్త్రీలతో నధికసం ♦ ప్రీతి దనర
నావిమానమునందు ♦ దేవత్వముంబొంది, తేజరిల్లెడి వీఁడు ♦ దినముఖమున
తే. గ్రామపార్శ్వజలముల మా ♦ ఘమున స్నాన, మాడెనో వాజిపేయాది ♦ యాగములను
జేసెనో పాపమతులఁ బో ♦ షింప నీవు, గలుగ బాధింపుచుంటినో ♦ కరుణ మాలి.

తే. నాకు నొసఁగిన యుత్తర్వు ♦ నీకు మఱల, నప్పగించితి నందుకు ♦ నర్హమైన
పట్టికాదులతో నిఁకఁ ♦ బనులు నాకుఁ, గలవె పదసేవఁజేతు నీ ♦ కడను నిలిచి. 130

క. అని పలుకుచున్న శమనుని, గని శంకరుఁ డనియె వీఁడు ♦ కాఱడవులలో
ననయము మృగములను వధిం, చినమాంసమె జీవనముగఁ ♦ జేయుచు నచటన్. 131

సీ. చేసినపుణ్య మి ♦ చిత్రగుప్తుఁ డెఱుంగఁ, జాలఁడు శివరాత్రి ♦ సంభవింపఁ
బస్తుండి మారేడు ♦ పత్రితో శివపూజ, జాగరణము రాత్రి ♦ సలుప దాని
ఫలమున వస శుక్ల ♦ పలల మాదిగ సప్త, ధాతువులను నిండి ♦ తగని మఱికి
చేఁ గల్గు తనువును ♦ శివరాత్రియను వీతి, హోత్రిని చేఁ గాల్చి ♦ యొప్పిదముగఁ
తే. గాంచనశరీరమును బొంది ♦ కనకపుష్ప, కమున దేవాంగనలతోడఁ ♦ గలసి సకల
భోగముల నున్నవాఁ డని ♦ భోగిభూష, ణుఁడు వచింపఁగఁ జిత్రగు ♦ ప్తుఁడును బలికె.

సీ. వీఁ డరణ్యమునందు ♦ విహరించుదినముల, శివరాత్రిఁ దలఁపఁడు ♦ చిత్తమందు
ముందర శివలింగ ♦ ముం గల దనువిధ, మెఱుఁగఁడు మృగముల ♦ కొఱకు బిల్వ
పత్రములను క్రిందఁ ♦ బడరాలఁగొట్టెను, గాని లింగార్చన ♦ గాదు జీవ
ములఁ జంపుటకు బాణ ♦ మును వింట సంధించి, నిదుర వదలిపెట్టి ♦ నిలిచెఁ గాని
ఆ. జాగరణము గాదు ♦ సకలవిధంబుల, పలల మేమి లేక ♦ వస్తు నుండెఁ
గాని వ్రతముఁజేయు ♦ కారణమున నుప, వాస ముంట కృత్తి ♦ వాస! కాదు. 133

తే. అట్లు వర్తించువీఁడు మ ♦ హాత్ములైన, వారు బొందినపదవిని ♦ బడసె ననుచుఁ
జిత్రగుప్తుండు బలుకఁగా ♦ శివుఁడు నతని, కభిముఖుండయి తెలిపె ని ♦ ట్లనుచు మఱల.
ఆ. వ్రతముఁ దలఁప కిట్టి ♦ ఫలమును జెందెను, శ్రద్ధతోడ నెవఁడు ♦ జరుపు నతఁడు
జన్మరహితమైన ♦ సద్గతి నొందుట, కొఱతఁబడదు చిత్ర ♦ గుప్త! వినుము. 135

క. అతిశయమగు దానములును, గ్రతువులుఁ దపములును జేయఁ ♦ గలిగిన సత్ఫలం
బతులితమగు శివరాత్రి, వ్రతమునకు సమాన మెద్ది ♦ వసుమతిలోనన్. 136

ఆ. కాన, నానవిూఱ ♦ కథితమా విూయధి, కారములకుఁ దగిన ♦ కార్యములను
నడపుచుండవలయు ♦ నాపప్రిమఘులు కింక, రులను గొట్టిరనుచుఁ ♦ దలఁపవలదు. 137

సీ. అల్పు లహంకారు ♦ లైనవారికి భంగ, పాటు నహంకార ♦ పదవి లేమి
చేయుదు నని పట్టి ♦ శివునివాక్యములను, గరియించి శిరమున ♦ ధర్మరాజు
సకలప్రాణులకు నే ♦ శ్రీకరైన శంకరు, నకు నతిభక్తిచే ♦ నతు లొనర్చి
కరుణింప మనసు త ♦ త్తరపాటు నొదవఁగ, భయమునఁ బాపుల ♦ పట్టికయును
తే. ముద్రి దండముఁ గొనుచు స ♦ మ్మోద మొదవఁ, జిత్రగుప్తునితోఁ దన ♦ సేన గొలువ
పురమునకుఁజేరె శమనుఁడు ♦ బొలుపు మిగుల, నచట బోయనివార్తలే ♦ మనఁగవినుఁడు.

చ. సురపతిభోగసంపదల ♦ సొంపు దలిర్పఁగ విష్టపత్రియం
బరుగు విమాన మెక్కి దివి ♦ జాంగనలుం గొలువంగ లోకముల్
దిరుగుచు శూలికింకరులు ♦ దెల్లముగాఁ గొనియాడుచుండ శం
కరునిపురంబునన్ గడవు ♦ కాలము నిల్చుచు నేఁగుచుండెడిన్. 139

ఆ. బోయవానికథను ♦ బుణ్యముగల శివ, రాత్రిమహిమ నిట్టి ♦ వ్రతము నాచ
రింప కితరపనుల ♦ నీఁగినవారికిఁ, గలిగినట్టి గొప్ప ♦ ఫలము వింటె? 140

తే. క్రమముఁ దప్పక శివరాత్రి ♦ వ్రతము నెవ్వఁ, డాచరించునొ శ్రద్ధతో ♦ నతనిపుణ్య
మిట్టిదని తెల్పసామర్థ్య ♦ మెవరికి నగు, ననుచు రాజేంద్రుఁజూచి యి ♦ ట్లనియెమౌని.

సీ. బోయవానికి నిట్టి ♦ పుణ్యము శివరాత్రి, మహిమచేఁ గలిగెడు ♦ మాఘమాస
మన్న నెలలకంటె ♦ నధికమా శుక్లప, క్షమునందు భీము నే ♦ కాదశియును
గృష్ణచతుర్దశి ♦ శ్రీశివరాత్రి రాఁ, గలదోట దానపా ♦ త్రులకుఁ దగిన
దానము సేయఁగాఁ ♦ దగినదై పూర్ణద, క్షిణలచేఁ గూడిన ♦ క్రతువు లెల్ల
తే. సలుప హెచ్చైనఁ దగునని ♦ సకలమునుల, కధికుఁడైన వసిష్ఠుఁడు ♦ నా దిలీప
జనపతికిఁ దెల్పె వినుమని ♦ శౌనకాది, మునుల కెఱిఁగించి సూతుఁ డి ♦ ట్లనియె మఱల.

ఆ. ఇటుల బోయవాని ♦ వృత్తము శివరాత్రి, వలన వానికైన ♦ ఫలము మౌని
దెలుప భక్తి దనర ♦ కలిదోషము లడంపఁ, జాలినట్టిచరిత ♦ మాలకించి. 143

సీ. అనఘచరిత్ర! మ ♦ హాత్మ్యఁ డంకిలునివృ, త్తాంతము వినఁగ సం ♦ తసము నొదవె
లోకత్రియమున న ♦ నేకము లుత్తమ, వ్రతముల కోరిన ♦ ఫలిత మొనరఁ
గలిగి పునర్జన్మ ♦ కారణమై యుండుఁ, గాని రాహిత్యమా ♦ ర్గము లేదు
శివరాత్రిమహిమ వ ♦ చింపఁదలంచుట, కలవిగాకుండె నా ♦ కశ్వమేధ
తే. క్రతుఫలమ్ముల నన్నిఁట ♦ నతిశయించె, నట్టిశివరాత్రివ్రత మెట్టు ♦ లాచరింప
వలెనొ మ్రొక్కెద నదివిూరు ♦ దెలియఁజెప్పుఁ, డనఁగ రాజేంద్రుతో నిట్టు ♦ లనియెమౌని.

సీ. ప్రతిమాఘమునఁ గృష్ణపక్షత్రయోదశీ,దినమున నుపవాసమున వసించి
రాత్రివేళను సతీరతి మాని నిద్ర నా,హారముఁ వదలి జాగరణ మెలమిఁ
గావించి మఱునాఁడు కల్యమందున లేచి, నిత్యకృత్యములను నిర్వహించి
పంచములను జూచి భాషింపకను నుండి, యేఱులు మొదలైన నీరుపట్ల
తే. స్నానమొనరించి పరిశుద్ధమైన చేల,ములను ధరియించి మధ్యాహ్నమునకుఁ దగిన
పనుల నెఱవేర్చి దేవతార్చనముఁ జేసి,పిదప శివునాలయమును సంప్రీతి దనర. 145

తే. గోమయమ్మున నలికి ముగ్గులను దీర్చి, పరిమళించెడి పుష్పముల్ బఱచి శుద్ధ
జలముచేతను బ్రోక్షించి శంకరునకుఁ,బానకముఁ దేనెయును నెయ్యి పాలు పెరుఁగు.

తే. కలిపి పంచామృతస్నానకలితమధుర,జలము లభిషేకమును జేసి శంభులింగ
మునకుఁ గుంకుమ గంధముఁ బూసి మూఁడు,పర్ణములు గల మారేడుపత్రిసలన.

సీ. మల్లెలు జాజులు మంచిసంపెంగలు, మొల్లలాదిగ పుష్పములను భక్తి
యుక్తిచేత 'భవాయ ఉగ్రాయ రుద్రాయ, శర్వాయ భీమాయ శంకరాయ
సోమాయ భర్గాయ శూలధరాయ న,మశ్శివాయ నమో నమః' అనుచును
భవుని బూజించి సాంబ్రాణిధూపము వేసి, దీపముల్ వెలిగించి దివ్యతరము
ఆ. లగుచు శంకరునకు నతిప్రీతి ఫలములు, భక్ష్యచోష్యలేహ్య పానీయములు
నన్నమాదిగాఁగ నఖిలపదార్థము, లారగింపుచేసి హరునిఁగూర్చి. 148

తే. గంధపుష్పాదికముచేతఁ గల విశిష్ట, వస్తువులు గొని నీవు పార్వతియు నిపుడు
సంతసింపఁగఁ గలరని మంత్రపఠన,చేత సంకల్ప మొనరించి చెలువ మమర.

తే. దానములఁజేసి పెక్కువిధములు వేడు,కలను గావించి వీణాపాటల మృదంగ
తాళముల గీతములను వాద్యములు సలిపి, మంగళారతు లిచ్చి సంభ్రమము గదుర.

సీ. శివునకుఁ బ్రియమైన శివరాత్రిమహిమలు, చదివెడి బ్రాహ్మణజనులవలన
వినుచుఁ దత్కథలను మనసును గలవర,పడనీక యారాత్రి గడుప నిద్ర
పడని జామున కొకపరి మంత్రముల జల,గంధపుష్పములను గదళిఫలము
లావాలతో నర్ఘ్య మర్పించి శివునకు, శుభకరుండవు కొండమాలితోడఁ
తే. గూడుకొని దోషములను బోఁగొట్టునట్టి, రాజశేఖర! యీశివరాత్రిదినము
నందు నాచేతఁ గొనిన యీయర్ఘ్యమును గ్ర,హించి నాపాపములను లయింపుమీశ!

ఉత్సాహ. సేవకులకు శుభము లొసఁగు చిత్తజారి! పార్వతీ
దేవిహారి! వరద! సృష్టిస్థితిలయమ్ము లన్నిఁటక్
నీవ యగుచుఁ ద్రిగుణములను నిండి వెల్గుచున్న యో
దేవ! నాదుదురితములను ద్రెళ్ళఁజేయవే దయన్. 152

తే. అనుచు నాప్రాణములను నీ కర్పణముగఁ
జేసితిని నీవె గతి నాకుఁ జిత్తమందుఁ

దలఁచి ననుఁ బ్రోవు మనెడి మం♦త్రమున నర్ఘ్య
ము నిడి మ్రొక్కంగవలయు శం♦భునకు నటుల. 153

తే. ఒనర నారాత్రి కడపి సూ♦ర్యోదయమున, దిశము నొనరించుఁ బనులను ♦ దీర్చి పిదప
శాంభవశ్రాద్ధమును భక్తి♦శ్రద్ధగలిగి, చేయఁదగు ముందుగా దానిఁ ♦ జెప్పెద విను.

సీ. కలకంఠునకుఁ బ్రీతి♦కరముగాఁ గొందఱు, బ్రాహ్మణశ్రేష్ఠులఁ ♦ బలువిధములఁ
బూజించి వారికి ♦ భోజనం బిడ శాంభ,వశ్రాద్ధ మది యని ♦ పలుకుచుందు
రవలను శివభక్తు♦లైన భూసురులకు, బంధులుఁ బంగులు ♦ సంఘులకును
సేవకులాదివి♦శిష్టజనంబుల, భుజియింపఁజేసి వి♦ప్రులకు భూమి

తే. నావు రథ మేనుఁగును గుఱ్ఱ♦మాదిగాఁగ, సకలదానంబులను జేయఁ ♦ జను నెవండు
రక్తుఁడై యున్న తన కగు♦శక్తికొలఁది, గవ్వ నిచ్చినఁజాలు ని♦ష్కపటముగను. 155

క. హితమతి నిటు శివరాత్రి, వ్రతసాంగముఁ జేసి విప్ర♦వరుల ననుమతిన్
మతిమంతుఁ డగుచు మౌన,వ్రతుఁడై పారణముఁ జేయ♦వలయు నరేంద్రా! 156

ఉ. ఈనియమమ్ము చే నెవఁడు ♦ నీశివరాత్రివ్రతంబు సేయునో
వానిసమస్తదోషములు ♦ భస్మములై రజతాద్రిమందిర
స్థానమునన్ వసించు శివు♦సన్నిధిలో నిదిగాక భూమిపై
వానికుటుంబ మత్యధిక♦భాగ్యులు భోగ్యులు రూపవంతులై. 157

తే. స్వాంతవ్యథరోగములు లేక ♦ సకలఫలము, లనుభవింపుచు నంత్యము♦నందు శివుని
పదవిఁ గైకొందు రనఁగ భూ♦పతి వసిష్ఠు,తోడ నిట్లని పలికె సం♦తోష మొదవ. 158

తే. మంత్రనియమము లెఱుఁగని♦మనుజుఁ డీవ్ర,తమును నెట్లొనరింపఁ♦దగును వాని
ఫలముసంపూర్ణముగ నెట్లు♦గలుగు నతని, కనుచు రాజేంద్రుఁ డడుగ ని♦ట్లనియె మౌని.

తే. అతిరహస్యము శివునకు ♦ నధికప్రీతి,కరము పెక్కువిధముల వి♦జ్ఞానమునకు
మూలమైనట్టి విషయము♦ బోధపఱతు, నిపుడు శివరాత్రిమహిమ గ్ర♦హింపు మనఘ!

సీ. శంకరునకు నమ♦స్కారమంత్రము చేత, నూరట నొందుచు ♦ సారమతిని
శివునకు నర్చనఁ♦జేయు నెవ్వఁడు నెల్ల,విధములఁ బూజఁ గా♦వించు నట్టి
వాఁ డల శివరాత్రి♦నాఁ డుపవాసము, రాత్రికాలము జాగ♦రణముఁ జేయ
పాపములను విడు♦వఁబడును బురుషులు, నాఁడువారిల వివా♦హమునుగాని

తే. కన్నియ రజస్వలనుగాని♦చిన్నదియును, బ్రౌఢ వీరిలో నెవరు నీ♦వ్రతము సలుపఁ
జెందరాని పదార్థము♦నెందు లేదు, మఱియు విధవైన మాఱుజ♦న్మమున నదియు.

తే. చెడనిముత్తైదుపతనముఁ♦బడయు నెవఁడు, నీవ్రతముఁ దప్పకుండఁగ ♦ నెప్రుడు నడపు
నట్టివాఁ డెల్లపాపము ♦ లడఁచి శివుని,లోకమందు వసించును ♦ బ్రాకటముగ. 162

తే. ఎచట శివరాత్రిమహిమ వ♦చింపుచుండు, నచట శివుఁడు ప్రసన్నుఁడు♦వగు నెవండు
చదివి వినిపింప నతఁడె యీ♦శ్వరుఁ డనంగ, నెన్నఁబడె లోకమందున ♦ నినకులేశ!

తే. ఇహాపరమ్ముల రెంటికి ♦ నీశుఁడైన, శంభుఁ బూజింప శివరాత్రి♦చరితము విన
కోర్కు లన్నియు నీడేరుఁ♦గొదువలేక, వేయుమాటలు నిఁక నేల ♦ వినుము పార్థ! 164

క. శివరాత్రిమహిమ నొకపరి, చవిఁగొను మానవుఁడు యాగ♦శతఫల మందున్
శివునికరుణారసంబున, నవరత్నవిమానమందు♦నను వెలుఁగొందున్. 165

క. మనుజేంద్ర! కార్తవీర్యుని, మును దత్తాత్రేయమౌని ♦బోధించిన త
ద్ఘనమాఘమాసమహిమను, వినుపించెద వినుము చెవులు ♦ విమలత నొందన్. 166

క. ధరవిూఁదను మాహిష్మతి,పురమునఁగల కార్తవీర్య♦భూపతి యొకనాఁ
డరిగెను దత్తాత్రేయుని, దరిశింపఁగ సహ్యపర్వ♦తమునకు నధిపా! 167

తే. ఏఁగి మునివరుపదముల ♦ కెరఁగి భక్తి, గదురఁ గూర్చుండి నీయను♦గ్రహమువలన
ధర్మముల నన్నిఁటిని వింటిఁ♦దాపసేంద్ర!, మాఘమహిమను దెలుపవే♦మనము వలర!

క. అని యడిగిన రాజేంద్రుని, గని మునిపుంగవుఁడు ననియెఁ ♦ గారుణ్యమునన్
మును మాఘస్నానఫలం,బును నారదుఁ డడుగ ధాత ♦ బోధించెఁ దగన్. 169

సీ. అది నీకు నెఱిఁగింతు ♦ నాలకింపుము కర్మ,భరితులై యున్న యీ♦భరతఖండ
మునఁగల పుణ్యభూ♦ములయందు నెల్లెట్ల, నుండఁదగినచోట్ల ♦ నుండుటయును
సకలతీర్థములందు ♦ స్నానసంధ్యాద్యను,♦ష్ఠానాదివిధులును ♦ శ్రాద్ధములును
ఘనముగఁ జేయు మా♦ఘస్నానమును లేని, వానిజన్మము కడు ♦ వ్యర్థమగును

ఆ. అట్టివాఁడు చేయ♦నగు పుణ్యకర్మలు, కర్మసాక్షి లేని ♦ గగనతలము
నిందుహీనమైన ♦ ఋక్షమండలము వి,ధమున నిష్ఫలతను ♦ దనరుఁ బుత్రి! 170

క. విను మాఘస్నానపవిత్ర,మున సంతోషించినట్లు ♦ పురుషోత్తముఁ డే
ఘనదానవ్రతములచే,తను సంతస మందఁ డెందుఁ ♦ దాపసవర్యా! 171

సీ. బలుపు మిక్కుటమయి ♦ బలమున శాశ్వతం, బపవిత్రమైన దే♦హమున నేమి
ఫలము నీతను నెము♦కలు కంబములు నర,ములఁ గట్టఁబడి మాంస♦మునను రుధిర
మునఁ బూఁత,తోలుచే♦తను గప్పనది కంపు,గలిగిన మలమూత్ర♦ములకుఁ బాత్ర
మగుచు దుఃఖము మనో♦వ్యథనార్తికములచే, బాధింపఁబడునది ♦ ప్రబలమైన

తే. రోగములకు నివాసమై ♦ రూఢిదనరఁ, దగినదై వదలుటకు స♦త్యమును గాని
దగుచుఁ బాపములకు మూల♦మై పరులను, సంకటముఁ జేయు నెడల నా♦సక్తతయును.

ఆ. చెలుపు నొకరి కొనరఁ♦జేయుటచే రోఁత, కలుగుచుండు నదియుఁ♦జలనమొందు
నదియుఁ గొండెములకు♦నాటపట్టయి కూర్మి, మైనదియును నెవరు ♦ నేనిదియును.

తే. పగపుఁ బుట్టింప బాధల ♦ వదలుచుండ, బహుళ మధ్యాత్మికాదితా♦పత్రయముల
మాఁటిటిఁ గూడినది ధర్మ♦ములకు నేమి, కానిదగుచు దురాశలఁ♦గలిగినదియు.

క. ఆలుసుసఖశత్రువులతోఁ, జేరినదై శమనుపురికిఁ ♦ జేరును నరక
ద్వారములఁ నుండునని చెం, పారఁగఁ బురుగుపలె చర్మ ♦ భస్త్రికలందున్. 175

తే. కర్మపరిపక్వమైన కు ♦ క్కలకు హోమ, ద్రవ్య మనఁదగునట్టి యీ ♦ శరీరము మాఘ
మందు శీతోదకస్నాన ♦ మాచరింప, కునికి జలబుద్బుదము విధ ♦ మున నశించు.

సీ. హరిభక్తిలేని బ్రా ♦ హ్మణుండు, దక్షిణలేని, శ్రాద్ధ, మాచారముఁ ♦ జరుపనట్టి
వంశము, ద్విజకర్మ ♦ వదలిన రాచఱికము, పంచవగల ధ ♦ ర్మమును, గోప
మునఁ దపంబును, గ్రంథ ♦ ములపరిశీలన, లేని తెలివి, భక్తి ♦ హీనయైన
భార్య, నీతములేని ♦ బ్రహ్మచర్యవ్రతి, మగ్నిమండక వేల్చు ♦ నట్టి హోమ,
తే. మొంటరిగఁ జేయు భోజన ♦ మొకరి ననుస, రించి జీవించువానికి ♦ నిచ్చునట్టి
కన్య విధమున నెవఁడు మా ♦ ఘమున శీత, జలములను దోఁగకున్న నా ♦ శనము నొందు.

సీ. ధనవంతునకుఁ జేయు ♦ దానము, శూద్రుని, యాచించి చేసిన ♦ యాగము, నల
నాటుచేయని విద్య, ♦ ప్రజలకు నపకార, మొనరించు రాజు, లు ♦ బ్ధునకు దొరకి
నట్టి ద్రవ్యము, కూటి ♦ కయి చేయు యాత్రలు, వ్రతము, లసత్యమౌ ♦ పలుకులు, భగ
వంతుఁడు లేఁడని ♦ వాదించు మతము, సం, చలనము గలిగిన ♦ జపము శ్రద్ధ
తే. లేని పరలోకసంబంధ ♦ మైన క్రియలు, దానములచేత జీవించు ♦ వాని బ్రతుకు
వ్యర్థమగునట్లు మాఘము ♦ నందుస్నాన, మొనరఁ గావింపకునికిఁ జె ♦ డును మనుజుఁడు.

తే. మాఘమందున సూర్యుఁడు ♦ మకరరాశి, గతుఁడునై యుండు నప్పటి ♦ కల్యమందు
స్నానమొనరింపకుండిన ♦ సకలపాప, ముల విడువఁబడి, స్వర్గముఁ ♦ బొందు నెటుల?

ఆ. బ్రహ్మహత్య కల్లుఁ ♦ ద్రావుట గురుపత్ని, సంగమంబు నట్టి ♦ జనులసఖ్య
మితరధనము నపహ ♦ రించుట పంచమ, హాదురితము లివియు ♦ ననిరి బుధులు. 180

క. మునివర! మాఘస్నానం, బున నీపాపమ్ము లైదుఁ ♦ బోఁగలవు నెసం
డును సూర్యుఁ డుదయ మగువే, శను నెప్పుడు నూరినెలుప ♦ ల నుదకమందున్. 181

ఆ. పడుదు నెవరు వారి ♦ పంచమహాపాత, కముల నడప నెపుడు ♦ గలుగు ననుచు
మొఱలు పెట్టుచుండు ♦ మునివర! జలములే, పాపములను జేయు ♦ భస్మముగను.
తే. పాపములు మాఘమును జూచి ♦ భయమునొంది, మాకుఁ జెడుకాలమిపుడు సం ♦ భవమునయ్యె
మంచివారలు స్నాన మీ ♦ మాఘమందుఁ, జేసి వెలుగుచున్నారు ♦ చిచ్చుపగిది.
సీ. అనలము గాష్ఠము ♦ లను గాల్చువిధమునఁ, గరణత్రయము చేతఁ ♦ గలుగు దోష
ములను మాఘస్నాన ♦ ము దొలఁగించును కార, ణంబున బుద్ధిపూ ♦ ర్వకమువలనఁ
జేసిన పాపము ♦ ల్బాడు గవిమాఘమ, కరరాశిగతుఁడైన ♦ కాల మునయు
మునఁ జేయు సుస్నాన ♦ మున దోషములులేని, వారు స్వర్గమునందు ♦ వాస ముండ్రు
ఆ. పాపులైన నరులు ♦ పరిశుద్ధులగుదురు, సంశయంబు వలదు ♦ శౌరిభక్త
పరులనాఘులైన ♦ బలవంతు లగునట్లు, మాఘమహిమ నొందు ♦ మనుజవరులు.

క. సురలోకమున వసించెద, రరయఁగఁ బాదిత్యములకుఁ ♦ బ్రాయశ్చిత్తం
బిరువుగ మాఘస్నానమె, పరమోత్కృష్ట మని బుధులు ♦ పలుకుదు రెందున్. 185

క. తొలిజన్మమందు నెవ్వనికిఁ,గల సంస్కారమునఁగాని ♦ కలుగ దిటుల నెం
పలరఁగ మాఘస్నానము,వలనన్ సంసార మనెడి ♦ పంకపుఁబూఁతిన్. 186

తే. చక్కఁగాఁ గడుగుట కెంతొ♦చాలినదియు, నెల్లపాపములను హరి♦యింప నెల్ల
కోరికలు దీర్పఁగలదియుఁ ♦ గొదువ లేక,అట్టి మాఘవ్రతమును జేయ♦నైనవారు. 187

తే. చంద్రసూర్యులకాంతితో ♦ సకలవిభవము,లైన భోగము లన్నియు ♦ ననుభవింపఁ
గలరు దీనికి నొకపూర్వ♦కథ గల దది,విను మనుమ రాజుతో నసె ♦ మునివరుండు.

ఆ. మిగుల రూపవతియు♦ భృగువంశజాతయు, ఋక్షకాభిధాన ♦ మెసఁగు విప్ర
వనిత బాల్యమందు ♦ వైధవ్యమును బొంది,ఆపరాని దుఃఖ ♦ మావహిల్ల. 183

సీ చని వింధ్యపర్వత♦మునకు దాఁపున నర్మ,దకు నుత్తరంబైన ♦ దరిని నియమ
మున జనసాంగత్య♦ము విడి శ్రీహరిభక్తి,దనరఁగ సత్య మా♦ధారముగను
నింద్రియజయము హ♦రించిన కోపము, సూనృతవాక్యముల్ ♦ సుస్వభావ
మును దానమున బుద్ధి ♦ తేను నెండఁగట్టుట,నక్కఁఅగలదియు ♦ నహముకాల
ఆ. మాఱుభాగములుగ ♦ నం దొకభాగము, నిలను రాలుగింజ ♦ లేరి తెచ్చి
ఫమ్చుకొనుచుఁ బ్రాణ♦ములు నిల్పుకొని కృచ్ఛ్ర,మాదిసకలవ్రతము♦లాచరించి. 190

తే. నారచీరలు ధరియించి ♦ భూరితపముఁ,జేయుచు విరక్తిమార్గముఁ ♦ జెంది ధీర
తయును బరిశుద్ధ మధికసం♦తసము నొదవ, కపిలనర్మదనదులసం♦గస్థలమున. 191

క. అఱువదిమాఘస్నానము, లిరువందఁగఁజేసి తపము ♦ వృద్ధిపఱచి సుం
దరతనువు విడచి ఋక్షక, మఱికొన్నిదినంబు లరుగ ♦ మరణము నొందెన్. 192

క. ఘనముగ నా కన్నియ సే,సిన మాఘస్నానఫలము♦చే యుగములు నా
ల్గును వేయిమార్లు వరుసను,చను కాలము విష్ణుదేవు♦సముఖమునందున్. 193

చ. పరిజనులు న్నహర్నిశలు ♦ భక్తిని గొల్వ సమస్తభోగముల్
పొరిఁబొరిఁ జెందుచున్ బిదపఁ ♦ బూషణులోకమునందు నేమియున్
గొఱఁతయులేక సౌఖ్యములఁ ♦ గొండొకకాలము నిల్చి విష్ణుమం
దిరము ప్రవేశమై కడుయ♦థేచ్ఛసుఖంబుల నుండ నత్తఱిన్. 194

మ. బలపద్దర్పసమగ్రు లుగ్రు లఘసం♦పాదుల్ మహాక్రోధచి
త్తు లసాధారణవీర్యవంతులును నై♦తోపట్టు సుందోపసుం
దులకై బ్రహ్మ సృజించె మున్ను సిరినా♦థుం గొల్చ నాఋక్షకా
ఖ్యలసద్దేహిఁ దిలోత్తమాఖ్యరమణిం♦గా వాండ్ర నిర్జింపఁగన్. 195

క. విను జన్మాంతరమునఁ జే,సిన మాఘస్నానమహిమ♦చేఁ బ్రాయంబున్
ఘనసౌందర్య మయోనిన్, జననము సంభవము నయ్యె ♦ సకలవిధములన్. 196

ఆ. తిన్నఁదనము మిగుల ♦ సన్ననినడుము దే,వతలనైన మోహ♦పరచునట్టి
మెఱుఁగుఁదీఁగ కెనయు ♦ మేను నప్సరసల, నందఱకిని మేటి ♦ యనఁగఁ బరఁగె. 197

తే. తనను సృజియించినట్టి వి♦ధాతకనులఁ,జూడ నాశ్చర్యమును గడుఁ♦జోద్యమయ్యె
ధాత యంతట నాతిలో♦త్తమను గాంచి, మిగులసంభరితుం డయి ♦ మిన్నకుండె.

సీ. సుగల నాసుందోప♦సుందులు వేధింపఁ, గమలాసనుం డున్న♦కడకు నొక్క
దినమున నరిగి వం♦దనములు గావించి, తమపడుపాట్లు వి♦ధాత కెఱుఁగ
వినుపింప దైత్యనా♦శనము నాలోచించి, ధాత పల్కెను దిలో♦త్తమను జూచి
ఆదానవుల నీవు ♦ హత మొనరింపఁగా, నాజ్ఞ నొసంగితి ♦ నరుగు మనఁగ
తే. రాక్షసులు నుండు చోటికి♦రయమునఁ జని, నర్మదానదియందును ♦ స్నాత యగుచు
మంకెనపుఁబూవులకును స♦మానమైన, ధాతుపటమును గట్టి సం♦తసము నొదవ. 199

చ. గణగణమ్రోఁతల న్మెరయుఁ ♦ గంకణముల్ మొలనూలు నందియల్
మని మలరన్ ధరించి కడు ♦ మౌక్తికహారములుం గళంబులన్
ఘనముగ వ్రేలఁగా రవల♦కమ్మలు కర్ణములన్ వెలుంగఁ గొ
ప్పున గురువిందపుష్పములు ♦ బొల్పుగఁ దాల్చి తిలోత్త మాదటన్. 200

సీ. అకాననమున న♦శోకవృక్షముక్రింద, వసియించి తిన్నని♦స్వరము మీఱ
వీణవాయింప న♦వ్వేళ నారాక్షస,భటులకు నాకాశ♦పథమునుండి
క్ష్మ కరుదెంచిన♦చందురునికళవలెఁ, గనుపింప సంతోష♦కలితు లగుచుఁ
దొందరఁగా నేఁగి ♦ సుందోపసుందుల, కెఱిఁగింప వృత్తాంత ♦ మిటుల నపుడుఁ
తే. దెలుపసాగిరి మాటికి ♦ దేవదైత్య,యక్షగంధర్వనాగక♦న్యకలయందు
నెవరొ నీవనమందు మా ♦ కెఱుక పడని, యొక్క స్త్రీరత్నమును గల ♦ దక్కజముగ.
తే. కామి గానట్టివానిని ♦ గామిఁజేయఁ,జాలు నాచిన్నదానిఁ గాం♦చను జనంగ
వలయు నని తెల్పు పరిజన♦వాక్యములకు, సంతసింపుచు నారాక్ష♦సవరు లధిప !

ఆ. అపుడు తామఁ జేయ♦నా జలక్రీడాది,పనులఁ దోడ నున్న ♦ వనితల విడి
సరసినుండి వెడలి ♦ సరగున సుందోప,సుందు లంత దానిఁ ♦ జూడఁగోరి. 203

చ. ఇను మొకనూలుబారువుల♦యెత్తుసరింగలవాని దీర్ఘ మా
ఘనగదలం ధరించి వడి♦గాఁ జనుదెంచెడినారి కామవ
హ్నిని రగులంగఁ జేయనగు ♦ నిందునిభాస్య సమస్తభూషలం
దనరుచు శక్తిరూపమును ♦ దాల్చిన దానిసమీపవర్తులై. 204

సీ. అతిలోత్తమకు వా ♦ రభిముఖులయి సురా,పానముచే దేహ♦పరవశమున
నొకరితో నొకడు సుం♦దోపసుందులు నిట్లు, వాదాడుకొనిరి నా♦భార్య హోమెఁ

దమ్ముఁడా! నే దీనిఁ ♦ దగ వరించెద నని, పలుక జ్యేష్ఠునివాక్య♦ముల కసహ్య
పడి సోదరుఁడు నాకుఁ ♦ బత్నిగాఁ గొనియెద, ననఁగ ని ట్లిరువుర ♦ కంత కంత

తే. కతిశయించిన కోపము ♦ నణఁపలేక, మైమఱపుచేతఁ గవలుచు ♦ మదగజముల
కరణిఁ బర్వతములమాడ్కిఁ ♦ గదనమునకుఁ, జొచ్చి తమచేతిగదలచేఁ ♦ జచ్చి రధిప!

తే. ప్రాణములఁ బాసి భూమిపైఁ♦బడిన దైత్య,వరుల సుందోపసుందుల ♦ వారిఘటులు
గని మొఱలుపెట్టసాగిరి ♦ కాళరాత్రి, కెనయు చిది వచ్చె నిద్పోటి ♦ కేల యనుచు.

మ. గిరిపక్షంబుల నేలఁగూల్చు పవిమా♦డ్కిన్ సుందుని న్వానిసో
దరుఁ డౌ నా నుపసుందునిన్ ధరణిమీఁ♦దన్ గూలఁగాఁ ద్రోఁచి వే
గిరపాటొంద విధాతసన్నిధికి నేఁ♦గెన్ వ్యోమమార్గంబునన్
సురలున్ మెచ్చఁ దిలోత్తమాంగన గడున్ ♦ సొంపారఁగా భూవరా! 207

సీ. అత్తరి బ్రహ్మ తి♦లోత్తమ నటుఁ జూచి, నీవు సేసిన పని ♦ దేవతలకు
మేలౌట నా కది ♦ మెచ్చువచ్చెనుగాన, భానుఁడు నాకాశ♦పథమునందు
నెంతకాలము నుండు ♦ నంతపర్యంతము, సూర్యుని రథముపై ♦ సుఖకరముగ
వసియింపు మని ధాత ♦ వర మొసంగెను విప్ర,కన్య మాఘస్నాన♦కారణమున

ఆ. నప్సరసలయందు ♦ నధికురాలై భాను,నరదమందు సుఖము ♦ లందికొనుచు
వెలుఁగుచున్న దనుచు ♦ విప్రోత్తముఁడు కా ర్త,వీర్యునకుఁ దెలిపె స♦విస్తరముగ.

ఆ. మఱల సిట్టు లనియె ♦ మనుజులు సద్గతిఁ, జెందఁగోరి మాఘ♦మందు స్నాన
మాచరింపవలయు ♦ నదిగాన నాస్తికు,లైన ఫలము గలుగ ♦ నదియు వినుము. 209

చ. ఇనుఁ డుదయించువేళ నెవఁ♦డేనియు మాఘమునందు స్నానమున్
ఘనముగఁ జేయు వానిఁ గనఁ♦గాను హరించునా గొన్నిపాపముల్
కనుక ననేకదక్షిణలఁ ♦ గ్రొలెడియాగము లెన్నిఁ జేయ నిం
పెనయఁగ నొక్కమాఘమున ♦ కెంతయు నీఁడునుగావు భూవరా! 210

ఆ. మాఘమాసమందు ♦ మనుజుఁ డే జలముల, స్నాన మాచరింప ♦ సద్గతికిని
మూలమగుచు నెసఁగుఁ ♦ బుణ్యతీర్థములయం,దైన నధిక ఫలము ♦ నలరునండు 211

సీ. పాపముల హరించి ♦ పావన మొనరింపఁ, గలిగిన యొకకథ ♦ గల దదియును
మాఘమాసస్నాన♦మహిమఁ దెలియఁజేయుఁ,గాన నీకుఁ జెపుదు ♦ దాని వినుము
గతకాలమందు మా♦ఘస్నానమును జేసి,నట్టికోమటితోడఁ♦బుట్టువాఁడు
నరకమునం దుండ ♦ నాకవాసునిఁ జేసె,ననఁ గార్తవీర్యుఁడు ♦ మునివరునికి

ఆ. ననియె నెటుల తమ్ముఁ ♦ డన్నకు నిరయముఁ, దొలఁగఁజేసె దీనిఁ ♦ దెలుపు మనుచుఁ
బలుకు రాజువాక్య♦ములకు దత్తాత్రేయుఁ, డనియె దానివిధము ♦ మనుజనాథ! 212

## —♦ వైశ్యుని చరిత్ర ♦—

సీ. విను మును కృతయుగ♦మున నిషధాఖ్యప, ట్టనమందు ధనదున ♦ కెనయు నొక్క-
కోమటి గలఁ డందు ♦ హోమకుండలుఁ డను,వాఁడు నాచారము♦వలన నగ్ని
బ్రాహ్మణపూజలు ♦ భక్తి నొనర్చుచు, సేద్యవర్తకములు ♦ సేయువాఁడు
గుఱ్ఱము లెనుములు ♦ గోవులు మొదలగు, పసురక్షణముచేతఁ ♦ బరగువాఁడు
ఆ. వంటచెఱకు పెఱుగు ♦ పాలు మజ్జిగ నెయ్యి, పేడ గడ్డి పండ్లు ♦ వేళ్లు నుప్పు
జాజి యింగు జీర ♦ జాపత్రి పిప్పలి, మిరిచి యేలకులును ♦ మెంతి శొంఠి. 213

తే. పక్కలాకులు కందులు ♦ వడ్లు పెసలు, నాదిగాఁగల వస్తుధా♦న్యములు నూనె
కూరగాయలు శర్కర ♦ గుడము మధువు, వస్త్రములు మొదలగునట్టి ♦ వస్తువులను.

తే. కొనుచు నమ్ముచు వైశ్యుఁడు♦గూర్చిన వర,హాలు నెనిమిదికోటులై ♦యధికధనముఁ
గలిగి లోకులు నిందింపఁ ♦ గఠినుఁ డగుచు, స్వాంతమున నది నిల్పి సం♦సారిపగిది.

క. తనసంపాదించిన ధన,మున నాలవపాలుధర్మ♦మున కుపయోగం
బొనరించె దానివివరము, వినుపించెద వినుము చెవులు ♦ విమలత నొందన్. 216

సీ. హరిపూజనములు శి♦వాలయములు తటా,కములు కోనేర్లు వ♦నము లనేక
పూలతోఁటలు నూరి♦బైలున నాలుగు,దిశలను జలువపం♦దిళ్ళు బీద
లకు నన్నసత్రము♦లను నిత్యదానముల్, మునుఁ జేయు పాతక♦ములకు శాస్త్ర
మందునఁ దనరు ప్రా♦యశ్చిత్త మతిథుల,సత్కార మాదిగా ♦ సకలపుణ్య
తే. కర్మలకుఁ గర్చుఁజేయుచు♦ధార్మికుఁ డని, ప్రజలు నెన్నఁగ కాల మా♦పగిదిఁ గడుపు
చుండ శ్రీకుండలుండు వి♦కుండలుఁ డనఁ, దనయు లిరువురు గలుగ నా♦తనికి నంత.

చ. ముదమున హేమకుండలుఁడు ♦ బుత్రులనుం గృహవర్తనంబులం
దధిపులఁజేసి సంపదల♦యాశ దొలంగి వనాంతరంబునన్
సదమలనిష్ఠచే నృహరి♦సన్నుతి ఘోరతపంబుఁ జేయుచున్
వదలిన దేహుఁడై హరిని♦వాసమునన్ వసియించె నెంతయున్. 218

సీ. అంత శ్రీకుండలుఁ ♦ డతనితమ్ముఁడు వికుం,డలుఁడు దుర్వృత్తుల ♦ మెలఁగి మిగుల
ధనవంతు లధిక సౌం♦దర్యవంతులు పిన్న,వయసువా రగుచు గ♦ర్వమున జూద
మాడి దుర్విషయము♦లందు నాసక్తులై, మంచిప్రవర్తనల్ ♦ మాని పరుల
భార్యామణులఁ బొందు♦వారునై తల్లిదం,డ్రులను వేధించి పె♦ద్దలపలుకులు
తే. వినక పిల్లనఁగ్రోవిచే ♦ వీణగీత,వాద్యములఁ బొద్దుఁ బుచ్చుచు ♦ వారవనిత
వెంటఁ దిరుగుచుఁ బాడుచు ♦ వెసను జూద,మాడువారలతో జూద♦మాడుకొనుచు.

ఆ. ధవళవస్త్రములను ♦ దాల్చి సువాసన, గలుగు మంచిగంధ ♦ మలఁది దేహ
ములను చేటముఖము ♦ లలర వారలు నూఱు,లిచ్చుచోట వేల ♦ నిచ్చి రధిప! 220

సీ. జనకుఁ డార్జించిన ♦ సకలాంబరములుఁ గాం,చనవరత్న భూ♦షణములుఁ బత
కములుఁ గంకణములుఁ ♦ గస్తురితిలకమున్, బరిమళద్రవ్యముల్ ♦ బరగఁ దాల్చి
యరదముల్ గజములు ♦ హయములపై నెక్కి, సంచరింపుచు వార♦సతులతోడఁ
గలయుచుఁ జవిగల్గు ♦ కల్లుఁద్రావుచు నటీ,జనులతో సకలదే♦శములుఁ దిరిగి
తే. చవిటినేలను గింజలు ♦ సల్లినట్లు, భట్టులకు నాట్యగాండ్ర క♦పాత్రదాన
ములు ననేకములుగఁ గొల్లఁ♦బుచ్చి రింట,నున్న ద్రవ్యమునంతయు ♦ సున్నఁజేసి. 221

తే. ఎల్లపాపములను హరి♦యించువాఁడు,ప్రాణికోటులఁ గలిగించు♦వాఁడు నైన
కేశవుని పూజ లెప్పుడు ♦ లేశమాత్ర,మైనఁ జేయుట యెఱుఁగ రో♦యవనినాథ!

క. క్రతువు లొనర్పఁగ బ్రాహ్మణ,వితతికి దానములుఁ జేయు♦విధ మెఱుఁగక దు
ర్మతులై తమధనమంతయు, సతత మపాత్రులకె కర్చు ♦ సమ్మతిఁ జేయన్. 223

క. ధన మీవిధముగఁ బోవఁగఁ, దినుటకు నన్నమును లేక ♦ దీనదశను బొం
దినవార లగుచు బంధుల,కును రోఁత జనింప నంత ♦ కుత్సితబుద్ధిన్. 224

తే. తాము కాపుర ముండిన ♦ గ్రామమందు, దొంగిలింపఁగ సొమ్ము నా♦సంగతి పుర
పతికి జనులకుఁ దెలియఁగ♦భయముఁగదుర,నడవిలోఁజొచ్చి స్వేచ్ఛావి♦హారులగుచు.

సీ. ప్రాణుల హింసింప ♦ బలమున జెట్టీలఁ, బోరువా రన్నద♦మ్ములు నిరువురు
పక్షులు కుందేళ్లు ♦ పందులు జింకలు, నెనుబోఁతు లుడుములు ♦ నేనుఁగులును
శార్దూలములు నాది ♦ సకలమృగంబులఁ, జంపుచు దేనిని ♦ సరకుఁ గొనక
వేఁటాడు పనులందు ♦ విహరింప నొకదిన, మన్న పర్వతమున ♦ కరుగఁ దమ్ముఁ
తే. డడవికిన్ని బోవ నప్పుడు♦నన్నయు నొక,పులికి లోఁబడి చచ్చెఁ ద♦మ్ముఁడును బాము
కాటునను గూలె వా రేక♦కాలమందు,నడఁగ శమనునిదూతలు ♦ నచటికిఁ జని.

ఆ. త్రాళ్ల నంటఁగట్టి ♦ తడయక పాపాత్ము,లైన కోమటులను ♦ యమునికడకు
నీడ్చుకొనుచు నేఁగి ♦ యేలినవాఁడ! తె,చ్చితిమి వీరి నేమి ♦ చేయవలెను? 227

చ. అన విని చిత్రగుప్తుఁడు ర♦యంబునఁ బ్రాణులపట్టిలో లిఖిం
చిన విధ మంతఁ జా నెఱిఁగి ♦ జ్యేష్ఠుని నిర్గతియందుఁ ద్రోయ నిం
పెనయఁ గనిష్ఠునిన్ సుఖము ♦ లీనెడు స్వర్గమునందు నుంపఁగా
ననుమతిఁజేయ నా శమను♦నాజ్ఞ శిరంబునఁ దాల్చి యెంతయున్. 228

సీ. అన్ని పనులయందు ♦ నధిక నేర్పరులగు, కింకరుల్ మదిని ని♦శ్శంక దనర
నా వైశ్యతనయులం ♦ దగ్రజు రౌరవ, మనెడి భయంకర♦మైన నరక
మునఁ ద్రోయ, వానిత♦మ్ముని బిల్చి ప్రియమైన,పల్కులతో నొక♦భటుఁడు ననియె
నో వికుండల! నీవు ♦ నావెంట నరుదెమ్ము,స్వర్గలోకము నిత్తు ♦ సంచిత మగు
ఆ. పుణ్యకర్మవలన ♦ భోగములను జెందఁ,గల వటంచు దూత ♦ పలుక సంత
సించి పోవుచుండి ♦ చిత్తమునం దొక,సంశయంబుఁ దోఁప ♦ శమనుభటుని. 229

చ. కని యిటుఁ బల్కె మేము నొక ♦ కర్జమునం జనియించి దుష్టవ
ర్తనల మెలంగుచుఁ బలువి ♦ ధంబుల పాపము లొక్కరీతిగఁ
గొనకొని చేయఁగా నరక ♦ కూపము నన్నకు స్వర్గభోగముల్
పనరుగ నాకు నేమిటికి ♦ వానివిధం బెఱుఁగంగఁ దెల్పుమా ? 230

తే. అని విభుండలుఁ డడుగ నా ♦ యమునిదూత, పలికె సోదరు లాలుబి ♦ డ్డలును జనన
మునకు సంబంధులేగాని ♦ పుణ్యపాప,కర్మ లొకరివి యొకరికిఁ ♦ గలుగ వెపుడు.

సీ. వృక్షమందు ననేక ♦ పక్షులు సేరిన,పగిది కుమారులు ♦ భార్య సోద
రులు నొకగృహమందుఁ ♦ గలసియున్నను నెవ, రెవరు నేకర్మము ♦ నెటులఁ జేయ
నవి వారికే భుక్త ♦ మగుఁగాని తక్కిన,వారల కెపుడు సం ♦ భవము గావు
కాన నీయన్న దుం ♦ ష్కర్మములను జేయ, నిరయమునకు నేఁగె ♦ నీవు పుణ్య
తే. కర్మ లొనరింప స్వర్గభో ♦ గములు గలిగె, ననుభవింపుము శాశ్వత ♦ మైన సుఖము
లనుచు యమదూతపలుకు వా ♦ క్యముల కలరి,పలికె నిట్లని వైశ్యుఁడు ♦ పార్థివేంద్ర!

ఆ. చిన్ననాఁటినుండి ♦ చిత్తము దుర్వృత్తు,లందు మెలఁగుచుండ ♦ నట్టిపాప
ములనె చేయుచుంటి ♦ పుణ్యము నే నాచ,రింపనైతి నెప్రదు ♦ నెఱుఁగుదేని. 233

క. వినుపింపు మనఁగఁ గింకరుఁ, డనఘా ! నే పుణ్యకర్మ ♦ లన్నియు నిపుడుఁ
వినుపించెద నవి యెఱుఁగుదు, నని కోమటితోడ భటుఁడు ♦ నపుడి ట్లనియెన్ 234

తే. వేదముల నన్ని చదివిన ♦ విప్రుఁడు హరి,మిత్రుఁడును వానిసుతుఁడు సు ♦ మిత్రుఁడతని
యాశ్రమను యమునానది ♦ యామ్యదిశను, గలదు విపినమునం దుండు ♦ కాలమందు.

సీ. అతనితో నీవు స ♦ ఖ్యముఁజేయ సత్పురు,షులసహవాసము ♦ గలుగ నెల్ల
పాపముల హరింప ♦ పావన మగు యము,నానది జలముల ♦ స్నాన మొనర
రెండుమాఘములు నం ♦ దుండి చేయఁగ నొక, దానిచేతను దుష్కృ ♦ తములు దొలఁగె
రెండవదానికై ♦ త్రిదశాలయప్రాప్తి,మయ్యె సుఖంబుల ♦ ననుభవింపు
తే. మనఘ ! యీయన్న నరకము ♦ లందు నసిత,పత్రములవల్ల నఱుకుడుఁ ♦ బడుచు రాల
పైని పొడిపొడిగాఁ జేయఁ ♦ బరగి నిప్పు,లందుఁ బడవేసియ యాతన ♦ లొందఁదగును.

చ. అనవుడు నన్నదుఃఖమున ♦ కాత్మ గలంగ సమస్తభోగముల్
దనకు లభింప నందుఁ బ్రిమ ♦ దం బలరం బులకాంకితాంగుఁడై
పైనఁగొన శోకహర్షములు ♦ ధీరము దక్కఁగఁ గాలుదూతతో
వినయము నేర్పుఁ జెంపొదవ ♦ వీనుల కింపుగఁ బల్కె నొక్కటిన్. 237

సీ. మంచివారికి నేఁడు ♦ మాటలచేత నే, కలుగుచున్నది చెల్మి ♦ గాన నీవు
స్నేహము నాతోడఁ ♦ జేసినవాఁడవై, యుపకార మొనరింప ♦ నోపవలయు
సర్వముం దెలిసిన ♦ సఖుఁడ! నే నెఱుఁగని, విషయములను విన ♦ వేఁడుకొనెద
మనుజులు నేకర్మ ♦ మున యమలోకముఁ, జూడరు దేనిచేఁ ♦ జొత్తు రనఘ !

తే. నేను నివి వినఁగోరెద ♦ నీదువలన, ననుచు వైశ్యుఁడు వలుక కా♦లునిభటుండు
నడుగఁదగినట్టి సంగతు ♦ లడిగితి వీక, నవియుఁ దెలిపెద ననుచు ని♦ట్లనియె దూత.

ఆ. మలినరహితమైన ♦ మనసుచే సద్బుద్ధి, గలుగుచుండు నాకుఁ ♦ గొలువునందు
నాశగల్గి సమయ ♦ మక్కఱలేదు నేఁ, దెలియునంతవఱకుఁ ♦ దేటపఱతు. 239

తే. బాల్యకౌమార యౌవన ♦ వార్ధకములఁ, బనుల వాక్కుల మనసునఁ♦బరుల కెపుడు
బాధసేయక యుండెడి♦వారు యముని, లోకమును బొంద రెప్పుడు ♦ ప్రాకటముగ.

ఆ. వేదశాస్త్రములను ♦ వివిధదానములను, జదువఁ జేయునట్టి ♦ జనుల ప్రాణి
హింసఁ జేయువార ♦ లెన్నివిధముల సద్గతిని బొంద రెంత♦కాలమునకు. 241

తే పరమధర్మము నేప్రొద్దు ♦ ప్రాణిహింసఁ, జేయకుండుటయే మహా♦శ్రేష్ఠమైన
యాగతపములు దానము♦లనుచు మునులుఁ బలుకుదురుగద! యెల్లభం♦గుల మహాత్మ!

క. నల్లులు చీమలు దోమలు, పిల్లులు మొదలైన యట్టి ♦ ప్రాణుల నెల్లన్
ఎల్లెడలను దనవలెనే, చల్లఁగఁ గనుఁగొనఁగ భూత♦సమభావుఁ డగున్. 243

తే. అట్టిపుణ్యాత్ము లెప్పటి♦కైన నినుప, మేకులను కట్టెనిప్పులఁ ♦ బ్రాకటమగు
దారిఁ ఛ్రోతతరంగిణి ♦ యేరు నరకములను యాతనలను బొందఁ♦బోల రనఘ!

—♦ జీవహింసకు లొందు నరకములు ♦—

సీ. జలముల భూమిపై ♦ సంచరించెడు మీన, ముల మృగంబుల వృక్ష♦ముల వసించుఁ
బక్షులఁ దనదుసం♦రక్షణకై హింసఁ, గావించువారలు ♦ కాలసూత్ర
నరకమందును బడి ♦ పొరలుచు శునకమాం, సమును భుజింపుచుఁ ♦ జడులపగిది
రుధిరము చీమును ♦ గ్రోలుచు గడునస, హ్యమును దుర్గంధము ♦ నైన పంక
ఆ. మున మునింగి క్రింది♦ముఖములు గల కీట, కములు గఱచుచుండఁ ♦ గడుభయమును
గలుగఁజేయు నంధ♦కారములోఁ గన్నుఁ, గనుపడక యొకరిని ♦ దినుచు నొకరు. 245

తే. భయముపుట్టించు రవముతోఁ♦బలువిధముల, నొఱలుఁ బెట్టుచు నేడ్చుచు♦నరకమందు
నిటుల నొకబ్రహ్మకల్పము ♦ నేఁగునంత, కాల మందుండి పిదప వృ♦క్షముల నలరి.

సీ. బహువత్సరము లుండఁ♦బడుచుఁ గ్రూరములైన, శార్దూలసింహాది ♦ సకలయోను
లందుఁ బుట్టుచు మృతి♦నొందుచుఁ గడపట, గ్రుడ్డివారును మఱు♦గుజ్జువారు
నేకాక్షులును గాళ్లు♦నీచబోయినవారు, బహుళదరిద్రులు ♦ ప్రాణిహింసఁ
జేయుచునుండెడి♦బోయలు మొదలైన, హీనులై జన్మింతు ♦ రెవరునైన
ఆ. నిహపరముల రెంట ♦ హితవుఁ దలంచిన, వారు మనము వాక్కు ♦ పనులయందు
నేకమగుచు జీవ ♦ హింసకునెపు డొల్ల, రట్టివారు జెంద ♦ రాపదలను. 247

క. సరిగా వంకరగా సాగరమందున నెల్లనదులు ♦ గలసినభంగిన్
ధరలో ధర్మములన్నియు, నరయంగ నహింసయందు ♦ నలరుచునుండున్. 248

ఆ. ప్రాణికోటి కభయ♦దానము నిడువాఁడు, పుణ్యతీర్థములకుఁ ♦ బోయి స్నాన
మాచరింప నెల్ల♦యాగములను దీక్ష,సేయునట్టిఫలముఁ ♦ జెందఁగలఁడు. 249

సీ. బ్రహ్మచారిగృహప్ర♦వర్తి వానప్రస్థు, సంన్యాసి వీ రను♦స్థానములను
జక్కఁగా నడపిన ♦ స్వర్గలోకమునందు, వసియింపఁజొత్తురు ♦ వర్ణములను
ఆశ్రమముల ధర్మ♦మలరుచు శాస్త్రము,లందుఁ దెల్పినవిధ ♦ మాచరించి
అటులఁ జరించుఁ బు♦ణ్యాత్ములు నింద్రియ,జయమునఁ బరమేష్ఠి♦సదనమునకు
తే. వరుగుదురు వైశ్వదేవము ♦ నతిథిపూజ, లగ్నిహోత్రము సత్యము ♦ నాదిగాఁగఁ
బుణ్యకర్మల జరుపుచుఁ♦బొలుపు మిగుల, వేదపఠనము సేయుచు♦వోద మొదవ.

చ. చెఱువులఁ నోఁపులుం దిగుడు♦చేమడు బావులు బీదవాండ్రకున్
దిరముగ నన్నదానములు ♦ దేవళముల్ దగఁ బంచయజ్ఞముల్
కర మనురక్తిచే జరుపఁ♦గల్గినవారు కృతాంతుపట్టణం
బెఱుఁగక స్వర్గమందె వసి♦యింతురు భోగములందు నీఁగుచున్. 251

తే. విషయములయందుఁ గోరిక♦విడచి వేద,పఠన దేవునిపూజ లౌ♦పాసనాది
బహుళకార్యాభిరతులగు ♦ బ్రాహ్మణులకు, స్వర్గలోకము గలదు ని♦స్సంశయముగ.

తే. శత్రువులు చుట్టుగ్రమ్మిన ♦ సమయమందు, భీతినొందక ముఖమును ♦ వెన్కవేసి
కొనక రణమందు నిల్చిన♦కోవిదు లెపు, డింద్రలోకమునందు వ♦సింతు రనఘ!

తే. వారిజాక్షుల గోవుల ♦ బ్రాహ్మణులను, శరణుఁజొచ్చినజనుల ర♦క్షణము సేయు
కొఱకుఁ బ్రాణములైనఁ బోఁ♦గొట్టుకొనెడి, వారలు త్రివిష్టపంబును♦వదల రెపుడు.

తే. కుంటివాండ్రను బసివాండ్ర♦గ్రుడ్డివాండ్ర, ముసలివాండ్ర దరిద్రులఁ ♦ బోష్యవర్గ
మెవరు సేయఁగఁ జాలువా♦రెపుడు నింద్ర,లోకమందు వసింతురు ♦ ప్రకటముగ.

సీ గోరక్షణము నగ్ని♦గురుదేవతల నెల్ల,వారిని బూజించు♦బ్రాహ్మణులకు
దేవలోకము నొక♦గోవు దాహము దీఱు,నంతనీ రుండెడి ♦ గుంత నొకటి
త్రవ్వించువారు న♦రకముఁ జూడరు నూతు,లను బావులను జెఱు♦వులను ఘటింప
నది గొప్పధర్మమౌ ♦ నందు నెల్లప్పుడు,జలభూములందున ♦ సంచరించు
ఆ ప్రాణికోటి నీరుఁ ♦ ద్రావి వర్ధిల్లు నీ,ధర్మమునకు నంతుఁ♦దగులనట్టి
పనులు సేయువార♦లనిశము జలదాన,పరు లటంచు బుధులు♦పలుకనైరి. 256

తే. బావులఁ జెఱువులనునీరు ♦ ప్రాణికోటు, లెంత హెచ్చుగఁ ద్రావుదు ♦ రంతగొప్ప
ఫలము త్రవ్వించువారికిఁ♦బ్రాప్త మగును,బుణ్యమగు స్వర్గమందునఁ♦బొలుపుమిగుల.

ఆ. నీటియందుఁ బ్రాణి♦నివసించుఁ గావున, సకలజీవులకును ♦ జలమె జీవ
నముగ నుండు జీవ♦నమునకు నాధార,ములను జూప నాక♦మున వసించు. 258

సీ. మాకందముల నైదు ♦ మారేడు లుసిరిక,వెలగల మూఁడేసి ♦ వేప రావి
చెట్లు నొక్కొక్కటి ♦ చింతలు పది వట,వృక్షము నొకటిగా ♦ నేరుపఱచి
తోఁపువేసిన వాని♦దురితము లన్నియుఁ, దొలఁగి స్వర్గమునందుఁ♦గలుగుసుఖము
వేడిని బోఁగొట్టు♦నీడలు గల మార్గముఁ, లైదైనఁ బదియైన ♦ నవనిపైని
ఆ. వేయ మేలు వాని♦ వేళ్లు నాకులు పుష్ప,ములను బండ్లచేత♦మునులకుఁ బితృ
దేవతలకుఁ దృప్తిఁ♦గావింతు రందుచే,నధిక ఫలము గలుగు ♦ ననఘచరిత! 259

ఆ. దట్టమైన చల్లఁ♦దనమున నలరెడి,వృక్షములను నాటి ♦ పెంపుసేయు
నట్టివాఁడు సమిధ ♦ లగ్నిలో నెయిఁ జేర్చి,వేల్చు ఫలము నొందు♦విమలచరిత!260

ఆ. భూమిమీఁద వృక్ష♦ములు వేసి పెంచిన,నాతఁ డెల్లకాల ♦ మన్నసత్ర
ములను యాగదాన♦ములఁ జేయుపుణ్యాత్ముఁ,డగుచు స్వర్గలోక♦మందు నిలుచు.261

తే. విరుల నాకుల ఫలముల ♦ విస్తరించి, మంచినీడలచే నొప్పి ♦ మార్గములను
గలుగు వృక్షములను నర♦కఁజనువారు, నిరయమున నెల్లకాలము ♦ నిలుతు రనఘ!

చ. తులసి సమస్తదోషముల ♦ దూరముచేయును గోర్కు లన్నిటిం
గలుగఁగఁజేయు నెందు నది♦కన్పడు తామగ లెందునుండునో
పలువురు వైష్ణవుల్ సతము ♦ బాగుగ నిల్చెద రట్టిచోటులం
దలవడ విష్ణుమూర్తి మన♦మాఱ వసించును నక్కడక్కడన్. 263

## తులసీమాహాత్మ్యము.

సీ. కానఁ దులసి వేయు ♦ మానవులకు యమ,కూపబాధలు లేవు ♦ కొంచెమైన
తనకులాచారము ♦ తప్పి చలింపక, సఖుల విరోధుల ♦ సమతఁ గాంచు
చలరి పరులసొమ్ము ♦ నపహరింపక గొప్ప, మనసుచే వర్తించు ♦ మనుజుఁ డెపుడు
హరిభక్తుఁ డనుచు నీ ♦ వెఱుఁగు మాతనియింట, తులసి గల్గిన యమ♦దూత లందుఁ
తే. బోరు నది పుణ్యతీర్థముఁ ♦ బోలినదగు, తులసి నాటిన దానివి♦త్తులును దళము
లెంత పర్యంత మవనిపై ♦ నెసఁగు నంత,కాల మాతఁడు విష్ణులో♦కమున నుండు.

ఆ. ముక్కుగోళ్లఁ దులసి ♦ మూర్కొనువారి పి,తరులు సంతసించి ♦ తార్క్ష్యవాహుఁ
డగు పరమపదుండు ♦ నగు విష్ణుదేవుని, నిలయమునకు నేఁగి ♦ నిలుతు రచట. 265

తే. నర్మదాదర్శనము నతి♦ నిర్మల మగు, జలము గలిగిన గంగలో♦స్నాన మాచ
రింపఁ దులసీదళంబు ధ♦రింప నివియు, మూఁడు సమ మని చెప్పనొ♦ప్పును కుమార!

ఆ. తులసి వేసి పెంచి ♦ జలములచే దాని, పరిమళమును భక్తి♦పరుమకొనుటఁ
గనుట నందువలనఁ ♦ గలిగిన ఫలమున, సకలదోషములును ♦ సమయు ననఘ!

క. ప్రతిపక్షమందు ద్వాదశి, నతులితమగు తులసిచేత ♦ నజుఁ డింద్రాదుల్
హితవుగ శ్రీహరిపూజలు, సతముగఁ జేయుదురు మదికి ♦ సంతసమొదవన్. 268

సీ. బంగారు రత్నపు◆ష్పములఁ బూజించిన, ఫలము తులసిలోని ◆ పదియు నాలు
పాలైన నియ్యా నో◆పదు నూఱునావుల, వేయిమామిడిచెట్లు ◆ వేసి పెంచు
ఫల మెన్నఁగా నొక్క◆తులసిమొక్కను నాటఁ, గలుగును విష్ణుపూ◆జలకుఁగాను
తులసివనము వేయఁ ◆ దుదకు స్వర్గము నొంది, శతసహస్రయుగము ◆ లతిశయముగ
ఆ. నిలుచు నెవరు లేత◆తులసీదళములచే, హరిహరులకుఁ బూజ ◆ లనవరతముఁ
జేయు వారి గృహముఁ ◆ జేరరు యమదూత, లెపుడు సందియంబు ◆ నేమి లేదు.

తే. గంగ మొదలగునదులు పు◆ష్కరములు గల, తీర్థములు విష్ణుదేవుఁడు ◆ దేవతలును
తులసియందు నివాసులై ◆ సలలితముగఁ, గదలకుందురు సంతోష◆కలితు లగుచు.

ఆ. తులసినాటి వాని◆దళముల నెవ్వరు, హరిని బూజసేతు ◆ రట్టివారు
నాల్గుభుజములు గల ◆ నందకధరుఁ డుండు, నిలయమునకు నేఁగి ◆ నిలుతు రచట.

## శివపూజాప్రభావము.

సీ. అనిశము నొకటి రెం◆డును మూఁడుకాలము, లందుఁ బూజింప శ్రీ◆హరిని నర్మ
దానదియందు ను◆ద్భవమైన లింగము, సైన రత్నముచేత ◆ నలరు లింగ
మైన స్ఫటికలింగ◆మైన స్వయం వ్యక్త, మగు లింగమైన పు◆ణ్యస్థలములఁ
దీర్థములందుఁ బ్ర◆తిష్ఠించువానికి, మహిమ గల్గిన "ఓం న◆మశ్శివాయ"
ఆ. యనెడి మంత్రములఁ ◆ నావాహనముఁజేసి, జపము నర్చనలను ◆ శక్తికొలఁదిఁ
జేయువారు యముని ◆ జేరుటగాని త, త్కథలు చెవుల వినుట◆గాని లేదు. 272

ఆ. శివుని పూజమహిమ◆చేత శుభముల కా, సక్తి గలుగునట్టి ◆ భక్తులు శివ
లోకమందు నిందుప్ర◆లు పదియు నల్వురుఁ, దొలఁగునంతపఱకు ◆ నిలుతు రనఘ!

క. ఒకపని గల్గిన మతి వే, ఱొక నెపమున శివునిపూజ ◆ నొనరఁగ నెవరున్
వికలము నొందకఁ జేసినఁ, బ్రకటితముగ భవునిలోక◆పదవిని బొందున్. 274

ఉ. కొండలు పిండిసేయు బల◆కోవిదు లంబుధినీరు నేమి లే
కుండఁగఁ ద్రావ నేర్పుగల ◆ యోధులు నేలయు నింగి రెండు ను
ద్దండతఁ గ్రిందు మీఁదగు వి◆ధంబునఁ ద్రిప్పఁగఁజాలు ధాత నా
ఖండలముఖ్యులం దృణము◆గాఁ గనువారలు శంభుభక్తులే? 275

ఆ. శివునికింకరులకుఁ◆జేయ శక్యముగాని, కార్య మేది యంత◆కఠిన మైన
సకలవిషయములను ◆ సాధింతు రని వై, శ్యు, తోడ నిటుల ననియె◆దూత మఱల.

సీ. శివునిపూజ మహిమఁ◆జెప్పెద విను మనో, హరము మిగులఁ గాంతి◆నలరు తనువు
సత్యముఁ ద్యాగముఁ ◆జక్కనిమాటల, నేర్పును శూరత్వ◆మేర్పడుటయు
లోకప్రసిద్ధి గ◆ల్గును బ్రహ్మసృష్టిని, గరుడవాహనుఁడు రా◆క్షసులఁ జంప
బలిచేత దానముఁ ◆ బడయుట శివపూజఁ, జేయ సంభవమయ్యెఁ ◆ జెలువ మమరఁ

తే. గర్ణునకు దానశీలత ♦ కార్తవీర్యు,నకును శూరత్వముఁ గుబేరు♦నకు ధనంబు
ద్రోపదికి మంచిమగలును ♦ ధ్రువున కున్న,తస్థలము శివపూజచే♦తను లభించె. 277

సీ. వాక్పతిత్వము బృహ♦స్పతికి నాలమునందుఁ, గెలుపు నర్జుననకుఁ ♦ గృష్ణున కతి
మహిమ గలుగ నగ♦స్త్యమౌని సంద్రపునీరుఁ,ద్రావ వసిష్ఠుఁడు ♦ బ్రహ్మతేజ
మును ధరించుట వాయు♦పుత్రుఁ డంబుధి దాట, రామచంద్రుండు వా♦రధిని గట్ట
కలకంఠపూజచేఁ ♦ గలిగిన ఫలమగు, మంత్రముతోనైన ♦ మంత్రహీన
ఆ. మననుగాని పత్ర♦పుష్పము శివునిపై,నుంచ బహుతరముల ♦ నుద్ధరించు
మూఁడులోకములకు ♦ ముఖ్యము గల శివ,పూజ దేనిసాటి ♦ బోల దరయ. 278

ఆ. విష్ణుభక్తులైన ♦ విబుధులు సుగతికిఁ, జేరుచుందు రందు ♦ శివుని నిందఁ
జేయువారు పాప♦చిత్తులై నరకము,నందుఁ గూలుచుందు ♦ రనవరతము 279

క. శివునకు నర్పించిన వ,స్తువులందున నేది గొనిన ♦ దోషము గలుగున్
శివనిర్మాల్యము బావి చె,రువులందున వేయఁదగు ని♦రూఢిగ నెవరున్. 280

తే. ఆశఁ దనరఁగ నీఁగకా♦లంత యైన,నెఱిఁగి యెఱుఁగక యెవరు శం♦కరుని సొత్తు
ననుభవించిన నొకపరి♦శయము వలకును, నిర్గతినిఁ బొందుచుందు ర♦నర్గళముగ.

తే. గడ్డి మ్రోఁకుల జాల శం♦కరున కాల,యమును గట్టించు పుణ్యాత్ము♦లైనవారు
శివునిదాపున సంతోష♦చిత్తులగుచు, శివునితోఁగూడి యుందురు ♦ చెలువ మమర.

తే. బ్రహ్మవిష్ణ్వీశ్వరుల యను♦గ్రహముఁ బొందు,నట్టివారలు చిరకాల ♦ మతిశయముగ
వారిలోకములందు న♦వారితముగ, నలరుచుందురు సకలసౌ♦ఖ్యముల ననఘ! 283

సీ. పసువులకొట్టము ♦ ల్బాటసారులు నిల్వఁ, జల్లనీడలు గల♦సావడులును
సన్యాసు లుండెడు ♦ శాలలు కడుబీద,లకు దిక్కులేనివా♦రికిని దగిన
గుడిసెలు విప్రుల♦గుంపు వేదములను, జదువుటకు విశాల♦సత్రములును
జలివేంద్రములను బ్రా♦హ్మణులకు గృహంబులుఁ,గట్టింప స్వర్గలో♦కమును గల్గు
తే. పైనఁ దెల్పిన వేనైనఁ ♦ బాతగిలిన, బాగుఁ జేయించువారి కి♦బ్బడిఫలంబు
దొరకుఁ బాపాత్ములకు యమ♦పురిని సకల,సంకటములును గల్గు ని♦స్సంశయముగ.

సీ. ధనలోభమున నన్న♦దానసత్రముల దే,వాలయములకు సం♦న్యాసులమఠ
ములయందు నధికార♦ములు గలవారలుఁ,గర్మపరిత్యాగ♦కారణులయి
భయము మిక్కుటమగు♦బాధ నొందఁగఁజేయు, రౌరవమనెడి న♦రకమునఁ బడి
బహుతపింతురు యతీ♦శ్వరుల నాశ్రమములఁ,గల పుష్పములు పండ్లు♦జలములు మఱి
తే. యన్నమును దినువారు మ♦హానరకము,లిరువదొకటింటఁ బడి కడు ♦ నీతిబాధ
లనుభవింతురు సంన్యాసు ♦ లన్న మెవరుఁ,దినఁగరా దెప్పటికినైనఁ ♦ దెలివిమాని.

క. వినువారలు చాంద్రాయణ,మును జేయఁగవలయును మత♦మున కధికారం
బును గలవారలను స్పృశిం,చిన స్నానముఁ జేయనగును ♦ జేలంతోడన్. 286

తే. బ్రహ్మ కేశవశంకరా♦ర్చనలకొఱకు, బూలతోఁటలు వేయించు♦పుణ్యపురుషు
లమితకాలము దేవలో♦కమున సకల,సౌఖ్యములఁ బొందుచుందురు ♦ సంతసమున.

తే. దేవతల పితరులఁ జాలఁ♦దృప్తిఁబరచు, నట్టివారలు లోకము♦లన్నిటికెని
శ్రేష్ఠమగు బ్రహ్మసదనముఁ♦జేరి ప్రళయ, కాల మంతటిపఱకు న♦క్కడ నిలుతురు.

ఆ. మందిరమున కతిథి ♦ మధ్యాహ్నమున రాఁగ, వేదమును బఠించు ♦ విప్రుఁ డైనఁ
దొడరి మూఢపండి♦తులు నైనఁ బామరు,లైన బ్రహ్మలో స♦మాను లరయ. 289

ఆ. దారి నడక లేక ♦ దాహ మాఁకలిఁ గొన్న, బ్రాహ్మణునకు నన్న♦పానములను
దృప్తిపరచి యాద♦రించినవారలు, స్వర్గమున నిలుతురు ♦ సౌఖ్యములను. 290

తే బాటసారులు క్షుద్బాధఁ♦బాపుకొనుట,కొఱకు నెవ్వఁడుఁ జూచి గృ♦హస్థుఁగనట్టి
యెవనియింట భుజించు నా♦గృహనివాసుఁ, డనఘ! చిరకాలస్వర్గసౌ♦ఖ్యములనందు.

క. సాయము మధ్యాహ్నమునం,దే యింటను నతిథు లాద♦రింపఁబడుదురో
నాయింటివాఁడు యమపురి, నేయెడలను జూడఁబోవఁ ♦ డెప్పటికైనన్. 292

తే. అతిథివచ్చిన లేదు పో♦దన్నమంచుఁ, బలుకు మాటలు విని విన్నఁ♦బాటు నొదవఁ
బోవ నాయింటియజమాని ♦ పుటకనుండి,జేయుపుణ్యము నతిథికిఁ♦జెందు ననఘ!

తే. అతిథిఁబోలిన బంధువుఁ ♦ డవనిఁ గలఁడె, అతిథిపూజల మహిమచే ♦ నవనివిభులు
మునులు బ్రహ్మపదంబును ♦ బొంది యెప్పు,డచట జలనము నొందక♦నలరి రనఘ!

తే. అతిథి నేమఱుపాటున♦నైన నధిక,జనులమధ్య నొకానొక♦సమయమందు
నైనఁ బూజించునట్టి గృ♦హస్థుఁ డెపుడు, యమునిజూడఁడు యేసమ♦యమున నైన.

సీ. అన్నదానముఁజేయు♦నట్టి పుణ్యాత్ములు, చక్కఁగ నెల్లు పు♦ష్పకమునందు
మెలఁగుచు నమృతంబె♦లలి భుజింపుచుఁ బుణ్య,మైపోవ స్వర్గము♦నందు మెలఁగి
మంచిధారుణిని జ♦న్మించి భారతఖండ,మునకు రాజగు నన్న♦ము నిడు వాఁడు
అభివృద్ధిగల వంశ♦మందునఁ బుట్టి దీ,ర్ఘాయుష్యవంతుఁడై ♦ గణుతికెక్కు

ఆ. నధికప్రాణులకును ♦ నన్న మాధార మా,దాన మెవరుఁ జేయఁ ♦ బ్రాణదాన
మునకు సమ మటంచు ♦ బుధులు వచించి రొ,కప్పు డిందురిపుసుముఖమున నుండి.

తే. వసుమతికి వచ్చు కేసరి♦ధ్వజునిఁజూచి, యముఁడుదయతోడఁ బలికెఁ♦ట్లనుచు రాజ!
కర్మభూమిని జన్మించఁ♦గలవు మఱల, నీకు మనమునఁ గలదేని ♦ నాకసుఖము. 297

ఆ. పెట్టు మన్న మనుచు♦గట్టిగ మువ్మాఱుఁ, బలుకుమాట లేను ♦ దెలిసికొంటెఁ
గాన నేది యన్న♦దానముతో సరి,గాదటంచు దృఢము♦గాఁ దెలిపితి. 298

ఆ. ఉష్ణకాలమునందు ♦ నుదకము శీతల,కాలమందు వంట♦కట్టెలును
మొగిని నన్నమిచ్చు♦బుణ్యులు యమునియా,తనల కెప్పటికెని ♦ దగులువడరు. 299

క. కరణత్రయమునఁ జేసినఁ, బురుషుని దురితములు నన్ని ♦ పోవుట కొఱకై
యిఱవుగ నాలునెలల కొక, పరిఁ బ్రాయశ్చిత్త మొనరఁ ♦ బడయఁగవలయున్.

తే. అటులఁ జేయక యిష్టమై♦నట్లు దిరుగు, వారు నరకములంబడి ♦ వనరుచుండ్రు
క్షితిని బుణ్యంబుఁజేసిన ♦ సిద్ధదేవ, గణము లుండెడి యింద్రలో♦కమున నుండ్రు.

సీ. ఆమ్నాయమాత గా♦యత్రిని గాని త, త్సంబంధమైన మం♦త్రమును గాని
జపియింపఁ బాపపుం♦జములు నశించు న, క్కఱతో నహర్ముఖ♦కాలమందు
సాయముపాసనఁ ♦ జక్కఁగాఁ జేయుచు, వేదములఁ బఠించు ♦ విప్రులుచిత
మగు పుణ్యగతిఁ బో♦వఁగఁ జాలుదురు నిరం, తరమును జేయు కృ♦త్యములఁ దవిలి
తే. పుణ్యతీర్థములందు నే♦ప్రొద్దు స్నాన, మాచరింపుచు బాహ్యేంద్రి♦యముల వశము
గలుగువారలు నతిభయం♦కరుఁడునైన, యముని జూడరు యెన్ని వి♦ధములకైన.

చం. నిరతము షట్క్రియ ల్సలుప♦నేర్చినవారలు నెవ్వరేనియు
న్బరగృహభోజనంబుఁ బర♦భామలు నేసిన వంటకంబు నేఁ
గరమున నేని వంటఁజనఁ♦గాఁ దగ దంటిరయేని వారివౌ
దురితముఁ జెంది పుణ్యజన♦దూరులు నౌదురు నట్టి రెల్లరున్. 303

ఆ. దానములను గొనుట ♦ ధారుణీసురులకుఁ, దగునటంచు నన్ని♦దానములను
బట్టఁగూడ దెపుడుఁ ♦ బరగృహముల భోజ, నము నొనర్పఁబడును ♦ నరకములను.

తే. ఎవఁడు కాలత్రయమునందు♦ నేమఱకయ, స్నానమును జేయు సకలదో♦షములుదొలఁగి
యమునిసంబంధమైనట్టి♦యాతనలను, బరగు దుఃఖముఁజూడఁ డె♦ప్పటికి నైన.

సీ. ప్రతిదినస్నానము♦వలనఁ బవిత్రులై, యుందు రుదయకాల♦మందుఁ జేయ
బాహ్యాంతరముల నే♦ర్పడిన కల్మషములు, హరియించి పరిశుద్ధుఁ♦డగు నతండు
స్నానము లేక భో♦జనముఁ జేసిన మల, భక్షకుం డనుచు దే♦వతలు నతని
గనులఁ జూడక వెను♦కకు మోముఁ ద్రిప్పుదు, రశుచి పాపాత్ముఁడై♦నందు వలన
ఆ. అట్టివాఁడు నరక♦మందునఁ బడి కడ, పటను మూలఁ డగుచుఁ♦బ్రభవ మందుఁ
బాలునదులయందుఁ ♦ బరిశుద్ధ జలముల, స్నానమాడఁ గలుగు ♦ సద్గతియును. 306

ఆ. ఎవఁడు తిలలతోడ♦ నేర్పరచిన పద్మ, ములను బాత్రములను ♦ సలలితముగఁ
బాత్రులకును శాస్త్ర♦పద్ధతి దానముఁ, జేయ దుర్గతికిని ♦ జేరఁ డతఁడు. 307

సీ. బంగారమాదిగాఁ ♦ బదియారు దానము, ల్సేసిన స్వర్గము ♦ జెందు నతఁడు
పర్వము లగు వ్యతీ♦పాతముల మకర, సంక్రాంతులందున ♦ స్నాన దాన
ములఁ జేయువారు య♦మునిలోకమున భీతి, కర మగు రౌరవ♦నరకములను
బొందరు మఱుజన్మ♦మందు దరిద్రుల, యింటఁ బుట్టరు నిజ ♦ మెపుడుఁ బల్క
తే. వారు మితభాషులును విను♦వారలకును, సమ్మదంబుగఁ జేయు ప్ర♦సంగములును
నోర్పుగలవారు కోపము♦నోర్వలేని, తనము లేకుండుటలు తిన్నఁ♦దనము లైన.

తే. తగినమాటలు మొగమాట♦ముగలవారు, ప్రాణులందున దయగల♦వారు నొకరి
పగు రహస్యప్రసంగతు♦లన్య్య లెఱుఁగు,నటుల బహిరంగ మొనరింప♦నట్టివారు.

తే. మంచిగుణములు పరులవి♦యెంచువారు, నితరసామ్మ్రము దృణముగా♦నెంచి మాన
సమునఁ దలఁపనివారు నా♦శమనుపురిని,గఱగు యాతనలను గండ్లఁ♦గాన రెపుడు.

తే. పరులపై లేని నిందలు♦పలుకువారు, కలుషములయందు నాసక్తి♦గలుగువారు
కఠినమాటలు నాడు దు♦ష్కర్మలు నొక,ప్రళయ మందురు నరకకూ♦పంబునందు.

సీ. పరులుసేసిన మేలు♦మఱచిన పాపక,ర్మలకుఁ బ్రాయశ్చిత్త♦ముగ ననేక
పుణ్యతీర్థస్నాన♦ములు దపంబులు జేసి,నను విడువక యది♦నరకయాత
నలను బాధింపు నీ♦యిలఁగల నదులందు, స్నానము నింద్రియ♦జయము హితవు
గల తిండి తక్కువ♦గా భుజించినవాఁడు, కాలుని నగరము♦పాలు గాఁడు

ఆ. పుణ్యతీర్థములకుఁ బోయిన నచ్చోట, దోషకృత్యములకుఁ♦దొలఁగవలయు
భుక్తికొఱకు యాత్ర♦బోఁగూడ దేఁగినఁ, బరులద్రవ్యముఁ గొనఁ♦బాడి కాదు.312

తే. తాను జేసిన ధర్మ మి♦తరుల కమ్మ, మానవలె తీర్థములఁ గొన్న♦దానములను
గెలువ శక్యముగానట్టి♦కలుషములయి, నరకములఁ బొందు నాతఁడు♦దురితదూర!

ఉ. ఏనరుఁ డేని దుష్కృతము♦లెన్ని గణించిన నవ్వియెల్ల, గం
గానది నీటిలో మునుఁగఁ♦గా నశియించి పవిత్రుఁడౌను,భూ
దానము నాదిగా సకల♦దానములు న్వ్రతము ల్జపంబులు
స్నానది నీటిబొట్టున క♦పన్నియుఁ బోల్పఁగఁజాల వెంతయున్. 314

ఆ. సకలతీర్థములకు♦సమముగా గంగాన,దిని దలంచనట్టి♦మనుజుఁడు నర
కమునఁ బడుచుఁ దడవు♦కాలము పెక్కు బా,ధలను బొందుచుండు♦ధర్మనియతి.

ఆ. ఎవ్వఁ డిది పురాణ♦మేకద! శ్లాఘనఁ,గాని యితరమేమిఁ♦గాదటంచుఁ
బదరుచుండు పాపి♦పడు నిరువదియొక్క,తరమువారితోడ♦నరకములను. 316

సీ. ధర్మమార్గమున కా♦ధారమై తీర్థము,లన్నింటికిని మూల♦మైనదియును
విష్ణుసత్పదమున♦వెడలి మహాదేవు,తలమీఁద కుదురుగ♦నిలచినదియుఁ
గడునిర్మలంబైన♦గంగానదీనీర,ములు పరబ్రహ్మమై♦యలరుచుండు
నందుకు సందేహ♦మనరాదు బ్రహ్మాండ,మున దానికి సమాన♦ముగల తీర్థ

ఆ. మొకటి లేదు నూరు♦యోజనముల దూర,మందు గంగ గంగ♦యని దలంప
నెల్లపాపములు హ♦రించినవాఁడునై, విష్ణుపదవి నొందు♦విమలచరిత! 317

కం. గంగాస్నాన మొనర్చిన, గంగం గలసి చను నెల్ల♦కలుషవ్రజ మీ
సంగతి నెఱింగి యెల్లరు, గంగాస్నానం బొనర్పఁ♦గావలెఁ జుండీ. 318

ఆ. దానముం గ్రహింపఁ♦దగు బ్రాహ్మణుండైనఁ, బుచ్చుకొననివాఁడు♦నిచ్చవచ్చు
రూపమూని చాల♦దీపించు స్వర్గంబు,నందు సౌఖ్యపదవు♦లందుచుండు. 319

కం. ప్రాణాయామ మొనర్చిన, యేనరుఁ డినసుతుని పురము ♦ నెఱుఁగఁడు బో వి
న్నాణముగఁ దపముఁజేసిన, వానికి దురితములు తొలఁగి ♦ స్వర్గము గలుగున్. 320

కం. దినము పదియాఱుమాఱులు, పనుపడ నొక యాఱునెలలు ♦ ప్రాణాయామం
బును జేయ భ్రూణహత్యను, నొనరించిన పాతకములు ♦ నొనరుగఁ దొలఁగున్.

వ. అని వెండియు నిట్లనియెఁ బ్రతిదినమును జేయఁబడిన తపములు, వ్రతములు, నొక్కపొద్దులు మొదలగు నియమములు, వేయిగోదానములు నొకప్రాణాయామములతో సమానములు గావు. నెల కొకపరియాయము దర్భకొనవలనఁ బడునట్టి జలబిందువులఁ ద్రాగి, నూరువత్సరములు నడపునట్టి వ్రత మొక ప్రాణాయామముతో సమానమగును. నూరుసంవత్సరములు నొసట గోపీచందనమును, సిగను దులసీదళమును ధరింప నొకప్రాణాయామముతో సమానమగును. మహాపాతకము, లల్పపాతకము, లుపపాతకము లనఁబడునవన్నియుఁ బ్రాణాయామములచేత వెంటనే నశించును.

ఆ. పురుషు లన్యసతుల ♦ పొందుఁ దలంపక, మాతృభావ మొదవ ♦ మసలునట్టి
వా రొకప్పుడైన ♦ వైవస్వతుని నరకములబాధ నెపుడు ♦ గాంచ రనఘ! 323

కం. మనమున పరసతులను దలఁపని మనుజుఁడు నిహపరములఁ ♦ బడయును బూజల్
ఘన ధర్మప్రవర్తనలచే, తను మెలఁగెడువాఁడు విడువఁ ♦ దగుఁ బరసతులన్. 324

ఆ. కాక యితరసతులఁ ♦ గలసిన దుర్జను, లిరువదొకటిరైన ♦ నరకములను
బడుదు రెవరు నెపుడు ♦ బరధనాపేక్షను, విడచువాఁడు బొందు ♦ విష్ణుపదవి.

సీ. దినము సాయంకాల ♦ మునఁ బురాణశ్రవణము మత దేవాల ♦ యములఁ జేయఁ
జేయింపఁ నెవ్వఁడు ♦ జెందఁడు యమలోకబాధలు కృపకు ని ♦ వాసులైనఁ
బెద్దలఁ బొడఁగన్న ♦ భృత్యునివలె తాము, సములేక మెలఁగ స్వ ♦ ర్గమును గెలుచు
జననీజనకులు మ ♦ సలివారు నగు వేళఁ, బూజింప శమనుని ♦ పురముఁ గనరు
ఆ. గురుని దండ్రికంటె ♦ గొప్పగా నర్చింప, నలువలోకమందు ♦ నిలుచు నతఁడు
స్త్రీలు మేలుకొఱకు ♦ శీలముఁ గాపాడు, కొనుట ధన్యలౌదు ♦ రనఘచరిత! 326

తే. శీలమును భంగపరచిన ♦ స్త్రీలుభయద, మైన యమలోకమును బొందు ♦ నాడువారు
నెప్పుడును దుష్టసావాస ♦ మిహమునందుఁ, దొలఁగి శీలమె గాపాడ ♦ వలయు ననఘ!

తే. వైశ్వదేవము మొదలగు ♦ పాకయజ్ఞ, ములకు శూద్రుని ద్రవ్యముఁ ♦ గలుపునట్టి
బ్రాహ్మణుఁడుస్వర్గమునదిగు ♦ బాటునొంది, శమనులోకమునం దతి ♦ శ్రమల నందు.

సీ. శాస్త్రవిచారము ♦ చక్కఁగాఁజేయ వే, దముఁ బఠింపను బురా ♦ ణమును దెలుపఁ
జదువను ధర్మశా ♦ స్త్రముల బోధింపను, ధర్మము దెలుపను ♦ దగినవారు
నిగమాంతనిష్ఠుల ♦ నిలచినట్టి మహాను, భావులచే నిట్టి ♦ వసుధ నిలుపఁ
బడియుండె నీచెప్పఁ ♦ బడినవారందఱు, వేదశాస్త్రపురాణ ♦ విద్య లెఱుఁగు

ఆ. మహిమవలన నెపుడు ♦ ద్రుహిణునిపురమందు, దోషకృత్యములను ♦ దొలఁగి సుఖము
లనుభవించుచుండు ♦ రానందముగఁ జిర,కాల మచట నిట్టి♦కారణముల. 329

ఆ. ఏమియెఱుఁగనట్టి ♦ హీనునకును వేద,శాస్త్రములను దెలిపి ♦ సక్రియ మగు
జ్ఞానబోధఁ గలుగఁ♦గాఁ జేయు పుణ్యుని, నమరు లెపుడుఁ జేతు♦రర్చనలను. 330

ఆ. విను రహస్య మొకటి ♦ వినుపింతు నిదియు భా,స్కరునిసుతున కధిక♦సమ్మతంబు
విష్ణుభక్తులైన ♦ విబుధులు శమనుని,గాని యతనిభటులఁ♦గాని గనరు. 331

సీ. వైవస్వతుఁడు తన♦భటులను జూచి కిం,కరులార! హరిభక్తి♦పరులు నాదు
దండన కెంతేని ♦ దగరు గావున నట్టి,వారల మీరు దే♦వల దిటంచుఁ
దఱచుగా మాకు న♦క్కఱతోడఁ దెల్పె నో,కానొకప్పుడు ప్రసం♦గమున నైన
హరిని దలంచిన ♦ నణఁగు పాపములు గో,విందుని వైకుంఠ♦మందు నిలతు
ఆ. రట్టికారణమున ♦ హరిని దలంచెడి, పాపచిత్తులయిన ♦ పరులవలనఁ
గలుగు మేలు మఱపు♦గలవారు నాచార,హీనులైనవారి ♦ మానవలయు. 332

ఆ. విష్ణుభక్తులైన ♦ వైష్ణవు లెవ నింట, నారగింతు రట్టి♦వారితోడఁ
జెలిమిఁజేయ దోష♦ములు వాపుకొనఁదగు, వారి మీరు ముట్ట♦వలదు పలుకు. 333

క. అని దండధరుఁడు నియమిం,చెను దూతలమైన మాకుఁ ♦ జెలువుగ నది గా
వున హరిభక్తులు భానుని,తనయుని పట్టణముఁ జూడఁ♦దగ దెప్పటికిన్. 334

క. దురితాత్ములైన జనులకు, నరకసముద్రమును దాట ♦ నావ యయిన శ్రీ
హరిసేవ దక్క నితరము, నెఱుకఁబడదు జూడ మదికి ♦ నెన్నివిధములన్. 335

ఆ. బ్రాహ్మణుండు శునక♦పలలము భక్షింప, నీచకులజుఁ డనుచు ♦ నిందఁజేతు
రధమజాతుఁడైన ♦ హరిభక్తి గలిగిన,వాఁడు శుద్ధుఁ డనఁగఁ ♦ బరగుచుండు. 336

సీ. విప్రాన్వయంబున♦ వెసఁబుట్టి శూద్రిని, గలసి సుఖింపుచుఁ♦గలుషములగుఁ
క్రూరకర్మములు పె♦క్కులు నొనర్చినపాపి, యగు నజామిళుఁ డం♦త్యమున మేము
గనుపింప భయ మొంది ♦ తనయుని ముమ్మారు, నారాయణాఖ్యుని ♦ జేరఁ బిలువ
సకలపాదిత్యము ♦ ల్నమసి మోక్షము నొందెఁ, గాన శ్రీహరి నెన్నఁ♦గావలయును
ఆ. అతనిజన్మకర్మ♦లన్నియుఁ గొనియాడ,నగును హరిని బూజ♦లందుఁ దనుపు
వారివంశజులును ♦ నారకములనుండి, తొలఁగి స్వర్గమందు ♦ దూరఁగలరు. 337

ఆ. విష్ణుభక్తులైన♦విబుధులచే నన్న, మారగించువారు ♦ నన్నివిధము
లైన తొట్రుపాటు♦లేని సుఖంబులు, గలుగు దేవలోక♦గతులఁ గంద్రు. 338

ఆ. తెలివిపరుఁడు దోష♦ములఁ బాసి శుద్ధుఁడు, నగుటకొఱకుఁ గాఁ బ్ర♦యత్నపూర్వ
కముగ విష్ణుభక్తి ♦ గలవారి యన్నము, నడిగి తెచ్చుకొనుచుఁ ♦ గుడువవలయు. 339

సీ. హరిభక్తు లన్నము ♦ దొరకనిదినమున, నీరుపానము చేత ♦ నిలువవలయు
మరణకాలమునందు ♦ మానవుఁ డెవఁడు గో,విందగోవింద గో♦విందయనుచుఁ

బలుకుచు దేహము ◆ న్వ్యాసిన కాలుని,గాని మమ్ములఁగాని ◆ గనఁ డెచటను
అగమోక్తమైన ◆ యంగముతోఁ జేరి, జ్ఞానముద్రినుగూడి◆నదియునైన

తే. న్యాసమాది ఋషిచ్ఛంద◆మందు దైవ,తములతోఁ గూడ దీక్షావి◆ధానమైన
ధ్యానమొనరించితదుపరి◆ద్వాదశాక్ష,రముల నష్టాక్షరముల మం◆త్రములు జపము.

క. కావించిన పుణ్యాత్ముల, సేవించిన బ్రహ్మహత్య ◆ జెలువుగ గర్భ
స్రావిక పాపము లన్నియుఁ, బోవుచుఁ బరిశుద్ధు లనఁగఁ ◆ బొగడఁ బడుదురా. 341

తే. బ్రాహ్మణులును సుదర్శన◆పాంచజన్య,ములను వనమాలను ధరించి ◆ యలరువారు
విష్ణురూపమునొంది త◆ద్విష్ణులోక,మున వసింతురు గలపాప◆ములను దొలఁగి. 342

ఆ. మనము జలముఁ బ్రతిమ ◆ మార్తాండులందుఁ బ,విత్రమైనచోట ◆ విష్ణుదేవు
నధికభక్తి దనరి ◆ నావాహనాది పూ,జలను దనుప నతని◆నిలయ మబ్బు. 343

తే. కాన మోక్షేచ్ఛగలిగిన ◆ మానవుండు, సర్వవిధముల హరిపూజ ◆ సలుపవలయు
వజ్రకీటకమగు దాని◆వలనఁ గలిగి,నదియు విష్ణువునకు నెల◆వైనదియును. 344

సీ. దోషపుంజములను◆దొలఁగఁద్రోయుచుఁ బుణ్య,ములకు మూలంబగు◆మోక్షమొసఁగఁ
జాలు సాలగ్రామ◆చక్రము గలిగిన, హరిని బూజించిన ◆ నరుఁడు రాజ
సూయయాగములను ◆ జేయఁగఁ బనిలేదు, వానికి నెక్కుడు ◆ ఫలము గలుగు
నిగమాంతములు నెవ◆నిని ముక్తినొసఁగు కా,రణుఁడు పరబ్రహ్మ◆మనుచుఁ బల్కు

ఆ. నట్టి విష్ణురూప◆మైన సాలగ్రామ,మునకుఁ బూజసేయఁ ◆ బుణ్యపురుషుఁ
డైన హరియనుగ్ర◆హముగల్గి సంప్రాప్త,మగుచు మోక్షపదవి ◆ నందు నతఁడు 345

సీ. కాష్ఠమును మథింపఁ◆గాఁ నగ్ని గనుపించు,పగిది సాలగ్రామ◆భక్తివరఁ
బూజింప విష్ణుదే◆వుఁడు నందు నెలుఁగును, సత్కర్మములకును ◆ జాలనట్టి
పాపకృత్యములందుఁ ◆ బనిగా మెలంగువా,రైన సాలగ్రామ ◆ కర్చనలను
జేసిన యమపురిఁ ◆ జెందరు లక్ష్మీస,మేతుఁడై శ్రీహరి ◆ ప్రీతిదనర

ఆ. నందు నిలచినట్లు ◆ నల వికుంఠమునందు, నిలువఁ డెపుడు నెవఁడు ◆ జెలువ మమర
నధికభక్తితోడ ◆ నట్టిసాలగ్రామ,మందు హరిని బూజ ◆ లలరు నతఁడు. 346

తే. అగ్నికార్యము లొనరింప ◆ నధికమైన, వసుమతిని దానమిచ్చిన ◆ ఫలముకంటె
నధికమయి హరిలోకము◆నందుఁ దఱచు,కాలము వసించు తనపుణ్య◆మూలమునను.

సీ. పదిరెండువిధములై ◆ పరగు సాలగ్రామ,శిలలందు నవతరిం◆చిన హరికిని
వేదోక్తమునను గా◆వించిన పూజల,వలన సంభవమగు ◆ ఫలము వినుము
పండ్రెండుకల్పము ◆ ల్ప్రతిదినం బన్నికో,టులునగు శివలింగ◆ములకుఁ బూజ
బంగారుపూలచే ◆ బాగుగాఁ జేసిన, ఫలము సాలగ్రామ◆శిలకుఁ జేయ

ఆ. నట్టివాఁడు కెంద◆నగును సాలగ్రామ,మందు హరికిఁ జేయు ◆ నర్చనలకుఁ
గా వికుంఠమందుఁ ◆ గాలము తడవుండి, చక్రవర్తి యగుచు ◆ జననమందు. 348

క. కామక్రోధాదులు గల, యేమానవుఁడైన హరికి నింపగు సాల
గ్రామార్చనలను జేసిన, నీమముతో నతఁడు విష్ణునిలయముఁ బొందున్. 349

శా. సాలగ్రామము నావహించిన హరిన్ సర్వాత్ముని న్నెవ్వఁడే
కాలంబందున నైనఁ బూజ లొనరింగాఁ జేయు నాతండు నా
వాలాయమ్ముగ స్వర్గమందు నివసించున్ బంజాలి కల్పంబు భూ
పాలుండై జనియించు ధారుణిని సౌభాగ్యంబు శోభిల్లగన్. 350

సీ. దానము ల్తీర్థయాత్రలు యాగములు జేయ నేనికి సాలగ్రామమున కెవఁడు
నర్పింపఁ బాపాత్ముఁడైనఁ బునర్జన్మ రహితుఁడై హరినగరమున నుండుఁ
బశుపక్షికీటకప్రాణిఁ దాఁ బుట్టఁడు, నేర్చినమంత్రముల్ శ్రేష్ఠవ్రతున్న
దీక్షతో శ్రీవిష్ణుదేవు సాలగ్రామ, శిలకు నావాహనఁ జేయునట్టి

ఆ. నరుఁడు నిలుచు నెపుడు హరినిలయమునందు, నిది నిజమ్ము గంగ మొదలు సకల
తీర్థజలము హరికిఁ దిరముగ నభిషేక, సలిలమందు నెపుడుఁ గలియుచుండు. 351

సీ. అదిగాన హరిరూపమైన సాలగ్రామ, మున కభిషేక మొనరింపఁ జేయు
జలములు శిరముపైఁ జల్లికొనఁగఁ దీర్థ, ముల మునిఁగినఁ గ్రతువులను దీక్షఁ
జేసినఫలమును జెందును హరికి గంధము నక్షతలను బుష్పములు నర్ప
నలుజేసి ధూపము నైవేద్యదీపక, ర్పూరతాంబూల మా మాధభక్తి

తే. దనర నర్పించి దైవవాద్యములు సెలఁగ, హరికి వందన మొనరించు నతఁడు కోటి
కల్పములు భగవంతులోకమున నతని, సన్నిధిని నిల్చు సంతోషసహితుఁ డగుచు.

మ. తనరం బత్తినిఁ గోటిలింగముల సంతర్పించి పూజించి లీ
ల నతింజేయ లభించుఁ బుణ్య మిల సాలగ్రామముల్ పూజన
ల్ప నదేరీతిలభించు నచ్యుతుఁడు సాలగ్రామరూపమ్ముచే
తను గ్రాలొప్పుట వసించు లోకములు దైత్యశ్రేణియక్షామరుల్. 353

క. నిలుతురు సాలగ్రామంబుల కెదుర నెవండు శ్రాద్ధమును బెట్టును నా
జ్వలనపరితాపుపితృగణ, ములు ముదమున నూరుకల్పములు స్వర్గమునన్. 354

గీ. దినము నెవరు సాలగ్రామతీర్థ మర్థిఁ, గ్రోలుదురో వారు బలుమారు కోరి పంచ
గవ్యములఁ బుచ్చుకొనఁగ నక్కఱయులేదు, తజ్జలము జేయు యోజనత్రయము శుద్ధి.

ఉ. అపరిశుద్ధమైన స్థలమందెవఁడైనను, దానహోమముల్
నేపరిశేయఁ గోటిఫలమిచ్చును దజ్జల మొక్కచుక్కయే
నేపరి శుద్ధుఁడౌను నతఁడేపునఁ దానిఁ బునర్భవమ్ము లే
కే పరితోషచిత్తమున నెంతయుఁ గోరఁడు తిల్లి స్తత్యముగ్. 356

శా. సాలగ్రామము లున్నచోటునకుఁ గ్రోశంబైనదూరంబునన్
నేలంగూలిన చెడ్డచిన్నిపురువేనిం బొందు వైకుంఠమున్
సాలగ్రామశిలాప్రదాన మొనరించం జాలువాఁ డొందు పు
ణ్యాలామీఁదనియుక్తభూవలయ మిత్యంగల్గు పున్నెంబునన్. 357

శా. సాలగ్రామము బేరమాడిన ఘనోచ్ఛం బేరముం జెప్పినన్
సాలగ్రామముఁ గొన్న నమ్మినఁ బరీక్షంజేసిన న్మెచ్చినన్

వాలాయమ్మును బ్రాణులన్ని ధర నంతం◆బొందుదాకం బడుఁగ
గాలావాసమునందు ఘోరనరకా◆గారమ్మునం గోమటీ. 358

క. కావున సాలగ్రామము, నేవిధిఁ గ్రయవిక్రయముల ◆ నెప్పటికైనన్
గావింపఁగఁ దగ దెవరును, భావమునం దలఁపదగదు ◆ ప్రాజ్ఞుల కెపుడున్. 359

ఆ. తరుచు మాటలేల ◆ దామోదరుని మది, స్మరణసేయు నెవఁడు ◆ సకలదోష
ములఁ దొలంగుఁ దపము◆వలన బుష్యాదులు, పొందుఫలము హరికి◆మ్రొక్కఁగలుగు.

క. జ్ఞానాజ్ఞానములవలన, నేనరుఁడును దుష్కృతముల ◆ నేర్పడఁజేయం
గా నవి హరికిన్మ్రొక్కిన, మానఁగ ◆ నరకములఁ దొలఁగు మాధవుకరుణన్. 361

సీ. ధరణినిఁ గల్గుతీ◆ర్థములు సేవించిన, ఫలము దేవాలయ◆స్థలములందుఁ
గలదేవతల కర్చ◆నలుజేయు ఫలమును, శ్రీహరిస్మరణచేఁ ◆ జెందునతఁడు
శార్ఙ్గముఁ దాల్చిన ◆ శౌరికి మ్రొక్కు ప్ర,పత్తినిష్ఠులకుఁ బా◆పములు లేవు
చక్రంబుఁ బూనిన ◆ చంద్రశేఖరమిత్రుఁ, గొలిచినవారికిఁ ◆ గొలలు దొలఁగు

ఆ. విష్ణుభక్తుఁడైన ◆ విబుధుండు శివదేవు, నిందజేయ శౌరి◆నిలయమునకుఁ
బాసి దురితకర్మ◆పాలయి శాశ్వత, మైన ఘోరనరక◆మందుఁ గూలు. 362

సీ. వైశ్యోత్తమా! సమ◆వర్తి మాకొక కాల,మందుఁ జెల్పినపల్కు ◆ లాలకింపు
మనుజుఁ డేకాదశీ◆దినమున నుపవాస,మును జేయునను చుఁ బ◆ల్కిన శమనుని
యాతనలకుఁ బోఁడు ◆ పాతకహరణు శ్రీ,పతిదినములు రెండు◆పక్షములను
వచ్చుచుండఁగ నట్టి ◆ పరిశుద్ధమైన శ్రీ,హరివాసరముల నే◆నరుఁడు నుపవ

ఆ. సింపఁ డట్టివాని ◆ చేసినపాతక,ములు దొలంగకుండ ◆ నిలచియుండు
మూఁడులోకములను ◆ జూడఁగ నిటువంటి, కలుష మింతయైన ◆ గానఁబడదు.

తే. వాజపేయాశ్వ◆మేధము ల్వాసుదేవు,వాసరమునందుఁ జాలవు ◆ వీసమైన
గాన మానవుఁడొనరించు◆కలుషము లొక,మురహరునిదినముపవాస◆మునఁ దొలంగు.

ఆ. అమితపుణ్యమొసగు ◆ హరివాసరవ్రత,మునకు సమము లేదు ◆ మూఁజగముల
నట్టిదినమునందు ◆ నావ్రతమొనరించు, నరుఁడు బారఁడు శమను◆పురమునందు.

తే. జగతియందు నేకాదశి ◆ స్వర్గమోక్ష,ముల నొసంగును శారీర◆మునకు రోగ
ములఁ దొలంగును మంచిభా◆ర్యాసుసుతులఁ, నాయురారోగ్యములనిచ్చు◆నతిశయముగ.

సీ. గంగాగయానదు ◆ ల్కాంచీపురంబును, బుష్కరక్షేత్రము ◆ భూమినిఁగల
విష్ణ్వాలయంబులు ◆ వివిధతీర్థము లొక, హరివాసరముఁ బోల◆వదియుఁ గాక
యొక్కయేకాదశీ ◆ నుపవాసమొనరించి, యారాత్రి జాగర ◆ మమరఁజేయు
పురుషుఁ డనాయాస◆ముగ విష్ణులోకప,దవికిఁ జేరును దన ◆ తల్లిదండ్రి

తే. భార్యవంకను గలిగిన ◆ పదితరముల,వారలు కృతార్థులగుచు న◆వారితముగ
సతిసుతులఁ బాసి శ్రీహరి◆సదనమగు వై,కుంఠపురమున నిలుతు రం◆కుంఠితముగ.

తే. బాల్యమందున వయసున ◆ వార్ధకమున, హరికిఁ బ్రియమైనవాసర◆మందుఁ బాప
కర్ముఁడైన నుపోష్యముఁ ◆ గలుగఁజేయు, నతఁడు నరకము పాలుగాఁ ◆ డనఘచరిత.

తే. మూఁడునేకాదశులు స్నాన◆మాడి యుపవ,సించి రాత్రిజాగరణముఁ◆జేసి తిలలు
హోమమును గోవు దానము ◆ లిచ్చునట్టి, నరుఁడు స్వర్గసుఖంబులఁ◆బొరలుచుండు.

ఉ. ఎవ్వరు పుణ్యతీర్థముల ♦ కేఁగకయుందురో కాంచనాదుల
న్నెవ్వరు విప్రసంఘముల ♦ కియ్యరొ దానములం దపంబుల
న్నెవ్వరు జేయమానుదురొ ♦ హీనమతి న్నిటువంటివారికి
న్నివ్వటిలంగ దుఃఖముల ♦ నేలకు నింగినిఁ గష్టమొందెదర్. 370
తే. నరకములఁ దొలఁగించుట ♦ కిరవుగలుగు, పుణ్యకర్మలసంగ్రహం♦ముల దెలిపెద
వినుము మనమున వాక్కాయ♦మనులవలన, ప్రాణులకుఁగీడు నెంతయు♦ మానుటయును.
ఆ. ఇంద్రియముల నణఁచి ♦ యిందిరారమణుని, బూజదానములను ♦ బొందుబరుప
శాస్త్రములను దెల్పు ♦ సరణిని వర్ణాశ్రమముల జరుపుటయును ♦ మనమునందు.
ఆ. స్వర్గముననుఁ గోర్కి ♦ జనియింప నెవరికిఁ, దానుజేయు తపము♦ దానములను
జెప్పికొనక కాలి♦ చెప్పులు గొడుగులు, నన్నవస్త్రజలము ♦ లర్థులకును.
తే. దినము నూరకమానక ♦ తనకుఁ దగిన, శక్తికొలదిని దానము ♦ లొసగుచుండ
నిందు నందున దాతృత్వ♦ మొసగువార,లగుచు యమయాతనలఁ బొంద ♦ రనఘచరిత.
క. మరుజన్మంబున వారలు. పరిపూర్ణాయువ్య మధిక ♦ భాగ్యపరులునై
ధరఁమీదఁ బుట్టుచుందురు, తరుచుప్రసంగములు నేల ♦ ధర్మము చేతన్. 375
ఆ. స్వర్గపదవిగల్గు ♦ సకలవిధంబులఁ, జిన్ననాఁటనుండి ♦ పెంపుదనర
ధర్మ మాచరింపఁ♦దగు నెవ్వరికి నీక, నేఁదెల్పువాఁడ ♦ నెఱుఁగఁజెపుమ. 376
మ. అనుచు న్దూత వచింపఁ దన్మదికి బ్ర♦హ్మానందముం జెంద ని
ట్లనియె న్వైశ్యుఁడు సజ్జనుల్పలుకు వా♦క్యంబు ల్సదా నిర్మలం
బున గంగానదినీరుతో సమముగాఁ ♦ బోల్పారి పాపంబులం
దునుమం జాలును గాన నామదిని సం♦తోషించితిం దీనికై. 377
ఆ. సత్పురుషులకు జన్మాది♦ సహజగుణము, లోకరి కుపకార మొనరింప♦ నొనరఁ బ్రియము
గలుగ భాషింప, నట్టివా♦రలును శీత,కిరునివలెఁ జల్లగా నుండ♦గల రెపుడును.
ఆ. కాన సత్పురుషుఁడ♦వైన నీబుణము, నాయెడలనిలిపి నన్ను ♦ నడుగువిషయ
మునకుఁ దగినవాక్య♦మును సెలవిమ్ము నా,తోడు నరకమందుఁ ♦ దొలఁగునెటుల.
తే. అని విశంఁడలుఁడునఁగ స్నే♦హామునఁగలుగు,బాంధవంబున యమదూత ♦ పరగనొక్క
క్షణము సుజ్ఞానమున ధ్యాన ♦ మొనరఁజేసి, పలికె నిట్లని వైశ్యుతో ♦ సలలితముగ.
క. పతితుఁడగుసోదరునిదు,ర్గతికి న్నడఁచేయు కోర్కి ♦ గలిగిన నీవున్
గతమష్టమజన్మములో, నతులితముగఁజేయుపుణ్య♦మాతని కిడుమా!
చ. అని యమదూత దెల్పిన మ♦హాత్ముఁడ! నాగజతన్మమెద్ది నే
ఘనముగ నందొనర్చిన సు♦కర్మ లవెట్టివి తద్విధంబు నే
వినవలతు న్నెఱుంగనన ♦ వే విని మత్కృతమైనపుణ్యమున్
బనివడి మత్సహోదరుని♦ పా లొనరించెద నీవుజూపఁగన్. 382
గీ. అనుచుఁ గోమటివల్కు వా♦క్యములు దూడ,వినఁగ వాత్సల్యమొదవ ని♦ట్లనియె నీకు
సంభవించిన పూర్వపు♦జన్మమందుఁ, జేయుపుణ్యము నెఱిఁగింతుఁ ♦ జిత్తమలర. 383
సీ. విను మొకమధువనం♦బున విశాలకుఁడను, బ్రాహ్మణోత్తముఁడు ద♦పమ్ము నందు
నిగమశాస్త్రములందు ♦ నిధి తేజమున బ్రహ్మ, యనఁదగు నట్టివి♦ప్రునకు ధర్మ

పత్ని రేవతిపేరఁ◆బరఁగు నాతఁడు భార్యఁ,గలన నవగ్రహ◆ములనుబోలు
తనయులఁదొమ్మండ్రఁ◆గనె నందు జ్యోతిష్మఁ,తుఁడు, శశి, ధ్రువుఁడు,బు◆ధుఁడుదారుఁ
తే. డనఁగ నైదుగు రౌపాస◆నాదిక్రియల, మిగుల నక్కఱగలవార◆లగుచు నిలయ
మందు భార్యలతోడ గృ◆హస్థధర్మ,ములను వర్తింపుచుండిరి ◆ విలసితముగ.
తే. ధ్యానరాష్ట్రుఁడు, నిర్మోహుఁ,◆డనఁ గుణాధి,కుఁడన జితమాయుఁడన నట్టి◆కొమరులైన
నలువురు విరక్తులగుచు సం◆న్యాసయోగ,మభ్యసించిరి నిర్మోహి◆తాత్ములగుచు.
తే. దినము నొకగ్రామమును వారు◆దిరుగుచుండి, రెల్లకర్మము లందున ◆ నిచ్ఛమాని
విషయములయందుఁ ◆ గోరికవిడచి యెవరు, నేమియిచ్చిన దాని గ్రహిం◆పకుండ.
తే. జుట్టు జందెముఁ బోఁగొట్టి ◆ మట్టిపెల్ల,నిత్యము హోమము సమముగా◆నెన్ను వారు
వస్త్రములె కావలెనటన్న ◆ వాంఛలేక, కప్పుకొనుటకు నేదైన ◆ నొప్పిదమగు.
సీ. ఆహారములభించు◆నది భుజియింపుచును సా,యంకాల మొకయింటి ◆ కరుగువారు
మొనసి పరబ్రహ్మ◆మును జిత్తమున నిల్పి, ధ్యానించు రక్షితేంద్రి◆యములఁ జయము
గలిగి భుక్తికి లేమి◆గలవారు శీతోష్ణ,ములు రెండు సమముగాఁ ◆ దలఁచువారు
సచరాచరంబైన ◆ జగము శ్రీహరిరూప,మనుచు భావించెద ◆ రనుదినంబు
తే. నొకరు నొకరిని భాషింప◆కుండి మౌన,మున వినోదకరంబుగా ◆ భూమిఁ దిరుగు
చుందు రొకవేళనైనను ◆ యోగివరులు, నేయుపను లెంచ రెప్పుడుఁ ◆ జిత్తమందు.
క. పరతత్త్వ మెఱుఁగువారును, దిరముగ సకలార్థములనుఁ ◆ దెలిసినవారుఁ
గరమర్థిని భూవలయము, దిరుగుచు వారంత నొక్క ◆ దినమున నిట్లన్. 389
క. క్రిందటియష్టమజన్మము,నందున బ్రాహ్మణుఁడ నగుచు ◆ నాలుసుతులతోఁ
బొందికను మత్స్యదేశము,నందు కుటుంబీకుఁడనగ ◆ నలరుచు నింటన్.
తే. నీవు మధ్యాహ్నమున వైశ్వ◆దేవ మొనరఁ,జేసి వాకిటిముందర◆జేరి మిగుల
దాహమాకలిచేతను ◆ దపనఁజెందు, యతులు నల్వురు గనుపింప ◆ నపుడు వేగ.
తే. కనులనానందబాష్పము ◆ లగ్రిమ్మికొనఁగ, తోట్రుపాటున వారల◆తోఁ బ్రసంగ
ములనుఁజేయుచుఁ బదపద్మ◆ములకు నీదు,శిరముదగులఁగ మ్రొక్కి స◆స్మితుఁడవగుచు.
సీ. హస్తముల్ జోడించి ◆ యతులతో నంటివి, నాజన్మ గడతేర ◆ నాదుబ్రతుకు
నెరవేర నిపుడు శ్రీ◆హరి ప్రసన్నతనొందఁ, బరిశుద్ధుఁడను గృహ◆పావన మిపు
డాయె నాపితరులు ◆ నాలుబిడ్డలను గృ,తార్థతఁజెందిరి ర◆తాపములను
దీర మీపాదము ◆ లేరిదర్శింప నే, ధన్యతనొందితిఁ ◆ దపసులార
తే. యనుచు సత్యమువలుకుచు ◆ నపుడు పూజ,జేసి సప్తజన్మంబులఁ ◆ జేసినట్టి
పాతకములనుఁబోఁగొ◆ట్టుపాదములను, గడిగి యజ్జలములు మస్త◆కమునఁదాల్చి.
తే. పుష్పగంధాక్షతల వారిఁ ◆ బూజసేసి, ధూపనీరాజనములిచ్చి ◆ చరితములను
దుర్రించి పక్వాన్నమున యతుల ◆ తుష్టిఁబొందు,నటుల భుజియింపఁజేసితి◆వనఘచరిత.
సీ. ఆదిగాన భూతము◆లందుఁ బ్రాణులు ముఖ్య,ములు ప్రాణులన్నింట◆ బుద్ధివలన
జీవింపఁదగునవి ◆ శ్రేష్ఠము లందులో,పల మనుష్యులుత్త◆ము లాగి వారి
లోపల బ్రాహ్మణులు ◆ ప్రధానులు నందు, విద్వాంసు లధికులు ◆ విబుధవర్య
వారిలో నాస్తిక◆త్వపుబుద్ధిగలవార, లుత్తము లందులో ◆ నుచితమైన

తే. కర్మలనుజరుపువారు స♦కలవిధముల, నుత్తములు వారిలో బ్రహ్మ♦వేత్తలు కడు
ముఖ్యులును బూజకర్హులు ♦ ముజ్జగముల, నట్టివేత్తలసాంగత్య ♦ మతిశయింప.
తే. పాపములునశించు ♦ బ్రహ్మవేత్తలు సత్య,ఘనులు జ్ఞానులౌక్య ♦ క్షణములోన
జననమాది నీవు ♦ సంగ్రహించిన వృజి,నములఁ దొలఁగఁజేసి ♦ కమలచరిత. 396
ఆ. బ్రహ్మవేత్తలైన ♦ బ్రాహ్మణు లొకరాత్రి, నిలచు నేగృహస్థు♦నిలయమందు
నతఁడు మరణమొందు♦నంతదాకఁ గావించు, దోషపుంజములను♦ దొలఁగఁజేయు.
సీ. ఈవిధమున నీవు ♦ నిందుకుఁబూర్వము,దైన యష్టమజన్మ♦మందుఁ బుణ్య
మార్జించితివి యిపు♦డది నిరయమునందుఁ,బడిన నీయన్నకు ♦ నిడుమటంచుఁ
బలికినయమదూత♦పలుకులు విని వైశ్యుఁ, డపుడు తత్పుణ్యము ♦ నన్నకు నిడ
నాతఁడు నరకము♦నందుండి వెడల వా, రిరువురు దివిజుల ♦ విరులవాన
తే. చేతఁ దడియుచుఁ దమకు మే♦ల్జేసిన యమ,దూతకును దగుమర్యాదఁ ♦ బ్రీతివరఁ
జేసి యమలోకమునకన్పి ♦ చెలువమమర, స్వర్గమునుఁజెంది రంత న♦వర్గళముగ.
తే. ధర్మములను దెలుపఁ♦దగునట్టివియు వేద,తుల్యమైన శమను♦దూతపలుకు
లాలకించి వైశ్యు♦డన్నకుఁ దనపుణ్య,మిచ్చి నరకమునకు ♦ వెడలఁ బాపి.
సీ. అతనితోఁ బరలోక♦మైన స్వర్గమునకు, నేఁగె నీకథ నిల♦నెవ్వరైన
వినిన వ్రాసినఁ జది♦విన వేయిగోదానములనుజేసిన ఫలం♦బలరి పాత
కములను దొలఁగఁగాపఁ♦గలరని కార్తవీ,ర్యునకు దత్తాత్రేయ♦మునివరుండు
వినుపించె నని బ్రహ్మ♦తనయుఁడైన వసిష్ఠ,మౌని దిలీపున♦కానతిచ్చె
ఆ. ననుచు శౌనకాది♦మునులకు నుగ్రశ్ర,వుఁడను సూతుఁ డెలుక♦పడఁగఁ దెలిపి
మఱలనిట్టులనియె ♦ మాఘమాసప్రభా,వమును దెలుపుటకు ను♦పక్రమించి. 400

## ఆశ్వాసాంతము.

క. లీలామానుషచరితా !, మాలాకారకృతకుసుమ♦మాలాన్వితా
శాలినుతగుణజాతా !, బాలామణిలక్షణాది♦భార్యోపేతా !

పంచచామరము. మురారిముఖ్యదేవతాప్ర♦పూజితాంఘ్రిరాజితా !
సురారిదైత్యవందితాఖ్య♦శోభితా ! విజృంభితా !
దరారిశూలసంభృతా ! వి♦దారితాఘమారితా
పురారి ! చంద్రధారి ! జన్మ♦భూరితాపదారితా !

## గద్య.

శ్రీబాలగోపాలకృష్ణవరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్యగోత్రపవిత్ర శ్రీమదబ్బ
రాజవంశపయఃపారావారరాకాకైరవమిత్ర శ్రీమదమ్మకామ్బా నృసింహా
మాత్యపుత్ర సూరిజనవిధేయ శేషాచలశర్మనామధేయప్రణీతంబైన
శ్రీపాద్మపురాణాంతర్గత మాఘమాహాత్మ్యంబునందుఁ
పంచమాశ్వాసము.

---

# మాఘమాహాత్మ్యము.

[ శేషాచలకవీయము ]

## షష్ఠాశ్వాసము.



రామామణివక్షా!
కారుణ్యామృతరసార్ద్ర • ఘనతరవీక్షా!
ధీరా! పాండవపక్షా!
ధారాధరవాహరక్ష • దానవశిక్షా! 1

వ. అవధరింపుము, సకలసద్గుణసంపత్పరిపూర్ణులైన శౌనకాది మహామునిశ్రేష్ఠులకు నుగ్రశ్రవోంకితుండగు సూతుండిట్లనియె. అట్లు వైశ్యుని కథానంతరమునఁ గార్తవీర్యుండు బ్రహ్మఋషియైన దత్తాత్రేయుంగనుఁగొని. 2

క. ఒకకారణమునఁ గోమటి । సుకరంబుగ మాఘమాస•సువ్రతమునఁ బాతకములవిడి సోదరుతోఁ । బ్రకటితముగ స్వర్గపదవి•పాలయ్యెఁగదా. 3

ఆ. కాన మాఘమహిమ • మౌనీంద్ర! మఱల నా । కానతిమ్మటంచు • నడుగు కార్తవీర్యునకును దాని•విధ మెఱిఁగింపఁగఁ । దలఁచి యిట్టులనియె • విలసితముగ. 4

ఆ. సంగరహితమైన • సలిలము పరిశుద్ధ । మగుచు ధవళకాంతి • నలరి పాతకములభయమునొందఁ•గాల్చిహరించుఁబ్రాణులకుబ్రతుకుఁదెరువు•గలుగఁజేయు. 5

సీ. ఆనీరములు నగు • హరిరూపమని శ్రుతు।లందు నిరూపించె • నదియుఁగాఁ
గ్రహములలోఁ బ్రభా•కరుఁడు నక్షత్రము।లందుఁ జంద్రుండెటు•లధికులగుసు
రటువలె మాసము • లన్నిఁటిలో ముఖ్య। మగు మాఘమాసము•నందు మకర
మున సూర్యుఁడుండ నే • మనుజు లహర్ముఖ।మందు నే కుల్యము•నైనఁగాని

ఆ. మలినరహితమైన • జలముల స్నానము । నాచరింపఁ బాపు•లైన స్వర్గమునవహింత్రు త్రిజగ•ములయందు నీస్నాన।ఫలముగనుట దుర్ల•భంబునగును. 6

కం. క్రమముగ నీమాఘస్నా।నముఁజేయుట శక్తిలేని • నరుఁడెపుడో నే
సమయమున మూఁడుదినములు । జమునంతముఁజేసి పిదప • సక్రమమలరన్. 7

కం. దారిద్ర్యములేకుండుటఁ । గోరుచుఁ దనశక్తిగలుగు • కొలఁదిని మన మిం
పారఁగదానముఁజేసిన।వారికిఁ బూర్ణాయు వధిక•వైభవ మలరున్. 8

ఆ. ఐదు లేక యేడు ♦ నగు నహర్ముఖముల । నెవఁడు మాఘమందు ♦ నింపుగదుర
స్నానమాచరింప♦దానిఫలము శుక్ల।పక్షచంద్రుపగిదిఁ ♦ బ్రబలమగును. 9

సీ. అడిగాన శ్లాఘనీ♦యంబగు మాఘమా।సస్నానవిధమును ♦ సావధాన
మున విను మీ పవిత్ర♦మున నీమముపహించి।క్రమముగాఁజేయు స్నా♦నమున నధిక
ఫలము సంప్రాప్తింపఁ♦గలదది చక్రిగా । జరుపఁదలంచిన ♦ జనుఁడు విషయ
సంగతులను మాని ♦ శయనించి భూమిపై । నగ్నులు మాఁటియం ♦ దాహుతులను
తే. వేల్చుచును శాశ్వతుండైన♦విష్ణుమూర్తిఁ । బూజసేయుచుఁగోదండ♦మును గరాబ్జ
మున ధరించిన హరికి న♦ర్పణముగాఁగ । దాన మొనరింపఁగాఁదగు♦ధరణినాథ. 10

ఆ. వంటచెఱకు నన్న♦వస్త్రము ల్పవిత్రి కం।బళము నూనె దూది ♦ పాదరక్ష
లాదిగాఁగ సకల ♦ మైనదానముల మా।ఘమునఁజేయఁదగును ♦ ఘనత మెఱయ. 11

ఆ. అటులఁ బాఁడిగోవు ♦ నాఁబోతుతోఁజేర్చి । వేదపాఠకుఁడగు ♦ విప్రున కిడ
నది క్షయింపకెపుడు ♦ నంభోధివలెఁ గడు । మేరలేనిఫలము ♦ దారిగలుగు. 12

క. హితవుగ మాఘస్నాన।వ్రత మూనిన నెవ్వఁడేని ♦ బ్రాహ్మణకృతమా
తతదానమైనఁ బట్టుట । నితరులభోజనముగూడ ♦ దెంతటికైనన్. 13

సీ. మాసాంతమందు బ్రా♦హ్మణులకు శక్త్యను।సారముదగిన భో♦జనము వెట్టి
తనమేలుకోరకు ద♦క్షిణలిచ్చి యేకాద।శీవ్రతోద్యాపనఁ ♦ జేయుపగిది
నమల మాఘవ్రతో♦ద్యాపనఁగావింప।వలె శ్రద్ధగలిగిన♦వాఁడునగుచు
స్వర్గమందున నిచ్ఛ ♦ జనియింప గోవింద । మాధవ శ్రీధర ♦ మకరమందు
ఆ. భానుఁడుండు కాల ♦ మైన మాఘమున నేఁ । జేయుస్నానమునకుఁ ♦ జెందఁదగిన
ఫల మనుగ్రహింప♦వలె నను మంత్రముఁ । జెప్పి నీటఁదోఁగ ♦ నొప్పిదమగు. 14

ఆ. స్నానమైనపిదప ♦ స్వర్గాదిలోకత్రి।యమున నంతరాత్మ ♦ యగుచు సకల
కలుషముల నడంచుఁ♦గమలామనోహరు।ధ్యాన మొనరఁజేయ ♦నగును మఱల. 15

ఆ. మాఘమకరమందు ♦ మందిరమునఁ గల । యేజలములనైన ♦ నెవరు స్నాన
మాచరింత్రు వారు ♦ నారువత్సరములు । ఫలమునొందఁగలరు ♦ సలలితముగ. 16

క. కూపజలస్నానము చేఁ । బ్రాపించును ద్వాదశాబ్ద♦ఫలము చెలువులన్
ఏపారఁజేయఁ బుణ్యము । దాఁపుగనందులకు రెట్టి ♦ దనరు నరేంద్రా. 17

సీ. నదులందుఁజేసిన ♦ నాలుగంతలు నగు । మనుజులు ద్రవ్విన ♦ మడుగులందుఁ
జేసినఁ బదిరెట్లు ♦ నెందును గొప్పైన । నదుల స్నానముఁ జేసి♦న శతఫలము
కొన్నినదులనీరుఁ ♦ గూడినస్థలమందుఁ । జలప స్నానము చతు♦శ్శతఫలమగు
గంగాజలమున మా♦ఘ మకరమునఁదోఁగ । సాహస్రఫలమును ♦ సంక్రమించి
తే. నాల్గుయుగములు వేమార్లు ♦ నడచునంత।కాలమున స్వర్గమందునఁ♦గదలకుండు
స్వర్ణదీయమునాదుల♦సంగమందు । శతసహస్రఫలంబును ♦ సంభవించు. 18

తే. ఎవఁడు గంగోదకస్నాన • మింపుగ దురఁ । జేయ నృప భ సువర్ణముల్ • వేయువేయు
కపిలగోవులు పదివేలు•గా ద్విజులకు । దానమిచ్చిన ఫలమునఁ • దనరు నతఁడు. 19

ఆ. ప్రజలమేలుకొఱకుఁ • బరమేష్ఠివలనఁ బ్ర।యాగ కల్పితంబు • నాయె నందు
స్నాన మాచరించు•జనుల పాపములన్ని । కాష్ఠములను గాల్చు•కరణిఁ దొలఁగు. 20

క. అల గంగా యమునానది । గలసిన వైనలుపుఁ దెలుపుఁ • గలిగి ప్రయాగం
గల జలములు పశుపాతక।ముల మడఁచును మాఘమునకు • మంచిదియునగున్. 21

సీ. బ్రహ్మహత్యనుజేయు • పాపితో ఘాత యి । ట్లనియె నీలోకము•నందు నేను
బాపకర్ముఁడ నంచు • భయము మార్గాయాస।మున శ్రమనొందకు • పుణ్యమైన
మాఘమందున రవి • మకరరాశిగతుండు । నైనఁ బ్రయాగము•నందు మునుఁగు
సజ్జనసంబంధ•జలబిందువైనను । మనభీతులడఁప స•మర్థమగును
తే. దొలిచదువులందు నిట్లని • పలుకుచుండె । నలుపుఁ దెలుపునుగల నీరు • నాటఁగూడి
నట్టిచోటను స్నానము • నాచరించు।వాఁడు స్వర్గము నొందును • వసుమతీశ. 22

తే. ఇటుల నే పండితులు భజి•యించి తెలియఁ।జాలియుందురో వారు మో•క్షమునకేఁగఁ
గల రసితసితధారలు • గను సరస్వ।తియు మొదలుగాఁగ నెట్టి న•దీజలముల. 23

ఆ. కలసిమునుఁగ నవియె • కమలాసనునిలోక।మునకుఁ బోవ మార్గ•ము గను సృష్టి
కర్త చేతమున్నుఁ • గల్పితమంచు వే।దములు దెలిపినటుల • ధాతవలికె. 24

తే. దురితము లనేకములుగల • నరుఁడునైన । మాఘమందున సూర్యుఁడు • మకర రాశి
నుండఁగఁ బ్రయాగజలముల•నూర్జితమగు।స్నానమొనరింప మరలఁడు•జన్మలకును 25

సీ. అమరులు గెల్వ శ • క్యముగాని హరిమాయ । సమసిపోవుఁ బ్రయాగ•స్నానమునను
దేజస్స్వరూపులై • దివ్యలోకమునందు । నమితసుఖంబుల • ననుభవించి
గరుడధ్వజునియందుఁ • గలయుదురు ప్రయాగ।మున సితాసిత జల•మున మునుంగు
మనుజుల పుణ్యము•లను జిత్రగుప్తుఁడు । దెలియుచుండును గడుఁ • దేటపడఁగ
తే. గ్రహణదినము కురుక్షేత్ర•కాననమునఁ । బారువులు నూరు హేమము•బ్రాహ్మణులకు
దానమొసఁగిన ఫలమును•దనరు మాన।వులకును బ్రయాగమునఁ దోఁగ• విలసితముగ.

ఆ. అనఘ! రాజసూయ•యాగము లొక వేయిఁ । జేయునట్టిఫలము • సెందు నొక్క
మాఘమందు నధిక•మహిమగల్గు ప్రయాగ।జలములందు మున్గు•సజ్జనులకు. 27

సీ. అవనీశ! విను మయో•ధ్యయు మధురయు మాయ। కాశి కాంచి యవంతి•కాపురమ్ము
ద్వారావతియు నేడు•పట్టణములు బ్రయా।గస్నానమునకు మా•ఘమునవచ్చు
చుండును బాపాత్మ • లుండెడి చేరిక । గలుగు తీర్థములన్ని • నలుపులై ప్ర
యాగనుగలసిన • వగుచుఁ దెల్లనివగు । జలము, గతించిన • జన్మలందుఁ
ఆ. జేయుపాపములు న•శించుఁ బ్రయాగను । మాఘమాసమందు • మకరరాశి
గతుఁడు భానుఁడైన • కాలములో స్నాన । మాచరింతురెవరు• ననఘచరిత. 28

చ. మనమున వాక్కు(గర్మముల • మానవు లట్లొనరించు దోషముల్
మన మలరంబ్రియాగమున • మాఘమునందున స్నానమాచరిం
చినఁ గుబుసంబునున్వదలు • చిల్వవిధంబునఁ బాసి మూఁడునా
దినములకుం బవిత్రులయి • దేవపురంబున నిల్తురెంతయున్. 29

వ. గంగానది కురుక్షేత్రమునకు సమానమైనది, కావున దానియం దెక్కడనైనను స్నానముఁ జేయఁ దగును. 30

తే. వింధ్యపర్వతమునకు సం•బంధమైన । చోట నది నూరురెట్లకు • సాటిదనరు
వారణాసి నుదఙ్ముఖ • వాహినిగల । యట్టిస్థలఫలమొకనూటి • కలదు సుమ్ము.

సీ. యమునలోఁ బ్రవహించు • నట్టి గంగానది।యందుస్నానముఁజేయఁ • జెందుదాని
కంటె శతాంశము • గలఫలమదియు వే।ణీసంగమంబయి • నిండుకొనుచుఁ
బశ్చిమముఖముగాఁ • బారినప్పుడు నంత । కధికమై వెయిపాళ్లు • నలరుచుండు
దాఁదర్శించు మా•త్రముననే బ్రహ్మహ । త్యను వదలించెడి • దగును గంగ

తే. పశ్చిమాభిముఖంబయి • పారుచుండి । యమునలోఁజేరుచోట మా•ఘమున స్నాన
మాచరించినఁ గల్ప ప•ర్యంతమెవరు । జేయుపాపములైన న•శించు ననఘ. 32

మ. అదె వేణీయని లోకమంతటను బ్ర•ఖ్యాతంబుగాఁ బల్కి రి
య్యది నిక్కంబు మహూర్తకాలమగునే • నా వేణియందుండి నె
మ్మదిగా దేవతలైన మాఘమున నిం•పారంగ స్నానాదులం
దుదిముట్టం బొనరించుచా రరుదు సం•తోషాత్ములై యెంతయున్. 33

సీ. బ్రహ్మవిష్ణుమహేశ • పాకారిముఖదేవ।తలును గంధర్వ య•క్షులును దిక్ప
తులు కిన్నరులు గుహ్య•కులు నణిమాదులు।గలిగిన బ్రహ్మవే•త్తలు సరస్వ
తీ రమాపార్వతీ • దేవులు శచిమేధ । లదితిపితరులు దే•వాంగనలును
నాగకన్యకలు మే•నక తిలోత్తమ రంభ । లాదిగాఁగలుగు నా•ట్యపదసతులు

తే. మాఘమందున సూర్యుఁడు•మకరరాశి।గతుఁడునై యుండఁగా నిట్లు•ప్రతియుగమున
లాలితంబగు వేణీజ•లమున స్నాన । మాచరింపుచునుండెద • రదియుఁగాక. 34

తే. మొదటియుగమున నిజరూప•ములను రెండు।మూడు నాలుగుయుగముల•మొనసి మాదు
మేనులనుబూని యేతెంచి • స్నానములను । జేసిపోవుచునుందురు • చిత్తమలర.

క. వేణీప్రయాగకలిత । స్థానమున న్మాఘమందు • జనుఁ డహములు మూఁ
డేని జలకమ్ములాడిన । జ్ఞానాయక! యశ్వమేధ•శత ఫలమబ్బున్. 36

సీ. కాంచనమాలిని • ఘనమాఘఫలము ది।నత్రయంబొక దైత్యు•నకు నొసఁగిన
వాఁడు దోషములను • వదలి ముక్తికి నేఁగె । ననుచు దత్తాత్రేయుఁ•డనఁగ దాని
విని కార్తవీర్యుఁడు • ననియెఁబూజ్యుఁడవైన । మునివర! రాక్షసుఁ•డనఁగ నెవఁడు
కాంచనమాలి యె • క్కడిది వానికిఁ బుణ్య । మేల నొసంగె వా రిరువురకును

తే. నెటులఁజేరికగలిగె నీ • వృత్తమెల్లఁ । దెలియఁజెప్పుము నేనది • తేటపడఁగ
వినవలతుననిప్రార్థింప • మునికులాబ్ధి । చంద్రుఁడిట్లనె నారాజ•చంద్రుతోడ. 37

ఆ. వినుము దేనినైన ♦ వినికిడిచే వాజి । పేయయాగములను ♦ జేయుఫలము
గలుగునట్టి పూర్వ ♦ కథ యిది విస్మయం । బొదవు దీనిని చెలి♦పెదను నీకు. 38

## కాంచనమాలిని చరిత్ర.

తే. అప్సరస సుందరాకృతి ♦ నతిశయముగ । నలరు కాంచనమాలిని ♦ గల దదియును
మాఘమందున భానుండు♦మకరరాశి।నుండఁగఁ బ్రయాగమునఁగల♦యుదకములను

సీ. స్నానము నొనరించి ♦ స్వర్గమునకుఁబోవు । చుండ నత్తరి వంచుఁ ♦ గొండయందు
నొకపొదరింటిలో ♦ నుండి భయంకరా । కృతిగల రాక్షస ♦ వృద్ధుఁడొకఁడు
గని గొప్పతేజము ♦ కనక శరీరము । నందమౌ పిఱుదులు ♦ చంద్రముఖము
పెడఁదకన్నులు నల్ల ♦ వెంట్రుక లున్నత । స్తనములు నతిచక్కఁ ♦ దనముగలిగి
ఆ. గగనవీథినరుగు ♦ కన్నియతో నిటు । లనియె నెవరితరుణి ♦ వమ్మ నీవు
ఎచటినుండి యెచటి ♦ కేఁగెదు తలవెండ్రు । కలును గోకఁదడియు♦గతమదేల. 40

తే. చక్కఁదనమును మిగుల నా♦శ్చర్యకరము । నతిమనోహరమగు తేజ♦మలరు దేహ
మేమిపుణ్యమువలన ల♦భించె వినఁగ । వలతు నా విధమంతయుఁ ♦ దెలుపవమ్మ. 41

ఉ. నీతడిచేలయందుఁగల ♦ నీరములో నొక బొట్టిదేలకో
నాతలమీఁద సోఁకఁగ న♦నాదినసంభవమైన క్రూరము
న్నీతరిఁబాసి చిత్తమున ♦ కింపగు శాంతము నొందఁగల్గె నీ
వేతపమాని చేసితివి ♦ యింతటి పుణ్యము గల్గునంతకున్. 42

తే. పరిమళముగల సుమముల♦భ్రమర మెఱుఁగు।కరణి సజ్జనులందునఁ♦గలుగు మంచి
గుణములాకారమున నెంచు♦కొనఁగవచ్చుఁ। గాన నీవృత్త మెఱిఁగింపఁ♦గావలయును

సీ. అనుఁడు రాక్షసునితో ♦ ననియె నే నప్సర । సను విను కౌమరూ ♦ పిణిని పేరు
కాంచనమాలిని ♦ ఘనదివ్యవేణీ ప్ర । యాగసంగమమగు ♦ నంబువులను
స్నానముఁజేసి నేఁ♦జనుచుంటి నాకొప్పు । దడిసిన దయ్యెను ♦ దనుజసురల
వలన మ్రొక్కులుఁగొను ♦ పార్వతీధవుఁడగు । శంకరు కైలాస ♦ సదనమునకు
ఆ. నరుగుచున్నదాన ♦ నగుదు నాతడివస్త్ర । మందుఁ గలుగు పుణ్య ♦ మలరునట్టి
నీటిబొట్టునొకటి ♦ నీశిరమునఁబడు । కారణమున వదలెఁ ♦ గ్రూరబుద్ధి. 44

వ. నేను సుమేధసుఁడను గంధర్వరాజు కొమార్తెను ఏపుణ్యముచేత నట్టివానికిఁ గూతురనై పుట్టి,రూపసంపదగల కన్యకనైతినో యావృత్తాంతమును నీకుఁజెప్పెద వినుము.

మ. గతజన్మానఁ గళింగభూపతికి భో♦గస్త్రీననై యుండి సం
తత తారుణ్యవయోవిలాసముల చే♦తం గర్వముంబొందు న
న్నతిలావణ్యము గల్గు వేశ్యసతులం♦దగ్రేసురాలంచు నీ
గతిచే నెంతురు మత్కులాంగనలు నా♦గణ్యం బగణ్యంబుగాన్. 46

సీ. ఆజన్మయందు నే ♦ నతిభోగములయందుఁ।దగిలివర్తింపఁ ద♦త్పట్టణమునఁ
గలపురుషులు నను♦గని మోహమును జెంద । వారిచేతను నే న♦వారితముగ

వెలలేని రత్నము ♦ ల్వివిధభూషణములఁ । గొరఁతలేని ధనముఁ ♦ గోక లమిత
కస్తూరి గంధముఁ ♦ గర్పూర మగరును । బరిమళద్రవ్యసం ♦ పాదనమును
ఆ. జేయుచున్న నన్నుఁ ♦ జేరిన వారింప । ననుచుఁజెప్పఁజాల ♦ నందుఁగామ
మోహితాత్ములగుచు ♦ మునుకొనిపాదసే । వనముఁజేయుచుందు ♦ రనవరతము. 47

ఆ. అట్టి జారధనము ♦ నపహరించితిఁ దుద । ముట్టమోసపుచ్చి ♦ మట్టుమీరి
వలపు మచ్చరముల ♦ వారొకరొకరిని । గొట్టుకొనుచుఁ బడిరి ♦ కోపమడర. 48

ఆ. ఈ విధమున నేను ♦ నెడపకతప్పట్ట । ణమున నుండ నంత ♦ నాకు ముసలి
తనమురాఁగనపుడు ♦ మన మునసువిచారి। మొకటిదోఁచె వినుము ♦ ప్రకటితముగ. 49

సీ. క్రితువులుయాగ స ♦ ద్వ్రతములు దపములు । దానముల్సేయని ♦ దాననైతి
కామధర్మార్థ మో ♦ క్షములనే పురుషార్థ । ముల నొసంగెడు శివ ♦ పూజసేయఁ
జాలనైతిని దుఃఖ ♦ సమితిని హరియించు । దుర్గ నారాధింపఁ ♦ దోఁచదయ్యె
నధిక భోగములందు ♦ నాసక్తిపరుఁడు పా । పములనుదొలఁగించు ♦ పద్మనాభుఁ
తే. దలఁపనైతిని విప్రసం ♦ తర్పణమును । మాని ని మేలుసేయను ♦ బ్రాణులయెడఁ
బుణ్యమేమాత్ర మెఱుఁగను ♦ బుద్ధిహీను । రాలనై చేసితిని దోష ♦ జాలములను. 50

క. అనియిటు బహువిధముల మన । మునఁదలపోయుచును వేద ♦ ములఁ జదివినవాఁ
డును రాజపురోహితు వి । ప్రునకు శరణుజొచ్చి దుఃఖ ♦ మున నోస్వామీ! 51

ఉ. ఏనొనరించు పాతకము ♦ లెట్లు నశించు స్వకీయ కర్మముల్
బూనితపింపఁజేయు నను ♦ బొల్పుగ నీభవపంకమందున
న్నేనిటుముఁగ్గియుంటి నిఁక ♦ నీదయ చేఁగల నేత్రబిందువుల్
వానయి నాపయిందడపు ♦ వాఁడవునై నను నుద్ధరింపుమా. 52

ఉ. మంచియుఁజెడ్డలో నెఱుక ♦ మాలిన మానవులందు నెల్లెడన్
వంచనలేక పెద్దలగు ♦ వారొనరింతు రనుగ్రహంబు నా
సంచిత దోషముల్దొలఁగు ♦ సాధన నొజ్ఞ నొసంగుమంచుఁ బ్రా
ర్థించిన బ్రాహ్మణుం డుపక ♦ రింపఁగఁజెప్పె స్వధర్మరూపమున్. 53

వ. అదియెట్లఁగలేని. 54

క. వనితా! నీవొనరించిన । పనులన్నియుఁజెలియునాకు ♦ బ్రహ్మ క్షేత్రం
బునకేఁగి స్నానమచ్చట । నొనరింపుము పాతకములు ♦ నొనరుగఁదొలఁగున్. 55

ఆ. ఇంతకంటెనాకు ♦ నే యుపాయముఁదోఁచ । కున్న చెల్లనదుల ♦ నుల్లమలర
స్నానమాచరింప ♦ సకల ప్రాయశ్చిత్త । మగును పాతకముల ♦ కనిరి మునులు. 56

ఆ. కావనీవు చెడ్డ ♦ కార్యములను వీడి । పుణ్యతీర్థములకుఁ ♦ బోవయత్నే
మాచరింపవలెఁ బ్రి ♦ యాగతీర్థస్నాన । మున సమస్తపాప ♦ ములనుదొలఁగి. 57

తే. అతివ పరిశుద్ధురాలవు ♦ నగుచు స్వర్గ । మున వసింతువు చిరకాల♦మును బ్రయాగఁ
గాక యితరస్థలమునందుఁ♦గలుగుదోష। ములు ప్రియాగజలమునందు♦మునుఁగఁబోవు

సీ. వినుమొక కాలమందున మఘవుఁడు గౌత । మునిభార్యసౌందర్యమును గనుఁగొని
కామాతురత్వము గలిగి రజస్వల । కాంతతో నింద్రుఁడు గలియునట్టి
పాపముచే నాపె పతిశాపమిడఁగ స । హస్రయోనులు దేహమందుఁగలుగఁ
బడినఁ గురూపి భాసమునొంది తానొన । రించినపనికి నిందించుకొనుచు
తే. సిగ్గు నవమానమును మది గగ్గలమగు । చుండ నాతఁడు నీటిచే నిండి మేరు
గిరిని శతయోజనములగు విరివి చేతఁ । దనరుసరసికి నరిగి చింతాభరమున. 59
తే. కొలనిలోఁగలతామర కుట్మలమున । సూక్ష్మరూపముదనరారఁ జొచ్చి తనను
దనకుఁ బ్రేరేపకుఁడగు కందర్పు నిందఁ । జేసెనిట్లని మనమునఁ జింతగదుర. 60
ఆ. ఆపదలకు మూలమై చెడ్డనడపడి । మదముగలిగి జనుల మానసముల
నలచువాఁడు నాశ్రయములేనివాఁడు పంచశరుఁడిపుడు నాకు శత్రువయ్యె.
ఉ. ఏమనవచ్చునిందులకు నేమియుపాయముఁ దోఁచదయ్యె నేఁ
బామరుఁడం జడుండనయి పాపమునొందితినంచు నీట నా
తామరమొగ్గ నన్నొదిగి దాఁగిప్రయత్నమునేమి లేమికిన్
వేమరుచింతనొందుచును భీతిగుల్పడ నుండె నత్తరిన్. 62
తే. అమరనగర మరాజక మయ్యెనంత । దివిజగంధర్వకిన్నర దిక్పతులును
శచియుఁగదలి బృహస్పతి సదనమునకు । నరిగి వందనశతములు నాచరించి.
క. అయ్యా! మాకందఱకును । నియ్యెడఁ బ్రభువైన యింద్రుఁ డేచటనిలచె నీ
వొయ్యన సుజ్ఞానముచే । నెయ్యమునం దెలుపుమయ్య నీ నేర్పదరన్. 64
గీ. గొప్పగుణములులేనట్టి కొడుకులేని । కరణి యింద్రుఁడులేని స్వర్గము ప్రకాశ
మడఁగె నిప్పుడు రాచకార్యములు రాజు । గలుగుసాధన మదిలోనఁదలఁపుమయ్య.
చ. అనియిటుదేవతల్గురుని బ్రార్థనసేయ నతండు జిత్తమం
దునఁ దలపోసిచూచి కడు దుష్టప్రవర్తనల న్మెలంగి చిం
త నతఁడు సిగ్గునొందుచు ముదంబునుబోవిడి తత్ఫలంబులో,
ననుభవమొందఁ దాఁగిన రహస్యపుఁజోటది నేనెఱుంగుదున్. 66
చ. మనుజులునీతిదప్పి చెడు మార్గమునంజరియింప భీతినొం
దిన దురితంబులంబొదలు దిట్టతనంబున రాజ్యమత్తతన్
గనులకు శోకదోషమగు కార్యములంబొనరించి తత్ఫలం
బనుభవమైన ఖేదమున నాపదఁజెందుదు రెట్టివారలున్. 67
ఆ. మూర్ఖులైనజనులు బుద్ధిచెడఁగ దైవ । వశమువలనఁ జెడ్డ పను లనేక
ములను జేసి పాప ములచేత నిహపర । ములగు రెంట సౌఖ్యములకుఁదొలఁగు. 68
క. మనమిప్పుడు నింద్రునికడ । కును బోవుదమనుచుఁ దెలుప గురువాక్యములన్
విని వారందఱుఁ గౌతుక । మున వాచస్పతినిఁదమకు ముందిడుకొంచున్. 69
తే. స్వర్గముననుండికదలి విశాలమైన । మేరుపర్వతమందు బంగారుకమల
ములను నిండినతామర కొలనుదరికిఁ । జేరి యింద్రుని సన్నుతుల్సేయ నపుడు. 70

సీ. తనకులగురుబోధ•దగులఁ దామరమొగ్గ । యందుండి యిందుఱిందు • నరుగుదెంచి
సిగ్గుసంకోచముఁ • జిన్నఁబోయిన ముఖ । కమలము నందవి•కారమైన
శారీరమున బృహ•స్పతి పాదములపైని । బడి నేనుజేయు నీ•పాపములకు
ననుకూలమైన పా్రి • యశ్చిత్తకాండము । నొనరించి రక్షించు • మనుచు వేడు
తే. కొనిన మఘవునివాక్యము•ల్విని ప్రయాగ । జలములో స్నానమునుజేయ•సకలదోష
ములు నశించును దత్తణ•మున నచటికి। నేఁగుదమురమ్మ నాతోడ•నిపుడుననఁగ. 71
ఆ. అపుడు గురువువెంట • నఱిగి ప్రియాగను । తెలుపునలుపు గలుగు • జలములందు
స్నానమాచరింప • సంచితదోషము । లడఁగి శుద్ధుఁడయ్యె • నదితిసుతుఁడు. 72
ఆ. పాపములను విడువఁ • బడిలివి నీదేహ । మందుఁగలుగు యోను • లన్ని కనలు
గాఁగనింతనుండి • కనుపట్టు నాయను । గ్రహము చేతనముచుఁ • గరుణదనర. 73
తే. వరమునొసఁగిన గురువాక్య•సరణినపుడు । కనులుగానుండియోనులు•కమలములను
గలిగియానసమెంతే • బ్రికాశమాన । మైనవిధమున నిందుఱిందు • నతిశయించె. 74
ఉ. అంతట దిక్పతు ల్దివిజ•లార్యులు సప్తమహర్షులుం గడుక్
సంతసమొప్ప నింద్రునకు • సత్క్రియలంబొనరింప నాతఁడ
త్యంతకుతూహలంబొదవ • నందటితో నమరావతీపురం
బెంతొ వినోదముల్గనుచు • నేఁగి సుఖంబుననుండెఁగావునన్. 75
ఉ. నీవు ప్రియాగకేఁగి కడు • నిర్మలమైన సితాసితాంబులం
బావనమైనయేట బహు • భంగుల స్నానముఁజేయఁ బాపముల్
బోవునుబొమ్మటంచు నను • భూసురుఁడున్నియమింప నంతే స
ద్భావము చేత వారి పద • పద్మము లేనటుబట్టి మ్రొక్కుచున్. 76
ఆ. బంధువులను నింటి • పనివాండ్రబోనగ । త్తెలను ధనము విషయ • ములను విషము
వంటివంటకమును • వదలిదేహము నొక । క్షణములోనఁ బోవు•ననుచుఁదెలసి. 77
తే. తృప్తిఁబొందినమనసుతో•గృహమువిడచి।చని ప్రియాగమునందుంగు•జలములందు
మాఘమాసముననుు రవి • మకరరాశి । నుండఁగ సితాసితముగల • యుదకములను. 78
తే. స్నానమొనరింప మూఁడు ది•నముల ఫలము । వలనఁ గలుషములడఁగి మి•గిలినదిమ
లిరువదేడింటఁ బుణ్యము • నెనసి దేవ । రూపమొందితి మిగుల నా•రూఢిదనర. 79
క. నేనొనరించు ప్రియాగ । స్నానము చే నామజన్మ • సఫలము పూర్వ
జ్ఞానముగల దానను శ । ర్వాణికిఁజెలికత్తెనగఁ • బరగుచునుందున్. 80
సీ. అప్పటినుండి ప్రి • యాగ మహత్వము । వర్ణింపుచును బ్రీతి • వత్సరమున
మాఘమునందు నే • మరక యానదికేఁగి । నలుపు తెలుపు గలుగు • జలములందు
స్నానముఁజేసి నే • శంకరుధామమా । రజతాద్రికేఁగుదు • రాక్షసోత్త
ముఁడ! నీవు నేకర్మ•మున గొప్పకోరలు । బారుమీసములు వి•కారమైన
ఆ. రూపుగలిగి నీవు • నీపర్వతపు గృహ । యందు నిలుచునట్టి • వృత్తమువినఁ
గలను జెప్పుమనుచుఁ • గాంచనమాలిని । పలుక రాక్షసుండు • దెలిపెనిట్టుల, 81

## —♦ రాక్షసుచరిత్ర ♦—

ఆ. సజ్జనులకుఁ బ్రీతి ♦ సహజమైయుండును । హితవుగలుగు దాని ♦ నిచ్చిపుచ్చు
కొనుడు రతిరహస్య ♦ మును దెల్పనడుగుట । గలదునీకు నివి ము ♦ గలుగు కతన. 82

ఆ. నీదు చేత నేను ♦ నిజముగ సన్మాన । మొందినట్లుఁ దలఁతు ♦ నిందువలన
నిపుడు క్రూరజన్మ ♦ కెటులప్రాయశ్చిత్త । మేలకలుగుఁజూడ ♦ నింకునందు. 83

ఆ. సజ్జనులకు దుఃఖ ♦ సరణిని వినుపింపఁ । గలుగు సుఖమునందుఁ ♦ గాన నేను
జేయు పాపములను ♦ జెప్పెదనీతోడ । వినుము పుణ్యురాల ♦ వివరముగను. 84

ఆ. నేను బూర్వమందు ♦ నిర్మలమును శ్రేష్ఠ।మైన విప్రవంశ ♦ మందుఁ బుట్టి
నిగమములను సాఁగ ♦ ముగఁ జదివినవాఁడ । నగుచుఁ గాశియందు ♦ నంబువులను. 85

ఉ. స్నానముఁజేయఁ బాపులగు ♦ క్షత్త్రియ వైశ్య చతుర్థకోటి ను
ర్దానముల న్ననేక పను♦రాగముల న్విడ వానినెల్ల నే
మానక తీయుచుం జెడుగు ♦ మాలలొసంగిన దానమైనఁ బెం
పూనినవేడ్కలోఁ గొనుచు ♦ నుంటిని నేను వివేకశూన్యతన్. 86

ఆ. ఇదియుఁగాక నింక ♦ నితరములగు పాప।ములు ననేకములను ♦ బొసఁగ మూర్ఖ
తనము చేత నేను ♦ దగనొనర్చినదురి।తములకంటె లేవు ♦ ధరణియందు. 87

క. లేశమునకుఁ బాతకమును । కాశీక్షేత్రమున నెవఁడు ♦ గావించిన నా
లేశము నొక పర్వతమయి । గాశిని నొందించు నదియె ♦ కారణమగుచున్. 88

ఆ. అపుడు నేను గొంచె ♦ మగు ధర్మమైనను । జేయనైతి మిగులఁ ♦ జేయఁబడిన
పాతకములు నచటఁ♦బాయును నరకము।లందు నతఁడుఁ నెపుడుఁ♦జెందకుఁడు. 89

సీ. వజ్రమ్ముబూసిన ♦ పగిదినన్నంటిన । కలుషపుంజముల రా♦క్షసుఁడనగుచు
హిమశైలమందు నే ♦ నెన్నశక్యముగాని । భయదమైనట్టి, పా♦పము లనేక
ములు సేసి పిమ్మట ♦ మూఁడు శార్దూల జ । న్మలు రెండు గ్రద్ద జ♦న్మములుఁ బిదపఁ
బ్రాఁకెడు పురుగుల ♦ పగిదిని రెంటి నా।వల నారుజన్మలఁ ♦ బందినగుచుఁ
తే. బుట్టి చచ్చుచుఁ గడపట ♦ నిట్టి రాక్ష । సత్వమిటు పదియైదవ ♦ జన్మగలిగె
నందు నొక వెయ్యిడెబ్బది ♦ యైన వత్స।రముల కాలము నేఁగెఁ బ♦ర్వతమునందు.

తే. ఇటుల దుఃఖాబ్ధిలోమున్గి ♦ యెంతకాల । మునకు దరిఁజేరలేమి చే ♦ మూఁడు యోజ
నములు నాచుట్టు నీపర్వ♦తమున జనులు । మెలఁగమానిపితినినాదు ♦ బలమువలన.

సీ. ఏతప్పుఁజేయుట ♦ నెఱుఁగని ప్రాణులఁ । జంపితి నాపాప ♦ చయమువలన.
మండుచుండెడు నాదు ♦ మానసమిపుడు నీ । దర్శనమను సుధా ♦ ధారవలనఁ
జల్లఁదనమునొందె ♦ సజ్జనసహవాస । మునఁ బుణ్యమిదు తీర్థ♦ములను ఫలము
గలుగుచునుండుఁ ద♦త్పారణమునఁ బుణ్య। లగువారు శ్లాఘన ♦ కర్హులౌదు
ఆ. రిటుల నాదుదుః♦ఖవృత్తాంతములు దేట।పడఁగ నీకుఁ దెల్ప♦వాఁడనైతి
నెచటఁగుఱింకను జరి♦యింప సజ్జనసేవ । కెడముగాదొ దాని♦ నెఱుఁగఁ జెపుమ. 92

తే. ఏమిసేయుదునింక నే•నేమిసెప్పుదు । పాపిదుఃఖాబ్ధికిని దరిఁ • జూపువార
లెవరనుచు నాదు మనమున•నెపుడుఁ జింత। చేతఁ బొరలుచునుందుఁ బ్ర•సిద్ధముగను.

తే. అనుసరణచేత జీవించు•నట్టి ప్రాణి । కెల్ల సజ్జనులగువారి • హితవుగలుగుఁ
గాలసందర్భము దనలోని • పాలు హంస । కిడిన విధమున ఒకమున • కేలయిడను.

క. అనవిని కాంచనమాలిని । ఘనమగు దుఃఖాబ్ధియందుఁ • గ్రాగెడువానిన్
గని రాక్షసోత్తమా విను । నిను ధన్యునిఁజేతు నిపుడు • నిశ్చయమనుచున్. 95

ఆ. కరుణదనరఁ బ్రిలిన • గావించె నీవు పాపములనుండి విడువఁ•బడినవాఁడ
వగుచు ముక్తికలుగు•నట్లు ప్రయత్నముఁ । జేయఁగలను దానిఁ • జెప్పెదవిను. 96

—శ్రీ పంచచామరము శ్రీ—

అనేకమాఘమాసము ల్ప్రయాగమందు స్నానము
న్ననేకవత్సరంబులేను • నాచరింప దాన నా
కనేకపుణ్యమబ్బె దాని • నట్టి దిట్టిదంచుఁ జె
ల్ప నాకు శక్తిచాలదింక • బ్రహ్మరాక్షసోత్తమా. 97

సీ. చేసినపుణ్యముఁ • జెప్పరాదంచు బెద్దలగువారలచేతఁ • బలుకఁబడియె
వేదముల్జదివిన • విప్రులు నార్తుల । కిచ్చుదానము గణి • యింతురెపుడు
సింధువులందు వర్షించు మేఘంబులఁ । బోలు పుణ్యులకిడు పుణ్య మరయ
నార్తుఁడ నీకుఁ బ్ర • యాగమందునఁజేసి । పడసిన యొక స్నాన • ఫలమొసఁగెద

ఆ. నదియు నిపుడు స్వర్గ • మందించు దురితము । లడఁచి దీన సంది • యంబులేదు
పుణ్యదాన మేను • బొసఁగించి తత్పుణ్య।ఫలము నొందఁగలను • సలలితముగ. 98

గీ. అనుచుఁబాతకములనెల్ల • నడఁచివేయఁ । దనరు మాఘమునందొక • దినమునఁగల
స్నానఫలమియ్యఁదలఁచి రా•క్షసునకపుడు।తనదు కటిచేలజలమున•ధారవోసె. 99

ఉ. అంతటరాక్షసుండు తన • కైన వికారపు రూపుబాసి వి
భ్రాంతిని దేవలాకృతిని • భాసిల దివ్యవిమానమందు న
త్యంతప్రమోదమున్నొనరవ • నంబరవీధినినిల్చి కన్నుల
న్వింతగఁ గాంతిచేఁగలుగు • వీక్షణపంక్తులచేత నొప్పుచున్. 100

క. రెండవసూర్యునివలెనే। యుండఁగొనఁగ దేహకాంతు • లాశాంతముల
న్నిండఁగఁ గాంచనమాలిని । ఖండితముగఁ జూచిపలికెఁ • గౌతుకమెసఁగన్. 101

ఆ. జనులుసేయునట్టి • సకలకర్మములకుఁ । దగినఫలము నొసఁగు • దైవమిపుడు
నేవిధమునఁబాప • వృత్తి దొలంగని । నాకు మేలుగలిగె • నీకతమున. 102

ఆ. ఇపుడు నన్ననుగ్ర•హింపుము దయగల । మానసమున నీతి • మార్గములను
గలుషములను జేయ•కయు ధర్మవర్తన । వలన మెలఁగుదానిఁ • దెలియనటుల. 103

క. నీయుపదేశముఁజేకొని । నీయాజ్ఞ శిరమ్మునందు • నిలుపుచు నవి నేఁ
జేయుచు సురలోకమునకుఁ । బోయెదనని రాక్షసాధి•పుఁడు ప్రార్థింపన్. 104

చ. కనికరముంచి వానిపయిఁ • గాంచనమాలినివల్కె నిట్లు నీ
వనయము ధర్మవర్తనము • నందు మెలంగుచుఁ బ్రాణిహింసచే
తనువిహరింపమాని సత • తమ్మును బెద్దలసేవఁజేయుచు
న్మనమున సత్యవాక్యమును • మానక శ్రీహరిపూజసల్పుచున్. 105

సీ. మూర్ఖతనము మానుము, నొకరిదోషము । గుణముల శ్లాఘునఁ • గూడ దెపుడు
సాహసకృత్యులకుఁ • జనకు, మాంసము రక్త । మస్థితోనుండు దే • హాభిమాన
మును దలంపకు, భార్య • తనయులు బంధులు । మొదలగువారిపై • మోహమువిడు
మీ ప్రపంచము నశి • యించును క్షణకాల । మని తలంపుచు నీవు • మనమునందు
ఆ. ననవరతము యోగ • మభ్యసింప విరక్తి, మార్గమొదవు దాని • మహిమవలనఁ
దెలియువాఁడవగుచు • దీనిస్వారస్యము, ననుభవింపుమీవు • నసురవర్య. 106

ఆ. నీదుపైనిఁబ్రీతి • నిండినదైయుంట, నెఱుఁగఁజెప్పితిటుల • నింకనీవు
మానసముననిలిపి • మంచి ప్రవర్తన, గలుగువాఁడవగుము • విలసితముగ. 107

క. నీమునుపటి రాక్షసరూపము వదలుచు దేవతనువు • భాసిలఁగఁ బ్రకా
శమునొంద నష్టదిక్కుల, నమరావతి కరుగుమింక • నర్యమతేజా. 108

క. అని కాంచనమాలిని తన, మనమున ననుకూలతత్త్వ • మార్గముఁ దెలుపన్
విని రాక్షసుండు సంతసమును జెందుచుఁ బలికెనపుడు • బాలుపుగమలన్. 109

సీ. పుణ్యాత్మురాల నీ • బోధచే ధన్యుఁడ, నైతి నేనిఁక నీవు • ననవరతము
సంతోషమున సూర్య • చంద్రులుండెడియంత, వఱకును గైలాస • పర్వతమున
హరుని సాన్నిధ్యము • నందు వినోదింపు, చును గౌరితో సౌఖ్య • మొనరఁజేయఁ
గలుగు నీవెప్పుడుఁ • గడుధన్య మొదవిన, దానవుగమ్మ నీ • తనువునందు
తే. నాళడొలఁగినదానవు • నగుచు నాప, దలనుజెందినవారి బా • ధలనుద్రుంపు
మనుచుఁదత్కాలశ్రీపాద • వనజములకు, మ్రొక్కి రాక్షసుఁ డేఁగెస్వ • ర్లోకమునకు.

క. అప్పుడుసురకన్యలు ముద । మొప్పఁగ నాలింగనముల • నొగిఁజేయుచుఁ బైఁ
గప్పిరి కాంచమాలిని । కొప్పిదమగు సూనవర్ష • మొనరఁ గురియుచున్. 111

క. ఓపుణ్యురాల! రాక్షసు । పాపశరీరముననుండి • పాపితివిఁక మా
యాపదలుదీరె నిర్భయ, మే పాఱఁగ సంచరింతు • మీవనమందున్. 112

చ. అనుచుఁ బ్రియోక్తులంబలుకు • నట్టి సఖీజనవాక్యలాత్మకున్
ఘనముగ సంతసంబొదవఁ • గాంచనమాలిని వారిఁగూడి తా
ననుపమదేహకాంతుల వి • హాయసవీథినిఁ బ్రజ్వలింపఁగాఁ
జని రజతాద్రికి న్శిఖరి • జాపతిసఖ్యము నాచరింపుచున్. 113

చ. పరునకు మేలుసేయ బహు • భంగుల సంతస ముప్పతిల్లి పైఁ
బొరలుచునుండె నిండుకొని • పొల్పుగ నీకథవిన్నవారలే
సరణిని నైన రాక్షసుల • సంకటమొందక ధర్మవర్తనల్
దిరముగఁజేసి స్వర్గమున • ధీయుతులై నివసింతురెంతయున్. 114

క. అనియిటులఁ గా ర్తవీర్యున,కును దత్తాత్రేయమౌని • కూరిమిదనరన్
వినుపించినవిధమును నీ,కును దెలిపితి మాఘమహిమ•కోరికలలరన్. 115

ఆ. మఱియు దానిమహిమ•మార్గముఁజెప్పెద, నాలకింపుమనుచు • నావసిష్ఠ
మునివరుండు నిటుల • ముదమున బల్కె ది,లీపనృపవిభావ•రీపతికిని. 116

సీ. అనుచు సూతుఁడుశౌన•కాది మునీంద్రు ల,కును చెప్పెఁదత్కథ•వినుమటంచు
వ్రతములు నోములుఁ • గ్రతువులు దానము,లను బోలి వాని ఫ•లమునొసంగఁ
దనరు మాఘుస్నాన•మున మానవులు దమ,జననీజనకుల వం•శమును నాక
మున నిల్పి రవితేజ•మునఁ బ్రకాశించుచుఁ, గామగమనము చేఁ•గాంతిగలిగి

తే. నట్టి దివ్యవిమానము•లందు దేవ,గణములను స్వర్గమునకేఁగఁ•గలరు పాప
కృత్యములు సేయువారలు•గినుకఁ జెడ్డ,పనుల దుర్మార్గులనఁబడు • వసుధయందు.117

తే. మాఘమందునభానుఁడు•మకరరాశి,నుండ సూర్యోదయమునందు•నిండుమతిని
స్నానమొనరింపఁగుబుసము•సర్పము విడు, పగిదిదోషములన్నియు•విగతమగును.118

సీ. సత్యములేనట్టి•జనులు మాతాపిత,రుల దోషముల నెన్నఁ•గల మనుజులు
నాశ్రిమములు దక్క•వగువారు శాంతిధ,ర్మములమానుట డాంబి•కముల మెఁగఁ
గలిగిన జనులు మా•ఘుస్నానమొనరింప, సత్పురుషులు నేఁగు•సద్గతికిని
బోవఁగలరు మాఘు•మునఁ దపోవ్రతదాన. స్నానము విష్ణుపూ•జలును సలుపు

తే. వారికినిఁ బుణ్యఫలము సే•కూరుచుండుఁ,గాన నామాసమున నెల్ల•మానవులును
స్నానదానాదిపనులను•శ క్తికొలఁది, జేయవలయుఁబ్రియత్నము • చేత ననఘ. 119

తే. అన్నదానముఁజేసిన • నమృతపాన,మును సువర్ణముఁజేయు నిం•దుప్రిసమీప
మందు స్వర్లోకముననుండు • నంబరములు,నియ్య భానునిలోకమం•దెసఁగుచుండు.

తే. క్రతువులును మంచిదాన ప్ర•తతిని యోగ,వరుల పదసేవ చేఁగల•ఫలము మాఘ
మందునను బుణ్యతీర్థము•లందు స్నాన,మాచరించినఁబొందుదు• రవనినాథ. 121

చ. మనుజులు నిర్మలాంబువుల•మాఘమునందు నహర్ముఖంబునన్
మనమలరంగ స్నానమును • మాధవునర్చనఁజేయ దుఃఖభా
జనములఁబాసి స్వర్గమున•సౌఖ్యములందునఁ దేలి పిమ్మటన్
జననమునొందు భూమిపతి•చంద్రుఁడు గాగ నరేంద్రచంద్రమా. 122

ఆ. మఱపు చేతనైన • మత్తత చేతను । నైన పాతకములు • నల్ల మాఘ
మునను జేయుస్నాన•మునఁబాపికొనినాక । సుఖములనుభవించు•సుజనవినుత. 123

సీ. ధరణీశ వినుము గం•ధర్వకన్యక లెందుఁ । బాపుకో నేరని • శాపఫలము
ననుభవింపుచు రోమ•శునివాక్యములను మా । ఘుస్నాన మొనరింపఁ•గా వినుక్త
లైరన రాజేంద్రుఁ • డనియె మహాత్మ త । త్కన్యలకెందు చేఁ • గలిగె శాప
మెవరి బిడ్డలు వార • లెందఱు నామము, లెవ్వి మాఘుస్నాన • మెందుఁజేసి

ఆ. రెంతవయసువార • లీకథ నాద్యంత,ములుగఁ దెలుపుమనుచుఁ • బుడమి ఱేఁడు
విన్నవింప నపుడు • విధిసుతుఁడైన వ,శిష్ఠుఁ డిటులఁదెలిపె • శీఘ్రముగను. 124

ఆ. కాష్ఠమందునగ్ని ♦ గలిగినవిధమున, ధర్మవృత్తులన్ని ♦ తనదుగర్భ
మందునుండు దీని ♦ నంతయుఁజెలిపెద, నాలకింపుమీవు ♦ నవనినాథ. 125

వ. గంధర్వులలో సుఖ సంగీతునకుఁ బ్రిమోహినియు, సుశీలునకు శీలయు, స్వరవేదికి
స్వరయుఁ, జంద్రికాంతునకు సుతారయు, సుభగునకుఁ జంద్రికయు నను కొమా
ర్తెలు గలిగిరి. వారైదుగురును సమానవయస్కులై, పరస్పర తోఁబుట్టువుల వలె
నెప్పుడు నొప్పుచుందురు. 126

తే. వారు తామరమొగ్గల ♦ వంటి లేఁత, కుచములు చిగిర్చి పూఁచిన ♦ కొమ్మలవలె
ముఖ వికాసము యౌవన ♦ మునఁ దనరుచు, హేమకజసరములుధరి ♦ యించి మిగుల.

సీ. హాటకోజ్జ్వల రత్న ♦ హారముల్దాల్చి ని, పాదమాదిగఁ గల ♦ స్వరములేడు
ఆరోహణావరో ♦ హణాల మృదంగ వా, ద్యములఁ బిల్లనగ్రోవు ♦ లందు వీణె
పాటలనాటల ♦ వానిలయ ప్రమా, ణములను శిల్పశా ♦ స్త్రముల నేర్పు
గలిగి మాతాపిత ♦ రుల లాలనముచేత, సంచరింపుచు మేరు ♦ శైలమందు

తే. నొక్క వైశాఖమునఁ గడు ♦ నొప్పిదమగు గౌరిపూజలు సేయ మం ♦ దారపుష్ప
ములను గోయుచునచ్చోద ♦ మునఁ దనరెడు, సరసికిని బోయికన్యలు ♦ సంభ్రమమున.

తే. ఆకొలనియందు నతిమనో ♦ హరముఁ గలుగఁ, జేయుచునుఁ జక్కఁగా వికా ♦ సించి కాంతి
నెసఁగు తామర కలువ పూ ♦ లింపుగ దురఁ, గోసి కొన్నిఁటినపుడు నా ♦ కొలనిదరిని.

తే. స్ఫటిక వైడూర్యమణులను ♦ బరచినట్టి, నేలపైనుంచి స్నానము ♦ నెలఁతలపుడు
జేసి మడుఁగులు ధరియించి ♦ చెలువమమర, దర్భలను శుద్ధిపఱచిన ♦ స్థలముఁ జేరి. 130

సీ. బంగారునీరుతోఁ ♦ బదును జేసినపిండి, చే దుర్గప్రతిమను ♦ జేసి దాని
కావాహనాభిషే ♦ కాదులు గుంకుమ, పూజాది పరిమళ ♦ ములను మంచి
గంధ మందారముల్ ♦ కలువ తామర పుష్పములను బూజజేసి ఫ ♦ లమ్ములొసఁగి
యుపచారముల భక్తి ♦ యుక్తినాట్యములందుఁ, బ్రబలి గాంధర్వ సం ♦ బంధమైన

ఆ. తాళమానములను ♦ దగిన ముక్తాయింపు, లలరు నెత్తుగడల ♦ నమరునట్టి
స్వరముదనర నొక ప్ర ♦ బంధమొనరఁ బాడి, రందుఁగన్యలప్పు ♦ డందముగను. 131

తే. అట్లు మృగములకానంద ♦ మతిశయింప, నాటపాటల మెలఁగ వా ♦ రంతలోనఁ
జూడ మధ్యాహ్నమగుట న ♦ చ్చోదమునకు, స్నానమొనరింప నొక బ్రహ్మ ♦ చారిజనఁగ.

సీ. అతఁడు మన్మథునకు ♦ నతిశయించిన రూపు, రేకలు తామర ♦ రేఖలువలెఁ
దనరిన గొప్పనే ♦ త్రములు విశాల వ, క్షము మేరుచాపుని ♦ చాయమేను
గలవాఁడు రెండవ ♦ కందర్పుఁడో యన, నందగాఁ డొప్పిద ♦ మైనజుట్టు
గలిగి చేతధనువుఁ ♦ గలమారుఁడన హస్త, తలమందున పలాశ ♦ దండమొకటి

తే. యమరఁ గృష్ణాజినమును జం ♦ దెము ధరించి । ముంజిచే వేదనిధియను ♦ మునికుమారుఁ
డగ్నిపుండనవాఁడంత ♦ నరుగుదేరఁ । జూచి గంధర్వకన్యలు ♦ చోద్యమంది. 133

తే. ఆటపాటలుమాని వా ♦ రందఱు గుమిఁగూడుకొని వాని కన్నులఁ ♦ జూడబోయ
వానిబారికిఁబడు లేళ్ల ♦ పగిది మన్మ, థాస్త్రముల వ్రేటులకు మది ♦ నళుకుఁజెంది,

ఉ. తత్తరపాటుతో విరహ•తాపముఁ జొప్పడఁ గాముకేళికిన్
జిత్తముపుప్పు తెప్పలుగఁ • జందర వందర లాడుచుండ వా
రత్తటినొడ్లతోనొకరు • నాలనిఁజూడుము చూడుమంచు లో
నొత్తినపేర్మిపై కొనఁగ • నూకొనిపల్కఁదొడంగి రంతయున్. 135

సీ. ఇతఁడు మన్మథుఁడంచు • నెన్న రతీదేవి, తోడులేక డిన • జాడదోఁచె
నశ్వినీదేవత•లంచుఁ దలంపఁ దా, నొక్కఁరుండే మఱి•యొకఁడులేఁడు
గరుడగంధర్వ కిం•న్నరసిద్ధులందు నొ, క్కఁడు కామరూపియై • కంటఁబడెను
గాక మునిసుతుండో • లేక సామాన్యపు, మనుజమాత్రుఁడో బ్రహ్మ • మనకుఁగాను
ఆ. నిట్టిరూపురేఖ • లేర్పడసృజియించి,నటులఁదోఁచుచున్న • దనుచుమనకుఁ
బూర్వజన్మకర్మ•ములకు మూలమనిదె, కన్నియలమమనము • గాంక్షదనర.

క. చేసినగౌరిపూజకు, భాసిలనిదె తత్ఫలంబు • బ్రాహ్మణువేదా
భ్యాసుని రాజీగోప్తటికి, వాసిగరప్పించె వీని • వలచెద మనుచున్. 137

మ. తమలోఁదామిటుమాటలాడుకొన గం•ధర్వాంగన ల్వానినిం
గ్రమముందప్పక వీనులన్వినుచుఁ దాఁ•గావించు మధ్యాహ్న కృ
త్యములంజేయుచు బ్రహ్మచారి తనక • న్యాయంబుగానేమి వి
ఘ్నము గావింపఁదలంచిరో యని మది•న్భావింపుచు న్నెంతయున్. 138

చ. తలపఁగఁ బూర్వకాలమున • ధాతృమహేశ్వరవిష్ణుదేవత
ల్సలలిత యోగసిద్ధులును • సన్మునిబృందము నష్టదిక్పతుల్
పొలఁతుల చిద్విలాసమున • బుద్ధిచలింపఁగ మోహితాత్ములై
వెలసిరిగాదె చూడ నది • విస్మయముఁ న్నొనరించె నామదిన్ 139

తే. స్త్రీలకనుబొమలనఁబడు • దృఢములైన, ధనువులందుండి వెడలెడి • తళురుచూపు
లనెడి చురుకైనబాణము • లలరువిల్తు, చేత మృగమనుచిత్తము • జెందకున్నె. 140

తే. ఎంతకాలము యువతుల • దృక్కులనెడి, మద్యమునమత్తుజెందక • మసలుచుండు
రంతవఱకును బుద్ధిన్యా•యమునఁదవిలి, మనుజసమ్మర్దనభయము • మానునతఁడు.

సీ. చిత్తమందునఁ గాని • చెడిపోవదెన్నిక, గులమందు మిక్కిలి • గలుగుచుండు
నటుగానిపక్షము•నందు నీచెప్పిన, వానిలో నన్నియు • వదలఁబడును
స్త్రీలు మనోహర • చేష్టలతో నొప్పి, యనురాగ మొదవిన • మనుజవరుల
మద్యపానము చేత • మత్తుగల్గినవారు, గాను సంతోషము • గలుగువారు
తే. గాఁగఁజేయుచునుందు రీ • కన్య లిపుడు, ధర్మవర్తనలందునఁ • దగులమైన
గుణములను మత్తు సంతోష•మునఁ జెలంగు, వానిఁగా నన్నుఁ జేయను•బూనెనార!

గీ. రక్తమాంసము మలమూత్ర•త్రిములు నన్ని, గలిసికొని యపరిశుద్ధత•గలుగు స్త్రీల
దేహమందున మూఢులు• మోహతమము, చేతఁ గ్రీడింపుచుందురు • నీతి విడచి. 143

గీ. కాన నీకన్నియలు నన్నుఁ • గదియరాక, మునుపె నాయింటి కేఁగెద•ననుచు యోగ
బలము హరిభక్తిమహిమ చే•బ్రహ్మచారి, జనియె వారికదృశ్యుఁడై•కనులఁబడక. 144

సీ. అంతి గంధర్వక ♦ న్యలు బ్రాహ్మణునియోగ, బలము శ్రీహరిమీఁది ♦ భక్తివలనఁ
గలిగినమహిమను ♦ గనులను బ్రత్యక్ష,ముగఁ జూచి వారి క ♦ ద్భుతమునొదవ
బిత్తరిచూపుల ♦ బెదరుచుఁ గురరుల,వలె మొఱబెట్టెడి ♦ వార లగుచు
దిశలఁజూచుచుఁ గడు ♦ దీనలై నిలుచుండి, యావిప్రతనయుఁడు ♦ నింద్రజాల
తే. విద్యలు ననేకమాయలు ♦ విరళముగను, గలుగువాఁడగు లేనిప ♦ క్షమున నిపుడు
గనులఁ గనుపడి యింతలోఁ ♦ గానరాక,పోవునా యని చింతతోఁ ♦ బొరలుచుండి. 145

ఆ. ఒకరితోడ నిటుల ♦ నొకరు భాషింపుచు, బ్రహ్మచారి కనులఁ ♦ బడమిఁజేసి
దావవహ్ని వనము ♦ దహియించువిధమున, మానసము విరాళి ♦ మంట లెగయ. 146

మ. ప్రియుఁడా! నీ విపు డింద్రజాలమును వే ♦ వేగన్నివారించి నీ
దయ మాపైఁదగఁ జేర్చి నీదుముఖప ♦ ద్మం బియ్యెడంజూపి మా
నయనాబ్జంబులఁ జల్లఁజేయు మిఁక స ♦ న్మానించి రక్షింపు మ
య్యయొ మే మెట్లుభరింతు మీవిరహదా ♦ వాగ్ని న్నివారింపకే. 147

క. నినుఁ గనుఁగొనుటకునై మా,తనువులఁ బ్రాణములునిలిచెఁ ♦ దడ వేటికి నీ
వును నెచ్చోటను నేఁగితొ,కొనిపొ మ్మచ్చోటికిమముఁ ♦ గుతుక మెలర్పన్. 148

క. అని యావిధమున మొఱలిడు, వనితలు నొకకొంతసేపు ♦ వారికొఱకునై
కనిపెట్టి మార్గమంతట, జనకులచే నేమి మనకు ♦ సంభవమగునో. 149

చ. అనుభయ మొంది గేహముల ♦ కప్పుడు నేఁగఁదలంచి వానిపైఁ
దనరినపేర్మిసంకెలలు ♦ దాఁకి పెనంగొన నెట్టకేలకున్
మనముల ధైర్యమూని తమ ♦ మందిరము ల్దగఁ జేరి నీటిచెం
తను విరహాగ్ని చేతఁ గల ♦ తాపమున న్బడియుండి రెంతయున్. 150

ఆ. తల్లు లపుడువారిఁ ♦ దగఁజూచి మీ కిటు, నేల దాపురించె ♦ నీయవస్థ
కింతపొద్దు మీరు ♦ నెచ్చోటఁబుచ్చితి, రనఁగ నాప్రసంగ ♦ మడుగుపఱచి. 151

క. ఓతల్లులార! కిన్నర,నాతులతోఁ గంచుకములు ♦ నలుగఁగ నాటల్
ప్రీతి విహరింప మేఘము, నాతతముగ మిన్నుగప్ప ♦ నంబుజమిత్రున్. 152

చ. కనుఁగొనలేక మా కిటులఁ ♦ గాలము దూలెను మార్గమందు వే
గను జను దేర దేహమునఁ ♦ గాఁక జనించె నటంచుఁదల్లులన్
వినునటు చెప్పి కన్య లతి ♦ వేదనసెందుచు మంచిరత్నముల్
దనరుప్రదేశమందుఁబడి ♦ తల్లడమందుచు నుండి రొండొరుల్. 153

వ. ఇవ్విధంబునఁ బ్రొద్దుఁబుచ్చుచు, నా కన్యలలో నొకతె నెమలికి నాటనేర్పు దానివలె నొకచోట నిలువక చిందులుద్రొక్కుచుండెను. మఱొకతె పంజరములోనిచిలుకతోఁ బలుకకుండెను. ఇంకొకస్త్రీ తానుబెంచునట్టి గోరవంకతో మాటలాడదయ్యె. మఱియొక్కమగువ ముంగిసను లాలింపదయ్యె. ఇంకొకతె సారసపక్షులతో నాటలాడదయ్యె. ఇట్లు దామరకొలనికిఁబోకయు, నింటిలో నాటలాడకయు, బంధువులతోఁ జక్కగా మాట్లాడకయు, వీణెలువాయింపకయుఁ గల్పవృక్ష

పుష్పములవలన గలిగిన రసవత్త్వమును వానిసౌఖ్యకరత్వమునుం గ్రహింపకయు, నాపుష్పములవాసనగలిగినదగు కమ్మనితేనెనుద్రాఁగకయు,యోగాభ్యాసముఁజేయు విరక్తిగలస్త్రీలవలె నాసికాగ్రమందు దృష్టినిలిపినవారును,గుటి దప్పక ధ్యానించువారును, శ్రీవిష్ణుమూర్తిపై తలంపుగలవారును, గ్రొత్తనీటిబొట్లు వడుచున్న చంద్రకాంతపు రాళ్ళచేతఁ గప్పినవై యున్న కిటికీలయందు క్షణకాలమును, జలయంత్రముదాపున నొక క్షణకాలమును, జల్లని లేతకదలీపత్రములతోఁ జెలికత్తె వీవఁగా నొకయుగముతో సమానమైన నాఁటిరాత్రిని గడపి రంత. 154

సీ. తెల్లవారుటఁగని ◆ తెఱవలు నీరాత్రి, ప్రాణము ల్వీరహాగ్నిఁ ◆ బడక నిలువ
బ్రతుకు గంటి మటంచుఁ ◆ బలుమాఱు దలఁచుచు, ధైర్యముతోఁ దమ◆తల్లులకడ
కేఁగి గౌరీపూజ ◆ లీపూటఁ గావింప, జనియెద మన వారు ◆ సమ్మతింప
నచ్ఛోదమునకు వా◆రరిగి తజ్జలముల, స్నానముల్ సేసి పు◆ష్పముల శాస్త్ర
తే. పద్ధతిని బూజలొనరించి ◆ పార్వతికిని, ఫలములర్పించి సంతోష◆భరిత లగుచుఁ
బాటలందుండఁ దొలినాఁటి◆బ్రహ్మచారి, జనకునాశ్రమ మం దుండి◆స్నానమునకు.

ఉ. వచ్చినవానిఁ జూడఁగ న◆పత్యముభానుఁడు రాగఁ బద్మము
ల్విచ్చినమాడ్కిఁ గన్నులు న◆వీనముగా వికసింపఁ గన్య లా
సచ్చరితుం గనుంగొనెడి◆ సంభ్రమముల్ ప్రకటింప నంతలో
హెచ్చినకామమోహముల ◆ నేఁగిరి బ్రాహ్మణుఁ డుండుచోటికిన్. 156

క. చని వానికేలుఁగవ నెయి యును బెనఁగొనవేసికొనుచు◆ నోబాపఁడ ని
న్ననుమమ్ము మోసపుచ్చితి, వనఘా నేఁడెచటి కీవు ◆ నరిగెద విపుడున్. 157

క. మాచేతఁజిక్కి నీ కా,లోచన లిఁకనేల యనెడి ◆ లోఁబడునటులన్
యోచనతో నను కన్యలఁ,జూచి పలికె నిట్లునతఁడు ◆ సుస్థిరమతియై. 158

సీ. అనుకూలమును బ్రియ◆మైన వాక్యములను, బలికిరి రైన నా◆పలుకు వినుఁడు
నే బ్రహ్మచారినై ◆ నిష్ఠతో గురునింట, నిగమముల్ సదువుచు ◆ నిలిచియుంటి
గురుకులవాసము ◆ కొఱఁతగానున్నది, ధర్మము నెఱుఁగు పె◆ద్దలగువారు
నేయాశ్రమమున వ◆ర్తింపుచునుందురో, దానిలో న్యాయముఁ◆ దప్పకుండు
ఆ. రదియుఁగానఁ బెండ్లి ◆ నంగీకరించుట, తగదటంచు నాహృ◆దయమునందుఁ
దోఁచెననఁగ వాని◆తోఁ గోయిలధ్వని,పగిది కన్యలపుడు ◆ బలికిరిటుల. 159

సీ. ధర్మమువలన న◆ర్థమును నందునఁగామ,మును దానిచే ధర్మ◆మునకు ఫలము
గలుగుననుచు శాస్త్ర◆ములయందు నిర్ణయ,మని పండితులువల్కి ◆ రనవరతము
గాన నీ కిప్పుడు ◆ కామముతోఁగూడు,కొనిన ధర్మాధిక్య◆మునను గల్గు
సకలభోగములిచ్చు ◆ స్వర్గము నెదురుగా, నరుదెంచెఁ దత్ఫల ◆ మనుభవింపు
ఆ. మనఁగ బ్రాహ్మణుండు ◆ ననె మీరుదెల్పిన, పల్కు లన్ని నిజమె ◆ వ్రతము చివఱ
వఱకుజరిపి పిదప ◆ గురునాజ్ఞగొని మిముఁ,బెండ్లియాడఁదగును ◆ ప్రీతిదనర. 160

క. అని పలుకు బ్రహ్మచారిని, గని నీ వతి మూర్ఖతనము ◆ గలవాఁడవు నే
మనవచ్చుఁ దత్త్వమెఱిఁగిన, మనుజుఁడు శాస్త్రమునఁగలుగు ◆ మార్గమువలనన్. 161

సీ. బెండ్లిఁజేసికొనినఁ ♦ బెండ్లాము సిద్ధాష,ధరసాయనమునఁ ♦ దనరుచుండు
నావిధమ్మున సిద్ధుఁ♦డగును త్తమున కగు, ధర్మమువలన మం♦త్రి మదిగాన
విద్వాంసులైనను ♦ విషయములను నెందు,నట్టివారైనఁ గ♦న్యలననుగ్ర
హింతురు మఱి నీతి♦వంతులు దైవిక, మునఁగల్గుదానిఁ జే♦కొన నుపేక్షఁ
తే. జేయరొకపక్షమున నటు ♦ జేసిరేని, తిరిగి దానిగ్రహింపను ♦ దిపరితడవు
పట్టు నిదిగాక విషయము♦వలనసైన, నమృతము నమేధ్యమునసైన♦హాటకమును. 162

ఆ. హీనజాతివాని ♦ నైనయు సద్విద్యయుఁ, గొద్దికులపుజన్మ ♦ గొప్పసుగుణ
ములునుగలిగిశ్రేష్ఠ ♦ మునఁ నొప్పుకన్యక, నెవ్వఁడేఁ దిగ్రి♦హింపనగును. 163

ఉ. చక్కనిరూపుసంపద వి ♦ శాలమునౌ కులసంభవంబుఁ బెం
పెక్కినప్రేమమానసము ♦ నింపుగనొప్పిదమైన కన్నులుకా
దక్కవలేక యన్నిఁటను ♦ దానయివచ్చిన కన్యపుణ్యముకా
వెక్కసమైనవానికి ల♦భించును, గల్గదు పట్టివారికిా. 164

ఆ. ఈవుబ్రాహ్మణుండ ♦ వేము గంధర్వాంగ,నలము మీకుమాకు ♦ నలువఘటనఁ
గలిగెనిపుడుగాన ♦ గాంధర్వ వైవాహి,కమున మమ్ముఁగొనుము ♦ కరుణదనర. 165

సీ. అటులఁజేయుట కీవు ♦ నంగీకరింపని, పక్షమందున మేము ♦ బ్రతుకఁజాల
మన బ్రహ్మచారి క♦న్యలఁజూచి ధర్మము, నందునాసక్తినిం ♦ పొందఁగలుగు
వారె ట్లధర్మమై ♦ వరలుదు రిదిగాక, కౌమార్థ ధర్మమో ♦ క్షములు నాల్గు
పురుషార్థములు నాదు♦బుద్ధి ధర్మవిచార,మం దనారతము నిం♦పొందియుండుఁ
తే. గాననామాటవినుఁడు మీ ♦ రేనునిపుడు, నిచ్చగింపను మీపల్కు ♦ లిందువదను
లార! యనఁ గన్యలపుడు వి♦చారముదవ, నభిమతమునానికిట్టిది♦యనుచుఁదెలసి. 166

ఆ. ఒకరినొకరుఁజూచి ♦ యిఁక వీఁడు మాటల, చేతఁజిక్కఁడనుచుఁ ♦ జేతులకును
వేసికొనినపెనను ♦ విడచి గంధర్వక, న్నియలువానిపైనఁ ♦ బ్రియముఁగదుర. 167

సీ. అంతఁ బ్రమోహిని ♦ యడుగులురెండు సు,స్వద సుశీలలు భుజ ♦ ద్వయ మిరువురుఁ
గదలనీయకపట్టి ♦ కౌఁగిలించెసుతార, ముఖమును జంద్రిక ♦ ముద్దుగొనియె
నటుల వారైదుగు ♦ రాబ్రహ్మచారికిఁ, గామవికారము ♦ ల్గలుగఁజేయ
నతఁడు ధీరతఁ బ్రశ ♦ యాగ్నిరీతినిమండి, కోపముతో మీరు ♦ కుమతులగుచు
తే. మోహపరవశమున దయ్య♦ములవిధమునఁ, బట్టుకుంటిరినన్ను నా ♦ పగిదినిఁకను
దయ్యముల రౌదురని విప్ర♦తనయుఁడు గడు, శాపమిచ్చెను గంధర్వ♦సతులకపుడు.

తే. బ్రాహ్మణునిచేత నిటుల శా ♦ పమునుబడసి, దూరమునజని వానియె♦దురనునిలచి
కన్యకలునిట్లువలికి ర♦కారణముగ, శాపమొసఁగితివో బ్రహ్మ♦చారి మాకు. 169

తే. స్నేహమేధర్మమగునని ♦ చెప్పుచుందు, రిట్టిచేసిన నీధర్మ ♦ మెట్లుదెలసి
నదగుఁదనయందు ననురాగ♦మొదవువారు, భక్తులును స్నేహితులునఁ♦బరగుచుంద్రు

క. వారికి ద్రోహముఁజేసిన, పూరుషు నిహపరములఁదుఁ ♦ బొందు నె సౌఖ్యం
బీరీతిఁ బెద్ద లనఁదగు, వారివలన నీవు విన్న ♦ వాఁడవెచెపుమా. 171

తే. అదియుఁగావున నీవు ద ♦ య్యమవగుమని, పలికి తమపనులంతట ♦ వదలి విప్రి
శాపమునఁగన్యలపుడు పి ♦ శాచరూప, మలర వారలుత్క్షుద్బాధ ♦ గలుగుచుండ. 172

క. ఆకొలని తీరమున నపు, డేఁకువ చేనుండిరంత ♦ నిలసురవరుఁడున్
జీకాకున దయ్యమువలెఁ, దేఁకువసెడిపోవ నచటఁ ♦ దిరుగుచునుండెన్. 173

సీ. వేగిరపాటుతో ♦ విప్రుండు గంధర్వ,కన్నియ లటుశాప ♦ కారణమునఁ
బెనుదయ్యములవలె ♦ భీషణాకారలై, మొరలువెట్టుచుఁ బాప ♦ మునఁ బొరలుచుఁ
దొలిజన్మమునఁజేయు ♦ దుష్కర్మఫలము సం,ఘటనమై కాలముఁ ♦ గడుపుచుండి
రెవరేనిజేయు సు ♦ కృతదుష్కృతములు వా, రనుభవింపకతీర ♦ దమరులైనఁ

ఆ, దానుజేయుకర్మ ♦ తననీడవలె వెంట, నంటితిరుగుచుండు ♦ జంటఁబాయ
కుండ వారితల్లి ♦ దండ్రులు నీవార్త, వినఁగ మిగులదుఃఖ ♦ వివశులగుచు. 174

తే. అయ్యయో! యెంతదగుప్రమా ♦ దానుభవము, గలిగెనిప్పుడు దైవయో ♦ గమున కెవరు
మీరరాదుగదాయని ♦ మిన్నుముట్టి, రోదనముఁజేయుచుండిరి ♦ మేదినీఁబడి.

తే. సరసిగట్టునఁగన్యలు ♦ జడులపగిది, నేడ్చుచుండిరి చిరకాల ♦ మిటుగతించి
పోవ నంత నొకానొక ♦ పుష్యమాస, మసితపక్షచతుర్దశి ♦ యగుదినమున. 176

ఆ. స్నానమాచరింప ♦ సరగున సచ్ఛోద,మునకు రోమశుఁడను ♦ మునివరుండు
వోవ నారుభూత ♦ ములు నాఁకలికినోర్వ, కతనిఁజంపితినుట ♦ కపుడు వేఁగ. 177

తే. చేరువకుఁబోవ నాముని ♦ శేఖరునకుఁ, దపము చేఁగల్గుతేజము ♦ దయ్యములను
గాల్పనని నిల్వరింప శ ♦ క్యములుగాక, దూరమునకేఁగినిలచెను ♦ ధారుణీశ. 178

సీ. అంతటఁ బురుషద ♦ య్యములండ్రివేదని,ధి స్నానమునకు నే ♦ తెంచి రోమ
శమహామునినిజూచి ♦ సాష్టాఁగదండ మ,ర్పించి హస్తములుఁజో ♦ డించినిలచి
మంచిమాటలచేత ♦ మౌనితోనిట్లనెఁ, దమబోటివారి సం ♦ ఖ్యమును మేలు
గలుగుటకేగదా ♦ గంగాదిపుణ్య తీ,ర్థముల స్నానమును బెద్దలగువారి

తే. స్నేహ మీరెంటిలోపల ♦ శ్రేష్ఠమగును, సత్పురుషులతోసఖ్యము ♦ స్వర్గమిచ్చు
నదియు యోగములన్నియు ♦ నణఁచి పిదప,సకలఫలములనొసఁగుటఁ ♦ జాలినదగు.

గీ. కావునకిప్పు డెదుటను ♦ గానుపించు, దయ్యములు నందునైదుగం ♦ ధర్వకన్య
లాఁడువియ మత్సుతుండగు ♦ నాఱవదియుఁ, బురుషదయ్యము వీరలు ♦ పోడిమిచెడ.

వ. పరస్పరశాపబద్ధులై వికారరూపములనుజెంది చిన్నవోయిన మొగములతో మీసన్ని
ధిని నిలచియున్నవారైరి. 181

క. శాపవిమోచనములకై, నీ ప్రాపుఘటించెనేఁడు ♦ నిష్కృతిచే ని
ష్పాపులను జేయవలెనిఁక, నా ప్రార్థనమూనిమదిని ♦ నరనుతచరితా. 182

తే. భానుఁడుదయింపఁ జీఁకటి ♦ పరువులిడిన, పగిది నీ దర్శనమున శా ♦ పములనుండి
తొలఁగువీరలటంచుఁ బు ♦ త్రునిగుఱించి,ఖేదపడువేదనిధిని సం ♦ మోదమెదవ. 183

క. కనిరోమశముని యో బ్రాహ్మణ యీపిల్లలును నాదు ♦ ననుమతిసేయన్
వెనుకటివలెనుండుటకై, వినుపించెద ధర్మమొకటి ♦ వినుమిదినీవున్. 184

వ. అనిన వేదనిధి యిట్లనియె. 185

క. వీరలశాపములింతటఁ, దీరెడుధర్మమును నాకుఁ • దెలుపుమీఁకను స
హ్రీరములై కొల్చెను సొం,పారగనగ్నులపగిది న•వారితబలిమిన్. 186

క. అని యిటులనుబ్రార్థించిన, విని రోమశమునివరుండు • వీరలు నా వెం
టను వచ్చి మాఘమాసం,బున స్నానముసేయ శాప•ములును దొలంగున్. 187

సీ. ఏమిచేసిన నీఁక • నీ శాపములు వోవు, పుణ్యతీర్థములఁదు • మునుఁగనేఁగు
మాఘమందున దీని•మహిమ నేమనవచ్చు, నింతకుఁబూర్వము • నేడుజన్మ
ములనుజేసిన పాప•ములతోడ నీ జన్మ,కలుషముల్ మొదలంటఁ • గాల్చివేయు
నగుదోషములకుఁ బ్రా•యశ్చిత్తమిదె దీని•కన్న మిన్నైన వే•రెన్నఁబడదు

తే. మునివరులు చూచి యెఱుఁగరు•గనుక నెట్టి, దోషములు మాఘమందున•దోఁగబుణ్య
తీర్థములకేఁగఁగడపటఁ•దీరునంచుఁ, దోఁచెనాకిది దగుదీని • నాచరింప. 188

ఆ. మనుజులెవరు మాఘ • మకరమునందు మా,నససరస్సునీట • స్నాన మాచ
రింప ముక్తిగలుగు • హిమశైలపానీయ,మున సమస్తపాప•ములు నడంగు. 189

సీ. సారస్వతీజల•స్నానము నెవరేని, గావింపబ్రహ్మలో•కమునుగలుగు
లలితశీలావిశా•లాజలమ్ములస్నాన, మొనరింపఁ బృధుఫలం • బెనయునౌను
గంగోదకంబులు • గలుషములను గాష్ఠ,ముల కగ్నివంటివై • మొదలునంటఁ
గాల్చి పునర్జన్మ • కారణమగుపను, ల్దొలగింపఁజాలును • దుంగభద్ర

తే. సరయువును గండకీ భీమ • చంద్రభాగ, సింధు కావేరి కృష్ణ ప్ర•సిద్ధమైన
కౌశికిప యోష్ణి గౌతమీ•వాసిగలుగు, నదులు పాపములణఁచిపు•ణ్యములనొసఁగు 190

గీ. నైమిశారణ్యమందు స్నా•నమ్మొనర్పఁ, బద్మనాభునిరూపముఁ • బడయునతఁడు
పుష్కరక్షేత్రమున బ్రహ్మ•పురమునఁ గురు, క్షేత్రముననింద్రలోకముఁ•జెందఁగలరు

సీ. ఇపుడు నేఁజెల్పిన • యీపుణ్యనదులు వి,నాగగంగాయము • నాగలసిన
దగుప్రయాగను మాఘ•మందు స్నానముఁజేయ, సకలతీర్థఫలంబు•సంభవమగు
నదిగాన తీర్థము•లన్నిఁటికంటె దా,నతిశయంబైన ప్ర•యాగమహిమఁ
దెలిపెద నదినీకు • దేవత ల్స్వర్గము,నందున్నవారలై • యెందుస్నాన

తే. మొనరఁజేసిన గర్భవే•దనలుదొలఁగి, విష్ణుదేవుని సాంగత్య•విభవులౌదు
రట్టిదైన ప్రయాగలో • నాచరించు, స్నానఫలమెట్లు సంభవ•మౌనటంచు. 192

మ. ఘనగీతంబులఁ బాడుచుందురు ప్రయా•గస్నానవుల్లెవ్వరై
నను మాఘంబున మూఁడహర్ముఖముల • స్నానంబుగావించు వా
రు ననేకంబులు జన్మపాతకము లా•రూఢి న్విసర్జించి పా
వనమౌ స్వర్గమునందు భోగములచేఁ • బ్రావీణ్యులైయుండెదర్. 193

సీ. గణ్యమైదనరు మా•ఘమునఁ బ్రయాగలో, స్నానముఁజేసిన • దానిఫలము
దానయాగవ్రత • తపములఫలమును, విధిమున్నుతాఁ బ్రసునఁ • బెట్టితూచఁ
గాఁ బ్రయాగమునందుఁ • గావించునట్టి మా,ఘస్నానమే హెచ్చు • గానుపించె
నడవులయందు దే•హములుశుష్కింపఁగా, నాకులునీళ్ళునా•హారములుగఁ

తే. జేసికొని చిరకాలము • సేయునట్టి, యోగతపముల చేతఁ బ్రి•యాగ స్నాన
మాచరించిన నుత్తమ•మైనగతిని, బొందఁ జేరరు లేదునూ•సందియంబు. 194

సీ. మనుజులు నెవరేని • మాఘమునందు గం, గాయమునానదు•ల్గలసికొను ప్రి
యాగజలంబుల • నరుణోదయమున సు, స్నానమ్ము నొనరింప•సకలసంప
దలుహ త్తి బారులు • దనరివాకిలితల, నిటునిహమందున•నీగి తుదకుఁ
బరమున మోక్షము • ప్రాపించు నశ్వమే, ధములును రాజసూ•యములు సేయు

ఆ. ఫలముకన్న మిగులఁ • గలుగుచుండుఁ బ్రియాగ, స్నానమాచరింప • దానిమహిమ
నెన్నవశము గాదు • నెవరికైనఁ బా, పములనీసడించి • పారఁదోలు. 195

క. ఘననర్మదానదీతట, మునఁ బూర్వ మవంతిదేశ•ముం బాలనముం
బొనరించు వీరసేనుం, డొనరించెను రాజసూయ • మొకఁ డుత్సుకుఁడై. 196

సీ. బంగారుతోడుపులఁ • బరగు యూప స్తంభ, ములు మొదలగువాని•వలన నాక
ఫలము నపేక్షించి • పదియారు నశ్వమే, ధములను గావించి • సమతమతిని
ధాన్యరాసులు పర్వ•తములఁబోలు నవియు, గోభూసువర్ణము • లోకోట్లకొలఁది
ధారుణీసురులకు • దానదక్షిణలిచ్చి, హరిభక్తి మెలఁగెడు•నట్టివేళఁ

తే. గులముతక్క—వనీచుండు • పొలము దున్ను, కొనుచు జీవించువాఁడును•గులమునందు
విడినవాఁడును బెడునడ•వడినిగలుగు, భద్రకుండని కలఁడొక • బ్రాహ్మణుండు. 197

తే. అతఁడు దైవికమునఁ దీర్థ•యాత్ర కరుగు, నట్టివారినిగూడి ప్రి•యాగ కేఁగి
మూఁడుదినములు నాజల•ములను మాఘ, మాసమున స్నానమొనరించె•మనముగదుర.

ఆ. అంత నూరకుండ • కాబ్రాహ్మణుండు నిం, కొక్క—పరి ప్రియాగ • కొంటరిగను
మఱలనేగి మాఘ•మాసమున స్నానమ, మాచరించివచ్చె • ననఘుఁడగుచు. 199

తే. పిదప నావీరసేనుఁడు • విప్రుఁ డేక, కాలమందునఁజచ్చి స్వ•ర్గమునకేఁగి
రవల నొకకొన్ని దినముల•కరిగి వార, లిరువురనుజూడఁగంటి నే•నింద్రసభను. 200

వ. వార లతిరూపసంపన్నులును, వయోవిలాసులును, దేజోవంతులును, బలశాలురును దేవతాస్త్రీలతో నిండుకొన్నవారును, దివ్యవిమానముల చేత నొప్పుచున్న వారును మిగుల నలంకారభూషితులును, గల్పవృక్షపుఁబుష్పదామముల గలవారునునై యాటపాటల చే సమానవైభవములతో నుండిరి. 201

తే. ఇట్లు ప్రత్యక్షముగఁగంటి • నీప్రియాగ, మహిమ నేమని వర్ణింతు • మాఘమందుఁ
జేయుస్నానఫలము రాజ•సూయయాగ, మునకు మిన్నగుచుండు వే•దనిధివిప్ర 202

క. ధనువులు ద్విశతములగు పొడ, వునఁగలుగు సితాసితాంబు•వులుగలిసిన నే
మనను బ్రియాగస్నానం, బొనరించిన మాఘమందు • నొగి ముక్తుఁడగున్. 203

ఆ. రాజసూయమున వి•రాజితమగు ఫల, మైనపిదప స్వర్గ•మందు నిలువ
కరుగుచుందు రవని• కలిపాపియుఁబ్రయాగ, జలము ముట్ట మఱల•జన్మఁగనఁడు. 204

సీ. విను మింద కొకపురా•తనముఁ బిశాచవి, మోచనమనుకథ • మొనసియుండె
నది విన నీసుతుఁ • డప్సరసలు పిశా, చముల నంమండి ని•క్క—ముగఁదొలఁగు

వినుపింతు నది యొక ♦ విప్రుండు పూర్వము, వేదముం జదివిన ♦ విష్ణుభక్తుఁ
డమితదయాపరుఁ ♦ డైన దేవద్యుతి, యొకని పిశాచత్వ ♦ మొసరఁ దొలఁగఁ
తే. బెట్టె నను రోమశమునితో ♦ వేదనిధియు, ననియె దేవద్యుతియన ♦ నతఁడు నెవని
తనయుఁ డెటు హరిభక్తి యా ♦ తనికి సంభ,వించె నెవని పిశాచత్వ ♦ మెటులఁ బాపె.
తే. దీనివృత్తాంత మంతయుఁ ♦ దేటపడఁగఁ, దెలుపుమను వేదనిధితోడఁ ♦ జెల్లముగను
రోమశమహర్షి పలికె నా ♦ రూఢి నిటుల, వినుమనుచు దాని నెల్ల స ♦ విస్తరముగ. 206
క. విన వేడుక పుణ్యముచేఁ, దనరెడు నీపూర్వకథను ♦ దప్పక విను మా
ఘున "ప్లక్షప్రస్రవణం", బనఁదగు వన మొకటి గలదు ♦ నతిరమ్యంబై. 207
వ. అట్టి పుణ్యక్షేత్రము సరస్వతీనది జనియించినచోటునఁ గలదై యుండె, నది నేపి, తాడి, చీఁకటిమ్రాను, మారేడు, పొగడ, చింత, కానుగు, మామిడి, సంపెంగ, కంపిల్లము, నాగకేసరము, రావి, బొట్టుగు, కొండగోఁగు, కలిగొట్టు, చండ్ర, తుమికి, వెంకాయ, సదాప మొదలగు వృక్షముల చేతను జుట్టఁబడినదై, యన్ని కాలములయందును బూలు, కాయలు, పండ్లు, గలదై, పుష్పాదిరవల చేత ధనదుని యుద్యానవనమువలె నానందము గలుగ జేయుచుండును; మఱియు నాయాశ్రమము తమ కుచితములైన యాహారముల చేత మత్తుఁ గొనియున్న కోయిలల స్వరములును, దుమ్మెదల రొదలును, చిలుకలను గోరవంకల పలుకులు నిండుకొని కోలాహలధ్వని గలదై యుండెను. పలువిధములైన కోఁతులును సంచరించుచుండెను. 208
సీ. ఆవనమందున ♦ నధికధర్మస్వభా,వము చేత నొప్పు దే ♦ వద్యుతియను
బ్రాహ్మణోత్తముని ని ♦ వాసాశ్రమము గల, దతఁడు 'సుమిత్రు'న ♦ కాత్మజుఁడయి
చక్రికరుణ చేత ♦ జనియించి సకలేంద్రి,యముల జయించి కో ♦ పము నడంచి
సూనృతమాడు న ♦ సూయయే లేకుండుఁ, జిత్తము వశముగాఁ ♦ జేసికొనుచు
తే. మండు వేసవిఁ బంచాగ్ని ♦ మధ్యమందు, నిలిచి సూర్యుని పై దృష్టి ♦ నిలిపి వార్షి
కమున మేఘము దట్టము ♦ గాను మింటఁ, గలిగి జడివాన వర్షించు ♦ కాలమందు. 209
తే. అంతరిక్షముఁ గనుచు హే ♦ మంతమందు, శీతవాయువు వీవఁ బై ♦ చేల మేమి
కప్పకయు నీటిలోనుండి ♦ కఠినమైన, తపముఁ గావించె నిటుల స ♦ ద్ధర్మ్యుఁ డగుచు.
చ. అతఁడు సహస్రవర్షములు ♦ నాపగిదిం దపమాచరింప స
మ్మతముగ నందుఁ బ్రజ్వరిలు ♦ మంటలు నావిరి నాల్గుదిక్కులన్
వితతములై వెలుంగఁ గడు ♦ వేడిమి కెంతయుఁ దాళలేక ప
ర్వతమున నుండు ప్రాణు లతి ♦ బాధలఁ జెందుచుండె నెంతయున్. 211
సీ. ఆభూసురోత్తముఁ ♦ డైన దేవద్యుతి, సేసిన తపముచేఁ ♦ జెలువ మమర
వీతిహోత్రుని వలె ♦ వెలుఁగుచునుండె నా,తఁడు కొన్ని నీమముల్ ♦ నడపుచుండె
నవి చెప్పెదను విను ♦ మనిశముఁ గాలత్రి,యమునందు మంచిపు ♦ ష్పముల చేత
హరికి సహస్రనా ♦ మార్చనఁ జేయుచు, ధ్యానము న్వేదప ♦ ద్ధతి నొనర్చు
తే. నిటుల శ్రీవిష్ణుమూర్తికి ♦ నింపుగదుర, స్మరణఁ జేయుచు నొక్క వై ♦ శాఖశుద్ధ
మందు నేకాదశీదిన ♦ మందు నధిక,సమ్మతంబున హరిపూజ ♦ సలిపి పిదప. 212

ఉ. వింతమనోహరం బొదవ • వేదవిధి న్నుతిసేయుచుండి శ్రీ
మంతుని దేవదేవుని ర•మాధిపు నార్తశరణ్యునిం గడున్
సంతసమొప్ప గాఁ దనదు•చక్కఁటికి న్నరుదేరఁజూచె న
త్యంతకుతూహలమ్ము దన•రాఁగ నండజవాహు విష్ణువున్. 213

వ ఇట్లు గరుడవాహనారూఢుండును, దొలికారు కొఱుమబ్బులో సమానమగు దేహుండును, జతుర్భుజుండును, శ్రీవత్సకౌస్తుభవిశాలవక్షుండును, శంఖచక్రగదా ఖడ్గశార్ఙ్గధరుండును నైన శ్రీమహావిష్ణువుం దర్శించి, బ్రాహ్మణుండు, గగు ర్పాటుగలవాఁడును, నానందబాష్పములతోఁ గూడిన నేత్రములు గలవాఁడును గృతకృత్యమైన మనసుగలవాఁడును నై యప్పుడు. 214

ఆ. భూమిపైని శిరము • మోపి సాఁగిలబడి, మ్రొక్కి నిలిచి దేహ•మునను గ్రమ్మ
కొనినదువ్వ దుడిచి•కొనఁగఁ బరబ్రహ్మ, మొందువానిపగిది • నుండె నంత. 215

సీ. వైష్ణవోత్తముఁడు దే•వద్యుతీపైఁ గలిగిన ప్రీతిచే నిటు • లనియె హరియు
నీవు నాయెడ భక్తి • నిలిపి కర్మములను, వదలినవాఁడవై • సదమలమతి
నన్యమెఱుఁగక న•న్నాశ్రయించితివని, తెలిసి నీకోరికఁ • దీర్పఁ దలఁచి
వచ్చితి నేమైన • వరము లిచ్చెద నేఁడు, మన దేవదేవుఁడ • నైన నీస్వ

తే కీయమగు మాయచే నీవు • సియ్యకొనిన, దేహదర్శన మెపుడు కు•తూహలమునఁ
జేయుచుండుటకంటెఁ బ్ర•సిద్ధమైన, వరము లేదు హరీ! కృష్ణ! • వాసుదేవ. 216

తే. బ్రహ్మ మొదలగు సకలదే•వతలు సనకుఁ, డాదిగాఁ గలయోగమ•హాత్ము లధిక
శిద్ధులగు కపిలాదులు • చిత్తమందు, నిన్నుఁ జూడఁ దలంతురు • నిరత మనఘ. 217

సీ. నాది, నే, ననెడి య•జ్ఞానమూలంబగు, పాశములందు శు•భము, నశుభము
దనరుచుండును బరా•త్పరుఁడవన నీయందు, నవి హేతువులచేత • నంటఁగాలు
నాజన్మమును బనుల్ • నాబుద్ధికినిఁ దగఁ, గలిగిన ఫల మేది • గలదొ దాన
నీచేత నిప్పుడు • నేఁ జూచినదిగాక, యింతకు వేఱైన • దేమివరము

తే. గలదు పరిశుద్ధుఁ డగుటకుఁ • గారణమిదె, యనిశమును నినుఁ బొందు నా•యంతరాత్మ
వలన నీపదపద్మముల్ • దలఁచుచుంటి, భక్తినీయందు నా కగు • వరము నిమ్ము. 218

కం. అనికోరిన దేవద్యుతి,వినయోక్తుల నాలకించి • విష్ణువు హర్షిం
చిన మనసున నటుగాని, మ్మని నిశ్చయపఱచి పలికె • మఱియిటులనుచున్. 219

తే. బ్రాహ్మణోత్తమ! విను నీత•పమున కెపుడు, విఘ్న మొదవదు ననుఁ గూర్చి•వివిధగతులఁ
జేయు నీస్తవ మెవరు సు•స్థిరమనమునఁ, బలుకు వారికి నాయెడ • భక్తిగలుగు. 220

తే. జ్ఞాన మేమాత్రమైన స్వ•కర్మవలనఁ, గలుగ సంపూర్ణమై యది • తొలఁగకుండు
దానివలన సర్వోత్తమ • మైన నిష్ఠ, నిలుచు వారికి నెప్పుడు • నిశ్చయముగ. 221

ఆ. అనుచు దేవదేవుఁ • డైన మహావిష్ణు, వరిగెఁ గనుపడకయ • యటు వెనుకను
నధికనిష్ఠచేత • నలరు దేవద్యుతి, విష్ణుభక్తుఁ డగుచు • వెలుఁగుచుండె. 222

క. అని రోమశముని దెలిపిన, విని దానికి మాఱుమాట • వేదనిధియు ని
ట్లనియె నిపుడీవు వినిపించిన ఘనకథ వినఁగ నాకుఁ • జిత్తమునలరెన్. 223

క. నాపాపములు నశింపఁగ, నేఁ బరిశుద్ధుండనైతి • నిజముగ నపు డా
శాపఁడునగు దేవద్యుతి, యేపగిది స్తుతులొనర్చె • నీశ్వరుకొఱకై. 224

క. దానిని విన మిక్కిలి నా, మానసమున వేడుకయ్యె • మానవవర సు
జ్ఞానులునగు పెద్దలసంధానముచేఁ దగిన మహిమ • దనరుచునుండున్. 225

తే. కావననిప్పుడు నీయనుగ్రహముకలన, నా యభీష్టము దీర సున్నానఁడననుచు
వేదనిధి పల్కు వాక్యముల్ • వినఁగ రోమ,శముని యిటులనె నందుకు • సమ్మతముగ.

తే. అతిరహస్యము జపయోగ్య • మగుచు సకల,విధములకు నుత్తమము దీని • వినుము మున్ను
పన్నగాంతకువలన నే • విన్న వాఁడ, నగుచు నాయందు నిత్యమై • యలరుచుండె. 227

క. ఇది వేదసారమైనది, మదికిని సంతోషకరము • మధురామృతముల్
వదలను బాపములన్నియు, నుదితంబగు నాత్మతత్త్వ • మూర్జిత క్రియలన్. 228

## —• దే వ ద్యు తి కృ త వి ష్ణు స్త వ ము •—

సీ. ఆదిగాన విష్ణువు • నందుమనంబును, జేర్చి దేవద్యుతి • సేసినట్టి
స్తవమెట్టిదనిన నీ • సకలచరాచర, లోకమంతటఁ దాను • లోకములను
దనయందు వసియింప • దైత్యారిగోవింద,వాసుదేవాఖ్యల • వరలునతని
బ్రణవపూర్వకముగాఁ • బ్రణుతులుగా వింతు, నీ ప్రపంచము తన • రూపమైన

తే. వాఁడు చక్రిముఁబూనిన • వాఁడు తనను,సేవకులఁ బ్రియమునను బో • షించువాఁడు
లోకనాయకుఁడనఁదగు • నీకు నే న,మస్కరించెద నన్ను నే • మముఁ బ్రోవుమనుచు. 229

ఆ. పొగడఁదగినవాఁడు • పొగడికకగువాఁడు, పొగడుటాది సర్వ • ము హరియని జ
గత్స్వరూపమనుచుఁ • గావించునుతులును, సేవభేద మెవరి • చేతఁ బడునొ. 230

వ. శిక్షావ్యాకరణాది షడంగములను, భగవత్ప్రతిపాదకములైన బ్రహ్మసూత్రము
లను గూడిన నిగమము లెవనియూర్పులో, నే నాదేవునకు సేవకుఁడనై వారి
మెప్పుకొఱకు స్తోత్రముఁ జేసెదను. 231

తే. ఎవని నామ్నాయములు నేమి • యెఱుఁగఁజాల, వెవని నామననుందు గ్ర • హింపనేరి
నట్టి దేవునిఁగూర్చి యే • మని నుతింపఁ, గలఁడు నావంటివాఁడు న • కాముఁడగుచు.

ఆ. బ్రహ్మమొదలు సకల • ప్రాణులు హరి పర,బ్రహ్మరూపమగుచుఁ • బరగి సృష్టి
కర్త బ్రహ్మ కెవఁడు • కారణమగు నట్టి,పరుఁడు శుద్ధుఁడనఁగఁ • బ్రభుఁడవీవె. 233

తే. దేహమును దేహధారియు • దేహధారు,లైన దాంపత్యభావము • నందు నితర
దేహమున నంటియుండిన • దేహి వీవె, తనువులను బొందియున్న యా • తనలవలన.

ఆ. సంభవింపఁబడిన • సకలదోషములందు, నలరుదుఃఖములకుఁ • దొలఁగియుందు
వట్టినీవు దుఃఖ • మను స్వభావముచేతఁ, గలుగుసూక్ష్మసూక్ష్మ • కారణముల. 235

సీ. దేహధారణములఁ దెలివిచే నీయందు, మఱుపుఁ జెందక సుఖకర మొదవిన
ప్రజ్ఞ చేఁదనరు సర్వవ్యాపకుఁడవీవె, నీయంగదర్త్వము లెన్నగడుపగిది
వృద్ధిక్షయములందు నేర్పడు షడ్వికారములలోఁ గల్గు గుణములు నీవ
యగుచు నొక్కఁడవై యలరెదు నిను ననేకములుగా నెంతు రజ్ఞానమతులు
ఆ. పురుషుఁ డెలమి సుతులఁ బుట్టించువిధమున, బ్రహ్మవగుచు సకలప్రాణికోటిఁ
గల్పనంబుఁజేయు ఘనుఁడవై దోషము,లందుఁ జెందకుందు వమలచరిత. 236

వ. రాగద్వేషాదిగుణ శూన్యుండవును, సేవింపఁదగినవాఁడవును, జ్ఞానస్వరూపుఁడవై విద్వాంసులయజ్ఞములకొఱకు జగద్వ్యాపకుఁడవై వెలుఁగుచున్నవాఁడవు. అట్టి నీవు రజస్తమోగుణములు లేనివాఁడవునైన నిన్నుఁగూర్చి నమస్కరించెదను. అని మఱియు నిట్లనిరి. 237

తే. మంచికర్మములందు వర్తించుధీరు,లైన పండితులకు లోకమందు నితర
జనములకు సమబుద్ధిని సఖ్యుఁడైన, బ్రహ్మమున కాచరించెద వందనములు.
తే. ఎవనిని జరాచరంబులు నెఱుఁగుచుండు రీషణత్రయములఁజిక్కి యేమహాత్ముఁ
గూర్చి సుతులకుఁ గామేష్టిఁగోరి చేతు, రట్టిదేవున కొనరింతు నధికనతులు. 239

సీ. జ్ఞానమార్గము మదిఁఘటియింపఁజేయుము, మానుషగుణముల మాని బుద్ధు
వగునిన్ను వేదాంతమందుఁ బరబ్రహ్మ,మనుచు విద్వాంసులు ననవరతము
దలఁచుచుందురు దేవతలకుఁ బ్రభుండవ,న్నే లినవాఁడ ని న్నెపుడుఁ బొంది
నేఁ బవిత్రితనొంద నీపాదపద్మము, ల్మనమున ధ్యానింతు ననఘచరిత
తే. భక్తియను వర్మమే నాకుఁ బరము నిన్నుఁ, గోరదనుగాక యింకొక కోర్కె గలదు
మనుజు లాశ్చర్యకరమైన మాయయందుఁ,గలయహ మెవని నాత్మలోఁ దెలిసికొనఁగ
సీ. హననమొనట్టి మాయాతీతుఁడవు నరు, లింటనుండువేళ నెచటికైన
నేఁగుచున్నప్పుడు నెవనినామము మదిఁ,దలఁచిన దుష్కృతంబులు నశించు
చిత్స్వరూపుఁడ నీకుఁ జేతు నమస్కృతు, లెల్లలోకములందు నెపుడుమిగుల
బాధించుచున్న తాపత్రయాగ్నిఁ బడి, మోహదుఃఖాబ్ధిలో మునుఁగుచుండు
తే. నట్టివారు నే మహాత్మునినామము, లనెడి మబ్బునీడలందుఁ జొచ్చి
దహనమొందరెవనిఁ దలఁచిన వ్యాధులు, మోహనరకములను మునుఁగకుండు.
తే. అట్టి మిటిలేనిదేవున కధికభక్తి, మ్రొక్కెద నెవండు శబ్దార్థముల గ్రహింపఁ
గోరికల జ్ఞానదృష్టిని శౌరినామము,లు దలంచుట నాసక్తి గలుగుటయును.
తే. సత్యముగనేని నన్ను సంసారమంట,కుండు లోకమునంతట నిండి వేద
సమ్మతుఁడవేని శ్రీహరి సర్వకాల,ములను మాధవుపదభక్తి గలుగుగాక.
తే. జగములకుఁ గారణుండయి సకలమునకు, నైనవాఁడును గానివాఁ డగుచు నెన్ని
విధములను గనఁజాలని విష్ణుమూర్తి, మాయ నన్నంటరాకుండ మనుచుఁగాత.
సీ. విద్యనుఁగూడి యీ విశ్వమంతటికిని, జననసంవృద్ధినాశనముకొఱకు
మొగి రజస్సత్వతమోగుణంబుల బ్రహ్మ, విష్ణురుద్రులవంగ వెలయు మూఁడు

రూపము లొందిన ♦ శ్రీపతిం దివిజులు, ప్రార్థింప నదితిగ ♦ ర్భమున జన్మ
మందిన హరి తృణ ♦ మాదిగాఁ బరమేష్ఠి, పర్యంతమునుగల ♦ ప్రాణులందుఁ

తే. పెక్కురూపములొందితా ♦ నొక్కరుఁడయి, నిండియుండిన వాసుదే ♦ వుండు నాదు
హృదయగగనమునందుఁ జ ♦ రించువాఁడు, ననుఁగటాక్షించి రక్షించు ♦ ననవరతము.

తే. ఆకసమునకుఁ బూర్వజుఁ ♦ డైనవాఁడు, నంతరిక్షముకన్న మి ♦ న్నగుచుఁ గ్రియలు
లేనివాఁ డంతటికిని దా ♦ నైనవాఁడు, నగుచు బ్రహ్మము దానుగా ♦ నలరువాఁడు.

సీ. గగనరూపుఁడు నిరా ♦ కారుఁ డవ్యయుఁడు నా, కాశాదిభూతప్ర ♦ గణమువఁగల
శాంతుఁడు నండజా ♦ సనుఁడు నెవ్వానితేజమ్ము మే, మెవ్వని ♦ సత్త్వనందు
భాగింపఁబడినట్టి ♦ వాండ్రమొ దుఃఖమై, సత్యముగానట్టి ♦ జగము దానఁ
గలుగు వికారముల్ ♦ గలిగినవాఁడవు, నీవె సంతోషించు ♦ నిన్ను గూడి

తే. యున్న లోకము నట్లు గా ♦ కుండ దుఃఖ, మడరు నంతటఁ గలవాఁడ ♦ వగుచు లేని
గతిని వర్తించు నీకు వి ♦ కారమెందుఁ, గలుగనేరదు కొందరీ ♦ యిలజనములు. 247

ఆ. పసుఁడవైన నిన్నుఁ ♦ బ్రాణ మహంకార, హృదయుఁడనుచుఁ దలఁతు ♦ రిదియుఁగాక
నీచులైనవారు ♦ నీయాకృతిని సర్వ, దేహమనుచు మదిని ♦ దివురుచుండ్రు. 248

సీ. నిగమముల్బొందిన ♦ నిన్ను శబ్దబ్రహ్మ, మని పురుషోత్తముం ♦ డని శివుఁడని
భక్తిరూపుడవని ♦ భావించెదరు కొందఱును, జ్ఞానముగల స్వ ♦ రూపుఁడనుచుఁ
దలఁచుచుందురు కుత్సి ♦ తులగువారలు నిన్నుఁ, దీర్ఘవిషయునిగా ♦ నర్థములను
గొందఱు వాదించు ♦ కొనుచుందు రిదిగాక, సంతానము నకు ర ♦ క్షకుఁడవనుచుఁ

తే. బలుకుచుందురు నిన్నుఁ జా ♦ ర్వాకులైన, భూతములయందుఁ జైతన్య ♦ మును గలిగిన
వాఁడవని చెప్పుచుందురు ♦ బౌద్ధులొక్క, క్షణములోపలఁ జెడుబుద్ధిఁ ♦ గాఁదలఁతురు.

వ. ఇదియునుంగాక దేవా! కొందఱు నిన్ను శరీరపరిమాణముగల దేవతగాఁ దలంపక ప్రకృతికంటెఁ బరుఁడవైన పురుషునిగాను, జన్మాదులు లేనివాఁడవుగాను, సంపూర్ణునిగాను, సత్తు, చిత్తు, నానందము, నఖండము నిర్మలములే స్వరూపములు గల వానినిగాఁ దలంతురు. 250

తే. నీదుపై మానసము నిల్పి ♦ నిపుణతగల, భక్తులగువారు నుపనిష ♦ ద్వాక్యములను
బలుకు తెరఁగున నాపర ♦ బ్రహ్మమీవె, యనుచు ధ్యానము నొనరింతు ♦ రతిశయముగ. 251

ఆ. వ్యోమమాదిపంచ ♦ భూతములును మాన, సమును బుద్ధి త్వక్కు ♦ చక్షువు మొద
లగు దశేంద్రియములు ♦ నాత్మ ననాత్మల, విద్యవిద్య ♦ లీవె వేఱ లేదు. 252

ఆ. అగ్ని దానియందు ♦ నాహోమ మొనరించు, దైవతములు హోమ ♦ ద్రవ్య మాజ్య
ములను వేల్చునట్టి ♦ పురుషుఁడు నందుల, కైనఫలము నీవ ♦ యగుదు వీశ. 253

సీ. అదిగాన శరణార్థి ♦ నగునాకు యాగాది, వ్రతదీక్షఁబొం దిన ♦ వారికి నగు
ఫలములు గలిగించు ♦ ప్రభుఁడవును సమస్త, ప్రాణుల కాధార ♦ మైన నీవె
పోషకుండవు గమ్మ ♦ బాలఁతులు యౌవన, ప్రాయమునందు ♦ యౌవనము గలుగు
పురుషుల నటులనే ♦ తరుణులు మగవారు, గ్రీడలఁ దగిలి వ ♦ ర్తించుపగిది

తే. నాదుచిత్తము నీయందు ♦ నాటుకొనియె, గుడ్లగూఁబలు భానుఁ గ♦న్గొననిలాగుఁ
భాపకర్ముఁడునైన నీ♦పాదములకు, మ్రొక్కఁగాలునిజాఁడఁడు♦నిక్కముగను. 254

తే. భక్తిదనరఁగ మీపద♦పద్మములకు, నెంతపర్యంతమును మ్రొక్క ♦ రంతవరకు
మూఁడువిధములునగు తాప♦ములనుబాప ములనుజనులకు బాధలు ♦గలుగుచుండు. 255

తే. భూగగన మింద్రియంబులు ♦ వొంద వెవని, నాలుబిడ్డలు సంబంధ♦మంటకుండుఁ
బురుషవర్యులు నెవనిని ♦ బొందుచుండు, రెవఁడు షడ్గుణసంపద♦నీఁగుచుండు. 256

సీ. ఆవిష్ణుదేవుఁడ♦వగు నీకు మ్రొక్కెద, నావశుండవుగమ్ము ♦ నళిననేత్ర!
యతిజనంబులు సాధ♦నాంతరముల కపేక్షను లేని మూలకా♦రణుఁడ వనుచు
ఆసాధనము దాని ♦ కగుకారణమునైన, వాఁడవు నీ కని ♦ పలుకుచుంటి
నేసాధనలు లేని ♦ యేదేవుఁ బొందుదు, రా నిర్మలజ్ఞాన ♦ మతిశయింప

తే. నిచ్చువానికి నే మ్రొక్కు♦లిడుదు నెవని, ధ్యానమనుచొక్కుపొడిని స్వా♦ధీనపరచు
కొనిన సిరిగల్గి మిగులఁజ♦క్కనిదియైన, భోగకామిని సుఖరూప♦మునఁబరఁగిన. 257

తే. కౌఁగిటను మోక్షలక్ష్మినిఁ ♦ గదియనునిచి, లోకచేతనసుఖముల♦లో నొకటిని
బొంది శయనించువానికి♦ మునులచేత, నుతులుగొనువాని కనిశము♦నుతులొనర్తు. 258

సీ. భవము నాదిగఁగల్గు ♦ భావవికారము, ల్వంచనజేయు స్వ♦భావములును
క్షుత్పిపాసలు మోహ♦శోకజరానాశ, ములు షడూర్ములులేని ♦ భూమివినుతుఁ
డును మైలదోషము♦లను మొదలగునట్టి, బాధల నొందని ♦ వాసుదేవు
నకుఁ బ్రేమగల్గువా♦నికిఁ బరిశుద్ధున, కును నిర్మలజ్ఞాన ♦ మనెడివెల్గు

తే. వలన నజ్ఞాన మెవనిచేఁ ♦ దొలఁగుచుండు, నెవనితేజము ♦ సూర్యున ♦ కొసఁగి వేడి
మిని జనించినతాపము ♦ జనులు వొందఁ, జేయువానికి ననిశముఁ ♦ జేతు నతులు. 259

ఆ. ఎవనివలనఁ దేట ♦ రొసఁగు మానసమున, సంశయంబు నొదవఁ♦జాలకుండు
నట్టి విష్ణుమూర్తి♦కాచార్యునకు నే న, మస్కరింతు నన్ను ♦ మనుచుకొఱకు. 260

ఆ. జగములందుఁ గల్గు ♦ సచరాచరంబులు, జీవకోట్లు హరినిఁ ♦ జెందు నెల్ల
సత్యమైన నాదు♦సామీప్యమున నట్టి, నీలవర్ణుఁ డెపుడు ♦ నిలుచుఁ గాత. 261

గీ. జంగమస్థావరములు నీ♦సకలజగము, లచ్యుతునిరూపమైన స♦త్యమున నాకు
ధాతృరుద్రేంద్రులకు జన ♦ స్థానమైన, విశ్వరూపముఁజూపు నా♦విష్ణుమూర్తి. 262

కం. హరిపాదభక్తి మనమున, నిరతము గలిగినపగిదిని ♦ నిష్ఠ మిగుల సం
భరితమగు నేని దామో, దరుదర్శన మిపుడు నాకుఁ ♦ దప్పక కలుగున్. 263

సీ. అని యీవిధమున బ్రా♦హ్మణుఁడు దేవద్యుతి, శపథరూపకమైన ♦ సత్యవాక్య
ముల నుతించిన విష్ణు♦మూర్తి ప్రత్యక్షమై, కరుణచేఁ గోరిన ♦ వరము నొసఁగి
సంతసింపుచు నేఁగె ♦ నంతఁ గృతార్థత. నొంది విప్రుఁడు హరిం♦బొందినట్టి
మనముచేత నిజాశ్రి♦మమున శిష్యులతోడ, నాస్తవమునె జప ♦ మాచరింపు

తే. చుండె నీ స్తోత్ర మెవరేని ♦ ఖండితముగ, శ్రవణమననములందున ♦ శ్రద్ధ నిలుప
వశ్వమేధఫలంబున♦నలరి బ్రహ్మ, విద్య నందులఁ దెలివిని ♦ విస్తరిల్లు. 264

తే. అతనిస్వాంతముదోషకా♦ర్యములఁబొరయ, దశుభములఁబొందదీస్తోత్ర♦మనవరతముఁ
జేయువారికి నెల్లెడఁ ♦ జిత్తచలన, మేర్పడక యుంద్రియపటుత్వ ♦ మెసఁగుచుండు.

ఆ. హితవుఁగోరువాఁడు ♦ నీ మంత్రరాజము, బఠనఁజేసు నెల్ల♦పాపములను
నమసి విష్ణులోక♦సంబంధమైనట్టి, పరమపదమునందు ♦ బద్ధుఁడగును. 266

తే. మఱియు నీస్తుతి నెవరేని ♦ నిరతమొనరఁ, జేయఁగోరినఁ గోరిక ♦ లొందు నధిక
గుణులుసౌందర్యులనఁదగు ♦ తనయులు బల, విభవదీర్ఘాయువుల చేత ♦ విస్తరింత్రు.

సీ. చదివినవారికి ♦ నది పదినూఱుల, తిలపాత్రములదాన♦ఫలము గలుగు
ధర్మార్థకామసా♦ధనములు మూఁటిలో, నేమనుజుండు దా♦నేది గోరు
నది శీఘ్రకాలము♦నందు లభించు మ,హాపాతకములైన ♦ నపుడె బాసి
పరిశుద్ధుఁడగు నగ్ని♦భయము చోరులబాధ, దొలఁగు నెడాగల ♦ తోర్రిపలందుఁ
తే. బోవువేళల నీ స్తోత్ర♦మును బఠింప, భూతబేతాళపైశాచ♦పూతనాది
క్షుద్రగ్రహములవలన ను♦పద్రవములు, సింహశార్దూలమృగభీతిఁ ♦ జెందరనఘ.

కం. హరిపూజ సలిపి యీ స్తవ, మిరువుగఁ బఠియించునతఁడు ♦ నేసమయమునన్
దురితములు దామరాకునఁ, దొరఁగిన నీరములమాడ్కిఁ ♦ దొలఁగుచునుండున్. 269

తే. మనుజుఁ డెవ్వఁడు నీ స్తవ ♦ మనుదినంబుఁ, జదువ నేర్చిన గంగాది♦నదులతీర్థ
ములను సుస్నాతులగువారు ♦ బొందునట్టి, దైన సద్గతి కేఁగుదు ♦ రమలమతిని. 270

కం. అనుదినకాలత్రయమున, ఘనమగు నీస్తుతిని బఠనఁ♦గావించిన నే
మనుజుఁడు సమస్తసుఖముల, ననవరతముఁ బొందుచుండు ♦ నందున నిందున్. 271

కం. వేదములు త్రికాలములు శి,క్షాదిషడంగములతోడఁ♦జదివినఫలమున్
బాదుకొనుదినము నొకపరి, మోద మలర నట్టి స్తోత్ర♦మును బఠియింపన్. 272

సీ. స్త్రీలకునత్యంత♦ప్రియుఁడైనవాఁడగు, గరుడవాహను నను♦గ్రహము దర్శ
నమునకు మూల మై♦నది, యోగసారమై, పావనమగుచు వి♦శ్వంభరునకు
మిక్కిలిప్రియమును ♦ మే లైనదియును దే,వద్యుతి నుతియింపఁ ♦ బరగినదియు
నీస్తోత్ర మెవ్వరు ♦ నేప్రొద్దుఁబఠియింప, సిరి యింట నెన్నఁడుఁ ♦ దరుగకుండుఁ
తే. గాన మాఘములందున ♦ స్నానమొనరఁ, జే యుఫల మిహపరములఁ♦జెందు నిదియుఁ
గాక యంత్యమునందు మో♦క్షమునొసంగు, విష్ణులోకమునొందు వి♦వేక మెసఁగు. 174

క. అనియిటు దేవద్యుతి సే,సిన స్తోత్రము వేదనిధికిఁ ♦ జెప్పి పిదప స
న్మునిపతి పిశాచమోక్షము, వినుపించెద నీవు చెవులు ♦ విమలత నొందన్. 274

క. విను మును ద్రావిడదేశ,మ్మున సోమాన్వయమునందుఁ ♦ బుట్టినవాఁడై
ఘనుఁడైన చిత్రసేనుం,డను నొక్కఁడు రాజు గలఁడు ♦ నతిధార్మికుఁడున్. 275

ఉ. శూరుఁడు సత్యసంధుఁ డతి♦సుందరరూపుఁడు దక్షిణాంబుధీ
తీరమునందునన్ గలుగు ♦ దేశజనంబుల నేలువాఁడు బెం
పారఁగ రత్నముల్ ధనము ♦ భాసిల రెండవసంద్రమో యనం
గా రమణీయమై మిగుల ♦ గౌరవముం దనరారువాఁడునై. 276

క. కరితురగస్యందనములు, గరమొప్పెడి కాలిభటులు ♦ కనకాభరణాం
బరములు వేలకొలందిని, దరుణులుఁ బరిచారికలును ♦ దనరినవాఁడై. 277

సీ. అతులపరాక్రముఁ ♦ డగుచు శాస్త్రార్థ త,త్త్వములను దెలియుచు ♦ ధారుణీసు
రుని బురోహితునిఁగాఁ ♦ దనకుంచు నిడుకొని,శ్రుతివాక్యముల (గర్మ♦వితతి నెల్లఁ
గావించి యాగాది♦క్రతువు లనేకము, లొనరించి బ్రాహ్మణ♦జనుల నతిథి
పూజలు దానము ♦ ల్బొలుపొందఁజేయుచు, నెల్లధర్మములు గు♦ర్తెఱిఁగి బ్రహ్మ
తే. విష్ణువు మహేశ్వరులయెడ ♦ భేదబుద్ధి, నెన్న కెల్లెడ మువురఁ బూ♦జింపుచుండి
వేడుకలకు నొకానొక ♦ వేళ నరిగె, జడలుదాల్చినపాషండు♦సదనమునకు. 278

ఆ. వేదధర్మములకు ♦ వెలి యగువాఁడును, జడలువాల్చి భస్మ ♦ మొడలు నిండఁ
బరగుచుండునట్టి ♦ పాషండులకుఁ బార్థి,వునకుఁ గొంతవాద♦మును జనించె. 279

సీ. అపు డవనీశుతో ♦ ననిరి పాషండులు, రాజేంద్ర శైవ ధ♦ర్మములవలనఁ
గలుగు ప్రభావముఁ ♦ దెలిపెద విను తల, వెండ్రుకల్దీయక ♦ పెంచునట్టి
చండాలుఁడైన సం♦సారాబ్ధిలోనుండి, తొలఁగు నాశాపాశ♦ములను ద్రెంచి
దుఃఖములన్నియుఁ ♦ దొరఁగును శైవమ,తమునందు వర్ణాశ్ర♦మములు బొంకు
ఆ. శంభునాజ్ఞ లేక ♦ స్వర్గము గలుగదు, దాన యాగ వేద♦తపములందుఁ
గార్య మేమి లేదు ♦ గణపతిత్వముగల్గు,భూతి దేహమందుఁ ♦ బూయునతఁడు. 280

ఆ. శిరమునందు నెవఁడు ♦ సిగ జడ లుంచిన, బోడియైన నొడల ♦ భూతి నిండ
దుమ్ము లెగయఁబూయు ♦ ధూర్జటిశిష్యులై, సంతసమున శివుని♦చెంత నిలుచు. 281

ఆ. ఒకటి రెండు మూఁడు ♦ నొనరంగ నాలుగు, నైదు జడలుదాల్ప♦నగును భూతిఁ
బోలునట్టి తపము ♦ పుణ్యముగనుపింప, నొడలు భస్మ తలను ♦ జడలుగలుగు. 282

తే. అట్టివారలు శివరూపు♦లగుదు రిదియు,గాక యంధులుఁ బంగులు♦జ్ఞానహీను
లైన శూద్రాదులగు నెవ♦రైనజడులు,భూతిఁదాల్చినఁబుణ్యమ్ము♦బొందునధిప. 283

సీ. గాధిపుత్రుఁడురాజు♦గా జనియించి బ్రా,హ్మణుఁడాయెఁ జోరుఁడై♦యగ్రవంశ
మందున వాల్మీకి♦యెందె శ్రేష్ఠత్వము, గాననీ విఁక లేని♦పోని సంగ
తులను మానసమందుఁ♦దలఁపక శివపూజఁ,జేయుము లోకప్ర♦సిద్ధముగను
జపతపంబులు పున♦ర్జన్మకారణమగుఁ, గాని బ్రహ్మత్వము ♦ గలుగఁబోదు
తే. ఘనతశివభక్తులన్యులఁ ♦ గనులఁజూడ, కితరబ్రాహ్మణులను మది♦నెంచరెపుడు
శైవమతమది శ్రేష్ఠమై ♦ సకలగోప్య,మైన మార్గములునుగల♦వందు నిజము. 284

ఆ. అన్యదైవములకు♦నర్చనగూడదు, తగినయత్నములను ♦ దపముతోడ
విడువఁదగినవాఁడు ♦ విష్ణువుగానఁ ద,త్ప్రతిమఁబూజసేయఁ♦దలఁపఁదగదు. 285

క. మతిహీనుఁడనుచు హరికి,న్నతులును గావింపరాదు ♦ నయముగలక్ష్మీ
పతినిగన శివద్రోహము, నతులితమై సంభవించు♦నావశ్యముగన్. 86

చ. భయము నొకింతలేని తన♦భక్తులఁజూచి శివుండు నెల్లెడం
బ్రియమును జెందుచుండు నతి♦ప్రీతికరంబయి శూలివాసమై

లయముదొరంగు శంకరవి॥లాసముఁ బొందుదు రట్టివారలు
నృియమున దీనినీవు ననుఁ॥రాగముతోఁదలపోసి చూడుమా. 287

తే. పరమధర్మ మనింద్యమై ॥ పరగు దీని, మదినెఱుంగుచు శివునిసం॥బంధమైన
భూతిధరియింపు మీవు నీ॥భువిని భస్మ,ధారులగువార శైవులు॥పార్థివేంద్ర. 288

తే. మఱలజన్మకు భయ మణు॥మాత్రమైనఁ, గలుగువారలు హరినామ॥ములనుదలఁప
వినఁగరా దెల్ల దేశము॥ల్వెడలి విష్ణు,భక్తు లనువారలనుఁజంప ॥ భావ్యమగును. 289

క. అనియిటు పాషండులచేఁ,తను బోధితుఁడగుచు రాజు॥తద్గ్రంథముల
న్వినిశ్లాఘింపుచుఁ బరవం,చనలోఁ బడి శైవమునకు ॥ సంబంధుండై. 290

ఆ. వారియెదుటనిలచి ॥ బ్రాహ్మణులను వేద,ములను నిందజేసి ॥ పుడమినీఁడు
వివిధమార్గములగు ॥ వేదోక్తకర్మలు, విడిచెగృహమునందు ॥ మడిసెనగ్ని. 291

సీ. ఆమ్నాయవాక్యము॥లందు నిరూపింపఁ,బడిన ధర్మములను ॥ విడచివేసి
విష్ణువున్నిందించి ॥ వైష్ణవులను నిరోధించియెక్కడ నీశుఁ॥చేతఁ
బొగడఁబడుచునుండుఁ ॥ బొడసూపునెచ్చోటఁ, ననుచు నజ్ఞానము॥నతిశయింప
విష్ణువు నెవరు సే॥వింతురో వారలఁ, దివిరినిత్యంబు బా॥ధింపుచుండు

తే. వేదములునాస్తి విప్రులు ॥ వేదవిహిత, మైనకర్మలు వ్రతయాగ॥దానములును
దానమిచ్చుట లేదనెఁ॥ధాగుణీశుఁ, డటులపాషండమతముఁ దా॥నాశ్రయించి. 292

క. చండతర కోపవశుఁడగుఁగ, దండములను బ్రజలనెల్ల ॥ దండింపుచు ను
ద్దండుఁడయి సతులకోరిక, మెండుగ జనియింపనటుల ॥ మెలఁగెడువాఁడై. 293

ఉ. దుష్టులు విష్ణుదూరు ల॥దుర్వ్యసను ల్జడదారులైన పా
పిష్ఠుల శైవులందుఁ గడు ॥ ప్రేమజనింప ననేకగ్రామముల్
స్పష్టముగా ధనంబులు గ॥జంబులు రత్న సువర్ణ హారముల్
ఇష్టముదీర నశ్వముల ॥ నిచ్చి సుఖస్థులఁజేసె వారలన్. 294

సీ. ఆరాజు దనరాష్ట్ర॥మందుఁ బట్టణమున, హరిపూజనలు సేయు ॥ నరులనెల్లఁ
బట్టి వేధించెద ॥ బాధించిచంపెద, ననుచు డిండిమవాద్య ॥ మనుదినంబు
మ్రోయింప నది విని ॥ పుణ్యాత్ములగు విష్ణు,భక్తులు దమకుటుం॥బములతోడ
దావిడదేశముఁ ॥ దప్పినవారలై, సజ్జనులుండు దే॥శముల కరిగి

ఆ. నంతఁ దత్పురమున ॥ నాదేశమునఁగల్గు, ప్రజలు పాపకర్మ॥రతులనుండ
వానలేక సకల॥పంటలు నశియించెఁ, దాగ జలములేక॥తల్లడిలుచు. 295

ఆ. ఏరులందు నూట॥నీరును ద్రావిరి, విప్రులకును బ్రదుకు ॥ విధములేక
చెట్లువేసిపెంచి ॥ జీవించుచుండిరి, పార్థివునకు భూమి ॥ పన్నులిచ్చి. 296

తే. హరిని నిందించి శివపూజ॥ లతఁడుసేయు,పనికిభూషింపరైరి భూ॥ప్రజలు రాజు
తనకులాచార మగ్నిహో॥త్రములు వేద,క్రతువులన్ని యువదలి దుఁ॥ష్కర్ముఁడగుచు.

క. రెండవ యముఁడో యన భూ, మండలమున ద్రవిడదేశ॥మనుజులకెల్లన్
దండివిభుఁడగుచు నిలఁదశ,వుండి మృతిజెందె నాతఁ॥డొక కాలమునన్. 298

సీ. అతనికి వేదసమ్మతముగా నుత్తర, క్రియలులేమిని యమ♦కింకరులకుఁ
జిక్కి బాధలచేత ♦ మిక్కుటమగు నగ్ని, కణములచే నిండు♦కొనినదియును
నినుపమేకులచేత♦ నెసఁగుచు శేండ్రపై, కాలినవేల వృ♦క్షములనీడ
లేక మార్గమునందుఁ ♦ గాకులు పొడుచుట, నక్కలు తోడేళ్లు ♦ కుక్క లధిక
ఆ. భయముగదుర నోడలఁ ♦ బట్టి భక్షింపంగఁ, బాపములను జేయు ♦ ప్రజలఘోష
వినుచు మిగుల భీతి ♦ నొనరెడి సమవర్తి, లోకమునకు నేఁగె ♦ శోకమడర. 299

వ. అని మఱియు మంచివారలు పొందరానిదైన యమలోకమున వానిగతిఁ దెల్పెదను వినుమని వేదనిధియగు బ్రాహ్మణశ్రేష్ఠునితో రోమశమహామునీంద్రుం డిట్లనియె.

తే. అవల నారాజు నాలోక♦మందు నొంను. నరకముననుండి వేరొక ♦ నరకమునకు
నలుగుచును దర్ప్నలములఁ దా♦ననుభవించె, వానివినుమీవుమనమున♦నూనికొనఁగ.

క. ముందుగ భయమును దుఃఖముఁ, బొందెడి తామిస్రనరక♦మునఁబడి పిదపన్
అంధతమిస్రనరకమున, యందున నెపతెగని దుఃఖ ♦ మనుభవమగుచున్. 302

తే. క్రిముముగా రౌరవాది న♦రకములందుఁజేర బాధలనొందుచు ♦ శ్రీహరిపయి
విరసమున నిటు యుగములు ♦ నిరువదొకటి, సనినపిమ్మట నతఁడు బి♦శాచమగుచు.

తే. ఆమహాపర్వతమునందు ♦ నధికతప్తి, పాసలకు నోర్వఁజాలక ♦ పరితపించు
చుండెఁ దగ్గరియందున ♦ నుదకమన్న,ములను గానక నాల్గుది♦క్కులను దిరిగి.

సీ. ఆఁకలి గొట్టుమెట్టాడఁగ నా పిశా,చము నంత నొకనాటి ♦ సమయమందు
మంచికాలము సంభ♦వించఁ, బ్లక్షప్రస్రవణ మహాకానన♦మునను దాండ్రి
చెట్టు నీడకుఁ జేరి ♦ సిలుఁగులఁగని శోక,భయముల రెంటిచే ♦ బహువిధముల
నేడ్చుచుఁ బలుమారు ♦ నీఁకనేను జీవింప, నెల్లభూతములకు ♦ నించుకైన
తే. మేలుసేయని నాకు నీ ♦ మేరలేని, జన్మ లెటు తుదముట్టుట ♦ సంభవించు
దుఃఖమను గొప్పయలలకుఁ♦దోడువడిన, దురితమను సాగరమునందుఁ♦ బొరలునన్ను
ఆ. కరము నెపుఁడు నూత♦గానిచ్చి దరిఁజేర్పఁ, జాలుననుచు నాపి♦శాచ మేడ్వ
విని దయాపరుండు ♦ విద్వాంసుఁడైన దే,వద్యుతియునచటికి♦వచ్చి కనఁగ. 306

ఆ. చెన్నుదరుగుమోముఁ ♦ జీకిరికన్నులఁ, గాలుదూతఁబోలు ♦ కారునలుపు
కదలునాల్క వ్రేలు♦పెదవులు దీర్ఘజం,ఘలును బాదములును♦గరములలరి. 307

ఆ. నిండుకున్ననరము ♦ లెండినయుదరము, వెరపుగలుగునోడలు ♦ నరసి వాని
పైని కరుణదనర♦భయమున నేడ్చెద, వెవఁడ వేల కలిగె ♦ నీయవస్థ. 308

సీ. ఇది మదీయాశ్రమ♦మిందుఁ బ్రవేశింప, నేమిసేయుదు నది♦యెఱుఁగఁ బలుకు
మిదివిష్ణులోకము ♦ నిందునదుఃఖము, లేదుపుణ్యాత్ముఁడ ♦ లేశమైనఁ
గాననీకగు దుఃఖ♦కారణము "శుభశ్చ, శీఘ్రు"మన్నట్లుగాఁ ♦ జెప్పవేగ
బుద్ధిమతులు మేలుఁ♦బొందునప్పుడు కాల,యాపనఁ గావింప♦ రే పగిదిని
ఆ. అనుచువేడుకలర♦నడుగుదేవద్యుతి, పలుకులాలకించి ♦ కలుగుతనదు
దుఃఖములను బార♦దోలి పిశాచము, మ్రొక్కిపలికె నిటుల♦మునివరునకు. 309

తే. మండువేసవిదినములఁ ♦ గొండలందుఁ, గాలుకార్చిచ్చు వానల ♦ కాలమందు
వర్షధారలనణఁగిన ♦ పగదినాకుఁ, గలుగుతాపము నినుజూడఁ ♦ దొలఁగె ననఘ.

ఆ. ఏమికారణమున ♦ నించుకపుణ్యము, నెపుడుఁజేయ మిమ్ము ♦ నిపుడుజూడఁ
గంటి సత్పురుషులఁ ♦ గలయుట పుణ్యహీ,నులకుఁగలుగ దెపుడు ♦ నుతచరిత). 311

క. అనిపలికి బ్రాహ్మణునకుఁ, వినుపించెఁబిశాచము తన ♦ వృత్తాంతము ని
ట్లని హరిపై విద్వేషము, జనియింపఁగ నిట్టిఫలము ♦ సంభవమయ్యెఁ. 312

ఆ. భక్తిచేత నెవని ♦ పదములు సేవింప, నరులకెల్లముక్తి ♦ దొరకు నట్టి
విష్ణుదేవునందు ♦ విద్వేషమతిగల, ఖలుఁడ నైననాకుఁ ♦ గలిగెనిట్లు. 313

తే. ధర్మమును ద్విజగముల సం ♦ స్థాపనంబుఁ,జేసి ప్రాణుల హృదయని ♦ వాసుఁడగుచు
రక్షకత్వముఁజేయ న ♦ ధ్యక్షుఁడైన, విష్ణుదేవునియెడల వి ♦ ద్వేషినైతి. 314

తే. ఎవఁడు సత్కర్మఫలముల ♦ నిచ్చుచుండు, నెల్లవేదములందున ♦ నెవనిజదువఁ
బడును దపముల విప్రుల ♦ వలనఁ బూజి,తుండు నాహరియెడ విరో ♦ ధుండనైతి. 315

ఉ. ఎల్లవనంబులందిరిగి ♦ యెల్లకిరీయేంద్రియముల్ విడంగనై
యుల్లమునందు నెల్లపుడు ♦ ద్యోపథమందు నటించువారిచేఁ
దల్లజులైన సద్యతిక ♦ దంబముచే నిగమజ్ఞపంక్తిచే
నుల్లమునం దలంపఁదగు ♦ యోగిపుఁ డొంటమియయ్యె నాకొగిఁ. 316

తే. బ్రహ్మమొదలగు నితరదే ♦ వతల సనకుఁ,డాదిగాఁగల యోగులు ♦ నధికభక్తి
చేత మోక్షముకొఱకు భ ♦ జింతురెవని, నట్టివిష్ణువునకు వైరి ♦ నైతినేను. 317

తే. ఎవఁడు జన్మస్థితిలయము ♦ లెసఁగఁజేయు,నాదిమధ్యాంతశూన్యత ♦ నమరు నెవఁడు
నట్టి శ్రీవిష్ణుమూర్తికి ♦ నతివిరోధి, నగుట నీదురవస్థ, సం ♦ ప్రాప్తమయ్యె. 318

ఆ. పూర్వజన్మమందుఁ ♦ బుణ్యముఁజేసిన, వాఁడనయ్యు హరికి ♦ వైరినైన
కతన నదియెనగ్ని ♦ గా మొదలంటఁగఁ, గాల్చె నాదుపుణ్య ♦ కర్మమెల్ల. 319

ఆ. ఇట్టిదురితమునకు ♦ నిదిమూలకారణ, మగుచు దీనిమేర ♦ మనమునందుఁ
దెలిసెనేని విష్ణు ♦ దేవుని వైరము, నన్యదేవపూజ ♦ లపుడె విడుతు. 320

సీ. విష్టరశ్రీవునిపై ♦ విద్వేషమను పాప,కర్మములను నర ♦ కము లనేక
వింశతియుగములు ♦ వివిధమార్గముల యా, తనలను బొంది పి ♦ దపఁబిశాచ
రూపము నాకు ని ♦ రూపింపఁగా బహు, దినము లీ పర్వత ♦ మున వశింప
నీయాశ్రమమునకు ♦ నేఁడరుదెంచుటఁ, జేసి నాజన్మము ♦ సిద్ధిఁబొందె

తే. ఇపుడు మిమ్ములదర్శింప ♦ నినుఁడునుదయ,మైన గాఢాంధకారము ♦ నణఁగుపగిది
దురితముల నంటకుండఁగఁ దొలఁగి చనియె, కర్మకనుగుణ్యములు భవ ♦ కారణములు.

తే. మరణనిర్బంధసంపద ♦ మగువ లెల్లఁ, బ్రాప్తకాలము రాఁగ సం ♦ భవములగును
గాన నిప్పుడు నాకు నీ ♦ ఘనపిశాచ,దేహము దొలంగు మార్గముఁ ♦ దెలుపు మనఘ.

ఆ. అనుచు నాపిశాచ ♦ మపుడు దేవద్యుతి, నడుగ నాతఁడిట్లు ♦ లనియె మఱల
జ్ఞానహీనమరయ ♦ మానవ సుర దాన,వులనునైన మోస ♦ పుచ్చుచుండు. 323

తే. దేనిచే దేవతలయందు ♦ ద్వేషబుద్ధి, గలుగునో దానిచేతనే ♦ కర్మమడఁగు
జననవృద్ధి క్షయంబులఁ ♦ జాలునెవఁడు, నతఁడె ప్రాణులకన్నిఁటి ♦ కాత్మయగును.
ఆ. అట్టి యీశ్వరునకు ♦ నపకారమెవ్వఁడు, సేయనోపు నరుఁడు ♦ సేయనట్టి
కర్మములకు ఫలముఁ ♦ గలిగించుహరిపైని, వైరబుద్ధి నరక♦వాసమనఁగ. 325
చ. నిగమములందు శాస్త్రముల ♦ నిర్ణయమైన సుకర్మలన్నియుం
దగ నొనరింపఁగావలయు ♦ ధర్మము దప్పక బ్రాహ్మణాది నా
లుగునగుజాతివారలును ♦ లోభులుగాక హరిం భజింపఁగా
నగును నిరంతరంబు హరి ♦ కర్చనఁ జేయుట ముఖ్యమార్గముల్. 326
వ. అట్లుఁగాక విరుద్ధమార్గములను దెలుపునట్టి దేవతాంతర సేవాదివిషయగ్రంథముల
ననుసరించుటచేఁ బాపములు గలుగును గావున వేదములకు విరుద్ధములైన విషయ
ములను దెల్పెడి శాస్త్రధర్మములను విడువవలెను. 327
క. మనుజులు కొందరు దమనే, ర్పునఁ గల్పనశాస్త్రములను ♦ బోధింపుచు నీ
జనసముదయముల మోహం,బునఁ బడఁద్రోయుదురు వేద♦ముం జెరుచుటకై.
ఆ. మంచిపద్ధతులను ♦ మానిపి చెడుశాస్త్ర, వాదులగుచు విప్ర♦వేదములను
దైవములను యాగ ♦ దపముల నిందించి, నరకములను బొందు ♦ దురు మహీశ.
క. ఇటువంటి మార్గములచే, బటువుగ సద్బ్రాహ్మణులను ♦ భగవంతుని సం
కటపడి ద్వేషించిన నొక, కుటిలుఁడు కేరళుఁడు నరక♦కూపమునఁ బడెన్. 530
తే. కాన వేదములకు వెలి ♦ యైన పాప, కర్మలకు దూరుఁడగుచు స♦త్కర్మలందుఁ
బండితుండగువాఁడు నే♦ర్పరితనమునఁ, బుణ్యమార్జించుచుండు సు♦బుద్ధిదనర.
తే. మంచిమార్గమునందు వ♦ర్తించువాఁడు, దుష్టులకు దైవవశమునఁ ♦ దోడువడిన
నల్పబుద్ధియునందుచే ♦ నాపదలకు, మూలమగుఁగాని యందున ♦ మేలులేదు.
సీ. ముట్టైన పడతిని ♦ ముట్టి కూడినవాఁడు, పరిశుద్ధుఁడైన కే♦వలము నింక
నేది పవిత్రముఁ♦గాదు సద్గతిగోరు, జనుఁడు వేదముల శా♦స్త్రములయందుఁ
జెప్పినక్రమమున ♦ శిష్టులు జరిపెడు, కర్మలు తనకుల♦ధర్మములను
దప్పక యొకరి య♦త్నము లేక నడుపంగఁ, దగును పాపాత్ములు♦దమకుఁ గలుగు
ఆ బుద్ధివలన శాస్త్ర ♦ ములుకొన్ని కల్పించి, వానిచేత నరులఁ♦ భ్రమలఁ నొందఁ
జేసి విష్ణువునకు ♦ శివునకు భేదము, నుండుననుచు నిలువ ♦ దొకటియైన. 333
క. తరములవారలతో యమ,నిరయములను గూలుదు రిది ♦ నిశ్చయమగునే
నరుఁడు గరణత్రియమ్మున, విరసముఁబోనడుపవలయు ♦ వేయి విధములన్. 334
తే. పుణ్యముల్గోరుచుండెడి ♦ పురుషుఁడు శివ, విష్ణువుల విషయములందు ♦ వేదములకు
దూరమగుక్రియలన్నియుఁ♦దొలఁగఁద్రోయ, వలయునని యీవిధమ్మున♦వానికపుడు.
తే. ఆపిశాచత్వమును బోవు ♦ నట్టి సులభ,మార్గమునుదెల్పి చింతను ♦ మాని మాఘ
మందునీవు ప్రయాగకు ♦ నరుగు మచట, నీపిశాచత్వము దొలఁగు ♦ నిశ్చయముగ. 336

సీ. మనుజేయు పాతక ♦ ములు బ్రయాగస్నాన,మునఁ బాసి స్వర్గముఁ ♦ బొందెదరని
ప్రాఁబల్కులందుఁ జె♦ప్పఁగ నొప్పె మనుజుల, కెల్ల దుష్కృతముల ♦ కింతకంటెఁ
దగిన ప్రాయశ్చిత్త ♦ మగుపడదెందున, యమ నియమాది యో♦గముల వలనఁ
జెందు ఫలముకంటె ♦ నందున స్నానముఁ,జేయ నాధిక్యముఁ ♦ జెందునతఁడు
ఆ. స్వర్గమోక్షములకు ♦ మార్గమైన త్రివేణి, సంగమంబు భువిని ♦ సకల నదుల
కంటె మిన్నయగును ♦ గనుఁగొన నందుకు, సమము లేదులేదు ♦ జగతియందు. 337

తే. పాతకములను శృంఖల♦బద్ధుఁడైన, వానికిఁ ద్రివేణిసంగవు ♦ స్నానమనఁగ
గండ్రగొడ్డలి దానిచేఁ ♦ గలుషములను, ద్రెంచి స్వర్గమునందు సు♦ఖించునతఁడు.

సీ. వీతిహోత్రుని సూర్య ♦ విష్ణువు తేజముల్, గలుగఁగఁ గూడిక ♦ గల్గునెచట
శీతోదకములను ♦ శ్రేష్ఠమై దూష్యమా, పాపతృణము వ్రేల్మి ♦ వస్తువగుచు
మురికియనెడి మేఘ♦ములు నశింపఁగ శర,త్కాలశుభ్రాంశుచం♦ద్రమునఁ బరగి
స్వచ్ఛమైన త్రివేణి♦జలముల స్నానముఁ,జేయు మానవుల దు♦ష్కృతములటుల
తే. విడి ప్రకాశించుఁ గేరళ♦విప్రుఁడొకఁడు, మోక్షమును జెందె నేజల♦ముల స్పృశింప
నాసితాసితసలిల ప్ర♦యాగ మహిమఁ, బలుకుటకు నేను జాలిన♦వాఁడఁగాను. 339

క. అనియిటు దేవద్యుతి దెలి,పిన మాటల నాలకించి ♦ విస్మయ మొదవన్
మనమున సంతోషింపుచు, మునివరుతో నాపిశాచ♦ము నిటులఁబలికెన్. 340

వ. అయ్యా! కేరళదేశపు బ్రాహ్మణునకు ముక్తిగలిగిన వృత్తాంతము సవిస్తరముగాఁ
దెలియ వినుపింపుమనుటయు నాపిశాచముతో దేవద్యుతి యిట్లనియె. 341

## —♦ కే ర ళు ని క థ ♦—

సీ. మున్నుఁ గేరళదేశ♦మున సాంగముగ వేద,ములు బఠించిన విప్ర♦కులజవసువు
దనభూములన్నియు ♦ దాయ లపహరింప, జననరాజ్యము బంధు♦జాలములను
విడచి దుఃఖింపుచుఁ ♦ గడు పేదయై కొంత,కాలము దేశముఁ ♦ గలయఁదిరిగి
యడవిలోపలఁ జొచ్చి ♦ బడలికచేఁ గొద్ది,వ్యాధిచేఁ బీడింపఁ♦బడుచు నొక్క
ఆ. పుణ్యతీర్థమునకుఁ ♦ బోవుచు మార్గము,నందుఁ గరవురాఁగ ♦ నన్ననీర
ములును లేక కష్ట♦మున శ్రమనొందుచుఁ, బొలిసెనతఁడు వింధ్య♦భూధరమున. 342

చ. మఱిదహనమ్ముగాని చర♦మక్రియగాని యొఱింగి తద్ధరా
మరున కొనర్చువారు క్షితి♦మందునకేనిఁ గనంగలేకపోఁ
దరిగనకుండి దిస్సమొల ♦ దప్పిక నాఁకలి యెండగాడ్పులం
దొరలుచుఁ గాళ్లు మండఁగ మొ♦రోయని యేడ్చుచుఁ దొంటిపాపమునన్. 343

ఉ. చేసిన ఘోరకృత్యముల♦చేతను బ్రేతతనుత్వమొంది త
ద్భ్యాసురుఁ డందు గాలివలెఁ ♦ బోడిమి దిక్కు చరింపుచుండి తా
వాసమొనర్చు కొండగుహ ♦ వాఁడొకనాఁడెద దుఃఖమొంది నేఁ
జేసియెఱుంగ దాన మిఁకఁ ♦ జేతునె సద్గతిఁ జెందనేర్తునే. 344

తే. అనుచుఁ జింతించి హోమము • నగ్నియందు, సురల కెవ్వరుసేయరో•హరినిగూర్చి
యర్చనలుఁజేయ రెవ్వరు • నాత్మవిద్య, నభ్యసింపరు నెవరు న•నాత్ములగుచు. 345

సీ. పుణ్యతీర్థములకుఁ • బోవరెవ్వరు బీద,జనులకు నన్నప•త్రములు నీరు
ఫలములు తాంబూల•ములు ధనరత్నము, లెవ్వ రిచ్చెదరో వారు • నెల్ల దుఃఖ
ములఁ జెందెదరు బ్రాహ్మ•ణులసొమ్ము నితరుల, స్త్రీలదద్రవ్యమును హ•రించువారు
బలిమి మాయల చేతఁ • బరవంచకత్వము, జూదమునాడుట • చోరులగుట

ఆ. పొంచియుండి సమయ•ము నెఱింగి మోసము, జేయువారు ముసలి • చిరత రోగు
లైనవారిధనము • నాక్రమించుట గృహ,ములకు నగ్ని మాన•వులకు విషము. 346

ఆ. ఇడుట తప్పుసాక్ష్య•మిచ్చుట యత్యాశ, తల్లిదండ్రిభార్య • తనయులందు
వైరబుద్ధి గ్రామ•పొరహితము పొందు,గాని సతులతోడఁ • గలియుటయును. 347

ఆ. ధర్మమార్గములను • దప్పించువారు దే,వుఁడును లేఁడటంచు • నుడువువారు
రణమునందుఁ దనను • రక్షించువారిని, వదలి ప్రాణభీతిఁ • బరచువారు. 348

క. శరణాగతులగువారిని, గరుణను రక్షింపనట్టి • కఠినాత్ములు భూ
సుర రత్నగోగణంబుల, నిరవుగ క్షేత్రములు నపహ•రించెడు వారల్. 349

తే. దానములయందు నాసక్తి•దగులువారు, నొకరి కపకార మొనరింప • నుండువారుఁ
బ్రాణులకు హింసగావింపఁ • దగువారుఁ,బరులపై దూరుమోపెట్టు•పాపమతులు.

తే. దేవతల గురువులను నిం•దించువారు, కుచ్చితపు దానములఁ దీసి•కొనెడివారు
పేతరాక్షస మృగపక్షి•జాతులను బి,శాచ క్రూరపుజన్మలు • సంభవమగు. 351

క. వారల కిహపరసుఖములు, దూరములగుచుండుఁగానఁ • దోరపుబుద్ధిన్
సారమగు మంచికర్మ లు,దారతఁజేయంగవలయు • ధైర్యము నొదవన్. 352

సీ. తపములు తీర్థయా•త్రలు యాగములు మంత్ర, జప గురుదేవ పూ•జలును దాన
ములు నాచరింపఁగ•వలయు దుష్కర్మలు, మానసమందైన • మరువవలెను
గత జన్మలనుగల • కర్మపరిత్యాగ,మునకు నాలుగు వర్ణ•ముల జనములు
సర్వకాలమును • హెచ్చరికతో ధర్మము,నందుఁ బ్రవర్తింప•నగు మనుజులు

ఆ. ధర్మఫలముఁగోరి • ధర్మముఁజేయరు, దురితములఁదలఁపక • దోషములను
జేయుచుంద్రు రిందు•చేఁ బ్రేతగతి నాకుఁ,గలిగె ననుచు మదిని • దలఁచుకొనియె.

వ. ఇట్లు నాకేరళదేశబ్రాహ్మణప్రేత పలికిన ధర్మోపదేశవాక్యములను బిశాచమున
కెఱింగించి మరల దేవద్యుతి వానితో నిట్లనియె. 454

ఆ. పర్వతమునఁ బ్రేత•బహుకాల మిట్లుండ, నంతనొక్కదినము • నాపథమున
విమలమైన మంచి • వేణీజలమ్ముల, రెండుఘటములందు • నిండనునిచి. 355

సీ. కడవలురెండు కా•విడిమట్లయందుంచి, భుజముపైదానిని • బొందుపరచి
విష్ణుకీర్తనముల • వీనులకింపుగాఁ, బాడుచు నరిగెడు • పాంథునొకని
గని దానికడ్డముఁ•జని భయమొందకు, నీకున్న జలములు • నాకునియ్యఁ
గోరెద నటునీవు • నీరములియ్యక, పోయినఁ బ్రాణముల్ • బోవునాకు

ఆ. ననుచుఁ బ్రేతపలికి ♦ నట్టివాక్యములకు, బాటసారి మరలఁ ♦ బలికె నిటుల
నెవఁడవీవు దుఃఖ ♦ మేపారఁ జిక్కిన, వాఁడ వమితరోగ ♦ పీడితుఁడవు. 356

తే. ప్రాణశేషము దిసమొల ♦ భయదమగు వి, కారరూపము నేలపైఁ ♦ గాళ్లునాన
కుండ నిలఁబడువాఁడవు ♦ కండలేని, కడుపు చేతులుఁగల చప ♦ లుఁడవు నగుచు. 357

వ. అని యడిగిన పాంథునకుఁ బ్రేతయిట్లనియె. 358

సీ. వినుమేను బ్రాహ్మణుం ♦ డను దానశూన్యుండ, లోభుండ మోహాండ ♦ లోలతముఁడ
నెల్లకాలము నన్య ♦ గృహములనన్నము, భుజియించి కాలము ♦ పుచ్చుచుందు
తీపిపదార్థము ♦ ల్దినుచునొక్కండనై, భిక్షు మెవ్వరికిని ♦ బెట్టనైతి
వైశ్వదేవము భూత ♦ బలిలేదు దగగొన్న, ప్రాణులకెపుడు నీ ♦ రములఁబోయఁ

తే. బితరులకుఁ దర్పణములును ♦ మృతదినముల, శ్రాద్ధములు దేవపూజలు ♦ సలుప నెఱుఁగ
వానకెండకు నుపయోగ ♦ మైన ఛత్రి, పాదరక్షల నిడలేదు ♦ బ్రాహ్మణులకు. 359

క. వ్రతములు జలపాత్రిలు సం, తత రోగుల కౌషధములుఁ ♦ దమలము లభ్యా
గతకింటనీడ నన్నము, హితమతితో నియ్యకుంటి ♦ నెన్నండైనన్. 360

ఆ. బీదజనులు వ్యాధి ♦ పీడితు లంధులు, దిక్కులేనివారు ♦ దీను లొకరి
వలన బాధనొందు ♦ నారును నాచేత, నాదరింపఁబడ రొ ♦ కప్పుడైన. 361

ఆ. పశువులమేపు నీరుఁ ♦ బాలనఁగావింప, నగ్నియందు హోమ ♦ మైన వేల్వఁ
దిలలు దానమొసఁగ ♦ నిలజన్మలేదండ్రు, చేయనైతినటులఁ ♦ జెలువమమర. 362

తే. పర్వదివసములను వ్యతీ ♦ పాతములను, గ్రహణ సంక్రాంతులగు పుణ్య ♦ కాలములను
గొంచెముగ దానమిచ్చిన ♦ గొప్పదియగు, నదియు నెన్నఁడు నేఁజేయ ♦ నైతి మఱియు.

సీ. జననములేనట్టి ♦ సర్వ పర్వములు గా, ర్తీకమందున ముఖ్య ♦ తిథుల నష్ట
కలను మఘాదిఋ ♦ క్షముల మన్వాదులఁ, దిలదర్పణముఁ బిత ♦ రులకు నిడను
కార్తీక దీపముఁ ♦ గలనైన నెఱుఁగను, స్నానము మాఘమా ♦ సమున లేదు
మాఘపుష్యముల నే ♦ మారక స్నానముఁ, జేయ సంభవమైన ♦ శీతబాధ
గల విప్రులకుఁ జిదు ♦ గులను మంటలువేసి, చలిని బోఁగొట్టఁగఁ ♦ జాలనైతి
మాధవా దిగనూష్ణ ♦ మాసములందున, జనులకుఁ జల్లని ♦ జలములిడను

ఆ. వేము రావి మఱ్ఱి ♦ వృక్షములను నాటి, పెంచలేదు ప్రాణి ♦ భీతివలన
మఱుగుఁజొచ్చినట్టి ♦ మనుజుల నెవరిని, గానఁజాలనైతి ♦ కరుణమాలి. 364

తే. పరుల నిర్బంధములచేతఁ ♦ బట్టువడిన, జనములను విడిపింపఁగఁ ♦ జాలనైతి
వాసుదేవుత్రిరాత్రోప ♦ వాసములను, బాదపూజలచే మెప్పఁ ♦ బడయనైతి. 365

వ. అదియునుగాక, కృచ్ఛ్రములు, కృచ్ఛ్రపర్వాకముఁ, జాంద్రాయణము, నష్టాంగతప్త కృచ్ఛ్రము, సాంతపనము, మొదలుగాఁగల పుణ్యవ్రతములను, నింద్రాదిదేవతలకుఁ బ్రియమైన యజ్ఞములను జేయనైతి. ఈ విధముగా మునుపటి జన్మ వ్యర్థమైనదాయెను.

ఆ. పూర్వజన్మ కర్మ ♦ ములచేత నీజన్మ, మెత్తినట్టి ప్రాణు ♦ లెల్లరకును
గ్రూరతముఁడ నీదు ♦ కూరిమి చేనన్నుఁ, జూడు విప్రముఖ్య ♦ సురుచిరముగ. 367

తే. పులులఁదోడేళ్లచే మృతిఁ • బొందినట్టి, యడవిమృగముల మాంసము • ననుదినమును
పరిమళించెడి పుష్పముల్ • బహురుచిగల, ఫలములను తేనె వేళ్లు దుం • పలును గలిగి.

సీ. మిన్నేటి కుద్దియై • మించిన సెలయేళ్ళు, చల్లనినీళులు • శైలమందుఁ
గలవెందుఁ జూచినఁ • గాని దైవబలము, నెట్టిదో యెచ్చోట • పొట్టకొరకు
చులకగా దొరకుటఁ • గలుగు పదార్థము, లెన్ని భక్షించిన • నెప్పటికిని
నాఁకలి బోనేర • దడుగడుగున నిధు,లను వానికూడిక • నెనసి బలము

తే. గలిగి దైవానుకూలము • గలుగకునికి, నాఁకలెటుఁ దీరకున్నది • నాకుఁ బ్రేత
జన్మయొక్క ప్రభావ మీ • సరికిఁ బాము,పగిది వాయువు చేత నే • బ్రతుకుచుంటి. 369

ఆ. మనుజుఁ డెవ్వఁడేని • మంత్రిసుఁ దోడ్పాటు, మగతనంబు గొప్ప • మతి పరాక్ర
మమును సఖులు నడత • మంచిదిగలిగినఁ, బొందరానిదైనఁ • బొందఁగలఁడు. 370

తే. కలిమిలేములు సుఖదుఃఖ • ములును బెండ్లి,బ్రతుకుచావులుభోగమః • ల్బడయుటయును
దొలఁగిపోవుట వ్యాధులు • గలుగుటెల్ల,నది యదృష్టమునకు మూల • మగు నిజంబు.

ఆ. చదువునేమిలేక • సౌందర్యవంతులు,గాక చెడునడవడి • గలిగి లోక
దూష్యులగుచు శౌర్య • దూరులై వర్తించు,వారు దొరలెనమున • వరలుచుంద్రు,

తే. బధిరులు నపుంసకులు మూక • పంగులు గుణ,హీనులును గూనులైనట్టి • మానవులును
సకలరాజ్యసుఖంబులు • శాశ్వతులయి, కానఁబడుచున్నవారైరి • ఘనత మెరయ.

సీ. తిలలు గోవులు గజ • మ్ములు మొదలగు మృగ,మ్ములు సతు ల్తినుబండ • ములును మంచి
కోకలు గంధము • నోప్పిక లాకులు నిటు,వంటిదానములు నె • వ్వారుసేయ
వారరణ్యములఁ బ • ర్వతముల నూరుల, పల్లెలయందు ని • వాసులైన
యత్నముం జేయక • యన్ని భోగములును, బలుమారుగల్గు నీ • పర్వతమున

ఆ. నేనుగాక యితరు • లైన రాక్షస పిశా,చములు స్త్రీలతోడ • సంచరింప
నడవియందు నక్క • డక్కడ కొండను, పలలభక్షణంబు • గలుగుచుండు. 374

తే. అళుకునొందకు నాదువా • క్యములకిపుడు, విష్ణుభక్తుఁడవగుట నీ • విపినమందుఁ
గలుగునట్టి పిశాచరా • క్షసులు నిన్నుఁ, గనులఁజూడ సమర్థులు • గారుకారు. 375

వ. ఇదియునుంగాక విష్ణుభక్తిచేత రక్షింపఁబడువాఁడై, విష్ణువునందు నాసక్తుండైన వానిని రాక్షసులు, ప్రేతములు, పూతనాదిస్త్రీభూతములు, బేతాళము మొదలగు పురుషభూతములు, గంధర్వులు, డాకినులు మొదలగు గ్రహములు, నితరములగు దయ్యములు, యవనములు మండలిక మొదలగు గ్రహవిశేషములు, యక్షరాక్షస గ్రహములు, ఘోరములైన యితరదుష్టగ్రహములు, మాతృభీమ వినాయక కూష్మాండగ్రహములు, సర్పములు మొదలగు దుష్టజంతువులు, ఇవన్నియు విష్ణుభక్తులును, బ్రహ్మనిష్ఠగలవారును, మానవ్రతులునునైన విప్రులఁ గన్నెత్తిచూడఁ జాలవు అని మఱియునిట్లనియె. 376

క. పరిశుద్ధత ధర్మముగల, పురుషుని తారలును భూత • ములును గ్రహంబుల్
సురలును బీడలనొంపక, నిరతమురక్షించుచుండ్రు • నిర్మలమతులై. 377

క. మనమున విష్ణువు నాలుక, మొనపై గోవిందనామమును నిల్పిన నీ
కును భయ మెక్కడి దిక నే, మును జేసిన పాపకర్మమున నీయడవిన్. 378

తే. ప్రేతజన్మము చే దుఃఖపీడితుండ, నగుచు సారసపక్షివాక్యములు మదినిఁ
దగుల శోకమువిడచి తత్కర్మఫలము, ననుభవింపుచునుంటి నిందను నిచట.

సీ. ప్రాణులకెపుడు సంబంధము ల్దొలఁగుట, గూడుటగల్గు నీకొండయందుఁ
గలిగినదృహరాఖ్యగలనది నింపైన, నిండార చల్లనినీరుగలిగి
మదపుబేనుఁగులసమ్మర్దనగలదియు, నుత్సాహ మొదవుటకునికిపట్టు
దట్టమై నేరేళ్లు దనరిమనోహర, మైయుండనొకదినమందు నేను

తే. నడవిలోనుండి యేటికి నఱిగి నీట, మునిఁగి గట్టునశ్రమదీర్చుకొనుచునుండఁ
గొన్ని పులుఁగులు దనవెంటఁ గొలువ నాఁడు, పక్షితో మగసారసపక్షి వచ్చె.

వ. ఇట్లువచ్చి యాయేటిలోనియిసుకతిన్నెపై వ్రాలి, యందలినీళ్లుద్రావి, కొంచెము సేపు విహరించి మనోజ్ఞములైన రెక్కలనడుమఁ దలఁజొప్పించుకొని సుఖముగా నిద్రవోవుచుండె నంత. 381

## సారస, వానరజన్మ ప్రకారము

తే. రక్తవర్ణములైన నేత్రములు ముఖము, నిడుదలగుగోళ్లు బలమున నిండి పొడవు
దేహమునఁ బారువెండ్రుక దీర్ఘవాల, మలరి కదలెడిపెదవులుఁ గలదియగుచు. 382

తే. వానరము వృక్షముననుండి వచ్చి యిసుక, తిన్నెపై సుఖనిద్రను దేలుచుండు
పక్షులనుగని యొకపెంటి పదము రెండు, చేతులనుబిగఁబట్టెఁ గుంచితపుమతిని.

క. అదిగని తక్కనపుల్ఁగులు, మదిఁగలఁగక నందు లేచి మరియొకచోటన్
బెదరుచువాలెను సంకట, మొదవఁగ నాపెంటి భయము నొందుచు నచటన్. 384

ఉ. కూయుచునుండ దానిపలుకుల్విని నిద్దురమాని భీతితో
నీయెడ నాకు భార్యలకు మృత్యువు సిద్ధమటంచు నెన్నుచున్
బాయని చింతతో మది కుపాయము దోఁపక పోతుపక్షి దాఁ
బోయెను గోఁతిచెంగటికిఁ బోడిమిదక్కఁగ భూసురోత్తమా. 385

వ. ఇట్లువచ్చిన మగసారసపక్షిని దానిభార్యలను మెడబట్టుకొని చంప నుపక్రమించినఁ గోఁతితో నాపక్షి మధురవాక్యములనిట్లనియె. 386

ఉ. ధారుణినేలు క్షత్త్రియులు దప్పులులేని మనుష్యమాత్రులం
దూరక శిక్షజేయుటకు నూల్కొనరెన్నఁడుఁ గాన నేమియు
న్నేరములేని మమ్ము నవినీతుఁడవై వధియింప నేల నీ
కూర్రపుబుద్ధిఁ బోనడఁచి గొప్పవహింపుము వానరోత్తమా. 387

సీ. పరహింసఁ జేయనివారు సాధువు లన్య, వర్తనమెఱుఁగనివారు నీటి
పాచిని భక్షించువారు నాకాశము, నందున విహరించునట్టివారు
వనములయందుండువారు స్వభార్యతో, భోగించువారెవ్వరు పాలఁతులయెడ
నూహఁజేయనివారు నొరులనిందింపని, వారు దొంగిలఁబోనివారు పరుల

తే. యాచనములేనివారు వి♦హాయసమున, గనుచుఁదిరిగెడువారిసాం♦గత్యము విడు
వారు పక్షులచేఁ గొలు♦వంగఁబడిన,వారునగు మమ్ము నేల యీ♦బాధ పఱుప. 388

తే. నీమ తొల్లిఁటిజన్మము ♦ నీ వెఱుంగ, వే నెఱుంగుదునని పక్షి ♦ హెచ్చరికను
జేయఁజపలస్వభావము♦ చేతఁదిరుగు, వానరము దానితోనిట్లు ♦ వలికెనపుడు. 389

క. సారసమా! పక్షివి నీ,వారయ నేఁగోఁతిజాతి♦నై యుండఁగ నే
తీరున గతజన్మ సమా,చారము లెఱుఁగుదువు దాని ♦ సరగునఁ జెపుమా. 390

క. అని యడిగిన వానరమును, గని సారసపక్షి నీదు♦గతజన్మము నే
నును యోగదృష్టి నెఱుఁగుదు, వినుపించెద నదియు విను స♦విస్తారముగన్. 391

సీ. మున్ను పర్వతదేశ♦మునకు విద్యాధికుం,డను పేర రాజవై ♦ యలరు దీవు
బ్రాహ్మణుండను నీకుఁ ♦ బౌరోహితుండ నా,హేతువువలన గు♦ర్తెఱుఁగుదు నిను
ధనసంగ్రహముఁజేయు♦తలఁపున నీవేలు బడిరాజ్యమందున్న♦ప్రజల నెపుడు
బాధింప నధిక పా♦పమునఁ గుంభీపాక,మాది భయంకర♦మైన నరక

తే. ములను దశలక్షవత్సర♦ములు దపింపఁ, బడుమఁ బలుమారు నేడ్పుచే ♦ భయదమైన
మొరలువెట్టుచు నగ్ని చేఁ ♦ బెరుగునట్టి, మంటలకు నోర్వఁజాలక ♦ ద్రుగ్గిపిదప. 392

క. విడువఁబడి కర్మశేషముఁ, గుడుచుటకై భువిని నీవు ♦ కోఁతివగుచు ని
ప్పుడు నన్నుఁజంపఁ దలఁచితి, వెడసేయక పాపములకు ♦ నిదె మూలముగన్. 393

క. క్రిందటిబామునఁ బారుని, సందున రంభాఫలములు ♦ సాహసమతి నిం
పొంద బలాత్కారముగాఁ, బొందిన తత్ఫలము లీవు ♦ భుజియించుటచే. 394

తే. వనమునందునఁ గోఁతివై ♦ జననమంది, సంచరింపుచునుంటివి ♦ సకలప్రాణి
సముదయము మున్ను జేసిన ♦ సంచితఫల, మనుభవింపక దివిజుల♦కైనఁబోదు. 395

తే. జ్ఞానయోగము నాయందుఁ♦గలుగుకతన,నిటుల నీపూర్వజన్మము ♦ నెఱుఁగుదునను
పక్షితో వానరమునిట్లు ♦ పలికె నీకు, నిట్టిజన్మము సంభవ ♦ మేల కల్గె. 396

క. అని యడిగినవానరమును, గనుఁగొని సారసము నాదు♦గతజన్మము నీ
కును చెల్పెద నా వృత్తము, వినుమని పలుకందొడంగె ♦ వివరముగాఁగన్. 397

సీ. నాపూర్వజన్మము♦నను నర్మదానది,గట్టున భాస్కర♦గ్రహణకాల
మందు ననేకధా♦న్యములరాసులు నీవు, భోయించి వానిని ♦ భూసురులకు
నిమ్మన నీ పురో♦హితుఁడనౌ మదమున, గర్వించి విప్రసం♦ఘమున కందఁ
గొంచెముగాఁ దీసి♦కొననిచ్చి తక్కిన,దంతయు నాకుఁగా♦ నపహరింప

తే. బ్రాహ్మణుల కందరికిఁదగ ♦ భాగ్యతగల, ద్రవ్యమును నే హరించిన♦దానివలనఁ
గాలసూత్రినరకమునఁ ♦ గదలుచున్న, పురుగులను నిండి నెత్తురు ♦ బురదగలది.

వ. రక్తకర్దమము పూయఫేనల మను నరకములందుఁగూలి దిక్కుగానక యూపిరి విడ
రాక ముహూర్తకాలము నూరుకల్పములుగా నరకయాతనల ననుభవించుచు
వేయివత్సరములు గడిపితిని. 399

ఆ. అందువలనఁగలిగి♦నట్టి దుఃఖముఁజెప్ప, నలవిగాదు దాని ♦ ననుభవించి
పక్షిజన్మమిపుడు ♦ పడసితి వానికొ,గణముఁ దెలియఁజేతు ♦ వినఁగవలయు. 400
ఆ. నాసహోదరికిని ♦ నాచేత నీఁబడి,నట్టి కంచుపాత్ర ♦ నామె చూచి
నపుడు దొంగిలింప ♦ నాదోషమునఁబక్షి,జన్మమిపుడు నాకు ♦ సంభవించె. 401
ఆ. పాపచిత్తురాలు ♦ భార్య నాకిది కంచుఁ, దొల్లిజన్మమందు ♦ దొంగిలింపఁ
బక్షిదేహమిపుడు ♦ బడసెను మనపూర్వ,జన్మకర్మలిట్లు ♦ జరుగుచుండె. 402
తే. వానరోత్తమ నీవు నా♦భార్య నేను, మనము ముగురము మఱలజ♦న్మమునఁ గామ
రూపదేశమునందు ని♦రూఢముగను, హంసలుగఁబుట్టి సుఖముల ♦ నందఁగలము.
సీ. అవలఁ బరిశుద్ధ♦మైన గోజన్మలు, పెందినపిమ్మటఁ ♦ బొందరాని
మానవజన్మసం♦భవమౌను మనకందు, చేతఁ బ్రాణులవల్లఁ ♦ జెడుగు మంచి
సాధింపఁదగు నిట్లు ♦ సకలజంతువుల కం,తర్యామియగుహరి ♦ తనదుమాయ
చేత మోహమునొందఁ♦జేసి స్వగుణముల,వలన దుఃఖముగల♦వారు నౌట
ఆ. బ్రహ్మచేతఁ జేయఁ♦బడిన సహజధర్మ,ముల బ్రవర్తనములఁ♦ గలిగి సుఖము
దుఃఖములనొసంగుఁ ♦ దొడరి ధర్మాధర్మ,ములకు మిగుల కోరి♦కల జనులకు.
తే. ప్రాణికోటులచే హరి ♦ పడయు పూజ, దనుజ శార్దూల నిర్జర ♦ మనుజకీట
కములు మొదలగు సకలజీ♦వములు దుఃఖ,కంటకపుమార్గమునఁజిక్కి♦కదలలేరు.
క. యోగులు సంసారపరి,త్యాగులు వేదములు జదువ♦నగువారగుచున్
బాగుగ నుపనిషదర్థము, లోఁగొని సాంగముగ వేడ్క♦లుం గనువారల్. 406
ఆ. స్నానమాడువారు ♦ సకలకర్మములందుఁ, గలుగు ఫలముఁ బొందఁ♦గలరటంచు
శాస్త్రమెఱుఁగువారు ♦ శౌరిమాయ నెఱింగి, దుఃఖసుఖములందుఁ♦దొట్రుపడరు.
ఆ. కానఁ బూర్వజన్మ♦కర్మముఁ దప్పింప, నలవిగాదు ధాత♦కైన నీవు
మునుపు పాపకర్మ♦ములను మాయోపాయ, మైన పనులకొఱకు♦నధికమైన. 408
ఉ. సేనలతోడఁగూడి నృప♦శేఖరు పేరువహించి యిప్పుడీ
కాననమందు మర్కటము♦గా జనియించితి వీవు నింక నీ
వానరజన్మ నాకు నిటు ♦ వచ్చెనటంచు విచారమేమి నీ
మానసమందుఁ జేర్పకిదె ♦ మంచిదిగాఁ దలపోయఁగాఁదగున్. 409
ఆ. ఎటుల సుఖమొ మదికి ♦ నటులఁ జరింపుచు, గహనమందు మంచి♦కాలమునకు
నెదురుజూచుచుండు ♦ మిఁక నేను సారస,జన్మమడవులందు ♦ జరుపుచుందు. 410
క. అని యిటుపలికిన పక్షిని, గని వానరమపుడు నిరయెఁ ♦ గడు వేడుకతో
మునునాచేఁ బూజలువడ,సినవాఁడవు నిపుడు నాదు♦చిత్తమునలరన్. 411
క. గతజన్మమందుఁగల సం,గతులన్నియు బోధకొఱకుఁ♦గా నీచేత
న్సతముగ వింటిని నీకిదె, హితమలితో మొక్కులిడుదు ♦ నివిగొనుమనుచున్.
ఆ. నీదువాక్యములకు ♦ నే నిపు డజ్ఞాన,మును దొలంగి సౌఖ్య♦మున వసింపఁ
గలిగె నీవు సతిని♦గలసి సుఖంబుల, ననుభవింపుమనుచు ♦ నతిఁగెఁగోఁతి. 413

సీ. బ్రాహ్మణోత్తమ విచి♦త్రముఁ బావనమునగు, మర్కటపక్షిసం♦వాద మిదియు
నే నేటిగట్టున ♦ నిలిచి విన్నంతమా,త్రమున నే సుజ్ఞాన ♦ మమరె నాకు
దుఃఖము నాపద ♦ దొలఁగె మిక్కుటమైన, గంగాప్రభావముఁ ♦ గనుటవలన
దాహము చేత బా♦ధను జెందువాఁడ నా,జలములయందున♦స్నానమొనరఁ

తే. జేయఁగోరినఁ దృప్తినిఁ ♦ జెందువాని,పగిది సంతసమొదవె నీ♦పట్లఁ బాప
ముల హరింపఁగఁజేయు నా♦జలము నీదు,చేతనున్నది నన్ను ర♦క్షించుఁగాత. 414

తే. పారియాత్రమునందొక♦బ్రాహ్మణుండు, నిర్మలుఁడు వేదములయందు♦నిధియనంగఁ
దగినవాఁడయి క్రతువులఁ ♦ దక్షుఁడగుచుఁ, బెక్కుజేయించి మిక్కిలి ♦ పేరువడసి.

తే. అటులనొకకొంతకాలము♦నడుగ నతఁడు,జచ్చి పిమ్మట బ్రహ్మరా♦క్షసుఁడునగుచు
వింధ్యపర్వతమున నాదు♦వెంట నష్ట,వర్షములు సంచరింపఁగ ♦ వానిసుతుఁడు. 416

సీ. గంగలో నఘనాశ♦ఘట్టమం దస్థులు,వైచిన రాక్షస♦త్వమును విడువఁ
గంటిఁ బ్రత్యక్షము♦గా నేను నదిగాన, గంగోదకముల స♦త్కరుణ నిమ్ము
పుణ్యతీర్థముల నేఁ ♦ బొందిన దానము,లకును బ్రాయశ్చిత్త♦మొకటి యెఱుఁగ
నందు చేఁ బ్రేతము♦నై వింధ్యపర్వత,మున నీరు నాహార♦మును దొరకక

ఆ. యలమటింపుచుంటి ♦ నయుత ద్విగుణవత్స,రముల నాఁటనుండి ♦ యమితమైన
సిగ్గువిడచి తెలియఁ♦జెప్పితి నా కగు, వృత్తమెల్ల నిపుడు ♦ విప్రముఖ్య. 417

తే. ఇపుడు గంగోదకముల నా♦కిచ్చి వేగఁ, బ్రాణములు దేహమందునఁ ♦ బదిలపఱుపు
ప్రేతజన్మముతోనుంటఁ ♦ బృథివి నెల్ల,వారలకుఁ గష్టతరమగుఁ ♦ బలువిధముల. 418

తే. ప్రాణులెప్పుడు దేహసం♦రక్షణమును, జేసికొనుచుండవలె నిది ♦ సిద్ధమరయఁ
గుష్ఠు మొదలగు రోగులు♦గూడ తనువు, విడువఁ గోరరు సంకట♦పడుచునైన. 419

క. అని ప్రేతమిటులఁబలికిన,వినయోక్తులు బ్రాహ్మణుండు♦విని తనమనమం
దున విస్మయకారుణ్యము,లను జెందఁగ నీవిధము ద♦లంచెందలఁకక. 420

ఆ. పాపపుణ్యములను ♦ బ్రత్యక్షముగ లోక,మందుఁ జూడఁగంటి♦ననవరతము
దానవులును దేవ♦మానవపశుపక్షి,జాతులందు జనన♦సంభవమును. 421

తే. బాల్య కౌమార ♦ యౌవన వార్ధకములు, వ్యాధిమరణము లెప్పుడు♦వచ్చుచుండుఁ
గాన నీకర్మభూమిని ♦ మానవాళి, న్యాయపద్ధతి నార్జించి♦నట్టి ధనము. 422

సీ. సత్పాత్రముల దాన♦సంగ్రహమెల్లఁ బ్రా,ణులకు మేలొనరింపఁ♦దలఁచువారు
రత్నసువర్ణముల్ ♦ రథతురగములు క,న్యలు బురమ్ములు నన్న♦మంబరములుఁ
బాదరక్షలు మంచి♦ఫలములు మంత్రమౌ,షధము నివేశన♦స్థలము గొడుగు
ధాన్యము లావులు♦దమలముఁ బానుపు, పూలదండలు పీఁట♦ తాళరాగ

తే. ములఁ బ్రకాశించుపాటలు ♦ మొదలుగాఁగ, నెవ్వనికి దేనిపైఁ బ్రీతి ♦ నిష్టమగునొ
స్వర్గమే దానమిచ్చిన ♦ సంభవమగు,నటులఁ గావించి తత్ఫల♦మందవలయు. 423

ఆ. ఇచ్చినదియుఁ గొంచె♦మేనియు నంతియె,యనుభవించు ననుచు♦నంతకంటె
తగ్గుహెచ్చులేని♦తాత్పర్యమునఁ గృతి,బాడెఁ దీర్ఘవాసి♦బ్రాహ్మణుండు. 424

క. అదివిని ప్రేతము సంతస,మొదవఁగఁ గళదేరి పలికె♦నో తెరువరి నా
మది కిపుడు నిన్నుఁ గన నర,పదిమోముల వేల్పుఁ జూచు♦పగిది గనుండెన్. 425

తే. చాతకములకు మేఘుఁడు ♦ జలమొసంగి, యసువులను నిల్పుకరణి నా ♦ కంబువులను
జేర్చి నా ప్రాణములను ర♦క్షింపుమీవు, బ్రాహ్మణోత్తమ! చిత్తము♦ పాదుకొనఁగ.

క. అను ప్రేతముఁ గని యానెతె,విను నా తలిదండ్రు లిపుడు♦భృగుకచ్ఛపమం
దున నున్నవారు నచటికిఁ, గొనిపోవుచునుండ వారి♦కొఱకీ జలమున్. 427

ఆ. తోవనడ్డగించి ♦ తోయములిమ్మని, యడుగుచుంటివిపుడు ♦ నందుకైన
సంశయంబు మదికి ♦ జనియించె యోచించి, చేయఁదగినపనులె ♦ చేయవలయు.

సీ. వేదశాస్త్రములను ♦ విబుధులచే మును, వింటిని గ్రతువుల♦కంటె నధిక
ఫలము సంభవమగుఁ ♦ బ్రాణసంరక్షణ, కనుచుఁ బవిత్రము♦లగు ప్రయాగ
జలములకేను నా♦తలిదండ్రులకుఁగాను, బోయెద మేలును ♦ బుణ్యమునగు
నొరులకు నుపకార♦మొనరించువారికిఁ, దక్కినపనులచేఁ♦దక్కువనుచుఁ

ఆ. పండితులగువారు ♦ భాషింపుచుందురు,నదియె దోఁచె నాదు♦మదికి యాగ
ములను నూరు జేయ ♦ ఫలమునఁ కెక్కువ,నిచ్చు నొరుల కుపక♦రించుఫలము. 429

తే. పరుల కుపకారమొనరించు ♦ నరుఁడెవండు, నతఁడు నుత్తమపురుషుల♦కతిశయుఁడనఁ
బరఁగి శాశ్వతమై యొప్పు♦ పరమపదము, నొంది భువియందు జన్మల♦నొందరాఁడు.

ఆ. ఇపుడు జలము చేత ♦ నీప్రేత కుపకార,మే నొనర్పఁగలుగ♦నెద్ది నాకు
సర్వధర్మమయము♦సారాంశము దధీచి, మున్ను జెప్పుశ్లోక♦ము వినలేద. 431

క. అని గంగాయమునానదు,లనుగల జలసంగమస్థ♦లమునీరములన్
దనమూపునుండి ప్రేతకు, మన మలరఁగనిచ్చె విప్ర♦మనుజుఁడు గడఁకన్. 432

తే. అంతఁ గేరళబ్రాహ్మణుఁ♦డైన ప్రేత,యా జలంబులఁ గొన్నిఁటి ♦ నాని తలకుఁ
బోసికొనఁగ నాజన్మముఁ ♦ బాసి దేవ,తాశరీరము నొందెను ♦ తత్క్షణమున. 433

సీ. ఆగొప్పమహిమకు ♦ నాశ్చర్యమొంది గం,గాయమునానదు♦లగ్గలియునట్టి
జలములచే నేను ♦ జక్రవర్తిత్వము,నైనఁ బొందుదు నిపు♦ డంబుకణము
వలనఁ బ్రేతత్వము ♦ దొలఁగితి నిట్టి స,మర్థులుగారు బ్ర♦హ్మాదులైన
జలమహాగుణములు ♦ శక్యమా చెల్పను, శ్రీమహాదేవుఁ డి♦చ్చిన సలిలము

తే. నింకొకవిధంబుగా నది ♦ యెటుల నౌను,నరుఁడెవఁడు పాలసంద్రపు♦నావలందు
లేమతుంపుర్లరాసులఁ♦జూచి వినియు, ననుభవింపక భక్తిపెం♦పావహిల్ల. 434

క. తిలపరిమితమగు గంగా,జలపానముఁ జేయ సిద్ధ♦సాధ్యులు గీర్వా
ణులలో నొక్కఁడు నౌఁగా,కిల నాతఁడు జననమొందఁ♦ డెప్పటికైనన్. 435

తే. గంగయందున నెవఁడు నొ♦కానొకప్పు,డైన స్నానముగావింప ♦ నతని కాల
కలహదుష్కృతదశనర♦కములు భంగ,పరుపఁజాలక యుండు నె♦ప్పటికినైన. 436

తే. తపము దానము యాగము♦జపము హోమ,ములను బ్రేతత్వమెంతయుఁ♦బొలఁగిపోదు
తత్క్షణంబున నేనీటఁ♦దడియుఁ దొలఁగు, నాజలంబునఁ గైవల్య ♦ మబ్బఁగలదు.

తే. మనము వాక్కులు నొకటిగాఁ ♦ దనువులందుఁ, గలుషముల చేత నెవ్వఁడుఁ బ్ర♦కాశమాను
లైన జనపాపములను గం♦గాంబువులును, దక్క నణఁపఁగలే విధి♦నిక్కముగను.

తే. జనుఁడు గంగోదకముల సు♦స్నాతుఁడైన, సకలకార్యములందునఁ ♦ జాలువాఁడు
గాక నిలయము కంటె సౌ♦ఖ్యములనిచ్చు, స్వర్గలోకము నతనికి ♦ సంభవమగు. 439

తే. వృజినరాక్షసప్రేతము ♦ లేజలమునఁ, దొలఁగు నట్టిగంగానది♦తోయములను
స్నానమొనరింప హరి సన్ని♦ధానమైన, పరమపదమును బొందు నే♦నరుఁడునైన.

తే. దాయ లెవరికిఁగాఁ దిల♦తర్పణంబుఁ, జేయ గంగాజలంబుల♦చేత వార
నరకమందున్న స్వర్గము ♦ నాకవాసు, లైన మోక్షముఁబొందుదు♦ రార్యవినుత.

క. పరిశుద్ధత శ్రేష్ఠత్వముఁ, గరమొప్పెడి మోక్షపదవి ♦ గంగాజల మో
తెరువరి వీనికి నధికము, సరిబోల్పఁగరాదు మూఁడు♦జగములయందున్. 442

తే. బ్రాహ్మణోత్తమ నీకు దీ♦ర్ఘాయువగును, బెడమొగము ధర్మమందునఁ ♦ బెట్టఁబోకు
గంగలో నీరుఁద్రావిన♦కారణమున, నిపుడె నీచేత గొప్పవ♦హింపఁబడితి. 443

ఆ. అనుచుఁ బలికి తనకు ♦ నంబువు నొసఁగిన, తెరువరికి ననేక♦దీవనలిడి
ప్రేతతనువువీడి ♦ త్రిదశత్వమునఁ గేర, శక్తితిసురుఁ డతిగె♦లలి దివికిని. 444

క. ప్రేతకు జలముల నొసఁగుచు, నాతెరువరి మరలఁదాఁ బ్ర♦యాగకుఁ జని సం
ప్రీతిగ హరిని దలంపుచు, శీతోదకములను గొనుచుఁ ♦ జెచ్చెర నతిగెన్. 445

సీ. అని పిశాచమునకు ♦ నపుడు దేవద్యుతి, వినిపించె నాతఁడు ♦ వినఁగ నట్టి
మహిమకు నాశ్చర్య♦మగ్నుఁడై మాఘమా, సమునఁ బ్రయాగకుఁ♦జని ముదమున
స్నానముఁజేయఁ బి♦శాచత్వమెల్లపా, పములు నశించి దే♦వత్వమొంది
వెనుకటివైరబు♦ద్ధిని మాని చక్కఁగా, హరిని నుతింపుచు ♦ నతిశయముగ

ఆ. విరులవాన సురలు ♦ గురియింప గంధర్వ, వరులు పొగడ దేవ♦వనిత లాడ
మంచిమానసమున ♦ మణిపుష్పకము నెక్కి, చనియె దేవలోక♦సదనమునకు.

తే. కాన విన్నప్పుడే దేహ♦కలుషములను, దొలఁగి సుజ్ఞానమోక్షము ♦ గలుగునదియు
మున్ను పెద్దలవలన నే♦ విన్నదియును, నరకవాసులపాపము ♦ జెరుపునదియు.

తే. ఈపురాతనచారిత్ర ♦ మిపుడు దగిన, కారణముతోడఁ దెలిపితిఁ ♦ గాన నీదు
తనయుఁడును నీవు నేను గం♦ధర్వసతులు, సద్గతినిగోరి మాఘమా♦సమున వేగ.

తే. చని ప్రయాగమునీటిలో ♦ స్నానమొనరఁ, జేయఁ బైశాచరూపము♦ల్బాయు వీరి
కింక వేరొండుసాధన ♦ మెందు లేద, టనుచు రోమశమౌనీంద్రుఁ ♦ డానతిచ్చె.

క. ఆ రోమశముని దెల్పిన, సారములగు నీతివాక్య♦సరణి మనములం
జేరఁగ నా దయ్యములును, వారక వేదనిధి సుగుణ♦ప్రాజ్ఞులనగుచున్. 450

తే. సాగరముఁబోలు పాపము ♦ ల్సమసిపోఁగ, సంతసింపుచు సుజ్ఞాన♦సరసిలోన
మునిఁగి దక్షిణదిశఁగూర్చి ♦ మునివరునిని, గగనపథమున వారలు ♦ గదిసి వేగ. 451

సీ. ముందు వెనుకఁ గాక ♦ యందఱు నొకటిగాఁ, జేరి ప్రయాగకుఁ ♦ జెలువ మమర
నా పుణ్యతీర్థము ♦ నపుడు గనుంగొన, నానందభరితులై ♦ యంతరిక్ష

మునని ల్చె రోమశ•ముని వారిమనములు, దనియ నందలిమహా• త్త్వమును జూపి
వినుపింపఁగడఁగె నా•వేదనిధిఁగని, భూలోకమునఁగల • పుణ్యతీర్థ
తే. ములకు రాజైన యీనది•గల విశేష,ములఁ గనుంగొను శ్రీద్ధతో • మున్ను దేని
యందునను సంతసింపక•యుండు మూఁడు,గుండముల నగ్ని దేవుండు•మండునదియు.
తే. కమలగర్భుఁడుయజమాని•గాఁ గలదియు,నైనయిది మాఘవేదిక•యరయు మిచట
హస్తికరమున కెనయగు • నాజ్యధార•వలనఁ దృప్తిని జెందు దే•వతలు మఱియు.
తే. మిగుల రుచికరమగుచు స•మీపమందుఁ, బడెడి సోమరసముధార•వలన మున్ను
గలిగి మేలైన శూలటం•కములవలనఁ, దనరుచుండెడి శంకరుం•డనఁగ నితఁడె.
సీ. పాతాళమున కంటు•వరకు నూడలుబారి,నట్టి దక్షయవట•మనఁగ నిదియె
ప్రళయకాలమునందు • జలధిలో జగములు, మునుఁగ సుఖంబగు • నునికికొఱకుఁ
గర మర్థి నెవని మా•ర్కండేయముని శర,ణాగతుండయ్యెనో • యోగనిద్రఁ
దనరు ప్రయాగమా•ధవుఁ డితండే సాంబ,శివునకుఁ బ్రియురాలు • జిత్తచలన
తే. షడ్గుణైశ్వర్యములుగల • సాధ్వి యెల్ల,కోరిక లొసంగునదియునై • సారమతులు
నమరసతులకు నేత్రోత్స•వము నొనర్చు, మానవులచేత సేచేట • మాఘమందు.
తే. చేరువగు సంద్రమునఁగల • నీరు విడిచి, కోరి సేవింపఁదగిన భా•గీరథి యదె
జనులెవ్వరు నేజల•స్నానమాడ, భానుతేజముతోడ స•మానులగుదు. 456
క. అదెయగు నిదె యమునానది, పదపడి యీరెండునదుల•పాయలు నొకచోఁ
గదిసినఁ బ్రయాగ మిందుల, సదమలమతి స్నానమాడ • జనులెవ్వరికిన్. 457
తే. వారణాసిని స్నాన మె•వ్వారు సేయ, నరకబాధలఁ జెందక • నాకమునకుఁ
జేరు నెచ్చోట స్నానముఁ•జేయ జనన, మరణతాపములందునఁ • జొరక యుందురి.
ఆ. అట్టి యీప్రయాగ•మందు జ్ఞానాజ్ఞాన,జన్మలఁగల ప్రాణి•సముదయములు
స్నానమాచరింప • సరగున స్వర్లోక,మందు నిలుచు నరక•మందుఁ బడక. 459
క. స్రష్టయును బ్రాణికోటుల, సృష్టినొనర్పఁగఁదలంచి • హితవుగ నిచటన్
ఇష్టముగఁజేయఁ గ్రతువులు, సృష్టిసమర్థత్వ మొదవె • శ్రీహరికరుణన్. 460
క. గంగాయమునలు గలసిన, సంగమ వేణీజలముల • స్నానముఁజేయన్
అంగనకై విష్ణుఁడు నా,సంగతితోనంతఁ బాల•సంద్రముకడకున్. 461
తే. సురలు దానవులమృతము•కొఱకు నొక్క, మొగిని మందరపర్వత•మునఁ దరువఁగ
జననమొందిన యిందిరా•సతిని దనకుఁ, బత్ని గాఁగొని సంతోష•భరితుఁడగుచు.
ఆ. సాంబశివుఁడు త్రిపుర•సంహారమునకుఁగా, నాఱునెలలు గాశి•యందు నిండు
స్నానమాడ నేక•శరమునఁ బురములు, మూఁటిహతము నొక్క•మొగినిజేసె. 463
తే. పాకవైరియు శాపముఁ • బడసి దేవ,వనిత నూర్వశి నాకము • వదల నెందు
స్నానమొనరింప శాపము • సమసి మరల, స్వర్గమునుబొందె నిర్మల•స్వాంతుఁడగుచు.
క. సుతహీనుఁడైన నహుషుఁడు, హితమతిదనరార స్నాన•మొందునఁజేయన్
గలికై యయాతినామకుఁ, డతులిత సుతుఁడుద్భవించె • నాతని కపుడున్. 465

ఆ. పూర్వకాలమందుఁ ◆ బురుహూతుఁడు ధనము,నందుఁ గాంక్షగలుగ ◆ నిందు స్నాన
మొనరఁజేసి ధనదు ◆ నోడించి కపటము,వలన నవనిధులను ◆ గెలిచికొనియె. 466
తే. ధర్మసుతులిరువురు లస ◆ ద్ధర్ములయిన, నరుఁడు నారాయణాఖ్యులఁ ◆ బరఁగు ఋషులు
దశసహస్రాబ్దములు నిందుఁ ◆ దపము నాచ,రించి దీరుచుకొనిరి ◆ వారిష్టములను. 467
సీ. శంకరపూజాభి ◆ సక్తుఁడై కాశ్యప,ముని దశేంద్రియముల ◆ నణఁచిపట్టి
ధర్మముఁదప్పక ◆ తప మాచరింపుచు, నణిమాదిగుణముల ◆ నతిశయించి
యోగసిద్ధిఁబొంద ◆ నొనర భరద్వాజుఁ, డిచ్చోటఁదపమును ◆ మెచ్చఁజేసి
యేడ్గురుఋషులలో ◆ నితఁడు మూఁడవవాఁడు, నైయుండె సనకుండు ◆ నాదిగాఁగ
తే. బ్రాహ్మణులుయోగమునకైన ◆ ఫలమునొసఁగు,చక్రపాణినిమదినుంచి ◆ స్నానతపము
లాచరింపుచు క్షేత్రజ్ఞుఁ ◆ డైన హరిని, దర్శనము నిందుఁజేయుచు ◆ ధన్యులైరి. 468
క. ఘనగంగాయమునానదు,లనుగల జలసంగమస్థ ◆ లంబున నుదయం
బున మాఘమకరమందున, నినుఁడుండెడిదినములందు ◆ నేమర కెవరున్. 469
ఆ. స్నానమాచరింప ◆ సకలపాపక్షయ, మగుచుఁ దేజమలర ◆ నంబరమునఁ
గళలు దనర సకల ◆ ఫలములనందుచు, మోక్షమునకు నేగు ◆ మోదమలర. 470
క. మునిరుచికునిశాపమునొం,దినగంధర్వుండు కాక ◆ దేహమును ధరిం
చినవాఁడైఁ యిచ్చో జల,మున స్నానముఁ జేయ శాప ◆ మోక్షమునయ్యెన్. 471
సీ. పరమహంసస్వరూ ◆ పముఁనొంది పారునీ,నలుపుదెలుపుగల ◆ సలిలమందుఁ
గలిన పేక్షించిన ◆ గంధర్వకన్యలు, చక్కనీకొమరుండు ◆ స్నానమిపుడు
జేతురుగాక సం ◆ ప్రీతితో నామాట,వలనఁ బూర్వమునందుఁ ◆ గలుగుపాప
ములను హరించునీ ◆ జలమున శాపవి,ముక్తులై యైశ్వర్య ◆ మునఁ జెలఁగుదు
తే. రనుచు రోమశముని చెప్పి ◆ నట్టివాక్య,ములు నిజంబని వింటిగా ◆ నలరువారి
పలుకు నంగీకరించి త ◆ జ్జలమునందు, స్నానమునకుఁ బ్రియత్నులై ◆ సంతసమున.
తే. అంబరమునుండి యవనికి ◆ నరుగుదెంచి,నలుపుఁదెలుపునఁబ్రవహించు ◆ సలిలముగల
తత్ప్రయాగముఁజూచి సం ◆ తసముగదుర, నిర్మలంబైన భక్తితో ◆ నిలిచిపిదప. 473
తే. మాఘమందున సూర్యుండు ◆ మకరరాశి,గతుఁడుగానుండుదినములఁ ◆ గల్యమందు
స్నానమొకపక్షమునుజేయ ◆ సమసెఁబాప,ములు పిశాచత్వములునంత ◆ ముదమలరఁగ.
తే. అపుడు గంధర్వకన్యక ◆ లైదుగురును, బ్రాహ్మణుఁడుశాపములఁబాసి ◆ రహినిదేవ
రూపములచేతఁ గ్రాలుచు ◆ రోమశముని, కెదుర నిలిచిరి సంతోష ◆ మొదవ నంత. 475
తే. వేదనిధి, వారు శాపము ◆ ల్విడచితొంటి,కంటెసుందరమైనదే ◆ హములఁజూచి
రోమశునిఁగూర్చి పలికెని ◆ రూఢముగను,వికచమనమున నాశ్చర్య ◆ వివశుఁడగుచు. 476
ఆ. ఓ మహానుభావ ◆ రోమశమౌనీంద్ర, నీయనుగ్రహమున ◆ నేఁడు వీరు
శాపమనెడిగొప్ప ◆ సాగరమీఁదిరి, వీరికృత్యమములు ◆ విస్తరింపు. 477
క. అనియిటు మునిచంద్రునితో, మనవిగ బ్రాహ్మణుఁడుపలుకు ◆ మధురోక్తులు నె
మ్మనమునఁ దగులఁగనపుడి,ట్లనియెను వేదనిధితోడ ◆ నార్యులు మెచ్చన్. 478
తే. నీసుతుఁడు బ్రహ్మచర్యల ◆ నిష్ఠదనర, జరుపువాఁడయి వేదము ◆ ల్జదివినట్టి
చిన్నవాఁడగు నితనిపైఁ ◆ జెలిమిగలుగు,కన్నియలఁగూర్చి వైవాహి ◆ కమునొనర్పు. 479

సీ. అనుచు నా రోమశుండను వాక్యములు దమ,తండ్రి సెప్పుటలు గాం దలంచి మదినిం
దనకుమారునకు గంధర్వకన్యలకును, వేదోక్తముగను గావించు పెండ్లి
కిని వేదనిధి మనంబున సంతసించె నా, బ్రహ్మచారి కలవరమును మాని
మునులదీవనల చేతను మంత్రముల చేత, శుభముహూర్తమునందు సురలు వొగడ
ఆ. గ్రమముం దప్పకుండం గన్యల నైదుగు,రను వివాహమయ్యె రహిజెలంగ
వారివారికైన కోరిక లీడేర్ప, ముచ్చటలను సతులు ముదమునొంద. 480
క. మనముల వర్షాకాలపు,దినముల నా దూలచెలకు దినదినమును వృ
ద్ధిని బొందుపగిది వారల, కనువుగ నుల్లాస మొదవ నా దంపతులున్. 481
క. మ్రొక్కలిడిన రోమశముని, చక్కఁగ దీవించి మేరు శైలంబునకుం
గ్రక్కునఁజని తనయాశ్రమ, మొక్క మొగిం జేరి సఖ్య మొదవఁగనుండెన్. 482
ఆ. నిమ్మళిముగ వేదనిధి దనకోడండ్రు, నైదుగురను దనయు నవలఁ గొనుచు
నుత్తరమునఁ దనదు నునికిపట్లకుఁ జేరె, జనవరేణ్య మిగుల సంతసమున. 483
సీ. అన్ని తీర్థములకు నధికమైన ప్రయాగ,మున మున్ను రోమశ మునివరుండు
దెలిపిన వ్యక్తంపుఁ బలుకుల చే రవి, మాఘమాసమునందు మకరరాశి
నుండు దినములందు నుదయకాలస్నాన,మును జేయఁగలిగిన పుణ్యముగల
వారు పాతిత్యవిదూరులు గంధర్వ,కన్నియ లైదుగు రన్ని కోరి
ఆ. కలును దీరఁగ సంతోషకలితలైన, చరితమగు కొన్ని కథల సంభరితమైన
మాఘమాహాత్మ్యమిది దీని మాఘమందు,స్నానమొనరించి నిర్మల స్వాంతులగుచు.
క. శ్రితపరుచు బ్రాహ్మణునిస,మ్మతి విప్రశ్రేష్ఠులకును మాసాంతమునన్
హితవుగ మాఘస్నాన,వ్రతఫలమును గోరి చేయవలె పూజఁ దగన్. 485
తే. ఈ పురాణము వినువారు నింపుగదుర,రత్నభూషణమాల్యాంబరములఁ దెలుపు
వారికిని బండితుల కిడి వారివలన, దీవెనల నొందఁగావలె భూవరేణ్య. 486
తే. ఇదియు నుత్తమధర్మమా నిందు నర్ధ,మైన మధ్యమగు దాని లోన సగము
నధమమగునని తత్త్వజ్ఞులైన సనకు,,డాది శూరులు దెలిపిరి మోదమొదవ. 487
తే. తమకు శక్తికిఁ దగినట్లు ధారుణీసు,రులకు భోజనతాంబూలముల నొసంగి
గంధ మర్పించి చేలముల్గంచుపాత్ర,ములను దక్షిణలను నియ్యవలయు ననఘ.
తే. ఈ పురాణము మాఘమందె వ రనెదరో, యట్టివారు దనకు సమమౌదు రంచుఁ
బలికె శ్రీపతి గాన వారలకుఁ జేయు,దానముల సంతసించును దనుజవైరి. 489
ఆ. అట్టి మాఘమాసమందుఁ బురాణము, వినినవారు నెపుడు విష్ణులోక
మందు నిలిచి మరల నవనిపై జన్మల, నెత్తరారు వారి కెప్పటికిని. 490
సీ. పుణ్యతీర్థములకుఁ బోయి మాఘస్నాన,మందుఁ జేయుట జాలనట్టివారు
ఈ మాఘమాహాత్మ్య మింపుగాఁ జదివిన,వారికి విను సభవారికిఁ దను
శక్తికిఁ దగినవస్త్రములు సువర్ణము, దానముఁ జేసిన స్నానమొనర
గాఁ బ్రయాగమునందుఁ గావించుఫలము సం,ప్రాప్తించుఁ గాన నెవ్వరును నీక
తే. ధనము వినుపించువారికి వినినవారు, గంధపుష్పాక్షతలఁ బూజ కడఁకఁ జేసి
తృప్తికరముగ భోజనమిడి కడాని,యంచుగల చేలముల నిచ్చి యనుపవలయు.

తే. ఈ పురాణరాజ • మేర్పడ మంచిపు,స్తకములందు వ్రాసి • తప్పులేమి
గలుగకుండఁ బండి•తులకియ్య నూర్వశి, వానిఁ గోరుచుండు • స్వర్గమందు.

వ. అని యిట్లు వసిష్ఠమహాముని చెప్పిన యీ మాఘమాహాత్మ్యమును దిలీపమహారాజు మిక్కిలి శ్రద్ధతో విన్నవాఁడై, మాఘమాసము కడపట నా మునిపుంగవునిఁ బూజించి, ముత్యాలహారము, బంగారు సరిపినగొలుసులు, భుజకీర్తులు, నానా రత్నములు పొదిగిన యుంగరములు, చేతికడియములు, నవరత్నములతోఁ జేసిన మొలనూలు, మిక్కిలి వెలగల వస్తువులు, ననేక ధన ధాన్యములు, నొరగుదిండు, రజతపీఠము, మృదువైన పావుకోళ్లు, నొప్పిదమైన యందలము, వాయువేగముగల హయము, సురటి, తక్కిన సమస్తమైన వస్తువులు సమర్పించి, గంధ, మక్షతలు, తాంబూలము, పరిమళించు పుష్పహారములు, వీనిచేతఁ బూజించి, వారిదీవనలఁ బొంది వర్ధిల్లె మఱియును. 493

గీ. అదిలీపుండు చక్కగా•నావునేతఁ, బక్వమగు పిండివంటలు • బాయసాన్న
శాకములతోడ బ్రాహ్మణ•జనులఁదృప్తి,పరచి దక్షిణలిచ్చి సం•భ్రమముగదుర.

ఆ. ఆ వసిష్ఠమౌని • కంత నరుంధతి, కగ్నులైన మూఁటి • కవల హోమ
ధేనువునకుఁ జుట్టుఁ•దిరిగి మ్రొక్కిడి దిలీ,పుండునతిగొఁ దనదు•పురముఁజేర.

ఆ. మౌనులార మున్ను • మాఘమాసవ్రత,కథ వసిష్ఠు చెలుపఁ•గా దిలీపుఁ
డాదరించె దాని•నంతయు మీకుఁ బ,ల్కితిని వ్యాసమునికి • నతులొనర్చి. 496

ఆ. ఎవఁడు మాఘమందు • మృత్తిక గోపీచం,దనము నుదయకాల•మున ద్విజులకు
నియ్య స్వర్గమునకు • నేఁగిన నూర్వశి, నాతిగా గ్రహింప•నగు నిజంబు. 497

ఉ. ఏమనుజుండు గల్యమున • నేర్పడ నిద్దురమేలుకొంచి తా
సోమరిగాక యూరివెలి•శుద్ధజలంబుల మాఘమందునన్
నేమముగల్గి స్నానమును • నిత్యము మాఘకథాప్రసంగము
న్నేమరకుండఁజేయ మది • కెల్లెడ విష్ణు ప్రసన్నతయ్యెడిన్. 498

ఆ. అతనిసుతులు దుహిత • లాయువు వంశాభి,వృద్ధిఁ బొందుచుందు•రిలనటంచు
శౌనకాదినైమి•శారణ్యవాసుల, కెఱుఁగఁజెప్పె సూతుఁ• డీ చరిత్ర. 499

తే. అపుడు సూతుఁడు శౌనకుఁ•డాది మౌను,లందుఁ గొందఱు చేఁ గుశ•యవల నార
చీరలను వ్రేళ్ల దుంపల • శ్రేష్ఠమైన, పుష్పఫలముల చేత సం•పూజ్యుఁడయ్యె.

తే. మునులు కొందఱును బవిత్ర•ములను దనరు, హస్తములమేను బ్రేమల•నంటికొనిరి
కనుల నానందబాష్పము•ల్గ్రిమ్మికొనఁగఁ,గౌఁగిలించిరి కొందఱు•కౌతుకమున. 501

ఆ. మునులచేత సూతుఁ•డనుపమసన్మాన,మొంది నిలిచి వార•లందఱకును
మ్రొక్కి తనదుహస్త•ములు రెండు పైకెత్తి, పలికె మేలుబ్రాహ్మ•ణులకగునని.

సీ. పుణ్యతీర్థములచేఁ • బొలుపారి దురితసం, హారియై పావన•మైనదియగు
నీయితిహాసము • నెవ్వండు విను వాఁడు,నిహలోకసుఖముల•నెల్లఁ బొంది
కలుషాత్ములగువారు • గనుటశక్యముగాని, పుణ్యలోకమునకుఁ • బోవు నెసఁగు
పలుకు నేర్పరియనఁ•గల సూతుఁడా ముని,శ్రేష్ఠుల కెఱిఁగింప • నిష్టమైన

తే. మాఘమహిమను జెవుల నేమరక వినుచు, ద్వాదశాబ్దములు పరిమితము గలిగిన
సత్త్రియాగమునంతను సాంగముగను, సలిపి మును లంత సంతోషకలితులైరి.

తే. మనుజులెవ్వరు నీమాఘమహిమఁ జదువ, వ్రాయ వినుపింప సకలపాపములు దొలఁగి
యిహసుఖంబులనన్నిఁట నీఁగి తుదకు, నుత్తమంబైన పదవిని నొందఁగలరు. 504

సీ. కలియుగవత్సరంబులు నైదువేలపైఁ, బదిరెండునగు శాలివాహనశక
వర్షము లెనిమిదివందలముప్పది, మూఁటితోడ సమానముగ "విరోధి
కృతు"వత్సరమున నీకృతిని శ్రావణశుద్ధ, సప్తమితిథిని నాసక్తిమీరఁ
ద్రిదశభాషను నలుఁబదియేడు నధ్యాయ, ములుగల గ్రంథముఁ దెలుఁగునందుఁ

తే. బూన్కి మెయినాఱు నాశ్వాసములుగఁ గూర్చి, యాదినారాయణునకు నేనర్పితముగఁ
జేసితిని చంద్రసూర్యులీక్షితినిఁ గలుగు, నంతకాలము నీకృతి యలరుపొంతె. 505

మ. జరగెన్ వ్యాసమునీంద్రుచే దివిజభాషన్మాఘమాహాత్మ్యమీ
ధరణిన్నేర్పడఁ దత్కథావళినిఁ బద్యస్ఫూర్తిగాఁ బల్కితిన్
విరతిప్రాస సమాసబిందుగణముల్వీక్షించి ధీరోత్తముల్
నెరసుల్గల్గినచోట దిద్ది కనుఁడీ నేర్పొప్పఁగా మ్రొక్కెదన్. 506

ఆశ్వాసాంతము

క. కమలాక్ష! భక్తరక్షా!
కమలారమణీయవక్ష! కౌశికపక్షా!
కమలోత్పలాప్తవీక్షా!
కమలోద్భవముఖ్యదేవగణపరిరక్షా!. 507

మాలిని. మునిజనవనచైత్రా! మోక్షలక్ష్మీకళత్రా!
దినకరశశినేత్రా! దేవతామిత్రజైత్రా!
ఘనఘననిభగాత్రా! గాధిపుత్రాత్మమిత్రా!
సనకనుతచరిత్రా! సజ్జనస్తోత్రపాత్రా!. 508

గద్యము

శ్రీబాలగోపాలకృష్ణవరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్యసగోత్రపవిత్ర శ్రీమదబ్బ
రాజవంశపయఃపారావారరాకాకైరవమిత్ర శ్రీమదమ్మకాంబా నృసింహా
మాత్యపుత్ర సూరిజనవిధేయ శేషాచలశర్మనామధేయప్రణీతంబైన
శ్రీపాద్మపురాణాంతర్గతమాఘమాహాత్మ్యమునందు
షష్ఠాశ్వాసము సర్వంబును
సంపూర్ణము.

---